మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు। మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే
సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.
ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన । నచాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి. 67
య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిదాస్యతి । భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్య
త్యసంశయః. 68

న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః । భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి
అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః । జ్ఞాన యజ్ఞేన తేనాహం ఇష్ట స్స్యామితి
మే మతిః. 70

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః । సోపి ముక్త శ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయా త్పుణ్య
కర్మణామ్ 71

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ ! త్వయైకాగ్రేణ చేతసా । కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ !

అర్జున ఉవాచ :—

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత ! । స్థితోస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ.

సంజయ ఉవాచ :—

ఇ త్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః సంవాద మిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్.
వ్యాసప్రసాదా చ్ఛ్రుతవాన్ ఏత ద్గుహ్యతమం పరమ్ । యోగం యోగేశ్వరా త్కృష్ణాత్ సాక్షా త్కథయత
స్స్వయమ్. 75

రాజన్ ! సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం । కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ
ముహుర్ముహుః. 76

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః । విస్మయో మే మహాన్ రాజన్ !
హృష్యామి చ పునః పునః. 77

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః । తత్ర శ్రీ ర్విజయో భూతిః ధ్రువా నీతి ర్మతి ర్మమ.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
మోక్ష సన్యాస యోగో నామ అష్టాదశోఽధ్యాయః.

శ్రీ

# గీతాసారసంగ్రహము

## 1. జిజ్ఞాసాప్రకరణము

భారతదేశము

అనాదికాలమునుండియు, మనము భారతీయులమనియు మన దేశము భరతదేశమనియు, ప్రసిద్ధ వ్యవహారమున్నది. మనము సర్వవిషయములందును, వేదమును పరమ ప్రమాణముగా గ్రహించుచున్నాము. తైత్తిరీయశాఖలో వేదమం దుపదేశింపబడినరీతిగా ప్రవర్తించు ప్రజలు భరతులనియు, అట్లు వారలను ప్రవర్తింపజేయు క్షత్రియప్రభువు, వేదోక్తరీతితో రాజసూయ మొనర్చి "భరతు" డను బిరుదును వహించుననియు చెప్పబడినది. [ఏషవో భరతా రాజా, తై. సం. 1–8–12] కావున ప్రజలను బట్టిగాని, ప్రభువునుబట్టిగాని, ఏర్పడిన ఈ "భరత" శబ్దమునకు సర్వవిధముల వేదమే మూలమగుచున్నది.

వేదము

"వేదయతీతి-వేదః" అను నిర్వచనమునుబట్టి తెలియజేయునది వేదమనబడును. ఇది తెలుపు విషయములను, నాలుగు ప్రధాన ప్రకరణములుగా పూర్వులు విభజించిరి.

1\. లోకమందెవరికిని, ప్రత్యక్షాదికమగు నెట్టి ప్రమాణమునకును, ఏవిధముగాను, తెలియబడుట కవకాశములేని ప్రమేయమును తెలుపునది వేదము. ఉదాహరణ :- "సర్వా వా ఇయం వయోభ్యో నక్తం దృశే దీప్యతే, తస్మాదిమాం వయాగ్ంసి నక్తం నాధ్యాసతే"— అను తైత్తిరీయశ్రుతి రాత్రియందు పక్షులకీ భూమండలమంతయు, అగ్నిజ్వాలవలె భాసించుటచే అవి రాత్రియందు భూమిపై వాలవు" అని చెప్పుచున్నది. ఈ విషయము మనకు లోక

సిద్ధమగు ప్రత్యక్ష ప్రమాణముచేతను సిద్ధించదుగాన దీనిని బోధించునది వేదము. అట్లే అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ, భూలోక, భువర్లోక, సువర్లోక, మహాలోక, జనోలోక, తపోలోక, సత్యలోకములను పేర్లుగల పదునాలుగులోకము లున్నవనియు, అందు పరస్పర విలక్షణులగు ప్రాణికోటి నివసించుననియు, లోకసిద్ధ ప్రమాణములచే గోచరింపని విషయము నీవేదము బోధించుచున్నది.

2. లోకులందరును కోరు ప్రయోజనములు నెరవేరుటకు, లోకమందెవరికిని తెలియని సాధన విశేషములను బోధించునదిగాన, వేదమనబడును. ఎట్లనగా, లోకమందు ఐశ్వర్యమును, వర్షమును, పశుసంపదను, వర్చస్సును, సంతానమును మొదలగు అనేక విషయముల నాయాజీవు లపేక్షింతురుగాని, అవి నెరవేరుటకుపాయ మెరుగరు. వేదము, ఐశ్వర్యకాముడు వాయువు దేవతగాగల యాగమును, వర్షకాముడు కారీరీయాగమును, పశుకాముడు చిత్రాయాగమును, వర్చఃకాముడు సౌర్యయాగమును, సంతానకాముడు పుత్రకామేష్టిని చేయుచో, కామనాసిద్ధి గలుగునని ఆయాకోరికల నెరవేర్చుకొను సాధనములను బోధించినది.

3. లోకసిద్ధమగు ప్రయోజనముకొరకు ఆచరించు లోకసిద్ధసాధనములనే నియమించి అలౌకికమగు అనగా పరలోకమందును ఈ లోకమందునుగూడ నీతనికా ప్రయోజనము మాత్రమేగాక ఇంకను అధికమగు ప్రయోజనమునుగూడ గలిగించు సాధనోపాయమును బోధించునది వేదము. ఎట్లనగా, ఆకలితీరి తృప్తిగల్గుటయను లౌకికప్రయోజనముకొరకు భోజనము లౌకికసాధనమైయుండ, అందు వైశ్వదేవమను సంజ్ఞగల నొక సంస్కారాతిశయమును, ప్రాణాహుత్యాదికమగు వైశ్వానరవిద్యయను సంజ్ఞగల నొకభావనావిశేషమును, అలౌకికసాధనముగా నీవేదము బోధించి దాని నాచరించినవారికి వెంటనే వారనుకొన్న ఆకలితీరి తృప్తిగలుగుట మాత్రమేగాక అగతికులైన ఇతర లోకమందలి జీవులకుగూడ తృప్తిగలుగుటద్వారా పరలోకములందు తనకు ఇంతకంటె గొప్పదేహముతో గొప్ప సుఖముల ననుభవించుటయు, చివరకు జననమరణ ప్రవాహాదిరూపమగు సంసార

నివృత్తికరమగు జ్ఞానోదయమగుటయునను అలౌకిక ప్రయోజనములుగూడ గల్గునని బోధించుచున్నది.

4. లోకమందొకే విషయము అనేకులచే అనేక విధములుగా వర్ణింపబడుచు విప్రతిపత్తికాస్పదమైయుండ వేదమా విషయములో సయుక్తికముగా అన్ని విప్రతిపత్తులను వారించి న్యాయమగు నిర్ణయమును బోధించునదిగాన వేదమనబడును. ఎట్లనగా లోకములో సర్వప్రాణులయొక్కయు, నిజరూపమగు ఆత్మ, అనేకులచే ననేకరీతులచే అనాదినుండియు,అనేకవిధములుగా వర్ణింపబడుచున్నది. కొందరు చైతన్యముతో నొప్పు దేహము మాత్రమే ఆత్మ యందురు. మరికొందరు చేతనములగు ఇంద్రియములే ఆత్మయందురు. వేరొకరు మనస్సే ఆత్మయందురు. ఇంకొకరు క్షణికమగు విజ్ఞానముమాత్రమే ఆత్మయందురు. కొందరు శూన్యమే ఆత్మయందురు. మరికొందరు దేహాదికముకంటె వేరై జననాది సంసారధర్మము నొందుచు ఆయాకార్యములకు కర్తయై ఆయాఫలానుభవముచే భోక్తయగునదియే ఆత్మ యందురు. ఇంకొకరు భోక్తమాత్రమేగాని కర్తగానివాడే ఆత్మయందురు. వీరికంటె వేరగు సర్వజ్ఞానములుగలవాడు, సర్వశక్తులుగలవాడే ఆత్మయని మరికొందరందురు. ఇట్లీ ఆత్మ అనేకులచే అనేకవిధములుగా విప్రతిపన్నమైయుండ, ఆయాఫలభోక్తయొక్క నిజరూపమే ఆత్మయనియు, అది సత్య, జ్ఞాన, అనంత ఆనందరూపమనియు సయుక్తికముగ బోధించినందున వేదమనబడును.

ఇట్లీ నాలుగు ప్రకరణములక్రింద సర్వ వేదార్థము విభజింపబడినది. ఈ వేదమువలని ప్రయోజనముగూడ నాల్గువిధములుగ విభజింపబడియున్నది.

1. ఈ భూలోకమందే ఉత్తమ, మధ్యమ, అధమములగు జన్మములనెత్తుట.

2. భువరాది జనోలోక పర్యంతములగు లోకములందు జన్మించి ఉత్తమదేహములతో ఉత్తమసుఖములనొంది, తిరిగి అతలాది జనోలోకపర్యంతములగు పదమూడు లోకములలో నెచటనో జన్మించుచు, మరణించుచుండుట.

3. సత్యలోకములోనికి వెళ్ళి, అచట కల్పాంతమువరకు బ్రహ్మతో సమానముగా

ఒక్క జగద్వ్యాపారమున తప్ప ఇతర విషయములందు ఆలోకాధిపతితో తుల్యముగానుండి, ఆపైని తిరిగి దేహము నొందక మోక్షము నొందుట.

4. దేహముల సమూహ రూపమగు జగత్తంతయు అనాది యనియు, ఇది కర్మ ఫలమేగాని వాస్తవము గాదనియు, ఉత్తరోత్తర దేహములకు పూర్వపూర్వ దేహములందలి కర్మమే కారణ మనియు, కర్మఫలము 1 స్థూలము, 2 సూక్ష్మము, 3 కారణము, అని మూడు విధములుగ నుండుననియు, అందు కారణరూపము వాసనాత్మకమగు కారణ దేహమేయనియు, సూక్ష్మరూపము సంకల్పాద్యాత్మకమగు అంతఃకరణమేయనియు, స్థూల మగు కర్మమే స్థూలదేహమే యనియు, ఇట్లు జగత్తంతయు కర్మఫల పరిణామవిశేషమేయై అసత్య జడ, దుఃఖ, పరిచ్ఛిన్న రూపమైనదనియు, ఒక కాలమందుండి భాసించుచు, ఆద్యంత ములు రెంటి యందును భాసింపకపోవుటచే, నీ జగత్తంతయు మిథ్యయనియు, సత్య, జ్ఞాన, ఆనంద, అనంతలక్షణమగు, ఆత్మయే సర్వకారణమనియు, అదియే సర్వ జగత్తనియు, నిశ్చ యించి సర్వాత్మభావము నొంది, మోక్షము నొందుట.

**ద్వివిధవేదార్థము ప్రవృత్తి, నివృత్తులు**

ఇట్టి పరస్పర విలక్షణములగు బ్రహ్మజగత్తులు రెంటిని కలిపి లోకులందరు ఒకటిగా వ్యవహరించుచున్నారు. ఇదియే అవిద్య యనబడును. గాన, వేద మందలి మొదటి మూడు ప్రకరణముల గ్రంథమును, పై అవిద్యను, క్రమ ముగా తగ్గించుట కుద్దేశింపబడినది. అట్లే ప్రయోజనములలోని మొదటి మూడును, అట్టివే. ఈ వేదభాగము కర్మకాండయనియు, ప్రవృత్తి ధర్మమనియు, చెప్పబడును, సృష్ట్యాది యందు జగత్కర్త ఈ ప్రవృత్తి ధర్మమును మరీచ్యాదుల కుపదేశించెను. వేదమందలి నాల్గవ ప్రకరణము జ్ఞానకాండ యనియు, ఉపనిషత్తులనియు, నివృత్తి ధర్మమనియు చెప్పబడును ఇయ్యది సృష్ట్యాదియందు సనకాదుల కుపదేశింపబడెను.

**గీతావతరణము**

ఇట్టి ద్వివిధ వేదార్థమును కాలవశమున లోపింప నద్దానిని పునరుద్ధరింప జేసి ప్రచార మొనర్చుటకు వర్తమాన కలిద్వాపర సంధి కాలమందు ఆజగ త్కర్తయే శ్రీకృష్ణుడను నామముతో అంశచే నవతరించి, దేహధారివలె

కన్పట్టుచు, ఆ కాలమందు సర్వవిధముల నుత్తమాధికారియై యుండి, భారతయుద్ధ కాలమందు శోకావేశముచే ధర్మసమ్మూఢచిత్తుడైధర్మ జిజ్ఞాసువగు నర్జునునకు పై ద్వివిధ వేదార్థమును బోధించెను. గుణవంతునకు బోధింపబడి, వానిచే నాచరింపబడిన ధర్మము, లోకమంతయు త్వరగా పుష్కల ప్రచారమును గనుట లోకసిద్ధము గదా! ఆ యుపదేశ మును యథోపదిష్టముగానే శ్రీవేదవ్యాసులు 700 శ్లోకములతో కూర్చి "పంచమవేదమను" ప్రసిద్ధిగల భారతమను తన గ్రంథమందుంచెను. ఇదియే గీతాశాస్త్రమను ప్రసిద్ధితో నున్నది. దీని సారమును సంగ్రహముగ నావిష్కరించుటకీ చిన్నగ్రంథ ముద్దేశింపబడినది.

**ఉపదేష్టలక్షణము**

ఇందుపదేష్ట యగు శ్రీకృష్ణుడు, సర్వజగద్రూపుడైనట్లు విశ్వరూప సందర్శనాధ్యాయమను పదునొకండవ యధ్యాయమందున్నది. గాన సర్వజీవ స్థూలదేహసమూహరూపుడని స్పష్టపడుచున్నది. అట్లే ఉపకారి భూతములందలి సూక్ష్మరూపములగు రసాదులు నేనేనని శ్రీకృష్ణులు పల్కుటచే [1]సర్వజగ త్సూక్ష్మదేహ సమూహరూపుడని స్పష్టపడుచున్నది. ప్రకటితముకాని కారణరూపముతోనే నీ బ్రహ్మాండమునంతను వ్యాపించియున్నానని [2]చెప్పుటచే సర్వజగత్కారణ దేహసమూహ రూపుడని స్పష్టపడుచున్నది. సర్వజీవులకు నిజమైన ఆత్మరూపుడను నేనే ననుటచేతను [3]నాకంటె వేరుగా జగత్తనునది లేనేలేదనుటచేతను [4]సర్వజగదధిష్ఠానమగు పరబ్రహ్మమని స్పష్టమగుచున్నది. మరియు నేనీ యోగశాస్త్రమును పూర్వకాలమందు వివస్వతున కుపదేశించితిననియు, అటనుండి మనువు, ఇక్ష్వాకు మొదలగు పరంపరగా నావిద్యయే లోక మందు వ్యాపించి యున్నదనియు, అదియే ఇపుడర్జునున కుపదేశించితిననియు, [5]చెప్పుట చేతను వీరి బ్రహ్మాత్వము స్ఫుటమగుచున్నది.

---

(1) రసోహమప్సుకౌంతేయః ప్రభాస్మిశశిసూర్యయోః। ప్రణవస్సర్వవేదేషు శబ్దఃఖే పౌరుషంనృషు7-8.
(2) మయాతతమిదం విశ్వం జగదవ్యక్తమూర్తినా। మత్థ్సాని సర్వభూతాని నచాహంతేష్వవస్థితః 9-4.
(3) అహమాత్మాగుడాకేశః సర్వభూతాశయస్థితః। అహమాదిశ్చమధ్యంచ భూతానామంతమేవచ. 10-20.
(4) మత్తః పరతరం నాన్యత్కించి దస్తిధనంజయ।మయి సర్వమిదంప్రోతం సూత్రేమణి గణాఇవ7-7.
(5) ఇమం వివస్వతేయోగం ప్రోక్తవాన హమవ్యయం।వివస్వాన్మనవే ప్రాహమనురిక్ష్వాకవేఽబ్రవీత్4-1. స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః। భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్.4-3.

ఇక అర్జునుడు క్షత్రియుడు, గృహస్థు, ప్రవృత్తిధర్మమునందు నిష్ణాతుడు-విద్యార్థిలక్షణము పూర్తిగాను గలవాడు [1]స్వజనవధభీతుడు [2]ఐహికదేహ సుఖముల నపేక్షింపనివాడు [3]గురువృద్ధులందు భక్తిగలవాడు [4]ఆముష్మిక సుఖములందు గూడ ఇష్టములేనివాడు [5]ధనార్జన ప్రవృత్తియం దిచ్ఛలేనివాడు [6]కామక్రోధ లోభాదులు లేనివాడు [7]పాపభీతి గలవాడు [8]సనాతనకులధర్మముల నతిక్రమింప నిచ్ఛలేనివాడు [9]అధర్మాభివృద్ధి, కులస్త్రీ దోషవర్ణసంకర దోషములను సహింపలేనివాడు [10]తనకుగాని, తన వంశమిత్రాదులకుగాని నరకము రాగూడదని తలచువాడు, కులహాని దోషమని ఎరిగినవాడు, అందరి పితృదేవతలకు వారివారి సంతతివారు పిండోదకక్రియల నొనర్చి తీరవలయును - లేనిచో దోషమువచ్చునని తలచువాడు, [11]వర్ణసంకర కారకములగు కులఘ్నుల దోషములచే గల్గు జాతిధర్మ, కులధర్మ నాశమును సహింప లేనివాడు [12]జాతి కుల గోత్ర ధర్మములను ఎవ రుల్లంఘించినను వారలందరకుశాశ్వత నరకము గల్గునని తలచి అట్టివారి నరికట్టి తమ తమ జాతి కులగోత్ర ధర్మములనాచరించునట్లు ప్రయ

---

(1) దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం । సీదంతిమమగాత్రాణిముఖంచ పరిశుష్యతి. 1-28. (2) నిమిత్తానిచ పశ్యామివిపరీతానికేశవ! నచశ్రేయోనుపశ్యామిహత్వా స్వజనమాహవే 1-31. (3) నకాంక్షేవిజయం కృష్ణ! నచ రాజ్యంసుఖానిచ ; కింనోరాజ్యేన గోవింద!కింభోగైర్జీవితేనవా 1-32. (4) ఆచార్యాః పితరః పుత్రాస్తథైవచ పితామహాః । మాతులాశ్శ్వశురాః పౌత్రాశ్శ్యాలాస్సంబంధినస్తథా. 1-34. (5) ఏతాన్నహంతుమిచ్ఛామిఘ్నతోపి మధుసూదన । అపిత్రైలోక్యరాజ్యస్యహేతోః కిన్నుమహీకృతే. 1-35. (6) నిహత్యధార్తరాష్ట్రాన్నః కాప్రీతిస్స్యాజ్జనార్దన । పాపమేవాశ్రయే దస్మాన్హత్వైతానాతతాయినః. 1-36. (7) యద్యప్యేతేనపశ్యంతి లోభోపహతచేతసః । కులక్షయకృతం దోషంమిత్రద్రోహేచ పాతకం. 1-38. (8) కథంనజ్ఞేయ మస్మాభిః పాపాదస్మాన్నివర్తితుం । కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన 1-39. (9) కులక్షయేప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః , ధర్మేనష్టేకులం కృత్స్నమధర్మోభిభవత్యుత. 1-40. (10) అధర్మాభిభవాత్కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః । స్త్రీషుదుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః 1-42. (11) సంకరో నరకాయైవకులఘ్నానాం కులస్యచ । పతంతిపితరోహ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 1-42. (12) దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః । ఉత్సాద్యంతే జాతి ధర్మాః కులధర్మాశ్చశాశ్వతాః.

త్నించువాడు [1]తనయొక్క సుఖముకొరకు ఇతరుల కెట్టి అపకారమొనర్ప నిచ్ఛలేని వాడు [2]ధర్మముకొరకును, పరోపకారము కొరకును, తన ప్రాణములను పరిత్యజింప సంసిద్ధుడును [3]గురువులను పూజించుటయందాసక్తి గలవాడును, పెద్దలతో కలహింపరాదని తలచువాడును, [4]తన సుఖముకొరకు ఇతరుల కెట్టి హానిని కలుగజేయక భిక్షాటనతోనైనను తాను సుఖింపగల త్యాగమూర్తియు, అర్థకామములం దెంతమాత్రము వాంఛలేక కేవలధర్మమందు వాంఛ గలవాడును యుద్ధమందు తానే జయించుదనని, తానే మహాబల పరాక్రమశాలినని, పాశుపతాస్త్రాది దివ్యశక్తి సంపన్నుడనని గర్వము లేనివాడును, జ్ఞాతి బంధుమిత్రులందు సంపూర్ణప్రేమ గలవాడును, భ్రాతదయ, జాలి, విషాదములు, పరమావధిని బొందగా కన్నీరు కార్చుచున్నవాడు [5]తన పక్షమందు ఏడక్షౌహిణుల సైన్యమును, కౌరవపక్షమందు పదకొండక్షౌహిణుల సైన్యమును, యుద్ధసన్నద్ధమై యున్నందున యేకారణముచే నీ యుద్ధమేర్పడినదో ఆకారణము శాస్త్రీయదృష్టిలో తన పక్షమునకే ధర్మమో, ఎదిరిపక్షమునకే ధర్మమో, నిశ్చయించి, అందలి గుణదోషములకు తానే బాధ్యత వహించుటకంటె, ధర్మనిర్ణయ సూక్ష్మమును పెద్దలగు పరిషత్తుపైనుంచి తదాదేశమును తానాచరించినచో ఆబాధ్యత పరిషద్రూపులగు బ్రహ్మవేత్తలపై నుండు నను ధర్మశాస్త్రహృదయవేత్తయు, ఆ పరిషత్తులో పదిమందిగాని, నలుగురుగాని, చివరకు బ్రహ్మవేత్తయగు వారొక్కరుగాని, యుండి విచారించి, నిర్ణయించినచో నది ధర్మశాసనమైయె ఈశ్వరాజ్ఞయై దాని నాచరించు తనకుగాని, తన పక్షమువారికిగాని. దోషావహము గాదనియు, గుర్తించినవాడును, శ్రీకృష్ణుని సర్వాత్మనా బ్రహ్మవేత్తయగు గురునిగాను పరిషత్తుగాను తనను, వారివద్ద ప్రపన్నుడగు శిష్యునిగాను, నివేదించిన ఉత్తమాధికారి [6]ఇట్లు మంచి జిజ్ఞాసతో అర్జునుడు గురూపసదన మొనర్చెను. కావుననే శ్రీకృష్ణుడు

(1) ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన। నరకేఽనియతం వాసోభవతీత్యనుశుశ్రుమ। 1-43. (2) అహోబత మహత్పాపం కర్తుం వ్యవసితావయం। యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః 1-45. (3) యదిమామప్రతీకారం మశస్త్రం శస్త్రపాణయః। ధార్తరాష్ట్రారణేహన్యుస్తన్మే క్షేమతరంభవేత్. 1-46. (4) కథంభీష్మమహంసంఖ్యే ద్రోణంచ మధుసూదన। ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన. 1-4. (5) తంతథాకృపయా విష్టమశ్రుపూర్ణాకులేక్షణం। విషీదంతమిదం వాక్యము వాచ మధుసూదనః 2-1. (6) కార్పణ్య దోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః। యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేహంశాధి మాంత్వాం ప్రపన్నం. 2-7.

గాని యితని దైవీసంపద్విశిష్టునిగ నుత్తమాధికారిగా [1]చెప్పెను.

ఇతడు యుద్ధములో జయించి నిష్కంటకముగా సమస్త భూమండలాధిపతియైనను, లోకాధిపత్యమును, లేక మానుషానందమును పొందినను, ఇంద్రియోచ్ఛోషణమే దాని ప్రయోజనమగునని, నిత్యతృప్తి వాని ప్రయోజనము గానేరదను నిశ్చయము గలవాడు [2]కావుననే భగవత్ప్రీతికి పాత్రుడు. ఇతని హితమును భగవంతుడు కోరుచుండును [3]భగవద్భక్తుడు, భగవత్ప్రియుడు, మహర్షులగు, నారద, దేవల, అసిత, వ్యాసాదులవలన భగవత్సామాన్య జ్ఞానము నొంది, అందు భక్తివిశ్వాసములుగలిగి, అజ్ఞానము నపరోక్ష మొనర్చుకొనుటకు తీవ్రాభిలాష గలవాడు. [4]భగవజ్జ్ఞానము, ఎంత గొప్ప దేవఋష్యాదులకును జ్ఞేయము గాదనియు, భగవద్విభూతులు మాత్రమే జ్ఞేయములని తలచి, భిన్న భిన్న దశలలో భగవద్విభూతులను, భగవద్యోగములను, మనన మెట్లొనర్పవలెనో తెలుసుకొనగోరువాడు (పరంబ్రహ్మ 10-12 to 18) అట్టి శ్రీకృష్ణు డిట్టి అర్జునునకు, ద్వివిధ వేదార్థమును, పుష్కలముగా నుపదేశించినగాని, వీని సందేహము తొలగదని తలచి, ప్రవృత్తిధర్మ నివృత్తిధర్మరూపమగు ద్వివిధ వేదార్థమును ఆ రెంటికినిగల సంబంధమును, అధికారి భేదమును సాధన భేదమును ధర్మస్వరూపమును, ఫలభేదమును, పుష్కలముగా బోధించి, వీని జిజ్ఞాసను సమాధానపరచెను. అందలి ప్రమేయమునంతను, సంగ్రహముగా విమర్శించి తెలుసుకొనుటకై, ముందు ఆత్మస్వరూప విచారణ ఈ ఆత్మప్రకరణమందు ప్రదర్శింపబడుచున్నది.

## సింహావలోకనము.

ఈ ప్రకరణమందు :

1. భారతదేశ సంజ్ఞానిమిత్తము, 2. వేదముయొక్క స్వరూపము, 3. అదిబోధించు ఆశ్చర్యకర విషయము, 4. లోకులు కోరునట్టి ప్రయోజనము లన్నిటికి సాధనములను

---

(1) మాశుచస్సంపదం దైవీమభిజాతోసిపాండవ.16-5. (2) న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్ యచ్ఛోక ముచ్ఛోషణమింద్రియాణాం । అవాప్య భూమా వసపత్న మృద్ధం । రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. 2 8. (3) భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమంవచః యత్తేహం ప్రీయమాణాయ వక్ష్యామి హిత కామ్యయా. 10-1. (4) ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా । అసితో దేవలో వ్యాసఃస్వయం చైవ బ్రవీషిమే. 10-13

వేదము బోధించుట, 5, లోకసిద్ధసాధనములతో, లౌకిక ప్రయోజనముతోపాటు పారలౌకిక ప్రయోజనమునుగూడ పొందు నుపాయమును వేదము తెలియజేయుట, 6. సర్వుల స్వస్వరూపమగు ఆత్మను వేదము తెలుపుట, 7. భగవంతుడు ప్రవృత్తి ధర్మము నుపదేశించుట, 9. భగవదవతారమే శ్రీకృష్ణుడని, అట్టి వాడే విద్యోపదేశార్హుడని, 10. సాధకుడగు అర్జుని గుణములగు భూతదయాదులు గలవాడే, విద్యాగ్రహణార్హుడని నిరూపింపబడినది.



ఉండుటకేమి. ఇట్లు నెలకు 20 రోజులును, సంవత్సరములో 8 మాసములున్న, 90 సంవత్సరములలో 60 సంవత్సరములును మాత్రమే, ఈతనికి దేహసంబంధముండు జాగ్రత్కాలమగుచున్నను, ఇతని, 6 వ సంవత్సరమునందలి జ్ఞానము 96వ సంవత్సరములో గూడ నశింపక, యేకరీతిగా భాసించుచున్నందున, ఈ జ్ఞానము దేహధర్మ మనరాదు.

౪. ఈ జ్ఞానము మనోధర్మమే యైనచో, మనస్సులేని సుషుప్తిదశలో నశింపవలయును గదా! రోజులో షుమారు రెండుగంటల కాలము మనస్సులేని సుషుప్తికాలమనుకొన్న యెడల పండ్రెండు సంవత్సరములలో, మనస్సులేకుండు కాలమొక సంవత్సరమగును.. అట్లయిన బాల్యమందలి జ్ఞానము వార్ధకమందుండగూడదు. సర్వులును "బాల్యములో ఆడుకొన్న నేను వార్ధకములో ఆడలేను" అని జ్ఞాన నిత్యతను పలుకుచుండుటచే, ఈజ్ఞానము మనోధర్మమనరాదు. కావున ఈ జ్ఞానము స్వతంత్రపదార్థమైనట్లవశ్య మంగీకరించి తీరవలయును. ఇది యీ జన్మలో బాల్యమునుండియు వార్ధకమువరకును నశింపక యేకరీతిగా నుండునని, యుక్తియుక్తముగా వివరించి ఇకముందు జన్మాంతరములందుగూడ ఇది నిత్యమని సాధించుదము.

మనము స్వప్నములో పక్షులమై ఆకాశగమన మొనర్చినట్లును, జలజంతువులమై సముద్రములను మైళ్ళకొలది ఈదినట్లును, దేవతా దేహధారులమై స్వర్గమందున్నట్లును, పాములమై బిలమందున్నట్లును ఇత్యాదిగా భిన్న భిన్న విషయజ్ఞానముల ననుభవించుచుండుట లోకానుభవసిద్ధమై యున్నది. అది అత్యంతము కల్లయందుమా—మనమే యనుభవించి, తరువాత యితరులకుగూడ అట్టి స్వప్నానుభవమును చెప్పుచుంటిమిగాన అత్యంత మసత్యమన వీలులేదు. ఇందుకొన్ని స్వప్నానుభవములు పూర్వము, మనమే ఈ జన్మలోనే, అనుభవించినవియై యున్నవి. గాన అన్ని స్వప్నములు పూర్వానుభవస్మరణములే యనవలయును. స్మృతియనగా నవశ్యము పూర్వానుభూతమై తీరవలయునుగాన, నీ స్వప్నములన్నియు పూర్వమెప్పుడో యొకప్పు డనుభవింపబడిన విషయములే. అట్లయిన ఆకాశగమన స్వప్నముచే నొక పూర్వజన్మలో మనమే పక్షులమైతిమనియు, సముద్రము నీదినస్వప్నముచే నొక పూర్వజన్మలో జలజంతువులమైతిమనియు, ఈ రీతిగా నానా యా స్వప్నస్వభావమునుబట్టి

నాయాపూర్వజన్మమందలి, దేహవిశేషము, లూహింప దగియున్నవి. దీనినిబట్టి పూర్వ జన్మలోని జ్ఞానమీజన్మలోగూడ భాసింపుచు జ్ఞానము యెన్ని జన్మలకయినను నశింపక, యేకరీతిగా నుండుననుట యుక్తియుక్తమేనని తెలుచున్నది. ఇట్లుండుటచే నిత్యమనియు, సత్యమనియు చెవ్పబడును. అందుచే నీజ్ఞానమే సర్వజీవులందును ఏకరీతిగాను, నిత్యముగాను, సత్యముగాను ఉన్నది.[1]

లోకమంతు, కర్త స్వతంత్రుడనియు, కర్మ, లేక దృశ్యము, లేక భోగ్యము ( Object ) పరతంత్రమనియు లేక కర్త్రాధీనమనియు సర్వానుభవసిద్ధము. తాను ప్రమాతయైనప్పుడు, అనగా ఒక విషయము నాలోచించుటకు, అనుభవించుటకు నిశ్చయించినపుడు మాత్రమే, ప్రపంచమున్నది. లేనపుడులేదు. జాగ్రత్స్వప్నములందు తాను ప్రమాతయైనందున, దృశ్య ప్రపంచమున్నది. సుషుప్తిలో తాను ప్రమాతకానందున దృశ్యములేదు. తన మనస్సులో, తాను దేశాంతరీయ, కాలాంతరీయ దృశ్యమును, తానే కల్పించుచున్నాడు. కాన, ఈ దృశ్యము తన కల్పనకు పూర్వము తనజ్ఞానమే. అపుడు తాను ద్రష్టగాడు. అది దృశ్యమును గాదు· ఆ భేదమేలేదు. ప్రమాతృత్వసమకాలమందే, తన జ్ఞానము, రెండుగా విభక్తమై ఒక భాగము ద్రష్టయని, రెండవభాగము దృశ్యమని, వ్యవహరింపబడుచున్నది. అందును దృశ్యమును, ద్రష్టయే భాసింపజేయుచున్నాడు, ఒకే సూర్యుడు సమస్త లోకమును ప్రకాశింప జేయుచున్నట్లు, ఒకే ద్రష్ట సమస్త దృశ్యమును ప్రకాశింపజేయుచున్నది.[2]

## అనంతరూప వివరణము

బ్రహ్మాండ మనగా సర్వజీవుల సమూహామే గావున సర్వజీవుల యొక్కయు, నిజ రూపమీజ్ఞానమే గావున ఇది అనంతమనియు, లేకసర్వవ్యాపక మనియు, చెప్పబడుచున్నది.

## షడ్భావ వికారములు.

శబ్దస్పర్శాది ప్రపంచవిషయములలో నొక్కొకటి గోచరమగు కాలములో మిగిలినవి గోచర

(1) నత్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః । న చైవ న భవిష్యామః సర్వేవయ మతః పరమ్. 2-12. (2) యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః । క్షేత్రం క్షేత్రీతథా కృత్స్నం ప్రకాశయతి భారత: 13-34.

ఘటించి ఆయావిషయములను ప్రవర్తించినట్లును, నిశ్చయింపబడు చున్నది, గాన, స్వప్నమందు మనస్సున్నట్లు నిశ్చయింపబడెను. అందు గూడ శబ్దజ్ఞానము, స్పర్శజ్ఞానము ఇత్యాదులు గలవు. గాని జాగ్రత్తులో వేద్యములుస్థిరములుగాను, స్వప్నములో వేద్యము లస్థిరములు గాను భాసించుచున్నవి. గానస్వప్నమందు గూడ జ్ఞానమున్నట్లు నిశ్చయింప బడు చున్నది.

సుషుప్తిదశ

ఇక సుషుప్త్యవస్థలో ఏట్టి యింద్రియ వృత్తులుగాని, మనోవృత్తిగాని, దేహాభావముగాని లేక యుండి మేల్కొన్న క్షణమందు "నేనేమియు నెరుగక సుఖముగా నిద్రించితినని" పల్కుట లోకానుభవ సిద్ధము. జాగ్రద్దశలో సుఖము ననుభవించిన వాడుగాని, రోగాదులచే దుఃఖము ననుభవించినవాడుగాని, ఈ సుషుప్తి దశలో పై యనుభవమునే చెప్పుచున్నందున అపు డీతనికి దేహేంద్రియ మనో ధర్మము లెంతమాత్రమును లేవని గోచరమగుచున్నది. గాని సుషుప్త్యనంతరకాలికస్మృతి వలన ఇతనికా సుషుప్తిలో జ్ఞాన మున్న ట్లూహింపబడుచున్నది. ఎట్లనగా ఒకప్పుడనుభవించిన విషయము తరువాత స్మరింపబడునుగాని, అనుభవింపని విషయము స్మరణకు రాదనుట లోకసిద్ధము. ఒకప్పుడు కాశీక్షేత్రమును చూచినవారు కొందరును, చూడనివారు మరికొందరును గలచోట మనము కాశినిగూర్చి ప్రస్తావించిన యెడల పూర్వము కాశీని చూచి యున్నవా రందరు మాత్రమే స్మరింప గల్గుదురుగాని ఎన్నడును చూడనివారు స్మరింపలేరు. అట్లే సుషుప్త్యనంతర కాలమందు "నేను సుఖముగా నింతకాలము నిద్రించితిని" అను స్మృతి తప్పక అనుభవ పూర్వకమై తీరవలయును గాన నీతనికి సుషుప్తిలో జ్ఞాన మున్న ట్లవశ్య మంగీకరింపవలెను. గాన జ్ఞానమీ మూడవస్థలలోను ఏకరీతిగా నున్నది.

ఇట్లు జాగ్రద్దశలో జ్ఞాన, మనో, దేహేంద్రియములను నాల్గును అవిద్యయు, స్వప్న దశలో జ్ఞాన, మనస్సులు రెండును అవిద్యయు, సుషుప్తిదశలో జ్ఞాన మొక్కటియు అవిద్యయు ఉండుటచేత మూడు దశ లందును ఏకరీతిగా యుండున దీజ్ఞాన మొక్కటియే. (అవిద్యావిచారణ ముందు చేయబడును) మిగిలిన మనో దేహేంద్రియములు ఒకప్పుడుండి మరియొకప్పు డుండుటలేదు. ప్రతివాడును "నేను జాగ్రత్తు ననుభవించితిని, స్వప్నము ననుభవించితిని, సుషుప్తి ననుభవించితిని" అని మూడవస్థలందును "నేను" అని సకలీవిగా

ప్రయోగించుటచే ఆ జ్ఞానమే ఈనేను, ఈ నేనే ఆ జ్ఞానము, అనుట యుక్తి సహమే యగు చున్నది. ఇట్లు సర్వుల చేతను వాడబడుటచే ఈ జ్ఞానమే సర్వము. ఈ జ్ఞానముకంటె మరి యొక వస్తువేలేదు.[1]

## చిద్రూప వివరణము.

ఈ జ్ఞానమును స్వతంత్రమగు పదార్థ మనక (1) విషయధర్మ మనియో, (2) ఇంద్రియ ధర్మమనియో, (3) దేహధర్మమనియో. (4) లేక మనోధర్మ మనియో, చెప్పుట కవకాశ ముండునేమో విచారించి చూతము.

1. ఈ జ్ఞానము శబ్దాది విషయ ధర్మమే యైనచో. నా విషయములు లేనపుడుగూడ పూర్వానుభూత విషయస్మృతి గల్గుచున్నందున విషయధర్మ మనరాదు.

2. ఈ జ్ఞాన మింద్రియధర్మమే యైనచో, యింద్రియములులేని సుషుప్తియందీజ్ఞానము నశింపక, పూర్వమువలె స్మరింపబడుచున్నది. బాల్యమందనుభూతమగు కాశీక్షేత్ర జ్ఞానము వార్ధకమువరకు, అనేక సుషుప్తులచే వ్యవహితమైగూడ, స్మృతమాత్రమై భాసించుచున్నదిగాన, ఈ జ్ఞాన మింద్రియధర్మ మనరాదు.

3. ఈ జ్ఞానము, దేహధర్మమేయైనచో, ప్రతివానికిని రోజులోగల ౨౪ గంటలలో, రెండువంతుల కాలము మాత్రమే దేహభావముతో నొప్పు జాగ్రద్దశయు, మూడవవంతు కాలము దేహభావములేని స్వప్నసుషుప్తిదశలును అనుభవములో నున్నవి. జాగ్రత్తులో జ్వరాదిరోగబాధయుండ, స్వప్నసుషుప్తులలో, నాబాధ లేకుండుటయు, అట్లే జాగ్రత్తులో తృప్తిగా భుజింప, స్వప్నమందు ఆకలితో బాధింపబడుచున్నట్లు, జాగ్రద్విపరీతానుభవము నొందుటయు, ఈ రీతిగా, ప్రతివానికిని, ఈ దేహముతో సంబంధ మొక్క జాగ్రత్తులో మాత్రమే యున్నది. ఈ రోజు జాగ్రత్సమాప్తివరకు, అనుభవింపబడుచున్న ఈ దేహము యొక్క సంబంధమాతనికి, మరుదినమందలి జాగ్రదారంభమువరకు, యెంతమాత్రమును

(1) జ్ఞానం తేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యా మ్యశేషతః । యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే. 7-2.

శ్రీ

# గీతాసారసంగ్రహము

## 2. ఆత్మప్రకరణము

### పరమాత్మ స్వరూపము.

ఈ గీతాశాస్త్రమందు శ్రీకృష్ణుడు, తన నిజరూపమును, జ్ఞానము, సత్, ఆత్మ. దేహి, అహం, క్షేత్రజ్ఞుడు, బ్రహ్మ, అక్షరం, ఉత్తమపురుషుడు ఇత్యాది పదములచేవాడెను. ఇది యెల్లప్పుడు ఏకరీతిగా నుండునదనియు,సత్యమైనదనియు, జ్ఞానరూపము, లేక చిద్రూపమనియు అనంతమనియు బోధించుట కీరీతిగా వివరించెను.

### సద్రూప వివరణము.

మనమందరము జాగ్రత్, స్వప్న, సుషుప్తులను, మూడవస్థలను ప్రతిదినమందును- జన్మకొకమారు బాల్య, యౌవన, కౌమార, వార్ధకములను దశలను అనుభవింపుచున్నాము. అందు జాగ్రదవస్థలో, చక్షురాదీంద్రియము లన్నిటితో దర్శనాది వ్యాపారమొనర్చుట, మనస్సుతో ఆలోచించుటయు, స్వప్నావస్థలో చక్షురాదీంద్రియములన్నియు ఉపసంహారమును జెంద, మనస్సుతో మాత్రమే, జాగ్రదవస్థా సంస్కారములవలన బుట్టిన విషయముల ననుభవించుటయు, సుషుప్త్యవస్థలో ఆ మనస్సుగూడ ఉపసంహారమును జెంద, యెట్టి విషయానుభవమున్ను లేకుండుటయు, అ సుషుప్తినుండి తిరిగి జాగ్రత్తు ప్రారంభమైన కాలమందు "నేనేమియు నెరుగక సుఖముగా నిద్రించితి"నని పల్కుటయు, సర్వజనానుభవసిద్ధమయియున్నది. "నేను మేల్కొంటిని" నేను కలగంటిని, "నేను నిద్రించితిని"అని జాగ్రదాద్యవస్థలు మూటిలోను, ఈ "నేన"నువాడు యెట్టిమార్పులేక, ఏకరీతిగా నుండుట సర్వలోకసిద్ధమైనది. ఈ నేను "అహం" అనబడును. గాన ఈ అహం శబ్దవాచ్యమై ప్రతి

జీవునియొక్కయు, నిజరూపము. [1]కావుననే ప్రతి జీవుడును "నాబుద్ధి, నాశిరస్సు, నా పాణిపాదమును, నాచక్షురింద్రియము" ఇత్యాది ప్రయోగములచే, తనను బుద్ధికంటెను, శిరస్సు మొదలగు నవయవముల కంటెను, చక్షురాదీంద్రియముల కంటెను, విలక్షణమైన వానినిగా పలుకుచున్నాడు.[2]

జాగ్రద్దశ

జాగ్రదవస్థలో శ్రోత్రేంద్రియముతో శబ్దమును, త్వగింద్రియముతో స్పర్శను, చక్షురింద్రియముతో రూపమును, రసనేంద్రియముతో రసమును, ఘ్రాణేంద్రియముతో గంధమును, ప్రతి జీవుడు గ్రహించి, "నేను శబ్దమును తెలుసుకొంటిని. స్పర్శను తెలుసుకొంటిని. రూపమును తెలుసుకొంటిని. రసమును తెలుసుకొంటిని. గంధమును తెలుసుకొంటిని" అని పలుకుచున్నాడు. ఇందు శబ్దస్పర్శాదులకంటెను, శ్రోత్రాదీంద్రియముల కంటెను, తెలివి యనునది విలక్షణముగా నున్నది. ఇందున్న తెలివియే జ్ఞానమనబడును. ఇందు శబ్దజ్ఞానము, స్పర్శజ్ఞానము, రూపజ్ఞానము, రసజ్ఞానము, గంధజ్ఞానము, అను అయిదుజ్ఞానములలోను, జ్ఞానమను విశేష్యమేకరీతిగానుండి, విశేషణములగు శబ్దస్పర్శాదులు మారుచున్నవి. ఇవి వేద్యములుగాన మారుచున్నవి. గాన వేద్యముమారినను జ్ఞానము మారక యేకరీతిగా నున్నది. ఇట్లు బాల్యమందలి జ్ఞానము వార్థకమందుగూడ నశింపక యెన్ని సంవత్సరములకైనను ఏకరీతిగానున్నది. ఇట్లుజాగ్రదవస్థలో ఈ జ్ఞానము మనస్సు, ఇంద్రియములు, దేహము ఇవియన్నియు భాసించుచున్నవి.

స్వప్నదశ

ఇక స్వప్నావస్థలో దేహేంద్రియము లుపశమింప, మనస్సు, జ్ఞానము, అను రెండుమాత్రమే యున్నవి. అచట గూడఆలోచించుట, సంకల్పించుట, చూచుట, భయ, కంపశోక, మోహ, సుఖాదులున్నవి. చక్షురాదీంద్రియములన్నియు, ఉపరతిని జెందియున్నట్లు పార్శ్వస్థులచే చూడబడుటయే గాక, తానుగూడ నడచుచున్నట్లు స్వప్నమునను భవించుచు, మేల్కాంచి, శయనించియేయున్నట్లు గుర్తింపుచున్నందునచక్షురాదీంద్రియము లుపశమించినట్లును, మనస్సేఆయాయింద్రియము లన్నిటి పాత్రను

(1) ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ । అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా. 7-6. (2) అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశ యస్థితః । అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మంత ఏవచ. 10-20.

మగుటలేదు. అట్లే సర్వ ప్రాపంచిక వస్తువులును పుట్టుచు, ఉండుచు, వృద్ధినొందుచు, పరిణమించుచు, క్షీణించుచు, నశింపుచు నుండుట సర్వానుభవ సిద్ధము. కాని ఈ జ్ఞానము ఎన్ని జన్మలకైనను నశించుటలేదు. కాన ఇది 'అవినాశి' యనబడును.[1]

## జ్ఞానము జన్మాంతరానుగత మగుట.

అతి బాలురుగూడ తల్లిని, ఇతరులను, దీపమును గుర్తించుట, నవ్వుట, ఏడ్చుట, ఆకలి మొదలగు లక్షణములు గల్గి యుండుటచే నీ జ్ఞానమునకు జన్మలేదు. పూర్వజన్మ జ్ఞానమును మరపీ జన్మలో స్వప్నమం దనుభవించుచున్నందున దీనికి నాశములేదు. దేహము నశించినను ఇది నశింపక మరుజన్మలోని కనుగత మగుచున్నందున దీనికి నాశము లేదు. [2]దేహమరణము 1. శస్త్రచ్ఛేదనము, 2. ఉదక ప్రమాదము, 3. అగ్ని ప్రమాదము, 4. గాలి ప్రమాదము, 5. పాంచభౌతిక వికారములగు జ్వరాది రోగప్రమాదములు ఇత్యాదులు నిమిత్తముగా గలది. ఈ జ్ఞానము, దేహము ఎట్టి శస్త్రచ్ఛేదనాదిక మొందుచున్నను నశింపక మరు జన్మములోని కనుగత మగుటచే ఇది ఎట్టి భౌతిక వికారమునకును ఆస్పదము గాదు. [3]ఒక క్లాసులో 40 మంది బాలుర కొకే ఉపాధ్యాయు డొక పాఠము నొకే రీతిగా బోధించినను వారిలో కొందరు పుష్కలముగాను, మరికొందరు కొంతభాగమును, వేరొకరు విపరీతముగను గ్రహించుటయు, ఇంకొకరు అసలే గ్రహింపకుండుటయు, లోకమందు ప్రత్యక్షమైన విషయము. దీనికి కారణము వానివాని పూర్వ జన్మ విద్యా సంస్కార భేదమేగాని వేరొక కొంతమాత్రమును గాదు. పూర్వజన్మలో ఈ విద్య నభ్యసించియున్న వాడీ జన్మలో ఒకమారు చెప్పుటతోనే గ్రహించును. పూర్వము పశుదేహములోనుండి ఇపుడు మనుజుడై పుట్టినవాడెన్నిమార్లు బోధించినను గ్రహింపలేకున్నాడు. గావున ఈ విద్యా

---

(1) అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ । వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. 2-17. (2) న జాయతే మ్రియతే వా కదాచిత్ నాయం భూత్వాభవితా వా న భూయః । అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే. 2-20. (3) నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః । న చైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః. 2-23.

జ్ఞానము నిత్యమై ఛేద్య, దాహ్య, క్లేద్య, శోష్యాది వికారధర్మముల నొందక నిత్యముగా నున్నది.[1]

## స ర్వ వ్యా పా రా ను వృ త్తి.

అతిసూక్ష్మమైనదగుటచే ఆకాశము, ప్రపంచమందలి మంచి, చెడు వస్తువులన్నిటి లోపల, బయట వ్యాపించియున్నను, ఆ వస్తువుల మంచిచెడులు దానిఁ గంటుటలేదు. బురద మీద, గంగానదిమీద వ్యాపించిన ఆకాశమునకు, ఆ రెంటిలో ఏ ఒకటి అంటలేదు. అట్లే మన చక్షురాదీంద్రియములు, జన్మప్రభృతి అనేక వస్తువులను గ్రహించుచున్నను, వాటి గుణదోషము లా ఇంద్రియముల గ్రహణశక్తికి ఎంతమాత్రము అంటక, మామూలు ప్రకారము వ్యవహరించుచున్నవి. కంటితో ఎన్నిరంగులను ఎన్నిపర్యాయములు చూచినను, అందొక్క రంగుగూడ కంటిలోని శక్తికి అంటి, దానిని మార్చలేదు. అట్లే ఆత్మ సర్వప్రపంచావస్థితమై యున్నను, ఆ ప్రపంచగుణదోషములు దానికంటవు.[2] ఒకేమనుష్యుడు పాత వస్త్రములను విసర్జించి క్రొత్తవస్త్రములను ధరించినంత మాత్రముచేతను, లేక స్నానకాలమందంగవస్త్రమును ఉపకాలమందు పీతాంబరమును, రాజదర్శనాదులందు తలపాగా మొదలగు దుస్తులను, ఇట్లు కాలభేదముచే వేషమును మార్చినంతమాత్రముచేతను "అంగవస్త్రమును ధరించిన ఆ మనుష్యుడే ఈ పీతాంబరధారి" యని లోకమందెట్లు ప్రత్యభిజ్ఞ గలుగుచున్నదో, అట్లే ఈ జ్ఞానముకూడ ఒకప్పుడు మనుష్యదేహమును, వేరొకపుడు పశుదేహమును ఇత్యాదిగా జన్మభేదముచే, దేహభేదముల నొందుచున్నను, ఆ జ్ఞానమే "ఇది" యని ప్రత్యభిజ్ఞ గలుగుచున్నందున, "ఇది"యే దేహియనబడును.[3] మనము ప్రతిక్షణమునందును కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, సుఖము, దుఃఖము, శీతము, ఉష్ణము ఇత్యాది పరస్పర విరుద్ధములగు వికారవిషయముల ననుభవించు

---

(1) అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయం అక్లేద్యోఽశోష్య ఏవచ । నిత్యస్సర్వగతః స్థాణుః అచలోఽయం సనాతనః. 2-24. (2) యథా సర్వగతం సౌక్ష్మ్యాత్ ఆకాశం నోపలిప్యతే। సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే. 13-33. (3) వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి । తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ. 2-22.

చున్నను, ఈ జ్ఞానమెట్టి వికారమును బొందక యేకరీతిగా నున్నది. అట్లే బాల్య, యౌవనాదులందు, దేహము వికారముల నొందుచున్నను, ఈ జ్ఞానమెట్టి వికారమునుబొందక యేకరీతిగా నున్నది. [1]దేహములోని వికారములు ఇంద్రియగోచరమగుచున్నను, ఈ జ్ఞానమే ఇంద్రియమునకు గోచరమగుటలేదు. మనస్సులేని సుషుప్తిలోగూడ నున్నందున మనస్సునకుగూడ గోచరముగాదు. [2]ఇట్టి జ్ఞాన మంతరింద్రియ బహిరింద్రియములకు గోచరముగాదు. కావుననే ఇది అణుప్రకంటెగూడ అణుతరమైనది. భూత భవిష్యద్వర్తమాన జన్మలన్నిటిలోనున్నందున (క్రాంతదర్శియగుటచే) కవి యనబడును. ఎన్ని జన్మల పూర్వమందయినను బాల్యవార్ధకాది ఉపచయాపచయములు లేక, నిత్యనూతనముగా నున్నందున పురాణమనబడును. ఈ జ్ఞానము దేహేంద్రియ స్వాధీనమందులేక, దేహాదులే దీని స్వాధీనమందున్నవి. ఎట్లనగా కారణమగుతండ్రి కార్యమగు పుత్రాదులను తన స్వాధీనమందుంచుకొనును. కార్యములేని కాలమందుగూడ కారణముండుననుట లోకసిద్ధము. గాని కారణవస్తువు శాసకుడును, కార్యవస్తువు శాసింపబడునదియు ననబడును. అట్లే ఈ జ్ఞానము కారణమై సర్వకాల సర్వావస్థ సర్వజన్మలందును ఏకరీతిగా నున్నది. కార్యమగు దేహాదికమొక కాలమందుండి వేరొక కాలమందు నశించుచున్నవిగాన, ఈ జ్ఞానమాదేహాదికమునకు కారణమై అనుశాసిత యనబడును.[3]

## నిరవయవత్వ నిరూపణము.

వికారాస్పదములగు దేహాదులు సావయవములై విభాగయోగ్యములై యుండుటచే, అంగవికలులుగూడ జీవించుచున్నారు. ఈ జ్ఞానమావికలాంగులందును మనుష్య, పశుపక్ష్యాదులందును సమానముగా నున్నది. పశువులుగూడ పచ్చిగడ్డి చేతిలో ధరించిన వానిని ప్రేమతో సమీపించుటయు, దండమును ధరించిన వానిని దూరమునుండియే చూచి భయముతో పారిపోవుటయు, ప్రత్యక్షము; గాన పశుపక్ష్యాదులకుగూడ ఈ జ్ఞానము సమానము.

(1) దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా। తథాదేహాన్తర ప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి. 2-13. (2) అవ్యక్తోఽయ మచింత్యోఽయం అవికార్యోఽయ ముచ్యతే । తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. 2 25. (3) కవిం పురాణ మనుశాసితారం అణోరణీయాంస మనుస్మరేద్యః । సర్వస్య ధాతార మచింత్య రూపం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్. 8-9.

అందుచే ఇది విభాగయోగ్యముగాని నిరవయవ పదార్థమైనందున వధాది వికారముల కాస్పదముగాదు.[1] ఈ ఆత్మ చంపునదిగాదు, చంపబడునదిగాదు. ఈరెండు ఆత్మధర్మములని భావించువా రజ్ఞానులు.[2] ఈ జ్ఞానము సర్వశరీర వ్యాపకమై సకల దేహేంద్రియ వ్యాపార ములకును కారణమగుచున్నది. జీవదేహము కార్యకారియగుటయు, మృతకళేబరము కార్య కారి కాకపోవుటయు, సర్వానుభవ సిద్ధముగదా! దేహేంద్రియాదు లాయా కార్యముల నొనర్చుచుండ, అందువలన గలుగు ప్రయోజనమగు సుఖదుఃఖాదికమీ జ్ఞానమునకు స్వరూ పమై సంబంధించుటలేదు. ఏలననగా, సుఖదుఃఖాదులన్నియు జాగ్రత్స్వప్నములను రెండవ స్థలలోనే యుండునుగాని, సుషుప్తిలో యుండవుగదా! ఈ జ్ఞానమీ సుషుప్తిలోగూడ ఏకరీతిగా నుండుటచే, దీనికి సుఖదుఃఖాది సంబంధ మెంతమాత్రమును యథార్థముగా లేనట్లు నిశ్చయింపబడుచున్నది. మరియు దుఃఖరోగ జరాదులచే నీ దేహాదికము కృశింపు చుండ నీ జ్ఞానమెల్లప్పుడు నేకరీతిగా నుండుటచేగూడ దీనికి దేహగత, గుణదోషసక్తత లేనట్లు నిశ్చయింపబడుచున్నది. మనుష్యాశ్వగవాదు లన్నిటియందును ఈ జ్ఞాన మేకవిధమై నందునను, దీనికి యథార్థముగా సుఖదుఃఖ సంబంధములేదని నిశ్చయింపబడుచున్నది.[3] ప్రారంభదశలో ఈ ఆత్మకు ఇదివరలో, కనివిని యెరుగనంతటి ఆశ్చర్యమైనదిగా సాధకుడు చూచుచు, చెప్పుచు, వినుచుగూడ గ్రహింపలేడు. పరిపక్వదశలో దీనిని గ్రహించిన వారా శ్చర్యతుల్యులే అనగా అనేక వేలమందిలో ఒకరే.[4] ఈ జ్ఞానము దేహాదులు నశించనను నశింపకుండుటచే అక్షరమనబడును. అంతరింద్రియ బహిరింద్రియములకు గోచరమగుటలేదు.[5] దీనిచే సర్వబ్రహ్మాండము వ్యాప్తమై యున్నందున దీనికే'పురుషుడ'ని యన్వర్థసంజ్ఞ (పూర్ణ

---

(1) దేహీ' నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత। తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 2-30. (2) య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్। ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. 2-19. (3) అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః। శరీరస్థోపి కౌంతేయ! న కరోతి న లిప్యతే. 13-32. (4) ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనం ఆశ్చర్యవ ద్వ దతి తథైవ చాన్యః। ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 2-29. (5) అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిం। యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. 8-21.

మనేన సర్వమితిపురుషః అని పురుషశబ్ద నిర్వచనము.)[1] కార్యమగు ఘటాదికముకంటె, కారణమగు మృత్తుపెద్దదనియు, పృథివికంటె ఉదకమును. దానికంటె అగ్నియు, దానికంటె ఆకాశమును పెద్దవియనియు శాస్త్రముచేతను, లోకానుభవముచేతను సిద్ధమైయున్నది. ఈ జ్ఞాన మాకాశమునకుగూడ కారణమైనందున అంతకంటెను పెద్దదగుటచే 'బ్రహ్మ'యనబడును. లోకమందు దిక్కు, దేశము, కాలము, వయస్సు మొదలగునవి ఆపేక్షికములు. ఒక వస్తువుతో పోల్చి వీనిని చెప్పవలయునేకాని స్వతంత్రముగ చెప్పవీలులేదు. ఎట్లనగా 60 సంవత్సరముల వయస్సుగల ఒకనిని చిన్నవాడనిగాని, పెద్దవాడనిగాని స్వతంత్రముగా చెప్పవీలులేదు. అంతకంటె చిన్నవానితో పోల్చి చెప్పవలసివచ్చినపు డాతనినే పెద్దవాడనియు, అంతకంటె పెద్దవానితో పోల్చి చెప్పవలసి వచ్చినపు డాతనినే చిన్నవాడనియు చెప్పెదము. అట్లే ఒకవస్తువు తూర్పుమొదలగు దిక్కులలో నేదిక్కులో నున్నదియు స్వతంత్రముగా చెప్పవీలులేదు. ఒక వస్తువుతోపోల్చి, దానికి తూర్పున ఉన్నట్లు చెప్పవలయును. అట్లే యీ గొప్పదనముగూడ ఆపేక్షికముగాన ఈ జ్ఞానము బ్రహ్మాండమందలి నే వస్తువులో పోల్చినను గొప్పదేగాని, దీనికంటె పెద్దవస్తు వెచ్చటనులేదు. కాన నిది 'బ్రహ్మ' యనబడును.[2] జాగ్రదవస్థలో జ్ఞాన, బుద్ధి, మనో, దేహేంద్రియములును స్వప్నములో జ్ఞాన మనోబుద్ధులును, సుషుప్తిలో జ్ఞానమాత్రమును ఉండుట లోకసిద్ధముగాన, ఇంద్రియములకు కారణమైన మనస్సు ఆ యింద్రియములకంటె గొప్పది. మనస్సుకు కారణమైన జ్ఞానము ఆ మనస్సుకంటె గొప్పది.[3] ఇది సర్వులందును ఉన్నందున 'సర్వ'మనబడును. సర్వులకును నిజరూపమగుటచే "అహం" అనబడును.[4] తనవలె లోకులందరియొక్కయు నిజరూపమైనందున "తత్" అనబడును. ఎన్నడు నశింపనందునను అంతట అనుగతమైయున్న ఆ

---

(1) పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా । యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్. 8-22. (2) అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే । భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః. 8 3. (3) ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః । మనసస్తు పరాబుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః. 3-42. (4) సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనంచ వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్. 15-15.

మనను "సత్" అనబడును.[1&2] క్షేత్రమను పేరుగల ప్రతిదేహమందునుండి తద్వ్యాపారమున కంతకును అధిష్ఠాన మగుచున్నందున ఈ జ్ఞానమునకే 'క్షేత్రజ్ఞ'యని పేరు.[3&4] ఇదియే నిత్యము, నిరవయవముగాన ఆద్యంతములు లేక, ఇంద్రియగోచరము గానందున అనాదిమత్తని జ్ఞేయమని చెప్పబడును.[5] అట్లగుచో నిది శూన్యమని తలంపరాదు. సర్వజీవులయొక్క పాణి, పాద, చక్షు, శ్రోత్రాదులద్వారా ఈ జ్ఞానాస్తిత్వము పృథముగా నిశ్చయింపబడుచున్నది.[6] కాని ఆ ఇంద్రియ గుణములతో నీ జ్ఞానమున కెట్టి సక్తతయు లేనందున 'అసక్త' మనబడును. శబ్దస్పర్శాదీంద్రియ గుణములు దీనికి లేనందున ఇది నిర్గుణమనబడును. "మటమున్నది, మనుష్యుడున్నాడు, పశువున్నది" ఇత్యాది వ్యవహారమంతయు నీ జ్ఞానచైతన్య మాయావస్తుస్థలం దున్నప్పుడే కుదురును గాని, లేని మృతకళేబరములందుండదుగాన నిది 'సర్వభృత్త'నబడును. దేహేంద్రియాదులకు కారణములగు సత్వరజస్తమోగుణములు లేనిదైనను ఆయా గుణపరిణామమగు సుఖదుఃఖాదికమున కుపలబ్ధయగుటచే 'గుణభోక్త' యనబడును.[7] సర్వభూతముల దేహములోపల చర్మ మాంసాదులకును, దేహావయవములకును చరముగానుండు ప్రాణాదులకును అధిష్ఠానముగా నుండి అతిసూక్ష్మమగుటచే అజ్ఞానులకు గోచరముగానందున వారలకెన్ని జన్మలకైనను దూరముగానేయుండును. జ్ఞానుల కత్యంతసమీపమందున్నది.[8] ప్రతి జీవునియందును ఆకాశమువలె నవిభక్తమై దేహాదులకంటె విభక్తమైన దానివలెనుండి భూతములను స్థితికాలమందు భరించునదియు ప్రళయము

---

(1) ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః । బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. 17-23. (2) సద్భావే సాధుభావేచ స దిత్యేత త్ప్రయుజ్యతే । ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. 17-26. (3) ఇదం శరీరం కౌంతేయ; క్షేత్ర మిత్యభిధీయతే । ఏత ద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి త ద్విదః. 13-2. (4) క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత । క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తజ్ జ్ఞానం మతం మమ. 13-3. (5) జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే । అనాదిమ త్పరంబ్రహ్మ నసత్తన్నాస దుచ్యతే. 13-13. (6) సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ । సర్వత శ్శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. 13 14. (7) సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ । అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. 13-15. (8) బహి రంతశ్చ భూతానాం అచరం చర మేవచ । సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం దూరస్థం చాంతికేచ తత్. 13 16.

కాలమందు గ్రసించునదియు ఉత్పత్తి కాలమందు ఉత్పత్తి స్వభావము గలదానివలెను ఉండును. ఎట్లనగా రజ్జువును చూచి సర్పమను భ్రాంతి నొందిన వానికి సర్పముయొక్క ఉత్పత్తి స్థితి లయములు మూడింటికిని రజ్జువే అధిష్ఠాన మైనట్లు ఈ జ్ఞానమే సర్వభూతముల ఉత్పత్త్యాదుల కధిష్ఠాన మైనది.[1] నశించునట్టి దేహాదులతో నశింపక శ్రేష్ఠుడై యుండుట ఉత్తమ పురుషుడనియు, పరమాత్మ యనియు చెప్పబడును.[2] స్థూలదేహ నాశము సర్వవిదితము. సూక్ష్మదేహనాశము ముక్తులకును, సత్యలోకము నొందు వారలకును మాత్రమే గలుగును. కారణ దేహనాశము ముక్తులకు మాత్రమే గలుగును. ఇట్లే దేహత్రయము నుండి విముక్తుడగు స్థితియే మోక్షమనియు, కైవల్యమనియు చెప్పబడును. అది లోకప్రతీతిలోను, వేదమందును ఈ జ్ఞానభావ మాత్రస్థితియే గాన పురుషోత్తము డనబడును.[3] ఈ జ్ఞానమే ప్రకాశరూపమై సర్వజీవుల దేహాదికములో నుండి అంతఃకరణాదులను ప్రకాశింప జేయుచు అచట తమస్సును పోగొట్టుచున్నది.[4] సూర్యదీపాదులకాంతి వెలుపల వస్తువులను ప్రకాశింప చేయుచున్నను, దేహముల లోపల ప్రకాశింపచేయలేదు. ఈ జ్ఞానము దేహముల లోపల అంతఃకరణమును ప్రకాశింపజేయుచు సూర్యాదులు లేని కాలమగు స్వప్నసుషుప్తులందుకూడ ప్రకాశించుచున్నందున సూర్యాదికాంతికంటె దీని కాంతి గొప్పదియై ఆసూర్య చంద్రాదులకుగూడ అధిష్ఠాన ప్రకాశరూపమైనది.[5] స్వప్నసుషుప్తులలో దీనిప్రకాశమున్నందునను, అప్పుడు సూర్యాదులు భాసింపకుండుటను దీనిని సూర్యాదులు ప్రకాశింపజేయలేరు.[6]

## ఆనందరూప వివరణము.

ప్రపంచమందలి విషయముల ననుభవించుటచే గలుగు సుఖము క్షణికము. ఒక

---

(1) అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్ । భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 13-17. (2) ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః : యో లోకత్రయ మావిశ్యబిభ ర్త్యవ్యయ ఈశ్వరః. 15-17. (3) యస్మాత్క్షర మతీతోఽహమ్ అక్షరాదపి చోత్తమః । అతోఽస్మిలోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 15-17. (4) జ్యోతిషా మపి తజ్జ్యోతిః తమసః పర ముచ్యతే। జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్. 13-18. (5) యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ । యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. 15-12. (6) న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః । యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ. 15-6.

విషయసుఖముకంటె యింకొక విషయసుఖము హెచ్చుతగ్గులతో నుండునదియు అనిత్యమై నదియునని సర్వానుభవసిద్ధము. ఈ జ్ఞానమట్లుగాక సర్వోత్కృష్టమైనదియు, అంతరింద్రియ, బహిరింద్రియములకు గోచరము కానిదియు అయియున్నది.[1] సుషుప్తియం దెట్టి ఇంద్రియ విషయాదులు లేకున్నను, లేచిన తరువాత సుఖమును స్మరించుటచే సుఖానుభవము సుషుప్తిలో ననుభవింపబడుచున్నట్లవశ్య మూహింపబడుచున్నందున ఈ జ్ఞానమే సుఖరూపమనియు, హెచ్చుతగ్గులు లేక, సుషుప్తికాలములో అంతట ఏకరీతిగా నున్నదనియు, నిశ్చ యింపబడుచున్నది గాన యిది సర్వసుఖములకంటె గొప్పది.[2] లోకమందు ఆహారపదార్థములు సుఖకరములు. అంతకంటె గృహక్షేత్రాది స్థిరాస్థియు, దానికంటె వెండి బంగారములును, చరాస్థియు, దానికంటె పుత్రాదులును, అంతకంటె భార్యయు, అంతకంటెను గూడ తానే తనకు సుఖకరుడు-ఆపదలలో పై పదార్థములను వరుసగా పరిత్యజించునుగాని తనను తానెప్పుడును పరిత్యజింపడు. మరియు దారాపుత్రాదులందలి ప్రేమయంతయు, తన సుఖముకొరకే గాని, వారలకొరకెంతమాత్రమునుగాదు. గాన తానే సర్వోత్కృష్ట సుఖరూపుడగుటచే ఆత్మయనబడును.[3&4] ఇదియే "నేను."

ఇక "నేను చూచుచున్నాను, వింటున్నాను, పరిచ్ఛిన్నుడను, దుఃఖము ననుభవించు చుంటిని" ఇత్యాది లోకవ్యవహారమునకు కారణము నెరుగుటకు అనాత్మ ప్రకరణ ముపక్రమింపబడుచున్నది.

## సింహావలోకనము.

పరమాత్మయొక్క స్వరూపమగు సత్, చిత్, ఆనంద, అనంతములు, సద్రూపవివరణకొరకు జీవుని జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు, చిద్రూపవివరణకొరకు జ్ఞానము, దేహేంద్రియ మనోధర్మము గాదని నిరూపించుట, అనంతరూప వివరణకొరకు జన్మాంతరానువృత్తజ్ఞానమును, షడ్భావవికార రాహిత్య వర్ణనమును—సర్వవ్యాపారానువృత్తి నిరూపణమును - నిరవయవత్వ నిరూపణమును - ఆనందరూప వివరణకొరకు, పుత్ర, మిత్ర. కళత్ర ధనాదులందలి ప్రేమ తనకొరకేనని నిరూపించుటయు ఈ ప్రకరణములో గలవు.

---

(1) సుఖ మాత్యన్తికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియం । వేత్తి యత్ర న చైవాఽయం స్థితశ్చలతి తత్త్వతః. 6-21. (2) యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః । యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే. 6-22. (3) ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ । ఆత్మైవ హ్యాత్మనో బన్ధుః ఆత్మైవ రిపు రాత్మనః. 6-5. (4) బన్ధురాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః । అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 6-6.

శ్రీ

# గీతాసారసంగ్రహము

## 3. అనాత్మ ప్రకరణము

ఇట్టి జ్ఞానానందలక్షణమగు ఆత్మకంటె వేరుగా భాసించునదంతయు అనాత్మ యనబడును. దీనినే గీతాశాస్త్రము దేహము, శరీరము, ప్రకృతి అసత్, క్షేత్రము, క్షరము, అధిభూతము ఇత్యాది శబ్దములచే పేర్కొన్నది. ఈ శరీరము 1. స్థూలము, 2. సూక్ష్మము, 3. కారణము అని మూడు విధములు.

### స్థూల దేహము.

ఇది సర్వకాల సర్వావస్థలందును ఉండక పోవుటచే అసత్తనబడును.[1] ఇది ఒక కాలమందు ప్రాణసంయోగమును, మరియొక కాలమందు ప్రాణవియోగమును పొందునట్టిది.[2] ఇది నేను, ఇతరుడు, బంధువులు, మిత్రులు, శత్రువులు, మనుష్యులు, పశువులు, దేవతలు ఇత్యాది సర్వభేదములతో నొప్పియున్నది.[3] ఈ దేహ ముత్పత్తికి పూర్వ మెట్లుండునో, మరణానంతర మెట్లుండునో గోచరముగాక మధ్యనుండు స్థితి కాలమందు మాత్రము భాసించుచున్నందున దీనికి భూతమని పేరు.[4] శబ్దస్పర్శాది గుణములతో సంయోగము నొందుచు ఆ శబ్దస్పర్శాదులను గ్రహించు శ్రోత్రాదీంద్రియముల సమూహామే ఈ దేహము

---

(1) నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః । ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వ దర్శిభిః. 2-16. (2) అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే। గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః. 2-11. (3) నత్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః। న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్. 2-12. (4) అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత। అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరిదేవనా ? 2-28.

కాన ఇది సావయవమున్ను, విభజింప నలవియైనదిన్ని అసత్యమున్ను శీతోష్ణ సుఖదుఃఖాదుల కాశ్రయమున్ను అగుచున్నది.[1] కావుననే యిది జననము, ఉనికి, వృద్ధి, పరిణామము, అపక్షయము, నాశము అను వికారములు గలది.[2] ఒకడు పుట్టుకలోనే కుంటి, గ్రుడ్డి ఇత్యాది వికలాంగుడుగాను, వేరొకడు మహాసుందరుడుగాను, ఒకడు దరిద్రునింటిలోను, ఇంకొకడు శ్రీమంతు నింటిలోను జన్మించుచున్నాడు.

అట్లే ఒకడు గొప్ప తెలివిగలిగి ఒక్కమారు చెప్పినంతనే విద్యను గ్రహించువాడును, యింకొకడు మూఢుడై ఎన్నిమార్లు బోధించినను విద్యను గ్రహింపలేనివాడును లోకమందున్నందున, దీనికి కారణము తప్పక పూర్వజన్మ సంస్కారమే యనవలయును. పూర్వజన్మలోని ధర్మాధర్మ సంస్కారము ననుసరించి యీజన్మలో దీని గుణదోష ప్రవృత్తియుండును. కాన జన్మించినవాడు తప్పక నశించుననియు, మరణించినవాడు తిరిగి యెచ్చట నయినను జన్మించుననియు, స్పష్టమగుచున్నది[3] ఇది ఛేదన, దహన, క్లేదన, శోషణాది ప్రమాదములకు లోనయి స్ఫుటముగా నింద్రియగోచరమగుచు పొడుగు, వెడల్పు, లావు మొదలగు పరిచ్ఛేదము గలిగి బాల్యయౌవనాదులందుపచయాది ధర్మము గలదయి అనిత్యమును నున్నది.[4&5] కావుననే ప్రతి క్షణమందును యెద్దియో యొకపనిని చేయుచుండును.[6] తాను దుఃఖము ననుభవించుచు తత్ప్రతీకారము కొరకే పనిచేయును. ఒకప్పుడు సుఖము ననుభవించుచున్నను అంతకంటె గొప్ప సుఖము నపేక్షించియే ప్రవర్తించునుగాన, ఈ దేహము దుఃఖరూపమయినది.[7] ఇది స్వభావముచే జడమైనది గాన 'క్షేత్ర'మనబడును. దీని నాయా వ్యాపారమందు ప్రవర్తింపజేయునది సూక్ష్మదేహము గాన దాని స్వరూపము వివరింపబడుచున్నది.

---

(1) మాత్రాస్పర్శాస్తు కౌన్తేయః శీతోష్ణ సుఖదుఃఖదాః । ఆగమాపాయినో నిత్యాఃతాం స్తితిక్షస్వ భారత. 2-14. (2) అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః । అనాశినో౽ప్రమేయస్య తస్మా ద్యుద్ధ్యస్వ భారతః 2-18. (3) జాతస్యహి ధ్రువోమృత్యుః ధ్రువం జన్మమృతస్యచ । తస్మా దపరిహార్యే౽ర్థే నత్వం శోచితు మర్హసి. 2-27. (4) తత్ క్షేత్రం యచ్చ యాదృక్చయ ద్వికారి యతశ్చయత్ స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 13-4. (5) మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్తమేవచ । ఇన్ద్రియాణి దశైకంచ పంచచేంద్రియ గోచరాః. 13-6. (6) నహి కశ్చిత్ క్షణ మపిజాతు తిష్ట త్యకర్మకృత్ । కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. 3 5. (7) క్లేశో౽ధికతరస్తేషాం అవ్యక్తాసక్త చేతసామ్ । అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. 12-5.

## సూక్ష్మదేహము.

ఇది స్వరూపముచే మనకు గోచరముగాక దాని కార్యముచే నూహింపబడుచున్నది. శోక, మోహ, సుఖ, దుఃఖ, రాగ ద్వేషాదులు దీని కార్యములే.[1] ప్రాణవాయువు, అంతఃకరణము, ఇంద్రియములు, వీటి సమూహమే దీని స్వరూపము. ఇది ప్రాణధారణ మొనర్చుటచే 'జీవు'డనబడుచు, స్థూలదేహమును నాయా పనులందు ప్రవర్తింపజేయును.[2] స్థూలదేహము లెన్నిమారుచున్నను అన్నిటియందును అనుగత మగునదీ సూక్ష్మదేహమే. వాయువు పుష్పాదులమీదుగా వీచుచు అందలి పరిమళాదులను తనలో కలుపుకొని వెళ్లునట్లు, ఈ సూక్ష్మదేహము అంతరింద్రియ బహిరింద్రియశక్తులను తనలో లయింపజేసుకొనియే మరియొక స్థూలదేహమందు ప్రవేశించును.[3] ఇదియే శ్రోత్రాదీంద్రియములను, మనస్సును అధిష్ఠించి, స్థూలదేహము ద్వారా శబ్దస్పర్శాది విషయములను సేవించును.[4] ఇది స్థూలదేహములోనుండి లేచిపోవునప్పుడుగాని, మరియొక స్థూలదేహమందు ప్రవేశించునప్పుడుగాని, జ్ఞానులు చూడగలుగుదురేగాని పామరులు చూడజాలరు.[5&6] ఆలోచించుట, చింతించుట, ధ్యానించుట, ఘోమరితనము, హృదయదౌర్బల్యము ఈ సూక్ష్మదేహధర్మములే యగుచున్నవి.[7] ఇట్లీ యా విషయముల నాలోచించుటచే క్రమముగా సంగము, కామము క్రోధము, సంమోహము, స్మృతివిభ్రమము, బుద్ధినాశము ఇత్యాదులు గల్గును.[8&9] ఇవి గల్గి

---

(1) ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః। ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. 13-7. (2) మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః । మన షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 15 7. (3) శరీరం యదవాప్నోతి యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః । గృహీ త్వైతాని సంయాతి వాయుర్గన్ధా నివాశయాత్ .15-8. (4) శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణ మేవచ। అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే. 15 9. (5) ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్। విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞాన చక్షుషః. 16-10. (6) యతన్తో యోగిన శ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్ । యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః. 15-11. (7) క్లైబ్యం మాస్మగమః పార్థ నైత త్త్వ య్యుపపద్యతే । క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 2 3. (8) ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తే షూపజాయతే । సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభి జాయతే. 2 62. (9) క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః। స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి. 2-63.

నట్లు స్థూలదేహాశ్రితములగు ముఖశోషణము, అవయవములు నీరసించుట,[1] వేపసు(వణకుట), రోమహర్షణము, చేతులలోనున్న వస్తువు జారిపోవుట, నోఱుఎండుట, మనస్సు తిరిగినట్లుండుట,[2] ఇత్యాది లక్షణములచే నూహింపబడవలయునే గాని స్వస్వరూపముచే గోచరములు గావు. దీనికి సుఖాసక్తియు, జ్ఞానశక్తియు గలిగియున్నప్పు డిది 'సాత్త్వికదేహ' మనబడును.[3] ఇందు తృష్ణ హెచ్చుగానుండి తత్సిద్ధికొరకు నిరంతర ప్రయత్న మొనర్చు నప్పుడు 'రాజస దేహ' మనబడును.[4] ఇందు ప్రమాదము, ఆలస్యము, నిద్ర, మోహము, అజ్ఞానము ఇత్యాదు లున్నప్పు డిది 'తామసదేహ' మనబడును.[5] ఈ మూడు భేదములలో సత్త్వమే ప్రభువుగా నుండి రజస్తమస్సుల నణగద్రొక్కుటకును, అట్లే రజస్సే ప్రభువై సత్త్వతమస్సుల నణచుటకును, అట్లే తమస్సే ప్రభువై సత్త్వరజస్సుల నణచుటకును ప్రయత్నించును.[6] చతుర్దశ భువనములలో నేజీవుని సూక్ష్మదేహమైనను ఈ సత్త్వరజస్తమోగుణములు మూడును కలిగి యుండును.[7] జీవుని చక్షురాది సకలేంద్రియ ప్రవృత్తులును జ్ఞాన సహితములుగా నున్నచో వాని సూక్ష్మదేహము 'సత్త్వప్రధాన' మనబడును.[8] లోభము, ప్రవృత్తి, సర్వకార్యములనారంభించుట, శాంతి లేకుండుట, కోరికలు ఇత్యాదులున్న వాని సూక్ష్మదేహము 'రజఃప్రధాన' మనబడును.[9] అవివేకము, ప్రవృత్తి లేకుండుట, ప్రమాదము, మోహము ఇత్యాదులున్న వాని సూక్ష్మదేహము 'తమఃప్రధాన' మనబడును.[10] ఇది 1 ఆహారము, 2 తన ఆదర్శము,

(1) సీదంతి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి । వేపథుశ్చ శరీరేమేరోమహర్షశ్చ జాయతే 1-29. (2) గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే । నచ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః. 1-30. (3) తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్ । సుఖసంగేన బధ్నాతి జ్ఞాన సఙ్గేన చానఘః 14-6. (4) రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గ సముద్భవమ్ । తన్నిబధ్నాతి కౌన్తేయః కర్మసఙ్గేన దేహినమ్: 14-7. (5) తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ । ప్రమా దాలస్య నిద్రాభిః తన్నిబధ్నాతి భారత. 14-8. (6) రజస్తమ శ్చాభి భూయ సత్త్వం భవతి భారత. రజస్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజస్తథా. 14-10. (7) న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః । సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభిస్స్యా త్త్రిభి ర్గుణైః 18 40. (8) సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే । జ్ఞానం యదా తదా విద్యాత్ వివృద్ధం సత్త్వమిత్యుత. 14-11. (9) లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా । రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ: 14-12. (10) అప్రకాశోఽప్రవృత్తి శ్చ ప్రమాదో మోహ ఏవచ । తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన: 14-13.

ఆచరణ, 4 శ్రద్ధ, 5 దానము లేక పెట్టుబడి, 6 ప్రపంచవస్తువులందు తన దృష్టి, 7తాను ...యు పనులు, 8 కర్తృత్వము, 9 బుద్ధి, 10 ధైర్యము, 11 సుఖము, 12 వీటి ఫలము, అను ...రెండుగుణములు గలిగి యుండును. అందును, ఆహారమందలి గుణదోషములను బట్టి ఆద ...ము, దాని గుణదోషములను బట్టి ఆచరణ, ఈ రీతిగా ఉత్తరోత్తరములకు పూర్వపూర్వ ...ులు హేతువులగును.[1]

## సాత్త్విక సూక్ష్మదేహ లక్షణములు.

ఈ సాత్త్విక సూక్ష్మదేహము గలవారు ఆయుస్సును, సత్వమును, బలమును, ఆరోగ్య ...మును, సుఖమును, ప్రీతిని వృద్ధి పొందించునట్టియు, మధురమైనట్టియు, స్నేహము గలిగి ...ట్టియు, స్థిరమైనట్టియు, హృదయంగమములైనట్టియు రసవంతములైనట్టియు, ఆహార ...మును ప్రేమింతురు.[2]

2. వేద ప్రతిపాదిత ఇంద్రాది దేవతల నారాధింతురు.

3. ఫలము నపేక్షింపక తమ వర్ణానురూప శాస్త్రవిహిత యాగములు నాచరింతురు.[3]

4. ఫలాకాంక్ష లేక నిశ్చల చిత్తముతో తప మాచరింతురు.[4]

5. శాస్త్రీయమగు దేశ, కాల, పాత్రములను గమనించి ఎట్టి ప్రత్యుపకారమును అపేక్షింపక, దాన ఫలము నపేక్షింపక దానమిత్తురు.[5]

6. పిపీలికాది బ్రహ్మ పర్యంతములగు సర్వభూతము లందును, నాశరహితమగు ఐక్య భావమును, దేహములు భిన్నములైనను, జ్ఞానము మాత్ర మవిభక్తమైనట్లుగా చూచు జ్ఞానముగలిగి యుందురు.[6]

---

(1) బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శృణు । ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ 18-29. (2) ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః । రస్యాస్స్నిగ్ధా స్థిరాహృద్యాః ఆహారా స్సాత్త్వికప్రియాః. 17-8. (3) అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।యష్టవ్య మేవేతి మన స్సమాధాయ ససాత్త్వికః. 17-11. (4) శ్రద్ధయా పరయా తప్తం తపస్త త్త్రివిధం నరైః ।అఫలా కాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే. 17-17. (5) దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే । దేశే కాలేచ పాత్రేచ। తద్దానం సాత్త్వికం స్మృతమ్. 17-20. (6) సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే । అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 18-20.

7. నిత్యమై నట్టియు, ఆసక్తి లేనట్టియు, రాగద్వేష రహిత మైనట్టియు కర్మలను ఫలేచ్ఛ లేక ఆచరింతురు.[1]

8. ముక్తసంగులై అహంకారము లేక, ధైర్యోత్సాహములు గలిగి కార్యముసిద్ధించి నను సిద్ధించకున్నను ఎట్టి వికారము లేక ప్రతి పనిని చేయుదురు.[2]

9. కర్మమార్గ సన్యాసమార్గములను, తమ వర్ణాశ్రమముల విధి ప్రతిషేధములను, దృష్టాదృష్ట విషయములగు భయాభయ కారణములను, సకారణమగు బంధ మోక్షములను, గుర్తించు బుద్ధి గలిగి యుందురు.[3]

10. నిత్య సమాధ్యనుగతమగు ధృతిచే అంతరింద్రియ బహిరింద్రియముల యొక్క క్రియలను ధరించునట్టి ధైర్యముగలిగి యుందురు.[4]

11. ప్రారంభమందు విషమువలెను, పరిణామ మందమృతమువలెను ఉండునట్టియు తమ నిర్మలబుద్ధిచే గలిగినట్టియు, సుఖము నొందుదురు.[5]

12. వీరు ఒక స్థూలదేహమును విడిచి మరణించ, నిర్మలమగు ఉత్తమ లోకములం దుత్తమ స్థూలదేహమును బొందెదరు.[6] ఇట్లు సూక్ష్మదేహమందు సత్వగుణము ప్రధానమై యున్నట్లు గ్రహించుటకు ఆరహారము, ఆరాధన, యజ్ఞము, తపస్సు, దానము, జ్ఞానము, కర్మ, కర్తృత్వము, బుద్ధి, ధృతి, సుఖము అను పదకొండు కార్యలింగములును అట్టివారి కుత్తరజన్మఫలమునున్ను వివరించి రజః ప్రధాన సూక్ష్మదేహము నీ పండ్రెండింటిని వివరింతును.

---

(1) నియతం సంగరహితం అరాగద్వేషతః కృతమ్ । అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే. 18-23. (2) ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః । సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 18-26. (3) ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే । బంధం మోక్షంచ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ. 18-30. (4) ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః । యోగే నావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ. 18-33. (5) యత్త దగ్రే విష మివ పరిణామేఽమృతోపమమ్ । తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజమ్. 18-37. (6) యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ । తదోత్తమవిదాం లోకాన్ అమలాన్ ప్రతిపద్యతే. 14-14.

## రాజస సూక్ష్మదేహ లక్షణములు.

1. అతి కటువు, అత్యామ్లము, అతి లవణము, అత్యుష్ణము, అతితీక్ష్ణము, అతికఠినము- అతిదాహకములును, దుఃఖమును శోకమును, వ్యాధిని గలుగుజేయు నట్టిన్ని ఆహారములను కోరుదురు.[1]

2. యక్షులను, రాక్షసులను ఆరాధింతురు.

3. లోకులు తనను గొప్పగా తలచు నుద్దేశముగ దంభముతోను, ఫలాపేక్షతోను యాగముల నొనర్తురు.[2]

4. ఇతరులచే "ఇతడు సాధువు, తపస్వి" అనబడుచు, ప్రత్యుత్థాన అభివాదనములను పాదప్రక్షాళ నార్చనాదులను బొందుట కొరకును, దంభముకొరకును కాదాచిత్క ఫలమగు 'అధ్రువ' తపస్సు చేతురు.[3]

5. ఫలాపేక్ష గలిగి ప్రత్యుపకార మొనర్చువానికి మనస్సులో కష్టపడుచు దాన మొనర్చుదురు.[4]

6. సర్వభూతములను భిన్నభిన్న భావములు, భిన్నధర్మములు గలిగి యున్నట్లుగా చూతురు.[5]

7. ఫలేచ్ఛగలిగి అహంకారముతోనుండి అధికాయాసముతో కర్మల నాచరింతురు.[6]

8. రాగముగలిగి కర్మఫలమును కోరుచు, పరద్రవ్య లుబ్ధులై, తీర్థాదికములందుగూడ తమ ద్రవ్యమును వినియోగింపక, హింసా నిరతులై, పరపీడా స్వభావముగలిగి బాహ్యాంత శ్శౌచ వర్జితులై, ఇష్టప్రాప్తియందు హర్షమును, అనిష్టప్రాప్తియందు శోకమును, గలవారై ప్రతిపనిని చేతురు.[7]

---

(1) కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః । ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయ ప్రదాః. 17-9. (2) అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్ । ఇజ్యతే భరతశ్రేష్ఠ ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. 17-12. (3) సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్। క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 17-18. (4) యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్యవా పునః । దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. 17-21. (5) పృథక్త్వేన తు యజ్జ్ఞానం । నానాభావాన్ పృథ గ్విధాన్ । వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 18-21 (6) యత్తు కామేప్సునా కర్మసాహంకారేణ వా పునః । క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. 18-24. (7) రాగీ కర్మఫల ప్రేప్సుః లుబ్ధో హింసాత్మకో శుచిః । హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 18-27.

9. శాస్త్రప్రబోధిత ధర్మాధర్మములను, కార్యాకార్యములను స్పష్టముగ తాత్పర్య నిర్ణయముతో గుర్తింపజాలని బుద్ధిగలిగి యుందురు.[1]

10. ధర్మార్థకామములను, పురుషార్థములను, ఆయా సమయములందు నిత్యకర్తవ్యములనుగా మనస్సులో నిశ్చయించి, ఆయా ధర్మాది ధారణా ప్రసంగముచే ఫలము నపేక్షించు ధృతిగలిగి యుందురు.[2]

11. చక్షురాదీంద్రియములకును, రూపాది విషయములకును, సంయోగము కలిగినందువలన యేర్పడి ప్రారంభమం దమృతమువలెను, పరిణామమందు విషమువలెను, ఉండు సుఖము కోరుదురు.[3]

12. వీరు ఒక స్థూలదేహమును విడిచి, మరణించి, తిరిగి ఈ భూలోకమందే వేదోక్త కర్మాచరణ చేయు స్థూలదేహముల నొందెదరు.[4] సూక్ష్మదేహమందు రజోగుణము ప్రధానమై యున్నట్లు గ్రహించుటకు, పదకొండు కార్యలింగములును అట్టివారి కుత్తరజన్మములను నిరూపింపజాలినవి. ఇక తమః ప్రధాన సూక్ష్మదేహమందలి పండ్రెండును వివరింపవలెను.

## తామస సూక్ష్మదేహ లక్షణములు.

1. పూర్తిగా పక్వము గానట్టియు, రసముపోయి నిర్వీర్యము లైనట్టియు, దుర్గంధము గలిగినట్టియు, వండిన మరునాటికి పర్యుషిత (చద్దిపడిన) మైనట్టియు, భుక్తశేషమైనట్టియు, యాగార్హముగాక అపవిత్రమైనట్టియు, పదార్థములను ఆహారముగా కోరుదురు.[5]

---

(1) యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్య మేవచ । అయథావ త్ప్రజానాతి బుద్ధిస్సాపార్థ రాజసీ. 18-31. (2) యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయ తేర్జున । ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ. 18-34. (3) విషయేంద్రియ సంయోగాత్ యత్తదగ్రేఽమృతోపమమ్। పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్. 18-38. (4) రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే । తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 14-15. (5) యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్ ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియం. 17-10.

2. భూత, ప్రేత, పిశాచాదుల నారాధింతురు.[1]

3. తన జన్మచే నేర్పడిన వర్ణమునకు తగనట్టియు, అన్నదాన రహితమైనట్టియు, మంత్రరహిత మైనట్టియు, దక్షిణ లేనట్టియు, శ్రద్ధ లేనట్టియు, యాగముల నొనర్తురు.[2]

4. అవివేకముతోను, ఆత్మపీడతోను, పరుల వినాశనము కొరకును తపంబొనర్తురు.[3]

5. శాస్త్రవిహితములుగాని దేశకాల పాత్రములందు, ప్రతిగ్రహీతను సత్కరింపక అవమాన మొనర్చి దానమిత్తురు.[4]

6. శరీరాను వర్తియై దేహపరిమాణము గలవాడే జీవుడనియు, పాషాణ దార్వాది కము మాత్రమే యీశ్వరుడనియు, నిష్ఫలకమగు అయథార్థజ్ఞేయ వస్తుజ్ఞానము గలిగి యుందురు.[5]

7. తన శక్తిసామర్థ్యములనుగాని, కర్మవలన ఎట్టి పరిణామము గలుగునను ఆలోచనకాని లేక పనిచేయునప్పుడు తన శక్తిక్షయమునుగాని అర్థక్షయమునుగాని గణింపక, ఆ పనివలన గలుగు హింస నాలోచింపక, మోహముతో కర్మల నాచరింతురు.[6]

8. మనస్స్థిమితము లేక ప్రకృతివశులై బాలురవలె అత్యంత సంస్కార శూన్యమగు బుద్ధి గలవారై, పెద్దలకు నమస్కరింపక స్తబ్ధులయి, మాయావులులై, ఇతరుల జీవికను చెడగొట్టుచు, చేయదగిన పనులందుగూడ ప్రవృత్తిలేక ఎల్లప్పుడు విషాదము గలవారై, నేడు చేయదగిన పనిని నెలకుగూడ చేయని కర్తృభావముతో నుందురు.[7]

9. అధర్మమును ధర్మమనుట మొదలగు రీతిగా తమస్సుచే ఆవృతులై ప్రతి పదార్థమును విపరీతముగా గ్రహించు బుద్ధిగలిగి యుందురు.[8]

---

(1) యజన్తే సాత్త్వికాదేవాన్ యక్షరక్షాంసి రాజసాః । ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తేతామసా జనాః 17-4.(2) విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్।శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచ క్షతే. 17-13. (3) మూఢగ్రాహే ణాత్మనో యత్ పీడయా క్రియతే తపః । పర స్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్. 17 19 (4) అదేశ కాలే య ద్దానం అపాత్రేభ్య శ్చ దీయతే । అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్ 17-22.(5) యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహైతుకం । అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్. 18-22. (6)అనుబన్ధం క్షయం హింసాం అనపేక్ష్యచ పౌరుషం । మోహా దారభ్యతే కర్మ తత్తామస ముదాహృతం. 18-25. (7) అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైకృతికోఽలసః ।విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. (8) అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసావృతా । సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థః తామసీ. 18-32.

10. స్వప్నమును భయమును శోకమును విషాదమును మదమును వదలనట్టి ధృతి గలిగియుందురు.[1]

11. ప్రారంభమందును, పరిణామకాలమందును తమకు మోహమును కలుగ జేయుచు నిద్రాలస్య ప్రమాదాదులచే నొప్పు సుఖము నొందెదరు.[2]

12. వీరొక స్థూలదేహమును విడిచి మరణించి తిరిగి పశుపక్ష్యాది మూఢయోను లందు జన్మింతురు.[3]

దేహధారులందరి ప్రవృత్తులు మూడువిషయములపై నాధారపడి యుండును.

1. స్వభావసిద్ధముగా పుట్టుకనుండియు కొన్ని ఆహార, ఆలోచనాదులందు విశేషాభి రుచికలిగియుండుట. ఇది శ్రద్ధ యనబడును.

2. ప్రపంచములో తనకంటె గొప్పవారు, తనకు ఆదర్శప్రాయులు "ఫలాని" వారు అని తనలో ఒక నిశ్చయము నేర్పరుచుకొని, అందుల కనువుగా ప్రవర్తించుట ఇది "యజ్ఞ" మనబడును.

3. తన అభిరుచులుగాని, తన ఆదర్శముగాని న్యాయమైనదా? లేదా? యని దేనిని బట్టి పరీక్షించుకొని తానొక నిశ్చయమునకు రావలెనో అట్టి యథార్థజ్ఞానమునకు అసాధా రణకారణమే 'ప్రమాణ'మనబడును.

ఇందు మొదటి రెండును, మూడవదగు ప్రమాణముపై నాధారపడి యుండును. తన బుద్ధికి తోచినదే ప్రమాణమని తలచినవాని, శ్రద్ధా, యజ్ఞములు లేక అభిరుచి, ఆదర్శ ములు అధమముగా నుండును. ఇవి తామసము లనబడును.

తాను నమ్మిన, పాంచరాత్ర, పాశుపత, జైన, బౌద్ధ, వైశేషిక, న్యాయ, యోగ, సాంఖ్యదర్శనములలో నొకదానిని ప్రమాణముగా గ్రహించినవాని శ్రద్ధాయజ్ఞములు లేక

---

(1) యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ । న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ. 18-35. (2) యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః। నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్. 18-39. (3) రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే । తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 14 15.

అభిరుచి, ఆదర్శములు, మధ్యమములులేక రాజసము లనబడును. ఈ దర్శనములన్నియు, కొంత సాధన మొనర్చిన గొప్పవారి బుద్ధికి తోచినట్లు వారలచే నిర్మింపబడినవి.

అపౌరుషేయము, నిత్యము, స్వతః ప్రమాణము, భగవద్రూపము, యుక్త్యనుభవ సిద్ధము, ఎంతటి బుద్ధిమంతునకైనను ప్రత్యక్షాది ప్రమాణములచే గోచరముగాని, సాధన-సాధ్యావిషయములను బోధించు ఋగ్వేదాది శాస్త్రమునే ప్రమాణముగా గ్రహించిన వాని అభిరుచి, ఆదర్శము లుత్తమములు లేక సాత్వికము లనబడును.

ఇందు ఋగ్వేదాదిశాస్త్రము నూటికి నూరుపాళ్లు గుణములు గలిగి నిర్దుష్టమైనది. సాంఖ్యదర్శనము నూటికి 99 పాళ్లు, యోగదర్శనము 98 పాళ్ళు, న్యాయదర్శనము 97 పాళ్లు, వైశేషికదర్శనము 96 పాళ్లు, బౌద్ధదర్శనము, 95 పాళ్ళు, జైనదర్శనము 94పాళ్లు, పాశుపతదర్శనము 93 పాళ్లు, పాంచరాత్ర దర్శనము 92 పాళ్లు గుణములుగలవి. ఈరీతిగా ఒకదానికంటె తరువాత దర్శనములో దోషము లెక్కువగా నున్నవి. గుణములుతక్కువగా నున్నవి. ఇక తన బుద్ధికి తోచినదే ప్రమాణమను భావముగల జీవుల అంతస్థునుబట్టి నూటికి 91 మొదలు 1 వరకు పాళ్లు గుణములుండును. దోషములు నూటికి 9 మొదలు 91 వరకు పాళ్లు గలిగియుండును.[1]

అట్లు వేదమును ప్రమాణముగా గ్రహించి ప్రవర్తించువానికి సకలానిష్టములు తొలగి, ఈశ్వరానుగ్రహము గలుగును. తదతిరిక్త ప్రమాణగ్రహీతలకు జననమరణాది సంసారబంధము తప్పదు.[2]

ఈ వేదమును, గురుముఖతః, ఏకాగ్రచిత్తముతో గ్రహించి తన అజ్ఞాన, సంశయ, విపర్యాసాదులు తొలగునంతవరకు మనన మొనర్పవలెను.[3]

ఇట్లు గురువు తనకు బోధించినంతమాత్రముచే తాను గ్రహించిన విద్య ననుసరించి

---

(1) యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః । తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః. 17-1. (2) మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి । అథచేత్త్వ మహంకారాత్ న శ్రోష్యసి వినజ్క్ష్యసి. 18-58. (3) కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా । కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ. 18-72.

తాను ప్రవర్తించి తీరవలెను నిబంధనలేదు. శిష్యుడగు సాధకుడా విద్యను మననమొనర్చి, తాను తృప్తిగా యుక్తియుక్తముగా నున్నదని నమ్మినదానినే ఆచరించుట కతనికి స్వేచ్ఛ గలదు.[1]

ఈరీతిగా లింగముల (చిహ్నముల)చే గుర్తింపబడును గాన నిదియే "లింగదేహ" మనియు ననబడును. ఇట్లే సూక్ష్మదేహము శ్రద్ధారూపముతో భాసించును. అశ్రద్ధ ననుసరించియే సర్వజీవుల ప్రవర్తనయు పై పంద్రెండు లింగములచే గుర్తింపబడును. కావుననే ఈ పురుషుడు 'శ్రద్ధామయు' డనబడును.[2] ఈ శ్రద్ధయే సాత్త్వికరాజసతామస భేదములచే త్రివిధమగును.[3] దీని కార్యములే పైన వివరింపబడిన యజ్ఞదానాదులు, ఈశ్రద్ధ స్వభావము వలన పుట్టినది. అట్లే సత్త్వ రజస్తమో గుణములుగూడ ప్రకృతివలన పుట్టినవి.[4] గాన ఈ సూక్ష్మదేహమునకు కారణము ప్రకృతి యనియు స్వభావమనియు సంజ్ఞలుగల మరియొక పదార్థవిశేషమని తేలుచున్నది. సుషుప్తిదశలో ఈ సూక్ష్మదేహము భాసింపక ఒకానొక కారణవస్తువునందు లీనమైనట్లు సర్వజనానుభవ సిద్ధము. కాన నదియే "కారణదేహ" మన బడును. దాని స్వరూపము వివరింపబడుచున్నది.

## కా ర ణ దే హ ము

ఈ గీతాశాస్త్రమందీ కారణదేహము, ప్రకృతి, మాయ, అవిద్య, కర్మ స్వభావము, ధర్మము, అధ్యాత్మము, ఇత్యాది శబ్దములచే బోధింపబడినది. సూక్ష్మదేహ మనగా ఇంద్రియములు, అంతఃకరణము, ప్రాణాదులు, శబ్దస్పర్శరూప రసగంధములు, వచనదానగమన విసర్గానందములు, కామ, క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు, జ్ఞానతృష్ణా సంకల్ప సందేహ శ్రద్ధాసత్య ధృతి లజ్జాభయ రాగద్వేష తితిక్షోపరతి మౌనదంభ కృపా

(1) ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా । విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 18-63. (2) సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధాభవతి భారత । శ్రద్ధామయోఽయం పురుషోయో య చ్ఛ్రద్ధస్స ఏవ సః. 17 3. (3) త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా । సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 17-2. (4) సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః । నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్. 14-5.

మార్దవ తపః కార్పణ్య సంగస్మృతి దుఃఖ శమ దమ ధ్యానదర్ప అభిమాన పారుష్యస్పృహా హింసా క్షాంతి ఆర్జవ శౌచ స్థైర్య చాంచల్య వైరాగ్య రతి ప్రమాదాలస్య నిద్రాదులన్నిటి యొక్క సమూహము. ఇవన్నియు ప్రయత్నముచే నేర్పబడుటచే 'కృతు' లనబడును. ఇన్ని కృతులను పుష్కలముగా తనయందు (సుషుప్తిలో) లీన మొనర్చుకొనుటచే నిది 'ప్రకృతి' యనబడును. ఇవి కారణరూపములో తనకుగూడ గోచరముగాక, సూక్ష్మరూపములోతనకు మాత్రమే గోచరమై, స్థూలరూపములో సర్వులకును గోచరమగును.[1] ఇది యెన్నిజన్మల పూర్వమందైనను ఉన్నది గాన 'అనాది' యనబడును. సూక్ష్మదేహ ధర్మములన్నియు దీని వలన పుట్టినవే.[2] దేహేంద్రియాదులకును తద్ధర్మాదుల కన్నిటికిని యీ ప్రకృతిచే కారణమై నందున యిది 'కారణదేహము.'[3] పూర్వజన్మలం దొనర్చిన ధర్మాధర్మాది సంస్కారములతో పరిణతభాగము వర్తమాన జన్మారంభ కాలమందభివ్యక్తమగును. ఎట్టి జీవులైనను దీని ననుకూలముగ ప్రవర్తింతురు.[4] కావుననే ఈ ప్రకృతి జన్మ కొకసారి మారుచుండును. ఈ జన్మలో నొకడు తామస, రాజస, సాత్వికాదిలింగదేహము గలిగియున్నచో వాని ప్రకృతి గూడ నట్లే యుండును. ఈ జన్మలోని వీని ప్రవర్తనవల్ల మరికొంత క్రొత్త సంస్కార మేర్పడి ఆ కారణదేహమందు లీనమగును. ఎట్లనగా-ఒకడొక బ్రహ్మహత్య చేయుచో నాత డందులకు సంకల్పించుట సాధనసహాయ సంపత్తిని సమకూర్చుట చివరకు హననమొనర్చుట అను నీ క్రియాకలాపమంతయు నేదినమున కాదినమున వాని సుషుప్తిదశలో వాని సకల వృత్తులును కారణదేహమందు లీనమగుచున్నవి. ఇట్లే యీ జన్మలో నాతడింకను పెక్కు మంచిచెడుపనుల నాచరింపగా నాకర్మవాసన లన్నియు వాని కారణదేహమం దిమిడియుం డును. ఇట్లనేక జన్మలలోన వాని కర్మవాసనలన్నియు వాని కారణదేహమం దిమిడి యున్నవి. అందులో ఏ వాసనాసమూహము పరిపక్వమైనదో దానికి 'ప్రారబ్ధకర్మ' యని

(1) న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్ । కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. 3-5. (2) ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి । వికారాంశ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్. 13-20. (3) కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే । పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. 13-21. (4) సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి । ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి? 3-33.

సంజ్ఞ. ఆ వాసనాసమూహ పరిణామముయొక్క ఫలము ననుభవించుటకు తనువగు దేహము నొందును. మిగిలిన వాసనాసమూహము "సంచితకర్మ" యనబడును. ఆ సంచితకర్మయు, ప్రారబ్ధము ననుభవించు సమయమందీత డొనర్చిన పుణ్యపాప కర్మములును ఈ మొత్త మంతయు వాని కారణదేహమందే వాసనారూపముతో నుండునుగాన వాని ప్రాణోత్క్ర మణ సమయమందా వాసన లన్నియు భాసించి, అందులో తిరిగి ఏయే కర్మవాసనలు ఫలో న్ముఖములై యున్నవో వాటిని మాత్రమే తిరిగి ప్రారబ్ధముగా గైకొని, అందుల కనువగు దేహము నొందును.[1] కాన ఒకజన్మలో బ్రహ్మహత్య నొనర్చినవాడు ఆ జన్మలోగాని, మరు జన్మలోగాని ఎప్పటికైనను తప్పక క్షయవ్యాధి ననుభవించును. ఇట్లు వాని వాని కర్మ వాసనా సమూహ మంతయు జన్మకొకసారి లెక్క చూడబడి అందలి ఫలోన్ముఖమగు వాస నలు ముందుకు తీయబడి వాటి కనుకూలమగు ఊర్ధ్వలోకము లందలి దేవాదిదేహముగాని, మధ్యలోకమునందలి మనుష్యాది దేహముగాని, అధోలోకము లందలి మూఢదేహముగాని, నిర్ణయింపబడును.[2] మధ్యమపుణ్యము గలవారు, వేదమందలి ఫలవాక్యములను, అర్థవాదలను మాత్రమే (ఆపాతరమణీయములుగాన) మాటిమాటికి నెమరవేయుచూ, పుష్పించిన వృక్ష మందలి పుష్పములను మాత్రమే గ్రహించినట్లు, నిరంతర స్వర్గాదిఫలద్రష్టలై ఆత్మజిజ్ఞాసు వులు కానేరరు.[3] కావుననే ఈ ప్రకృతి వీని యంతఃకరణమునకు గూడ లోపలనుండి వీని ధర్మములన్నియు గలిగియుండును. అందున ఇదియే 'స్వభావమ'నియు, 'అధ్యాత్మమ'నియు చెప్పబడును.[4] ఇది ప్రతి జీవునకును సర్వకాల సర్వావస్థలందును, సర్వజన్మలందును ఉన్నను, బ్రాహ్మీస్థితిలో (దీని స్వరూపము ముందు జ్ఞానప్రకరణమందు వివరింపబడును) ఉండక, నశిం చునుగాన ఇదియే 'మాయ' యనబడును. దీనిచేతనే సర్వజీవులును తమ నిజమగు జ్ఞానరూప మును మరచిపోవుచున్నారు.[5]

---

(1) అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే । భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః. 8-3. (2) ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః మధ్యే తిష్ఠన్తి రాజసాః । జఘన్యగుణవృత్తిస్థాః అధో గచ్ఛన్తి తామసాః. 14-18. (3) యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః । వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః. 2-42. (4) నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః।మాయ యాఽపహృతజ్ఞానాః ఆసురం భావ మాశ్రితాః. 7-15. (5) నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః । అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః. 5-15.

ఈ కారణదేహము 'దైవీ ప్రకృతి' 'ఆసుర ప్రకృతి'యని రెండువిధములు.[1] అందు దైవీప్రకృతి గలవారి లక్షణములు ఇట్లు వివరింపబడినవి.

వీరు విశాల హృదయులు, శమదమాది సంపన్నులు, జగత్కారణమగు బ్రహ్మను గుర్తింతురు. ఈశ్వరు నారాధింతురు.[2] నిరంతరము భగవత్కీర్తన మొనర్తురు. ఇంద్రియోపసంహార శమదమ దయాహింసాది లక్షణములు గలిగి స్థిరవ్రతులై ఈశ్వరుని నమస్కారాదులతో నారాధింతురు.[3] భయము లేకుందురు. అంతఃకరణశుద్ధి గలిగియుందురు. పరవంచన మాయానృతాదులను వర్జింతురు. శాస్త్రాచార్య మూలకముగా జ్ఞానమును సంపాదించి ఇంద్రియ నిగ్రహాదులచే ఏకాగ్ర చిత్తముతో మనన మొనర్తురు. దాన దమ యజ్ఞస్వాధ్యాయనన్మార్గ తపస్సుల నాచరింతురు.[4] అహింసా సత్యాక్రోధత్యాగ శాంతి పరదోషానావిష్కరణ భూతదయా ఇంద్రియావికార, మార్దవ లజ్జా అచాపల్యాదులు గలిగియుందురు.[5] తేజస్సు, క్షమా, ధృతి, శుచిభావము, ఇతరులకు ద్రోహ మొనర్పకుండుట, తానే గొప్పవాడనని గర్వింపకుండుట,[6] ఇత్యాది గుణముల గలిగియుందురు.

## ఆసుర ప్రకృతి.

దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము[7] గలిగియుండు అసురప్రకృతి గలవారు ఏపని చేయదగునో, ఏపని చేయదగదో గుర్తింపరు. శౌచ

(1) ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ। దైవో విస్తరశః ప్రోక్త మాసురంపార్థ మే శృణు. 16-6. (2) మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః । భజం త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 9-13. (3) సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః । నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 9-14. (4) అభయం సత్త్వసంశుద్ధిః । జ్ఞానయోగవ్యవస్థితిః । దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 16-1. (5) అహింసా సత్య మక్రోధస్త్యాగ శ్శాంతి రపైశునమ్ । దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్. 16-2. (6) తేజః క్షమా ధృతి శ్శౌచమ్ అద్రోహో నాతిమానితా। భవంతి సంపదం దైవీమ్ అభిజాతస్య భారత.16-3. (7)దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ । అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్.16-4.

సత్యసదాచారములు వారియం దుండవు.[1] ఈశ్వరుడు లేడనియు, ఈజగత్తునకు కారణమే లేదనియు, ప్రజలెట్లసత్యప్రాయులో జగత్తుగూడ నట్టులే అసత్యప్రాయమనియు, ధర్మాధర్మములు లేవనియు, కామోద్రిక్తులగు స్త్రీపురుషుల యథేష్టాచరణ సంయోగమాత్రము చేతనే ఈ జగత్తేర్పడినదనియు నందురు.[2] వారిట్టి దృక్పథముతో నుండి పరలోకము లేదని తలచి, తత్సాధన మొనర్పక, అల్పబుద్ధి గలిగి హింసాది క్రూరకర్మల నాచరించుచు, జగన్నాశము నపేక్షించు జగచ్ఛత్రువు లగుదురు.[3] దంభ, మాన, మద, కామపరవశులై మోహముచే నశుభ నిశ్చయముల నాశ్రయించి, దుష్ప్రవర్తన గలిగియుందురు.[4] ఆ మరణాంతము అపారమగు ప్రాపంచిక విషయసుఖలంపటులై అదియే పరమ పురుషార్థమని తలచి అట్లు ప్రవర్తింతురు.[5] బహుళాశాపాశబద్ధులై కామక్రోధ పరాయణులై తదర్థమన్యాయముగా ధనమార్జింతురు.[6] "కోరిక నెరవేరినది. ఈ కోరిక ముందు నెరవేరును. ఇంత ధనమిప్పుడున్నది, ముందింత ధనము నొందగలను.[7] ఈ శత్రువు నాచే చంపబడెను. ఇంక నితర శత్రువుల నికముందు చంపగలను. నేనే ప్రభువును, భోగిని, సిద్ధుడను, బలవంతుండను; సుఖించుచుంటిని.[8] అనేక తరములనుంచి నా వంశమే గొప్పది. నాతో సమానుడెవరు? నేను దానమిత్తును, యాగమొనర్తును, సంతోషింతును." ఇత్యాదిగా అజ్ఞానమోహితులగుచు

---

(1) ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః । న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. 16-7. (2) అసత్య మప్రతిష్ఠంతే జగ దాహు రనీశ్వరమ్ । అపరస్పర సంభూతం కి మన్యత్కామహైతుకమ్. 16-8. (3) కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భమాన మదాన్వితాః । మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః. 16-10. (4) చిన్తా మపరిమేయాంచ ప్రలయాన్తా ముపాశ్రితాః కామోపభోగపరమాః ఏతావ దితి నిశ్చితాః. 16-11. (5) ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః ఈహన్తే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్. 16-12. (6) ఇద మద్య మయా లబ్ధం ఇమం ప్రాప్స్యే మనోరథం। ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్. 16-13. (7) అసౌ మయా హతశ్శత్రుః హనిష్యే చాపరానపి। ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవా న్సుఖీ. 16-14. (8) ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః। ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 16-9 (9) ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యో స్తి సదృశో మయా । యక్ష్యే దాస్యామి మోదిష్య ఇ త్యజ్ఞానవిమోహితాః 16-15.

చిత్త విభ్రాంతినొంది, మోహావృతులై కామభోగాసక్తులై దుఃఖాలయమగు నరక దేహములనొందుదురు.[1] తమను తామే స్తుతించుకొనుచు పెద్దల కవిధేయులై ధనమాన మదోపేతులై లోకమందు దంభమునకొరకు శాస్త్రవిధిలేని నామమాత్ర యజ్ఞముల నాచరింతురు.[2] తమ దేహమందును, ఇతరుల దేహమందును, సర్వబుద్ధి వృత్తులకును సాక్షిగానుండు ఆత్మను ద్వేషించుచు అహంకార బల దర్పకామక్రోధాదుల నాశ్రయించి, దేవతాసూయ గలిగియుందురు.[3]

ఇట్టి కారణ దేహమను ప్రకృతియే 'అవిద్య'యనబడును. దీనిచే సత్య, జ్ఞాన, అనంత ఆనంద లక్షణమగు ఆత్మను అసత్యజడ పరిచ్ఛిన్న దుఃఖలక్షణమగు స్థూలసూక్ష్మ దేహద్వయమును ఒకే పదార్థముగా గ్రహింతురు. అట్లగుటచే ఆత్మధర్మములగు సత్యానంద జ్ఞానాదులను దేహాదికమందును వ్యవహరింతురు. ఇదియే'అధ్యాస' 'అజ్ఞానము' 'మోహము' 'అవిద్య' ఇత్యాది పేర్లతో వాడబడును. దీనిని పోగొట్టుటకే ఈ గీతాశాస్త్ర మేర్పడెను.

అతలాది సత్యలోకాంతములగు సర్వలోకవాసులును, ఈ అధ్యాసతో నొప్పి క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగముచే నేర్పడిన జీవులే.[4] ఇది యేయింద్రియమునకును గోచరముగాక సర్వులును తమ నిజరూపమగు ఆత్మను మరచున ట్లొనర్చు కార్యరూపముచే మాత్రమే భాసించును. గాన నిది యోగమాయ యనబడును.[5]

జ్ఞాన ఆనంద అనంత సత్యలక్షణములన్నియు దీనిచే నావరింప బడినవి గాన నిది అజ్ఞాన మనబడును.[6] ఇదియే 'బంధ'మనబడును. ఈ అజ్ఞాన మనునది అభావ పదార్థమనియు, వేదబాహ్యులగు తార్కికులు అభావమువలన భావము పుట్టుననియు అందురు. గాని వేద

---

(1) అనేకచిత్త విభ్రాన్తాః మోహజాల సమావృతాః । ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ 16-16. (2) ఆత్మసంభావితాః స్తబ్ధాః ధనమానమదాన్వితాః । యజంతే నామ యజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్. 16-17. (3) అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః । మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః. 16-18. (4) యావత్సంజాయతే కించిత్ సత్వం స్థావరజంగమం క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ త ద్విద్ధి భరతర్షభ. 13-27. (5) నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః । మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్. 7-25. (6) నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః । అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః. 5-15.

వాదుల కయ్యది మహాదోషము గాన, "నట్టి యజ్ఞానమువల్ల బంధమెట్లు గలుగును?" నందేహమున కిట్లు సమాధాన మీయబడుచున్నది. ఈ ప్రశ్ననే అర్జునుడు వేసినాడు. జీవుని ప్రయత్నమునకంటె బలమైన మరియొక శక్తిచే ప్రేరితుడగుచూ జీవుడు పాప మొనర్చుచున్నాడు. ఆ శక్తి ఎట్టిది? అని[1] ఈ అజ్ఞానము ఆయా కామరూపములతో నుండు భావ పదార్థమేగాని అభావ పదార్థమెంత మాత్రముగాదు.[2] ఈ కామ మనగా చక్షురింద్రియ విషయమగు రూపదర్శన కామము: అనగా పుష్పఫలాదికములనుగాని, సినిమా మొదలగు దృశ్యవిశేషమునుగాని చూడవలయునను కోరికయే. ఇట్లే వేదఘోషాదులను శ్రోత్రేంద్రియముతో వినవలయు నను కోరికయే. ఇట్లాయా ఇంద్రియములన్నిటితో నాయావిషయములం దనురాగము నొందుటయు, అందెట్టి విఘ్నము గల్గినను ద్వేషము గల్గుటయు ఇత్యాదిరూపములతో నీయజ్ఞాన ముండును. ఇదియే జీవునకు ప్రబలశత్రువు. కామక్రోధాదు లన్నియు వీని కార్యములే[3] ఈ శత్రువుయొక్క కార్యము మూడుదశలలో నుండును.
1. దశ - అగ్నిసహజమైన పొగచే ఆవరింపబడిన దాని దాహకత్వ, ఉష్ణత్వాదులు లోపింపవు. అట్లే అవిద్య ప్రారంభదశలో జీవుని ఆవరించియున్నను, జీవస్వరూప ధర్మములగు, సత్, చిత్, ఆనందాదులు లోపింపవు. 2 దశ - ఆగంతుకమైన మాలిన్యము (దుమ్ము) అద్దమును ఆవరించి కొంతకాలమునకు క్రమముగా అద్దముయొక్క ప్రతిబింబ గ్రహణశక్తినిగూడ లోపింపజేయునట్లే అవిద్య, రెండవ దశలో జీవుని స్వరూపములగు సచ్చిదానందములను లోపింపజేయును. అద్దమను వస్తుసద్భావమునకు మాత్రము లోపములేనట్లు, జీవుని దేహ వ్యాపార సద్భావమునకు లోపముండదు. 3 దశ - తల్లిగర్భమందున్న శిశువుచుట్టు ఏర్పడిన మావి, ఆ శిశువుయొక్క సర్వస్వరూప స్వభావములను, ప్రసూతి పర్యంతము లోపింపజేయునట్లు అవిద్య మూడవదశలో జీవుని స్వరూప స్వభావాదుల నన్నిటిని లోపింపజేయును.[4]

---

(1) అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః। అనిచ్ఛన్నపి వార్ష్ణేయ । బలాదివ నియోజితః. 3-36. (2) కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః । తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా. 7-20. (3) కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః । మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 3-37. (4) ధూమే నావ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ। యథోల్బే నావృతో గర్భః తథా తేనేద మావృతమ్. 3-38.

ఇట్లే అవిద్యాభావరూపమే యగుచూ కామాదిరూపముతో నుండి జీవుని స్వరూపమగు సచ్చిదానందముల నావరించుచున్నది. ఇదియే నిత్యశత్రువు.[1] జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, సంకల్ప. వికల్ప, సందేహ, విమర్శాదిరూపమగు 1, నిశ్చయాత్మకమగు బుద్ధి 1, ఇవి ఆశత్రువుయొక్క ఆశ్రియస్థానములు. అచటనుండి జీవుని జ్ఞానమునాత డావరించును.[2] పై 12లో ప్రతిదాని విషయమందును రాగద్వేషాదు లాశ్రయించియే యుండును గాన, సాధకుడు తద్వశుడుగారాదు.[3]

ఇట్లంతఃకరణ ధర్మములగు ఇచ్ఛాద్వేష సుఖదుఃఖాది ద్వంద్వములచే మోహింపబడుచు, అనాది కాలమునుండియు సర్వజీవులున్ను జనన మరణాది సంసార ధర్మమునొందుచున్నారు.[4] ఇట్లా ఇచ్ఛాదులు ఫలించుట కనువగు దేహవ్యాపారముల నన్నిటిని ఎల్లపుడు చేయుచునే యుండును.[5] ఈ ప్రయత్నమే మన యధీనమై యున్నదిగాని తత్ఫలము మన యధీనమందు లేదు.[6]

ప్రతి ప్రయత్నమునకును 1. దేహము, 2. ఫలేచ్ఛతో నీప్రయత్న మొనర్చు కర్త, 3. జ్ఞానేంద్రియములు, 4. ప్రాణాది వాయువులును తత్కార్యములగు కర్మేంద్రియములు, 5. దైవము అనునైదును కారణము లున్నవి.[7&8] గాన తానొక్కడే ఈ కార్యసిద్ధికి ప్రయోజకుడగు కర్తయని తలచి, ఆత్మయందు కర్తృభావము నారోపించుకొనుట ఈ

(1) ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా । కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ. 3-39. 2) ఇంద్రియాణి మనోబుద్ధిః అస్యాధిష్ఠాన ముచ్యతే । ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 3-40. (3) ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ । తయోర్న వశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ. 3-34. (4) ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత । సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప. 7-27. (5) నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః । యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే. 18-11 (6) కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన । మా కర్మఫలహేతు ర్భూః మాతే సంగోఽస్త్వకర్మణి. 2-47. (7) అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్ । వివిధాశ్చ పృథ క్చేష్టాః దైవం చైవాత్ర పంచమమ్. 18-14. (8) పంచైతాని మహాబాహో కారణాని నిబోధమే । సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 18-13.

యజ్ఞాన కార్యమే[1] దానను జేసి పురుష ప్రయత్నము నెంత దృఢముగా నొనర్చినను ఇతడు తలచినట్లా పరియత్నము నెరవేరక 1. ఇష్టఫలము, 2. అనిష్టఫలము, 3. మిశ్రఫలము అని మూడువిధములగు ఫలము సిద్ధించును.[2] ఇష్టఫలము వచ్చినపుడు తానే ప్రయోజకుడనని సంతోషించి తన ఆత్మయందా భోక్తృభావము నారోపించును. అనిష్ట ఫలము వచ్చినపుడు క్రోధ, సంమోహ, స్మృతిభ్రంశ, బుద్ధినాశాదులు క్రమముగా గలుగును.[3] ఇదంతయు నీ యజ్ఞాన కార్యమే.

ఇంతేగాక, తమ బంధు, మిత్ర, పుత్ర, కళత్రాదులనుగూడ తననుగానే తలచి, వారలకు రోగాదిబాధ గల్గునపుడు తనకే బాధ గలిగినట్లును, వారలు సుఖింప తానే సుఖించుచున్నట్లును భావించుచూ వారలందరియందును, సర్వజీవులును ఆత్మత్వము నారోపించుచున్నారు.[4] అట్లే తమ బంధువులయందు ఆత్మభ్రాంతియు, శత్రువులందు పరత్వభ్రాంతియు నొందుచున్నారు.[5] ఇంతేగాక స్థావరములగు గృహ, క్షేత్రారామాదులందుగూడ ఆత్మత్వము నారోపించుచున్నారు.

ఇట్లే అవిద్యవలన అభిమానము, దంభము, హింస, అసహనము, దుర్మార్గప్రవృత్తి, పెద్దలను దూషించుట, అపరిశుద్ధత, అస్థిర చిత్తత్వము, స్వేచ్ఛాప్రవృత్తి.[6], ప్రతి యింద్రియ వ్యాపారమందుననురాగము, అహంకారము, బాల్యాది సర్వావస్థలయందును సుఖదృష్టి[7], ప్రపంచమునందలి ప్రతివస్తువునందును ఆసక్తి, పుత్రదారాగృహక్షేత్రాదులం దాసక్తి,

(1) తత్రైవం సతి కర్తారమ్ ఆత్మానం కేవలం తు యః। పశ్య త్యకృతబుద్ధిత్వాత్ న సపశ్యతి దుర్మతిః. 18-16. (2) అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్ । భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. 18-12. (3) క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః। స్మృతిభ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి. 2-63. (4) యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ। త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ. 1-33. (5) ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః। మామకాః పాండవా శ్చైవ కి మకుర్వత సంజయ. 1-1. (6) అమానిత్వ మదంభిత్వం అహింసా క్షాంతి రార్జవమ్ । ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. 13-8. (7) ఇంద్రియార్థేషు వైరాగ్యం అనహంకార ఏవచ । జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్. 13-9.

పదార్థములందు విషమదృష్టి, ఇష్టవస్తు బంధు మిత్రాదులందు ప్రీతి, అనిష్టవస్తు శత్రువులందు ద్వేషము[1], తానే గొప్పవాడననియు, వేరే ఈశ్వరుడు లేడనియు తలచుట, ఎల్లపుడు ప్రపంచమందలి వస్త్వనురాగముచే ఆధ్యాత్మికదృష్టి ఎంతమాత్రము లేకుండుట, తన నిజ రూపమెద్దియో విచారింప నిచ్ఛగూడ లేకుండుట.[3] ఇత్యాదులు గలుగును.* ఈ ప్రయత్న ములో కొన్ని యిపుడే నెరవేరును, కొన్ని కాలాంతరమందుగూడ నెరవేరును. వాటి ననుభవించుట కనువగు స్థూలదేహ మేర్పడుట, తిరిగి అచట పై ప్రయత్నము, తిరిగి తత్ఫలానుభవముకొరకు, తదనురూప లోకమందు దేహమేర్పడుట, ఈ ప్రకారము జనన మరణ ప్రవాహరూప సంసారమేర్పడును.[4&5] అసురయోని - ఏతన్నివృత్తికొరకు పై అభి మాన దంభాదుల వ్యతిరేక భావములగు అమానిత్వ, అదంభిత్వాదులను బోధించుటకు ఈ గీతాశాస్త్ర మేర్పడినది గాన ముందు జగత్కారణమున్ను, జగత్స్వరూపమున్ను విమర్శించబడుచున్నది.

## విషయోపసంహారము.

ఇట్లు అనాత్మ షడ్భావ వికారాస్పదమనియు, తద్భేదములగు స్థూల, సూక్ష్మ, కారణ దేహముల స్వరూప స్వభావ, సాధన, ఫలాది వివరణమున్ను, ఇందలి సాత్విక, రాజస, తామస త్రైవిధ్యమున్ను, 1 ఆహారము 2 ఆసక్తి 3 తపస్సు 4 శ్రద్ధా 5 పరోపకారపద్ధతి

---

(1) అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు । నిత్యంచ సమచిత్తత్వం ఇష్టానిష్టో పపత్తిషు. 13-10(2) మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ । వివిక్త దేశసేవిత్వం అరతి ర్జనసంసది. 13-11 (3) అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనం । ఏతద్జ్ఞాన మితి ప్రోక్తం అజ్ఞానం యదతో వ్యథా. 13-12. (4) తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ । క్షిపా మ్యజస్ర మశు భాన్ ఆసురీష్వేవ యోనిషు. 16 19. (5) ఆసురీం యోని మాపన్నాః మూఢా జన్మని జన్మని । మా మప్రాప్యైవ కౌన్తేయః తతో యా న్త్యధమాం గతిమ్. 16-20.

* నోటు:- అమానిత్వాదిపదము లందలి నఞ్ సమానసామర్థ్యముచే, అభిమాన దంభాదుల విద్యా క్షాత్ర్యములు దేహధారికి స్వాభావిక ప్రవృత్తులు. వాటిని విముఖ మొనర్ప ప్రయత్నించుటకు మొదలు అనియే జ్ఞానకార్యములగును.

6 దానములు 7 ప్రవర్తన 8 కర్తృత్వము 9 బుద్ధి వృత్తి 10 ధైర్యము 11 సుఖభేదము 12 వీటి ప్రవృత్తివలన గలుగబోవు జన్మాంతర భేదములు అను 12 గుర్తులచే, జీవులను 1 సాత్విక 2 రాజస 3 తామస, తరగతులుగా విభజించుటయు, దైవ, అసుర ప్రకృతుల గుర్తులను, వారికార్యములును ఈ ప్రకరణమందు వివరింపబడినవి.



శ్రీ

# గీతాసారసంగ్రహము

## 4. జగత్ప్రకరణము

ఇట్లు సత్యజ్ఞానాది లక్షణమగు ఆత్మయు, అసత్య జడాది లక్షణమగు ప్రకృతియు అనాదియైనందున[1] ఈ ఆత్మను ప్రకృతి తనయందు ప్రతిబింబించుకొనును. ఇది త్రిగుణాత్మకమని లోగడ చెప్పబడినది[2&3] ఇందు శుద్ధ సత్వము ప్రధానమైనపు డిదియే "మాయ" యనియు, అవిశుద్ధ సత్వము ప్రధానమైనపు డిదియే "అవిద్య" యనియు సంజ్ఞల నొందును. సృష్ట్యాదిలో పూర్వకల్పమందలి సర్వజీవుల కారణదేహముల సమూహమగు ప్రకృతియు సచ్చిదానంద లక్షణమగు బ్రహ్మయు నుండెను. ఈ అవిద్య బ్రహ్మయం దారోపింపబడిన దగుటచే రజ్జువునం దారోపింప బడిన సర్పమునకువలె దీనికి స్వతంత్రమగు సత్తా లేదుగాన సృష్టికి పూర్వమందీ బ్రహ్మ యొక్కడే యుండెను.[4] ఈ అవిద్య ఫలోన్ముఖమగుటయే సృష్ట్యాదికాల మనబడును. అపుడిందలి బ్రహ్మ ప్రతిబింబమే "ఈశ్వరుడను" సంజ్ఞ నొందును. సర్వ జీవుల కారణదేహములలో నేయే కర్మవాసన లున్నవో, అందెవ్వి ముందు పరిణమించి ఫలోన్ముఖములగునో, ఏవి ఆలస్యముగా పరిణమించునో, ఏక్రమమున ఆపరిణమించిన కర్మ వాసనలను అంతఃకరణలోనికి పంపవలెనో, గుర్తించి అందుల కనువగునటు సర్వజగత్తును

---

(1) ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి । వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్. 13-20. (2) సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః । నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. 14-5. (3) న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వాపునః । సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభిస్స్యా త్త్రిభి ర్గుణైః. 18-40. (4) సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం । కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహం. 9-7.

సృష్టించువాడే ఈశ్వరుడు గాన ఈయన సర్వజీవకారణ దేహసమూహమునం దభిమానియన బడును.[1] ఈయనయే కర్మఫల స్వరూపుడును తదనురూపముగా సర్వజీవులను పోషించు వాడును సర్వులకు అధిపతియు సర్వజీవులును చేయు పుణ్యపాపకర్మ లన్నిటికి సాక్షియు, సర్వులకు నివాసస్థానమున్ను, శరణుజొచ్చిన వారల ఆర్తి నివారించువాడును, ప్రత్యుప కారాపేక్ష లేకయే ఉపకార మొనర్చువాడును, సర్వ జగదుత్పత్తి స్థితిలయ కారణమున్ను, కాలాంతరమం దనుభవింప దగిన కర్మవాసనా సమూహమునకు నిక్షేపమున్ను, తిరిగి వాటికి ఫలకాలమందు బీజరూపుడున్ను, మోక్షపర్యంతము నశింపనివాడున్ను అయియు న్నాడు.[2] కావుననే సర్వజగత్తునకు తండ్రియు తల్లియు కర్మఫలమును పంచిపెట్టువాడును, పితామహాది మూలకారణమున్ను అగును.[3] ఈయనలేని కేవల ప్రకృతి సృష్ట్యాదికార్య మును చేయజాలదు కాన ఈయన ప్రకృతి 'కధ్యక్షు' డనబడును.[4] ఈశ్వరునకు ప్రభూత మున్ను, సర్వభూతములకు కారణమైనదిన్ని, కార్యములగు దేహాదికములకంటె గొప్ప దిన్ని, ఆదేహాదికముల నన్నిటిని భరించునదిన్ని అగు ప్రకృతియం దీశ్వరుడు గర్భము నుం చును. అనగా వాసనారూపములతో నుండు కర్మఫలము బీజరూపముగా అంతఃకరణ రూప మగున ట్లొనర్చును.[5] కావుననే ఈ ఈశ్వరునకు 'అవ్యక్తము' లేక 'అవ్యాకృతము' అని గూడ సంజ్ఞ. ఇట్లు సర్వజీవుల కర్మవాసన లన్నియు (కారణదేహము లన్నియు) ఈశ్వరునియందు కేంద్రీకరింపబడి యున్నందున ఈయన 'సర్వజ్ఞుడ'నియు లేక సర్వజీవకారణ "దేహసమిష్టి రూపుడ"నియు ననబడును.[6] సర్వజీవు లొనర్చు సమస్త కార్యముల (కర్మల) యొక్క వాస నలను ఫలకాలమువరకు ఉంచి అంతఃకరణ దేహాది ద్వారా అనుభవించు భోక్తయు, ప్రభు వున్ను అగును.[7] ఎట్లనగా ఈ కర్మవాసనలు పరిపక్వములు కాగా, వీటి ననుభవింపజేయుట

---

(1) ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి । భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. 18-61. (2) గతి ర్భర్తా ప్రభుః సాక్షీ నివాస శ్శరణం సుహృత్ । ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్. 9-18. (3) పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః। వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవచ. 9-17. (4) మ యాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం। హేతు నానేన కౌంతేయ జగ ద్విపరివర్తతే. 9-10. (5) మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మి న్గర్భం దధా మ్యహం। సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 14-3. (6) బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున । తా న్యహం వేద సర్వాణి. నత్వం వేత్థ పరంతప. 14-5. (7) అహంహి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవచ । న తు మామభిజానంతి తత్త్వే నాత శ్చ్యవంతి తే. 9-24.

కొరకు ఈశ్వరుని ఆజ్ఞచే తమస్సు ప్రధానముగా గల ప్రకృతి తనయందు ఈశ్వరుని ప్రతిబింబించుకొని ఆకాశవాయుఅగ్నిజలభూములను పంచభూత తన్మాత్రల నేర్పరచెను.

ఆ అయిదింటియొక్క సాత్వికాంశ సమూహముచే అంతఃకరణమున్ను,

ఆకాశ సాత్వికాంశచే శ్రోత్రేంద్రియమున్ను,

వాయు సాత్వికాంశచే త్వగింద్రియమున్ను,

అగ్ని సాత్వికాంశచే నేత్రేంద్రియమున్ను,

జల సాత్వికాంశచే రసనేంద్రియమున్ను,

భూమి సాత్వికాంశచే ఘ్రాణేంద్రియమున్ను అను జ్ఞానేంద్రియములు యేర్పడెను.

ఇందలి అంతఃకరణము వృత్తిభేదముచే 1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తము 4. అహంకారము అని నాలుగు విధములు. అందు మనస్సనగా దేహాది బాహ్యజగత్తునంతను వికల్పించుచు, ఈవస్తువగునా కాదా యను సందేహించు సాధనమగు అంతఃకరణవృత్తి. బుద్ధి యనగా దేహములోపలనుండి సర్వపదార్థములను, నిశ్చయించువృత్తి. చిత్తమనగా దేహాది బాహ్య జగత్పదార్థముల నన్నిటిని స్ఫురింపచేయు సాధనమగు వృత్తి, అహంకారమనగా దేహములోపల కర్తవ్యమును స్ఫురింపచేయు వృత్తి.

ఈ ఆకాశాది పంచతన్మాత్రలయొక్క రాజసాంశల సమూహముచే ప్రాణవాయువున్ను,

ఆకాశ రాజసాంశచే వాగింద్రియమున్ను,

వాయు రాజసాంశచే పాణీంద్రియమున్ను,

అగ్ని రాజసాంశచే పాదేంద్రియమున్ను,

జల రాజసాంశచే పాయ్వింద్రియమున్ను,

భూమి రాజసాంశచే ఉపస్థేంద్రియమున్ను అను కర్మేంద్రియము లేర్పడెను. ఇందలి ప్రాణము దేహమందలి వృత్తిభేదముచే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములని అయిదు విధములు.

ఇట్లేర్పడిన అంతఃకరణ, ఇంద్రియ, ప్రాణసమూహమే సూక్ష్మదేహ మనబడును.[1] ఇందుకు కారణమేమనగా, తన్మాత్రలగు పంచభూతములవలన ఏర్పడిన ఈ సూక్ష్మదేహములో శ్రోత్రేంద్రియమనగా శబ్దమే, త్వగింద్రియమనగా స్పర్శయే, నేత్రేంద్రియమనగా రూపమే, రసనేంద్రియమనగా రసమే, ఘ్రాణేంద్రియమనగా గంధమే, వాగింద్రియమనగా వచనమే, పాణీంద్రియమనగా ఆదానమే, పాదేంద్రియమనగా గమనమే, పాయ్వింద్రియ మనగా విసర్గమే, ఉపస్థేంద్రియమనగా ఆనందమే. ఇట్టి శబ్ద స్పర్శాదులు అతిసూక్ష్మము లైనందున వీనిసమూహము సూక్ష్మదేహమైనది. ఇది వాసనాత్మకమగు కర్మఫలము లు కారణ దేహమునకు బీజరూపమగు కార్యము. కర్మవాసనలను బట్టి ఇందలి సంకల్ప, ఇచ్ఛా ద్వేషా దులు మారునందున, ఒక్కొక్క జీవుని సూక్ష్మదేహ మొక్కొక్కరీతిగా నుండును. స్థూల దేహ ప్రవర్తనల కన్నిటికి ఇందలి లక్షణములు (బీజములు) చిహ్నములగును. అనగా జీవుల ప్రవర్తనలోని ఆహార, దానాదులనుబట్టి వీని సూక్ష్మదేహము గుర్తింపబడునుగాన నిదియే లింగదేహమని గూడ సంజ్ఞనొందినది.[2] ఇందలి శబ్దాదులు, ఎవరి కర్మవాసన కనువగు వాటిని వారలకు విభజించి పంచిపెట్టువా రుండకపోయినచో, ప్రతివారును సాత్వికములగు సుఖ శబ్దాదులనే గ్రహింతురు. అపుడు తామసములగు దుఃఖాద శబ్దముల ప్రసక్తిలేకపోవుటయు, కర్మఫల వైయర్థ్యమును గలుగును. గాన ఇట్టి కర్మబీజముల కధిపతి యొక డుండి తీరవల యును. మరియు వాసనారూపమగు నవిద్యలోని బ్రహ్మ ప్రతిబింబముచే ఈ వాసనలు బీజ భావము నొందినవి. గాన ఈ బీజముల సమూహమందుగూడ ప్రతిబింబ మవశ్య ముండి తీర వలయును. దీనికే "హిరణ్యగర్భుడ"ని పేరు. హిరణ్యమనగా సర్వజీవులయొక్క స్థూల దేహాదిరూపమగు పుణ్యాపాపకర్మ ఫలము. ఇది గర్భమందు గలవాడగుటచే హిరణ్యగర్భుడని సార్థకనామము. హిరణ్యగర్భమనగా బీజావస్థలో నున్న సర్వకర్మ ఫలములని తాత్ప ర్యము. కర్మఫలము లన్నియు ఇచ్ఛాద్వేష సుఖదుఃఖ రూపముగా నుండును.[3] ఇవి శబ్దరూప ముగా కొన్ని, స్పర్శరూపముగా కొన్ని, రసరూపముగా మరికొన్ని, ఈ రీతిగా పై లింగ

---

(1) మహాభూతా వ్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ । ఇన్ద్రియాణి దశైకం చ పంచ చేంద్రియ గోచరాః 13-6. (2) కైర్లింగై స్త్రీన్ గుణా నేతాన్ అతీతో భవతి ప్రభో । కి మాచారః కథం చైతాన్ త్రీన్ గుణా నతివర్తతే 14-21. (3) ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః । ఏతత్ క్షేత్రం సమా సేన సవికార ముదాహృతమ్ 13-7.

దేహమందలి సర్వావయవములును ఈ హిరణ్యాగర్భుడే యగుచున్నాడు. ఉదకమందలి రసము, సూర్యచంద్రులందలి కాంతి, వేదవాఙ్మయమందలి ప్రణవము, ఆకాశమందలి శబ్దము, మనుష్యులందలి పురుషకారము, భూమియందలి గంధము, అగ్నియందలి తేజస్సు, సర్వభూతములందలి జీవనశక్తి, తపస్సు చేయువారి యందలి తపస్సు, దేహధారు లందరి యందలి బీజశక్తి, బుద్ధిగలవా రందరిలోనున్న బుద్ధిబలము, తేజస్వులందలి తేజశ్శక్తియు, బలవంతు లందరియందలి కామరాగాది వికారవర్జితమగు స్వాభావిక బలమున్ను, ధర్మమునకు విరుద్ధము గాకుండా జీవులందున్న కామశక్తియు ఈ హిరణ్యాగర్భుడే. 1, 2, 3, 4 సాత్వికాది గుణభేదముచే శబ్దాదులు మూడువిధములుగా నున్నను, అవి యన్నియు, నితడే.5 ఇట్లు సూక్ష్మ దేహ సమూహము లన్నిటిమీద నీ హిరణ్యాగర్భు డధిపతియైయుండును. కాన నీతడే శ్రౌత, స్మార్త, యజ్ఞరూపుడు, పితృదేవతాహారమగు స్వధారూపుడు. మనుష్యాహారమగు ఓషధీసారరూపుడు. సర్వమంత్ర స్వరూపుడు.6 లోకమును తరింపజేయు శక్తిరూపుడు. నిగ్రహించువాడు. వర్షరూపుడు. దేవతాహారమగు నమృత రూపుడు.7 సూక్ష్మార్థ బోధన సమర్థమగు బుద్ధియు, పదార్థజ్ఞానమును, సమ్మోహము లేక వివేకపూర్వకముగా నా యాకార్యములందలి ప్రవృత్తియు సుఖదుఃఖములున్ను ఇతరు లెట్టి అపకారమును తనకు చేసినను సహించుటయు, సత్యము పల్కుటయు, అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహమును, జనన మరణములున్ను ఈయనవల్లనే కలుగును.8 ఏ ప్రాణిని పీడింపకుండుట, సర్వులందు సమబుద్ధి గలిగియుండుట, తృప్తి, తపస్సు, దానమిచ్చుట, యశస్సు, అపకీర్తి మొదలగునవి యన్నియు ఈయనవల్లనే సర్వులకు కలుగును.9 భృగువు మొదలగు సప్తమహర్షులును,

---

(1) రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాస్మి శశిసూర్యయోః। ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు 7-8. (2) పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ। జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు 7-9. (3) బీజం మాం సర్వ భూతానాం విద్ధి పార్థ! సనాతనమ్। బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ 7-10. (4) బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్। ధర్మావిరుద్ధో భూతేషు కామో ఽస్మి భరతర్షభ! 7-11. (5) యే చైవ సాత్వికా భావా రాజసా స్తామసా శ్చ యే। మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి 7-12.(6) అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్। మంత్రోఽహ మహ మే వాజ్యం అహ మగ్ని రహం హుతమ్ 9-16.(7) తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ। అమృతం చైవ మృత్యు శ్చ సదస చ్చాహ మర్జున! 9-19. (8) బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః। సుఖం దుఃఖం భవో భావో భయం చాభయ మేవ చ. 10-14. (9) అహింసా సమతా తుష్టిః తపో దానం యశో ఽయశః। భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః 10-5.

మనువులును, వారల సంతతియగు ఈ చరాచర ప్రపంచమంతయు నీతనివలన పుట్టినదే.[1] కావుననే యిది "మహాత్తత్వ" మనబడును.

ఇట్టి బీజరూపములగు శబ్దస్పర్శాదులు స్వరూపముచే స్ఫుటముగా గోచరముగావు. అందుచే వీటి నొక స్థూలోపాధిద్వారా గోచరింపజేసి సర్వజీవులను వారల కర్మఫలము నను భవింపజేయవలసిన బాధ్యత ఈశ్వరునిపై గలదు. ఏలననగా శబ్దమిట్టిదియని స్వరూపముచే గోచరముగాదు. ఒక ఫిడేలునుగాని, వీణెనుగాని, ఒక గాయకునిగాని ఉపాధిగా గైకొని అందు శబ్దవిశేష మనుభవింపబడును. ఈ ఉపాధులు స్థూలరూపములు. గాన ఇట్టి స్థూలదేహముల నేర్పరుచుటకు ఈశ్వరుడు ఆకాశాది పంచభూత తన్మాత్రలను పంచీకరణ మొనర్చెను.

ఎట్లనగా ½ ఆకాశం+1/8 వాయు+1/8 అగ్ని+1/8 జలం+1/8 భూమి = పంచీకృతాకాశము.

1/2 వాయువు+1/8 ఆకాశం+1/8 అగ్ని+1/8 జలం+1/8 భూమి = పంచీకృత వాయువు.

1/2అగ్ని+1/3 ఆకాశం+118 వాయు+1/8 జలం+1/8 భూమి=పంచీకృతాగ్ని.

1/2జలం+1/8 ఆకాశం+1/8 వాయు+1/8 అగ్ని+1/8 భూమి=పంచీకృతజలము.

1/2 భూమి+1/8 ఆకాశం+1/8 వాయు+1/8 అగ్ని 1,8 జలం=పంచీకృతభూమి.

ఇట్టి ప్రకృతి పంచీకృత పంచభూతములచే స్థూలరూపము నొందెను. ఇందలి బ్రహ్మ ప్రతిబింబమునకు విరాట్పురుషు డని సంజ్ఞ. ఇందు అతలాది సత్యలోకాంతమగు చతుర్దశ లోకములును, అందలి చీమలు, దోమలు మొదలగు స్వేదజజీవులును, పక్షులు, సర్పములు మొదలగు అండజ జీవులును, మనుష్యులు పశువులు మొదలగు జరాయుజ జీవులును, చెట్లు లతలు మొదలగు ఉద్భిజజీవులును, పర్వతాది స్థావరజీవులును, ఇత్యాది సర్వజీవులును కేంద్రీకృతమై యుందురు. అనగా సర్వజీవ స్థూలదేహ సమూహమే ఈవిరాట్పురుషుడు.[2&3] సర్వ

(1) మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా । మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః 10-6. (2) ఇ హైకస్థం జగ త్కృత్స్నం పశ్యాద్య సచరాచరం । మమ దేహే గుడాకేశ । యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి 11-7. (3) తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా । అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా 11-13.

జీవుల ముఖములే ఈయన ముఖము. సర్వుల నేత్రములే ఈయన నేత్రములు. ఇత్యాది సర్వుల యవయవములే ఈయన ముఖాద్యవయవములు.[1&2] సర్వులరూపములే ఈయన రూపములు. నానావర్ణములగు సర్వుల ఆకారముల సమూహామే ఈయన ఆకారము.[3] ఆదిత్యులు, వసువులు, రుద్రులు, అశ్వినీదేవతలు, మరుత్తులు మొదలగు దేవతలందరి దేహములే ఈయన దేహము.[4] దేవతలు, భూతవిశేష సంఘములు, కమలాసనుడగు బ్రహ్మ, దివ్యసర్పములు, ఋషులు మొదలగువారందరు వీని దేహమే.[5] సమస్త లోకములు ఈయనచే వ్యాపింపబడియున్నవి.[6] సర్వుల హస్తములే ఈయన హస్తములు, సూర్య చంద్రులే ఈయన నేత్రములు.[7] ప్రపంచములోని కాంతివంతములగు సూర్య, చంద్ర, అగ్ని, దీపాదులన్నియు ఈయన కాంతియే.[8] ఇట్లు పదకొండవ యధ్యాయమంతయు నీ విరాట్పురుష వర్ణనకు సంబంధించినదే.

ఇట్లీ జగత్తంతయు పంచభూతముల ప్రస్తారవిశేషమే యైనందుననే దీనికి (ప్ర + పంచ) ప్రపంచమని సార్థకనామము. ఇదియంతయు అనాదియగు సర్వజీవుల కర్మవాసనా సమూహామగు నవిద్యయొక్క విలాసమే. ఎట్లనగా వాసనారూపమగు నవిద్య, స్వతంత్రముగా జడమైనందున ఎట్టి పరిణామము నొందజాలక సచ్చిదానందలక్షణమగు బ్రహ్మను తనయందు ప్రతిబింబించుకొని బీజరూపావస్థను పొంది అందు తిరిగి ప్రతిబింబించుకొని తిరిగి స్థూలరూపమును పొందినది. ఇందలి సమిష్టికర్మ వాసనాప్రతిబింబమే ఈశ్వరుడనియు, సమిష్టిబీజరూపమగు నవిద్యాప్రతిబింబమే హిరణ్యగర్భుడనియు, సమిష్టిసూలరూపావిద్యా

---

(1) అనేకవక్త్రనయనం అనేకాద్భుత దర్శనమ్ । అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. 11-10. (2) అనేకబాహూదరవక్త్రనేత్రం, పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్। నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర ! విశ్వరూప ! 11-16. (3) పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః । నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ 11-5. (4) పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్ అశ్వినౌ మరుతస్తథా 11-6. (5) పశ్యామి దేవాం స్తవ దేవ ! దేహే సర్వాం స్తథా భూత విశేష సంఘాన్ ! బ్రహ్మాణ మీశం కమలాసనస్థం ఋషీం శ్చ సర్వానురగాం శ్చ దివ్యాన్ 11-15.(6) ద్యావాపృథివ్యో రిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశ శ్చ సర్వాః। దృష్ట్వాద్భుతం రూప ముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ 11-20. (7) అనాదిమధ్యాంత మనంతవీర్యం అనంతబాహుం శశిసూర్యనేత్రం। పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం స్వతేజసా విశ్వమిదం తపంతమ్ 11-19. (8) దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా । యది భా స్సదృశీ సా స్యాత్ భాస స్తస్య మహాత్మనః 11-12.

ప్రతిబింబమే విరాట్పురుషుడనియు వెనుక చెప్పబడినది. అట్లే వ్యష్టి కర్మవాసనా ప్రతిబింబము ప్రాజ్ఞుడనియు, వ్యష్టి బీజరూపావిద్యా ప్రతిబింబము తైజసుడనియు, వ్యష్టి స్థూలరూపావిద్యాప్రతిబింబము విశ్వుడనియు చెప్పబడుచు. ఈ వ్యష్టులే జీవు లనబడెదరు. కాన జగత్తు ద్వివిధము. అందొకటి సమిష్టియగు పంచభూతములు తన్మాత్రలు [అపంచీకృత పంచభూతములు] అహంకారము, మహత్తత్త్వము, అవ్యక్తము అను నీ రెనిమిది, ఇది నికృష్టమైనదియు, అశుద్ధమైనదియు, సర్వజీవులకు సంసారబంధనమునకు కారణమునకు హేతువై నదియ్యగుటచే అపరాప్రకృతి యనబడును.[1] రెండవది వ్యష్టులను జీవరూపమైనది. ఇది ప్రాణధారణ నిమిత్తముచే జీవసంజ్ఞ నొందినను శాస్త్రవిజ్ఞానముచే క్షేత్రజ్ఞలక్షణముగాన దీనిచేతనే నీజగత్తంతయు ధరింపబడుచున్నందున నిది పరాప్రకృతి యనబడును.[2] ఇట్లీరెండు ప్రకృతుల సమూహామే సర్వభూతములు.[3]

ఇందును పరాకృతి యనబడు చైతన్యాత్మకమగు క్షేత్రజ్ఞుడే సర్వావస్థలందును ఉండి అపరాప్రకృతి వ్యవహారమునకు హేతువగుచున్నందున ఈ చైతన్యమే సర్వజగత్కారణమగుచున్నది. అది జన్మించునది గాదు. నశించునదిగాదు. నిరవయవము, నిర్గుణము, నిర్వికారము. సత్యము, జ్ఞానము, ఆనందము, అనంతము. అదియే సర్వులయొక్క నిజరూపము. అని లోగడ ఆత్మప్రకరణమందు వివరింపబడెను. అట్టిదానినుండి, జన్మమరణములు గలదియు సావయవమును, సగుణమును, సవికారమును, అసత్యమును, జడమును, దుఃఖరూపమును, పరిచ్ఛిన్నమును అగు జగత్తెట్లు సృజింపబడునో విచారింపబడుచున్నది. రజ్జువును చూచి సర్పమను భ్రాంతినొందినవానికి సర్పముయొక్క సృష్టిగాని, స్థితిగాని, లయముగాని, ఈ రజ్జువు వలననే గలుగుటచే సర్పముయొక్క సృష్టి స్థితిలయములకు ఆ రజ్జువే కారణమైనట్లు, సర్వ జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు బ్రహ్మయే కారణమగుచున్నది.

లోకమందు కార్యకారణభావ మిట్లున్నది.

1. కుమ్మరి మట్టిని కలిపి చక్రి, దండాది సాధనములతో కుండ, చట్టి, మూకుడు మొదలగు పదార్థముల నొనర్చుచున్నాడు. ఇందు కుమ్మరి నిమిత్తకారణమనియు, మట్టి

---

(1) భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ। అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా 7-4. (2) అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ । జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ 7-5. (3) ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ । అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా 7-6.

ఉపాదాన కారణమనియు, చక్ర దండాదులు సాధనములనియు చెప్పబడును.

2. సాలీడను పురుగు తనకంటె వేరుగాని తన ముఖమునుండి వచ్చు లాలాజలముచే తీగెలను గూటిని నిర్మించి తిరిగి ఆ తీగెలనన్నిటిని తనలోనే లీనమొనర్చుకొనుట సర్వలోక ప్రత్యక్షము గాన నిట సాలీడే నిమిత్తకారణమున్ను ఉపాదానకారణమున్ను సాధనమున్ను అగుచున్నది.

3. తుంగ, గరిక మొదలగు ఓషధులకు విత్తనములు భాసించుటలేదు. వేసవికాలమందెట్టి ఓషధులు లేని భూమిలో వర్షఋతువునం దనేక ఓషధులుండుట సర్వలోక ప్రత్యక్షము. ఇచట కారణమగు భూమికంటె విలక్షణమగు ఓషధులను కార్య మేర్పడుచున్నది.

4. జీవులగు స్త్రీ పురుషుల వలన జీవులగు సంతానము గలుగుచున్నది. అట్లే వేప, మర్రి మొదలగు విత్తనములనుండి చెట్లేర్పడుచున్నవి. అట్లే చేతనులగు పురుషులనుండి అచేతనములగు కేశ, శ్మశ్రులోమ, నఖాదు లేర్పడుచున్నవి.

ఇట్లు ఇన్నిరకములలో జగత్కారణమగు బ్రహ్మకు, జగత్తునకు ఎట్టిసంబంధమున్నదో విచారింపబడుచున్నది.

కారణమగు మృత్తువలన ఘట శరావాది కార్యము లేర్పడుచున్నవి. అట్లే కారణమగు సువర్ణమువలన, కంఠాభరణ నాసికాభరణ కర్ణాభరణాదు లేర్పడుచున్నవి. ఇందు కారణమునకు, కార్యమునకు నామభేదము, రూపభేదము అను రెండు మాత్రమే భేదములు గాని ఆ మట్టియే ఈ కుండ. ఆ బంగారమే ఈ ఆభరణము.' అని లోకమందు ప్రత్యభిజ్ఞ ప్రత్యక్షగోచరమగుచున్నది. కారణనామము, మృత్తు, సువర్ణము. కార్యనామము ఘటము, ఆభరణము. ఇట్లు నామభేదము కారణరూపము మట్టిముద్ద, బంగారముముద్ద. కార్యరూపము ఘటాకారము ఆభరణాకారము. ఇట్లు రూపభేదము మిగిలిన లక్షణములన్నియు నీ కార్య కారణములకు సమానము. ఒక వస్తువును పూర్తిగా గుర్తించుటకు దాని హేతువు, దాని స్వరూపము, దాని కార్యముల నెరుగవలయును. ఇందలి కార్యకారణముల రెంటికిని హేతుస్వరూప కార్యములు సమానము. గాన కార్యము కారణముయొక్క రూపాంతరమేగాని వేరుపదార్థ మెంతమాత్రమును గాదు. అట్లే ఈ జగత్తను కార్యమంతయు కారణమగు బ్రహ్మకంటె వేరుగాదు. దారమందు ముత్యములు కూర్చబడినట్లు బ్రహ్మయందీసర్వజగత్తు

కూర్చబడినది.[1] కార్యమగు ఘట, ఆభరణాదికము ఉత్పత్తికి పూర్వము కారణమగు మృత్సువర్ణరూపముతోనే యున్నది. స్థితికాలమందుగూడ కారణరూపముతోనే యున్నది. నశించినపుడు గూడ కారణమందే లీనమగుచున్నది. ఇట్లు సృష్టి స్థితి సంహారములను మూడు కాలములందును కార్యమగు ఘటాభరణాదికము, కారణమగు మృత్సువర్ణరూపమును పరిత్యజించి యే క్షణమందుగూడ లేనట్లే కార్యమగు నీ జగత్తు, యే క్షణమందును కారణమగు బ్రహ్మను పరిత్యజించియుండదు. కార్యకారణములకు భేదము నామరూపములు మాత్రమే. కారణనామము బ్రహ్మ. కార్యనామము పశు, పక్షి, మనుష్య దేవతాదికము. అట్లే కారణరూపము సత్య జ్ఞాన అనంత ఆనంద లక్షణము. కార్యమగు జగద్రూపము, అతలాది సత్యలోకాంత మనుష్య పశు పక్ష్యాదుల అసత్య జడదుఃఖ పరిచ్ఛిన్న లక్షణము.[2] కార్యమగు ఘటాభరణాదికము పుట్టుచు, ఉండుచు, నశించుచూయున్నను కారణమగు మృత్సువర్ణాదికము నశింపనట్లే కార్యమగు అతలాది సత్యలోక పర్యంతమగు జగత్తు అంతయు పుట్టుచు, ఉండుచు నశించుచూయున్నను, కారణమగు బ్రహ్మ నశింపదు.[3] కార్యమగు ఘటాభరణాదికము కారణమగు మృత్సువర్ణాదికమందే యుండునుగాని కారణము కార్యమందు మాత్రమే యుండనట్లే కార్యమగు నీ జగత్తంతయు, కారణమగు బ్రహ్మయందే యుండును. గాని, బ్రహ్మ ఈ జగత్తుయందు మాత్రమే యుండదు.[4] అనగా కార్యమగు కంఠాభరణమని శబ్దముచ్చరించినపుడు సుమారు పదితులముల బంగారమే గ్రహింపబడును. కారణమగు బంగారము అను శబ్దముచ్చరించినపుడు ఈ కంఠాభరణ మాత్రమే గాక ప్రపంచమందలి బంగారమంతయు గ్రహింపబడును. గాన కార్యము కారణములో నొకభాగము మాత్రమే యైనట్లు కారణమగు నీ జగత్తంతయు కారణమగు బ్రహ్మలో నొక భాగము మాత్రమే. అనగా కార్యమగు జగత్తుకంటె కారణమగు బ్రహ్మ పెద్దది.[5] కారణగుణములు కార్యమందు సంక్రమించుటయేగాక, అధికముగా కొన్ని గుణములు

---

(1) మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ ౹ మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ 7-7. (2) మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా ౹ మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః 9-4. (3) ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినో ఽర్జున ౹ మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే 8-16. (4) మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా ౹ మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః 9-4. (5) అథ వా బహు నైతేన కిం జ్ఞాతేన తవార్జున ౹ విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్ 10-42.

గూడ నేర్పడును. ఎట్లనగా కారణమగు మట్టియందు గంధము, రసము, రూపము, స్పర్శ, శబ్దము లను గుణములున్నవిగాని ఉదకాహరణశక్తిరూపగుణము లేదు. కార్యమగు ఘటమందు దా గంధాదిగుణములన్నియు ఉండుటయేగాక అధికముగాఉదకాహరణము, వండుట కుపయోగించుట మొదలగు గుణములుగూడ కలవు. గాన కార్యముకంటె కారణమునందు గుణములు తక్కువగా నుండును.

జగత్సృష్టికి బ్రహ్మయు, ప్రకృతి యనబడు ఆ బ్రహ్మశక్తియు హేతువులని లోగడ చెప్పబడినది. ఆ శక్తి బ్రహ్మకంటె భిన్నముగాక నిర్మాణము, మోహము, అను గుణములు గలది. అందుచే నున్నస్థితిని భాసింపజేయకుండుటయు, అన్యథాగా భాసింపజేయుటయు గలుగును. గాన దానికి మాయయని సార్థకనామము. ఇది జీవుల నందరను దేహాదులతో నిర్మించి మోహింపచేయును.[1] కాన బ్రహ్మ ప్రతిబింబ సహిత తమః ప్రధాన ప్రకృతినుండి ఏర్పడిన ఆకాశమునందు సచ్చిదానందబ్రహ్మలక్షణములును, మిథ్యాత్వ,నిర్మాణత్వ,మోహనత్వము లను, ప్రకృతిలక్షణములును, కారణముద్వారా సంక్రమించిన గుణములు. నైజమగు శబ్దమును, పై కారణలక్షణములును అందున్నవి. ఇట్లే వాయువునందు సచ్చిదానందాది శబ్దాంతములగు కారణ ధర్మములును, నైజమగు స్పర్శయు నున్నవి. అగ్నియందు సత్యాది స్పర్శాంతములగు కారణధర్మములును, నైజమగు రూపమును ఉన్నవి. జలమందు సత్యాది రూపాంతములగు కారణధర్మములును, నైజమగు రసమున్ను గలవు. భూమియందు సత్యాది రసాంతములగు కారణగుణములును, నైజమగు గంధమున్ను గలవు. ఇట్లీ పంచ భూతముల ప్రస్తారమే సర్వ ప్రపంచమైనందున, దీనిలో నే పదార్థమును పరీక్షించినను, అందు సత్యాది గంధాంతములగు గుణములన్నియు తప్పక యుండితీరును. ఇట్లు కారణము కార్యముకంటె గుణములచే తక్కువదియు, వైశాల్యముచే గొప్పదియు నగుట యుక్తిపరమైనందున సర్వకారణమగు బ్రహ్మ సర్వవ్యాపకుడును, నిర్గుణమును అణువుకంటెగూడ పరమాణువును, మహత్తగు ఆకాశముకంటెగూడ మహత్తును అగుట యుక్తిసిద్ధమైనది.[2] ఇది స్వస్వరూపముచే నిర్గుణమైనను, జగత్స్వరూపమగు శబ్దాదిగుణముల కధిష్ఠానమై గుణ

---

(1) దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా । మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే 7-14. (2) కవిం పురాణ మనుశాసితారం అణోరణీయాం సమనుస్మరేద్యః । సర్వస్య ధాతార మచింత్యరూపం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ 8-9.

భోక్త యనబడును.[1] కారణగుణములు కార్యమం దనుగతము లగునుగాని కార్యధర్మములు కారణమం దనుగతములు గావు. ఏలననగా కార్యమేర్పడుటకు పూర్వముగూడ కారణమున్నది. కారణము అన్నికాలములందును ఉండునది. కార్య మొకకాలమందు మాత్రమే యుండి వేరొకకాలమం దుండనిది.[2] కార్యకోటిలో చేరిన ఆకాశమే, వాయువు మొదలగు భూతములతోగాని, వాటి గుణములతోగాని, అంటకుండుట లోకానుభవసిద్ధముగాన ఆకాశకారణమగు బ్రహ్మ జగద్ధర్మములతోగాని, దేహ ధర్మములతో గాని ఎట్టి సంబంధము నొందకపోవుట యుక్తియుక్తమే యగును.[3] ఇట్టి నిర్గుణమగు బ్రహ్మ జగత్తు నెట్లు సృజించును ? సృజించుట యనునది యొక గుణమే గాన నిర్గుణము సృజించుననుట పరస్పర వ్యాఘాతము గదా ! యను నాశంక కలుగనందులకు సమాధాన మిట్లు చెప్పబడెను. అవిద్య యను కారణదేహమునందు, స్థూల సూక్ష్మ దేహధర్మము లన్నియు వాసనా రూపముగా లీనమై సుషుప్తిలో యుండుననియు తిరిగి జాగ్రదాదులందు ఆ వాసనలే స్థూల రూపముల నొందుననియు, అట్లగుటచే నీ దేహ వ్యాపారముల కన్నిటికి నా యవిద్య కారణరూప మగుటయు, స్వతంత్రముగా నీ యవిద్య జడమగుటయు లోగడ వివరింపబడినది. సర్వజీవులును ఆత్మానాత్మల కన్యోన్యాధ్యాసతో వ్యవహరించుచుండుట అనాది కాలమునుండియు ఉన్నందున అట్టి జీవుల కర్మఫల వాసనాసమూహరూపమగు ప్రకృతి నాధారముగా గైకొనియే ఈ జగత్తు సృజింపబడినది.[4]

మరియు నీ జగత్తుకు బ్రహ్మ ప్రతిబింబసహిత, శుద్ధసత్వగుణ ప్రధానమగు ప్రకృతి నిమిత్త కారణమున్ను, బ్రహ్మ ప్రతిబింబ సహిత తమోగుణప్రధానమగు ప్రకృతి ఉపాదాన కారణమున్ను అగుచున్నది. బ్రహ్మ ప్రతిబింబసహిత మలిన సత్వగుణప్రధాన మగు ప్రకృతియే జీవులనబడెదరు. గాన బ్రహ్మ కార్య కారణ రూపద్వయమందును ఏకరీతిగానే ఉన్నది. ప్రకృతి మాత్రము మారుచున్నది. ఈ మార్పువలన స్థూలదేహమందలి అనుభవము మారుచున్నది. ఎట్లనగా ప్రతి పనియు ఎద్దియో యొక ఫలము నిచ్చి తీరును. మనము

---

(1) సర్వేంద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్ । అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ 13-15. (2) న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్।భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః 9-5. (3) యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్ । తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ 9-6. (4) ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః । భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్ 9-8.

జాగ్రద్దశలో సర్వేంద్రియములతోను అనేకపను లొనర్చుచుంటిమి. వీటి యన్నిటికి ఎన్నటి కైనను ఫల మవశ్యము వచ్చితీరవలెను. మన మొకేరోజున ఒక పొట్ల విత్తును, మామిడి విత్తును మొలవేసినను పొట్లకాయ నెలకును, మామిడికాయ కొన్ని సంవత్సరములకును సిద్ధించునట్లే ఈ పనులలో కొన్ని మరునాటికిని, మరికొన్ని నెలకును, సంవత్సరమునకును, జన్మాంతరమునకును సిద్ధించును.

మన మెన్నివేల జన్మలనుండియో, దినమున కనేకపనుల చొప్పున అనేక కోట్ల పను లను [కర్మలను] ఆచరించి యుంటిమి. అందు కొన్ని ఫలించినవి. మరికొన్ని ముందు ఫలింపనున్నవి. ఇవన్నియు ఆ యా ఇంద్రియముల ద్వారా చేయబడినవి గాన ఏరోజు కారోజు ఆ పనులన్నియు కారణ దేహమందు లీనమైయుండును. ఇవియే వాసన లన బడును. ఈ కర్మవాసన లా కారణదేహమం దుండి పరిణతము లగుచు పరిపక్వమైన తరు వాత అంతఃకరణ ద్వారా ఇంద్రియముల లోనికి వచ్చి శబ్ద స్పర్శాది విషయముల ద్వారా అనుభవింపబడును. ప్రతి దినమందును సుషుప్తికాలమం దా యా పరిణత కర్మలను, మరునాడు సుషుప్తి వరకు అనుభవింపదగిన క్రమములో వాటి నన్నిటిని స్వీకరించు చున్నాము. ఆ పని పూర్తిఅయి అందు మొదటి వాసన అంతఃకరణలోనికి వచ్చుటయే మనకు జాగ్రద్దశారంభమగుచున్నది. ఈ పని మనకు తెలియకుండగనే జరుగుచున్నది గాన సుషుప్తిలో అవిద్యయు, ఆనందరూపమగు ఆత్మయు ఈ రెండు మాత్రమే యున్నట్లు సుషుప్త్యనంతరకాలికమగు "నేనేమియు నెరుగక సుఖముగా నిద్రించితి" నను స్మరణ ముచే నిశ్చయింపబడుచున్నది.

ఇట్టి మన సుషుప్తి వలె సకలలోక సుషుప్తియే ప్రళయ మనబడును. మన సుషుప్తి కాలము అమెరికా వాసులకు జాగ్రత్కాల మగుట మనకు ప్రత్యక్షమే గదా! ఇక సువ ర్లోకాది లోకవాసులకు జాగ్రత్కాల మని చెప్పనేల! అట్లే సర్వలోక జాగ్రత్కాలమే జగ త్స్థితి కాలము. సర్వలోక జాగ్రదారంభ కాలమే సృష్ట్యారంభ కాలము. ఒక కలియుగ, ద్వాపర, త్రేతా కృతయుగముల సమూహమే మహాయుగ మనబడును. ఇది మనుష్య మానముచే 43,20,000 సౌర సంవత్సరములు. దేవమానముచే 12,000 సంవత్సరములు. ఈ మహా యుగములు వెయ్యిగల కాలము జగత్స్థితి కాలము, అంతే కాలము జగ త్ప్రళయకాలము.[1] ఆ ప్రళయ కాలమందు సర్వుల కారణదేహములున్న బ్రహ్మాండము

(1) సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః। రాత్రిం యుగసహస్రాంతాం తేఽ హోరాత్రవిదో జనాః 8-17.

లీనమైయుండి, క్రమముగా ఫలోన్ముఖమగుట కనువగు పరిణామము నొందుచుండును. ఆ పరిణామము పూర్తియై ఆ కర్మవాసన లుద్బుద్ధము లగుటయే సృష్ట్యారంభ మన బడును. కావున పూర్వ కల్పమందలి సర్వ జీవ కర్మ వాసనలే ఈ కల్పమందా యా కర్మానురూపమగు జీవదేహము లగుచున్నవి.[1] కర్మఫలము స్వతంత్రముగా జడమగు టచే నెట్టి పరిణామమును బొందజాలక ఈ బ్రహ్మ సన్నిధిమాత్రముచే నది పరిణతమ గును. అంతే గాని అది పరిణతమగుట కెట్టి ప్రయత్నమును ఈ బ్రహ్మ యొనర్చుట లేదు. గాన బ్రహ్మ ఉదాసీనుని వలె నుండును. కావున ఆ కర్మవాసన లీ బ్రహ్మను యే విధ ముగాను బంధింపనేరవు.[2] ఇంతే గాక కర్మాచరణకాలమందలి కర్త అధ్యస్తాత్మ భావము గలవాడై యున్నందున తత్ఫలము గూడ అధ్యస్తాత్మ భావము గల రూపముతోనే అనుభ వింపబడును. ఈ ప్రకృతి అనాత్మకోటిలోని దగుటచే అసత్య జడదుఃఖ పరిచ్ఛేదరూప మైనం దునను జగత్సృష్టి కిది గూడ బ్రహ్మవలెనే కారణ మగుటచేతను ఈ ప్రకృతి బ్రహ్మాశ్రయ మగు కల్పితపదార్థమే గాని యథాభూతవస్తు వెంతమాత్రమును గాదు. కావుననే ఆకా శాది సర్వ జగత్తులోను పరస్పర విలక్షణమగు సత్యాదులు అసత్యాదులు అను ఈ రెండు ధర్మములును గాన్పించుచున్నవి.[3]

మన సుషుప్త్యారంభమందు దేహధర్మములన్నియు, కారణదేహమందు లీనమై సుషుప్తి సమాప్తి కాలమందు తిరిగి అంతః కరణ ద్వారా స్థూల దేహములోనికి వచ్చు చున్నట్లుగానే సమస్త జగత్తును ప్రళయమందు ఈశ్వరునిలో లీనమై సృష్ట్యారంభమందు తిరిగి జగద్రూపము నొందుచున్నది.[4] కావున పూర్వకల్పమందలి జీవులే తమ తమ ప్రవర్త నల ననుసరించి ఉత్తమాధమ భావములతో నొప్పు లోకములందు తదనుకూల దేహముల నీ కల్పమందు బొందుచున్నారు. అనగా శాస్త్రోపదిష్ట రీతిని పురుషకారము నుపయో గించిన వాడిప్పటికంటె నుత్కృష్టలోకములో జన్మించుటయు, అశాస్త్రీయ ప్రవర్తన గలవా డిప్పటికంటె నికృష్ట లోకములో జన్మించుటయు, మొత్తము మీద ఈ బ్రహ్మాండ

(1) సర్వభూతాని కౌంతేయః ప్రకృతిం యాంతి మామికామ్ । కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్ 9-7. (2) న చ మాం తాని కర్మాణి, నిబధ్నంతి ధనంజయః । ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు 9-9. (3) మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ । హేతు నానేన కౌం తేయ ; జగ ద్విపరివర్తతే 9-10. (4) అవ్యక్తా ద్వ్యక్తయ సర్వాః ప్రభవం త్యహరాగమే । రాత్ర్యా గమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే 8-18.

ములో నెద్దియో యొక లోకమందిపుడున్నవాడు తరువాత కల్పములో కూడ ఎద్దియో యొక లోకమందు జన్మించును.[1] కాని జీవులలో ఉత్తమజ్ఞానులై పరమపురుషార్థ మగు మోక్షము నొందినవారు మాత్రము తిరిగి దేహధారులు గాక సర్వాత్మభావము నొంది బ్రహ్మయే యగుదురు.[2] అనేక కోట్ల మనుష్యులలో నొకానొక డీ మోక్షము కొరకు ప్రయత్నించును. వారిలో నొకానొకరు మాత్రమే బ్రహ్మవేత్త లగుదురు.[3] ఈ ముక్తులు బ్రహ్మయే గాన ఎన్ని కల్పములు మారినను, ఎందరు జీవులు పుట్టుచూ చచ్చుచూ యున్నను బ్రహ్మ భావము నుంచి వేరుగారు.[4] ఇట్లు జడమగు ప్రకృతియు, చైతన్యాభాసుడగు జీవుడును అనాదిసిద్ధులైనను అంతఃకరణ వికారములగు సుఖ దుఃఖ మోహాదులున్ను తత్కారణములగు సత్వ రజస్తమో గుణము లున్ను ప్రకృతి వలననే ఏర్పడు చున్నవి.[5] ఈ దేహాది కర్తృత్వము గూడ ప్రకృతివల్లనే ఏర్పడును. సుఖ దుఃఖాదుల నా యా ఇంద్రియముల ద్వారా అనుభవించుట పురుష ధర్మము.[6] ఇట్లు పురుషుడు ఆ ప్రకృతి యందుండి దానియందు తాదాత్మ్యాభిమానము నొంది తత్కార్యములగు సుఖ దుఃఖాదుల ననుభవింపుచు, తిరిగి సుఖప్రయత్న మొనర్చుచు దాని ఫల మనుభవించుటకు తదనురూపములగు జన్మ లెత్తుచు ఇట్లు పశుపక్ష్యాది మూఢజన్మలను గాని (తామస జన్మలను) మనుష్యాది రాజస జన్మలను గాని, దేవాది సాత్త్విక జన్మలను గాని, తన కర్మఫలానురూపముగా పొందుటకు కారణము అత డీ ప్రకృతియందు తాదాత్మ్యాభిమానము నొందుటయే.[7] కాన ఇట్టి పరిణామ విశేషముల నన్నిటినిన్ని, సర్వ కర్మలనున్ను కర్తృత్వము వహించి బ్రహ్మ యొనర్చుట లేదు. తత్సన్నిధి మాత్రముచే ప్రకృతి యనబడు స్వభావమే ఆ యా అంతఃకరణ దేహాదిరూపముగా పరిణమించి ప్రవర్తించుచున్నది.[8] ఈ స్వభావము

---

(1) భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే । రాత్ర్యాగమేఽవశః పార్థ । ప్రభవత్యహరాగమే 8-19. (2) అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిం । యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ 8-21. (3) మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే। యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః7-3. (4) పర స్తస్మాత్తు భావోఽన్యో వ్యక్తోఽవ్యక్తా త్సనాతనః య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి8-20. (5)ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి। వికారాం శ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ 13-20. (6) కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే। పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే 13-21. (7)పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్గుణాన్ । కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు 13-22. (8) న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః । న కర్మ ఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే 5-14.

బ్రహ్మనే ఆశ్రయించినదై మాయ యనబడుచు దేవాదులను గూడ తన స్వాధీనమం దుంచుకొనును. విశ్వ, తైజస, ప్రాజ్ఞులను వారు ముగ్గురును ఈ ప్రకృతి వశులే.[1] ఇట్టి దేహేంద్రియ వ్యాపార మంతయు తన కారణదేహ మొనర్చుచుండ ఈ విశ్వుడు తానే యొనర్చు చుంటినని తలచును.[2] ఈశ్వరుడైనను ఒకనిని మనిషిగాను, వేరొకనిని పశువు గాను, ఇట్లే దేవతలను గాను, వికలాంగులనుగాను ఈ రీతిగా సృజించుటలో, వాని వాని పూర్వజన్మ కర్మ ఫల వాసనలనే సాధనముగా గైకొన్నందున ఆ ఈశ్వరునకు వైషమ్యా భావము గాని జాలి లేకుండుట గాని (నైర్ఘృణ్యము) లేకున్నది. న్యాయాధికారి తనవద్ద విచారణకు వచ్చిన అభియోగములలో కొందరు ముద్దయిలను నిర్దోషులని తీర్మానించి వదలి వేయుటయు, కొందరు ముద్దయిలకు సంవత్సరము శిక్షను విధించుటయు, ఇంకొక ముద్ద యికి మరణశిక్షను విధించుటయు, ఎట్లు వాని వాని అభియోగస్థ పత్ర సాక్ష్యాది మూల కమో అట్లే ఈశ్వరునకు గూడ భిన్న భిన్న సృష్టికి వారి వారి కర్మ ఫలములు మూల కారణము లగును గాన ఈశ్వరుని నిందించుట అవివేకము.[3]

కావుననే జగత్స్వరూప మిట్లు వివరింపబడెను. ఈ జగత్తు ఛేదనాస్పదమై జన్మ జరామరణ శోకా ద్యనేకానర్థాత్మకమై, ప్రతి క్షణమందును విలక్షణస్వభావము గలదై ఊసరక్షేత్రమం దుదకభ్రాంతిని గలుగజేయు, ఎండమావుల వలె ఉత్పత్తికి పూర్వము కనుపించక స్థితి కాలమందు మాత్రమే కనుపించుచు నశించిన తరువాత కనుపించక సారములేనిదై గాని లేనపుడు గూడ చలించు ఆకులు గల రావిచెట్టువలె ఎప్పుడు చంచల మైనది. ఈ సంసార వృక్షమునకు బుద్ధియే స్కంధప్రదేశము. ఇంద్రియములే తొఱ్ఱలు. పంచభూతములే శాఖలు. శబ్ద స్పర్శాది విషయములే ఆకులు, ధర్మాధర్మములే పుష్పములు. సుఖ దుఃఖములే ఫలములు. కారణము కార్యముకంటె వైశాల్యముచే గొప్పదనియు, గుణ ములచే అణువనియు, నిత్యమనియు లోగడ చెప్పబడినందున ఆ బ్రహ్మయే ఈ సంసార వృక్షమునకు మూలము. ఈశ్వరుడే దీని బీజము. హిరణ్యగర్భుడే దీని యంకురము. తృష్ణ యను జలముతో నిది పెరుగును. పిపీలికాది బ్రహ్మ పర్యంతులగు జీవులందరును ఈ సంసార

(1) దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా। మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే 7–14. (2) ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః। అహంకార విమూ ఢాత్మా కర్తాహ మితి మన్యతే 3–27. (3) నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః। అజ్ఞానే నావృతం జ్ఞానం। తేన ముహ్యంతి జన్తవః 5–15.

వృక్షము నాశ్రయించిన పక్షులు. సర్వ జీవులయొక్క సుఖ దుఃఖ రాగ ద్వేషాదులచే నొప్పు వ్యవహారమే ఈ వృక్షాశ్రిత పక్షుల కలకల ధ్వని. ఇట్టి సంసారవృక్ష మనాదిసిద్ధము.[1] పంచ భూతములు దీని శాఖోపశాఖ లగుచు సర్వతోముఖముగా ప్రసరించినవి. తృష్ణాది గుణములచే పెంచబడి శబ్దస్పర్శాదులను చిగురుటాకులుగలది. సర్వ జీవుల యొక్కయు భిన్న భిన్నములగు కర్మఫలము లన్నియు దీని వ్రేళ్లు.[2] దీని స్వరూపము గాని ఆదిగాని, అంతము గాని ఎవరికిని గోచరమగుట లేదు. అనగా స్వప్నపదార్థములవలెను, ఎండమావులవలెను, అదృష్ట దృష్ట ప్రణష్ట స్వరూపము గలది.[3]

ఇట్లీ జగత్స్వరూప విచారణ యంతయు జగత్కారణము నెరిగి దాని నారాధించి ఈ సంసార నివృత్తి నొందుట కుద్దేశింపబడినది. కాన ఈ జగత్కారణమగు బ్రహ్మను ఎవరెట్టి రీతితో నారాధింపవలయునను విషయము ముందు సాధన ప్రకరణమందు వివరింపబడును.

## విషయోప సంహారము

ఇట్లీ ప్రకరణమందు జగత్తున కాది లేదనియు, ఎవరికి దాని ఆది తెలియబడదని తెలిసినందువల్ల ప్రయోజనము లేదని, అందలి ప్రతి అణువున్ను పరమాత్మను గుర్తించుటకు సాధనమగుచున్నదనియు, జీవులచే నొనర్పబడు కర్మలు (క్రియలన్నియు) దేహ, ఇంద్రియ, మనః ప్రాణములచే ఆచరింపబడుటచే, తత్ఫలము గూడ ఆదేహేంద్రియాది రూపముతోనే యుండుననియు, ఇట్లు కర్మాచరణ కాలిక దేహేంద్రియాదులు, జన్మాంతర మందలి దేహేంద్రియాది రూపముగా మారునట్లొనర్చు శక్తియే ఈశ్వరుడనియు, ఆ మార్పు శక్తిని వివరించుటకై ఆకాశాది పంచభూతములు, తజ్జనితములు, తత్స్వరూప వ్యష్టులే జీవుని దేహేంద్రియములనియు, తత్సమష్టియే ఈశ్వరుడనియు, ఆ ఇంద్రియము లిందలి

---

(1) ఊర్ధ్వమూల మధశ్శాఖమ్ అశ్వత్థం ప్రాహు రవ్యయమ్ । ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ 15-1. (2) అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖాః గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః । అధశ్చ మూలా న్యనుస న్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే 15-2. (3) న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాది ర్న చ సంప్రతిష్ఠా । అశ్వత్థ మేనం సువిరూఢమూలం అసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా 15-3.

శబ్దాది గ్రహణశక్తు లన్నియు, ఈశ్వరాంశలే గాని, జడమగు దేహములోని అంశలు కావ నియు, చైతన్య రూపుడై కారణమగు పరమేశ్వరునకు, జడరూపమై కార్యమగు జగత్తు నకు, కార్యకారణ సంబంధము ఆరంభరూపముగాని, పరిణామ రూపముగాని కాక, వివర్తరూపమే లేక ఆధ్యాసికరూపమే వనియు, అసలు కార్య కారణములు రెండున్ను అత్యంత విలక్షణ వస్తుద్వయమే గాదనియు, కారణము నందు, నామ, రూప భేదములను, అజ్ఞానము చేతను, అసంపూర్ణ జ్ఞానముచేతను కల్పించుటయే కార్య మనబడు ననియు, కార్య కారణములు రెండు భిన్నములని గాని, అభిన్నములని గాని నిరూపింప నలవి గాదనియు—వ్యవహారము కొరకు ఈశ్వరుడు జీవులను, వారల పుణ్యాపాప ప్రవర్తనల ననుస రించి వారలకు జన్మాంతరముల నిచ్చుననియు, జగత్తున కంతముండుననియు, దానికుపాయ మెరిగి, ప్రయత్నించుచూ తుదముట్టించుట మాత్రమే జీవుల కర్తవ్యమనియు నిరూపింప బడినది.



శ్రీ

# గీతాసారసంగ్రహము

## 5. సాధన ప్రకరణము



సామాన్యాధికారి ముందు వేదమందు విశ్వాసము లేనివాడై తనకు ఐహికమగు వర్ష, పశు, పుత్రాదులు కావలయునను కోరిక గలిగి అది నెరవేరు నుపాయము నన్వేషించుచూ, వేదమందలి కామ్యకాండనుగ్రహించి, అది తనకోరికను నెరవేర్చునేమో చేసి చూతమను దృష్టితో పరీక్షించుటకొరకాచరించి అది ఫలము నివ్వగా వేదమందు విశ్వాసము గలిగి క్రమముగా నిత్యకర్మలు గల వేదభాగము నభ్యసించి దాని యర్థమెరిగి తదనుకూలముగా తాను ప్రవర్తించుచూ ఆ భాగమందు గూడ విశ్వాసము గలిగి వేదములోని జ్ఞానకాండ నభ్యసించును. ఇట్లు ప్రతి విద్యాభాగమునందును ముందు, జిజ్ఞాస, తర్వాత అది నిజమై యుండునేమో పరీక్షించి చూతమను అభిలాష, తర్వాత దాని యందు విశ్వాసము. ఆ పైన విద్యలో నంతకంటె పై భాగమందు జిజ్ఞాస గలుగును.[1&2] ఇట్టి శ్రేయస్సాధనమునకే "విద్య" యని సామాన్య సంజ్ఞ. ఆ విద్య 4 దశలలో నుండును.

1. ఈ దశలో నిది కళ యనబడును. గీత, వాదిత్ర, నృత్త, నాట్య, చిత్ర, లిపి, గంధకరణ, మాల్య కరణ, క్రీడా, శరీర సంస్కార, తులా, లేఖన, అంగరాగ, పరస్పర భావగహణ, భూషణాదులు, కొయ్యపని, బంగారపు పని, ఇనుప పని ఇత్యాదులన్నియు కళ అనబడును. ఇవి 64.

2. ఈ దశలో నిది పురాణ మనబడును.

   మహా పురుషుల చరిత్రద్వారా మంచి గుణములచే బాగుపడినవారు, చెడు గుణములచే చెడిపోయినవారు తెలియబడగలరు.

---

(1) జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన। తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ। 3-1. (2) వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే। త దేకం వద నిశ్చిత్య యేన శ్రేయో౽హ మాప్నుయాం 3-2.

3. ఈ దశలోనిది "స్మృతి" యనబడును.
ఇందు ప్రతివాడు నిద్ర మేల్కొన్న క్షణమునుంచి, తిరిగి నిద్రపోవువరకును, పుట్టినది మొదలు చనిపోవువరకును, ఏయే పనులు చేయుట మంచిదో, ఏయే పనులు చేయుట మంచిది గాదో విధింపబడియున్నవి. నీవిట్లు చేయుము అని యుండును.

4. ఈ దశలోనిది అధ్యయనము, స్వాధ్యాయమని, వేదమని యనబడును. గురువు వద్ద చదువుచున్న సమయము అధ్యయనమనియు, తనంతటతాను మననమొనర్చుచు వల్లించు సమయమందు స్వాధ్యాయమనియు, తన ప్రయత్నము లేకయే, విద్య దొర్లుచు, తానే ఆ విద్యారూపుడైన దశలో వేదమని చెప్పబడును.

బాలునకు మాటలు వచ్చే వయస్సునుంచి, కళలను ఆ పై దశలలో, క్రమముగా, పురాణ, స్మృతి, అధ్యయనములను బోధింపవలెను. విద్యార్థికి ప్రారంభదశలో భిన్నముగాను, పరోక్షముగాను ఉండు విద్య బాగా జీర్ణమైన పరిపక్వ దశలో అపరోక్షమై తానే విద్యయగును గాని, తనకంటె విద్య భిన్నము గాదు. ఇట్లు విద్యలో ఎంత భాగము, తానే యాయెనో, ఆ భాగము "జ్ఞానము"నబడును. అది ఆ తరువాయి విద్యను గ్రహించుటకు సాధనమగును. ఇట్లు విద్యలోని అనేక దశలలో అనేక "జ్ఞాన" భేదము లేర్పడును. చిట్ట చివర దశలో సర్వ విద్యా పారంగతుడైనపుడు జ్ఞానమే తాను. జ్ఞానమే సర్వ ప్రపంచము. జ్ఞానమే పరమాత్మ. ఇచట అద్వైతభావమేగాని, ద్వైత మొంతమాత్రము లేదు. ఇదియే మోక్షమనబడును. పూర్వమునుంచి ఇప్పటివరకు అనేకమునులిట్లు సిద్ధియొక్క పరమావధిని (మోక్షమును) బొందిరి.[1]

ఈ గీతా శాస్త్రమందు నాలుగు విధములగు సాధన విశేషము లాయా అధికారుల కొరకు ఉపదేశింప బడినవి. అవెవ్వి యనగా :

1. సర్వకర్మ ఫలత్యాగము, 2. కర్మయోగము, 3. ధ్యానయోగము, 4. జ్ఞానయోగము. ఇందు జ్ఞానయోగము సర్వోత్కృష్టమైనది. దీనివలన మాయ నతిక్రమింతురు.[2] జనన మరణాది ప్రవాహము వీరి కుండదు.[3] వీరు అక్షరభావము నొందుదురు.

---

(1) పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమం । యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః 14-1. (2) దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా । మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే 7-14. (3) మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ । నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః 8-15.

ఇందుకు తగు నధికారము లేక అట్టి జ్ఞానయోగము నొందలేనివారు ధ్యానయోగమును సాధనముగా గైకొనవలయును.[1]

అదిగూడ చేయుటకు చేతకానివారు కర్మయోగమును సాధనముగా గైకొనవలయును.[2] అదిగూడ చేయలేనివారు సర్వఫలత్యాగమొనర్పవలెను.[3] ఇవి నాల్గున్ను పురుషకారభేదము లనబడును. గాన ముందు దైవమన నేమి? పురుషకారమన నేమి? యను విషయ మొకింత విచారించబడుచున్నది.

## దైవపురుష కారములు

ఏకాలమం దేజీవు డెట్టిపని (కర్మ) యొనర్చినను అది నశింపక తప్పక ఎద్దియో నొక ఫలము నిచ్చితీరుననియు ఆచరించుటకు సంకల్పించినది మొదలు ఫలము నిచ్చువరకును అది ఆ జీవుని కారణదేహములో వాసనారూపముగా నుండుననియు, పూర్తిగా ఫలోన్ముఖ మైనతోడనే అది వాని యంతఃకరణలో నాయా సంకల్పరూపముతో నంకురించి క్రమముగా ఫలరూపమై దేహేంద్రియములతో ననుభవింపబడుననియు లోగడ నిరూపింపబడినది. ఎన్ని జన్మల నుండియో పరిణతములగుచూ ఇంకను ఫలము నిచ్చుటకొరకు వేచియున్న కర్మ వాసనలెన్నియో గలవు. అవి దేహేంద్రియాదికముచే ననుభవింపబడు తుణము వరకు ఇట్టివని గోచరము గావు. ఈ సమూహమే దైవమనబడును.

ఇక పురుషకారము నిరూపింపబడుచున్నది. ప్రతి జీవుడును తన సుఖముకొరకు నిరంతరము ప్రయత్నించుచుండును. ఈ సుఖము వెంటనే గలుగునది, దూరకాలములో గలుగునది, మరుజన్మలో గలుగునది ఈ రీతిగా భిన్నమైనది. ఈ ప్రయత్నమంతయు పురుషకారమనబడును. దీనిఫల మిపుడేవచ్చునో, కాలాంతరమందువచ్చునో తెలియదుగాని, ఎప్పటికైనను వచ్చితీరును. ఇది చక్షురింద్రియముతో ననుభవింపబడున దొకటి, శ్రోత్రేంద్రియముతో ననుభవింపబడునది మరియొకటి. ఇట్లు సకలావయవములతోను అనుభవింపబడునదగుటచే భిన్నమైనది. మరియు నిది సాత్త్వికసుఖము, రాజస సుఖము, తామససుఖము

---

(1) అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్। అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥ 12-9. (2) అభ్యాసే ప్యసమర్థో ఽపి మత్కర్మపరమో భవ। మదర్థ మపి కర్మాణి కుర్వన్సిద్ధి మవాప్స్యసి 12-10. (3) అథైతద ప్యశక్తో ఽపి కర్తుం మద్యోగ మాశ్రితః।సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ 12-11.

అని మూడు విధములు.[1] వీటి లక్షణము లిదివరలో వివరింపబడినవి. గాన ఈ జీవుడు గత జన్మలలో అనేక ఇంద్రియములతో అనేక సాత్విక రాజస తామస సుఖములకొరకు ప్రయత్నించియుండుట సహజము. అనగా ఒకేచక్షురింద్రియముతో ననుభవింపబడు సాత్విక సుఖముకొఱకున్ను, రాజససుఖముకొరకున్ను, తామససుఖముకొరకున్ను అనేక ప్రయత్నము (కర్మ) ల నొనర్చియుండును. ఇట్లే సకలేంద్రియ త్రివిధసుఖముల కొరకును ప్రయత్నముల నొనర్చియుండును. అవియే వాసనారూపమునుండి కాలాంతరమున దైవమన బడును. అందేవి ఎట్టిరూపముతో ననుభవింపబడనున్నవో తెలియదు. అందు రాజస, తామససుఖ ప్రయత్నములు పరిణామమందు దుఃఖమును, మోహమును, నిద్రను, ఆలస్యమును ప్రమాదమును గూడ గలుగజేయును. అవియే జన్మాంతర హేతువులుగూడ అగును.[2] గాన దైవము ననుసరించి ఈ జీవునకు ఆయా ఇంద్రియములద్వారా సుఖముగాని, దుఃఖము గాని ప్రతిక్షణమందును రాదగియుండును. అది ఇట్టిది రానున్నదని ముందుగా పురుషులకు తెలియదు. గాన ప్రతిపురుషుడును తన సన్నిహిత సుఖముకొరకు గాని, దూరమందలి సుఖము కొరకుగాని, జన్మాంతరసుఖముకొరకుగాని, సుఖపరమావధియగు మోక్షముకొరకుగాని ప్రతి క్షణమందును ప్రవర్తించవలెను. ఇదియే పురుషకారమనబడును. ధానుష్కునిచే ధనుస్సులో సంధానమొనర్చబడి లాగి వదలబడినబాణము నా ధానుష్కుడైనను ఎట్లుపసంహరింపజేయ లేడో అట్లే దైవనిర్దిష్టమగు సుఖదుఃఖాదుల నీపురుషకారము పోగొట్టజాలకున్నను, బలవత్తర మగు పురుషకారమైనచో దాని వేగమును తగ్గించును. ఈ పురుషకార మెన్నటికైనను తప్పక ఫలించితీరునుగదా యను దృష్టితో చేయవలెను. ఒకవేళ దైవికముగాగూడ సుఖమే రాదగియున్నచో ఈ పురుషకారముగూడ సుఖముకొరకు చేయబడుచున్నదే గాన బంగార మునకు పరిమళమువలె పరమామోదమగును. కావున సర్వథా పురుషకారము శాస్త్రముచే నుపదేశింపబడుచున్నది. అందు సర్వకర్మ ఫలత్యాగమను పురుషకారము వివరింప బడుచున్నది.

---

(1) సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ। అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి 18-36. (2) యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః। నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్ 18-39.

## సర్వ కర్మ ఫల త్యాగము

దైవముచే గలుగు అనిష్ట, ఇష్ట, మిశ్ర రూపమగు కర్మఫలానుభవములో[1] అనిష్ట మిశ్రములు సకలేంద్రియార్థములందును రాగద్వేషాది రూపముతో ఫలోన్ముఖములై యగుపడును.[2] కాన పురుషకారముచే నా రాగద్వేషములకు వశుడు గాకుండ ప్రవర్తించ వలెను.[3] దైవీసంపత్తనబడు అభయము, సత్వసంశుద్ధి, జ్ఞానయోగనిష్ఠ, [ఆ యా ఇంద్రియ కర్మలందు ఫలాపేక్ష లేకుండుట] దానము, దమము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, సన్మార్గ ప్రవర్తన[4] అహింస, సత్యము, అక్రోధము, త్యాగము, శాంతి, అపైశున్యము (ఇతరునకు ఇతరుని దోషములను చెప్పుటయే పైశున్యము) భూతదయ, విషయసన్నిధి యందుగూడ ఇంద్రియ వికారము లేకుండుట, మృదుత్వము, లజ్జ, ప్రయోజనము లేకయే వాక్పాణిపాదాదులను వ్యాపారమొనర్చకుండుట[5] తేజస్సు [ప్రాగల్భ్యము] ఓర్పు, ధైర్యము, ఎవరికిని ద్రోహమొనర్పకుండుట, బాహ్యాభ్యంతర శౌచము తానే గొప్పవాడ నని తలంపకుండుట ఇత్యాదుల నలవరచుకొనవలయును. అట్లే ఆసురీసంపత్తనబడు దంభ దర్పాదులును దంభోదర్పోభిమానశ్చ [భ.16–4 శ్లో.నుంచి 18 వరకు] వదలిపెట్టుటకు ప్రయ త్నించవలెను. అట్లే సత్త్వకార్యమగు ప్రకాశము నలవరచుకొనుట. రజఃకార్యమగు ప్రవృత్తినిన్ని తమఃకార్యమగు మోహమునున్ను వదలిపెట్టుటకు ప్రయత్నించవలెను. దైవ ప్రాప్తములగు సుఖదుఃఖాదులను ఎట్టి వికారము లేక సహించుట నలవరచుకొనవలెను. సర్వవిషయములందును ఉదాసీనునివలె నుండుట కభ్యసింపవలెను. ప్రకృతిలోని సత్వరజ స్తమోగుణములచే నా యా సుఖదుఃఖములు సంభవించుచుండగా వాటియందెట్టి రాగ ద్వేషాదులు లేకుండుట నలవరచుకొనవలెను.[6] దేహాదిభౌతికప్రపంచము ఎల్లప్పుడు పుట్టుచూ, నశించుచూ యుండు స్వభావముగలది గాన, వాటి జనన మరణములందు తాను సుఖ

---

(1) అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ । భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ 18-12. (2) ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ । తయోర్న వశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ 3-34. (3) అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః । దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ 16-1. (4) అహింసా సత్య మక్రోధః త్యాగ శ్శాంతి రపైశునమ్ । దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్ 16-2. (5) ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాండవ । న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి 14-22. (6) ఉదాసీనవ దాసీనో గుణైర్యో న విచాల్యతే । గుణా వర్తన్త ఇత్యేవ యో ఽవతిష్ఠతి నేఙ్గతే 14-23.

దుఃఖముల నొందకుండుట నభ్యసింపవలెను.[1] సుఖ దుఃఖములందు సమబుద్ధిని, స్వస్థచిత్తతను, మట్టిని, బంగారమును రాగద్వేషాదులు లేక సమదృష్టితో చూచుటయేగాని బంగారము తనకు కావలయునని కోరకుండుటయు, మట్టి యక్కరలేదని తలంపకుండుటయు, తనను యితరులు దూషించినను భూషించినను గూడ రాగద్వేషాదులు లేక ఏకరీతిగా నుండుటను అలవరచుకొనవలెను. "నాకీ వస్తు విష్టమైనది ఈ వస్తువిష్టమైనది గాదు" అని పలుకకుండుట[2] ఎల్లప్పుడు స్వస్థచిత్తముతో నుండుట, ఒకడు శత్రువు, ఒకడు మిత్రుడు అని తలపకుండుట, పరేచ్ఛతో సేవనిని చేయకుండుట, ఇత్యాదుల నలవరచుకొనవలయును.[3] మనస్సులో నెల్లప్పుడు విషయములను స్మరింపుచు, బాహ్యమునకు మాత్రము కర్మేంద్రియోపరతి నొందినట్లుండుట మిథ్యాచారమనబడును. అది స్వభావము గాన దాని నడ్డగింప ప్రయత్నింపవలెను.[4] ప్రకృతిగుణములచేతనే ఆ యా దేహేంద్రియ కర్మలును, సుఖ దుఃఖములును ఏర్పడుచుండ తానే కర్తనని అహంకారముతో తలపకుండవలెను.[5] ఆ ప్రకృతి యొక్క గుణములచే నేర్పడు కర్మలందు సక్తతను వదలవలెను. ఆ సక్తత గల సాధకులను సిద్ధుడు నిరోధింపరాదు.[6] ఈశ్వర ప్రోక్తమగు శాస్త్రమతమునందును, తద్వేత్తలందును ఎట్టిద్వేషమున్ను అసూయయున్ను లేకుండవలెను.[7] శాస్త్రాచార్యోపదేశములందు శ్రద్ధాభక్తులు గలిగియుండవలెను.[8] శబ్దాది విషయములకును, శ్రోత్రాదీంద్రియములకును సంబంధము గలుగుటచే గలుగు భోగములు దుఃఖాకరములును, జన్మనాశములు గలవిన్నియని తలచి వాటిని వదలుటకు ప్రయత్నింపవలెను.[9] దేహేంద్రియాదులచే నొనర్పు

(1) అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ । తథాపి త్వం మహాబాహో ! నైనం శోచితు మర్హసి 2-26. (2) సమదుఃఖసుఖ స్స్వస్థః సమలోష్టాశ్మ కాంచనః। తుల్యప్రియా ప్రియో ధీరః స్తుల్యనిందాత్మసంస్తుతిః 14-24. (3) మానావమానయో స్తుల్యః తుల్యో మిత్రారిపక్షయోః । సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే 14-25. (4) కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్। ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే 3-6. (5) ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః । అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే 3-27. (6) ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు । తా నకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవి న్న విచాలయేత్ 3-29. (7) యే త్వేత దభ్యసూయన్తో నామతిష్ఠంతి మే మతమ్ । సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః 3-32. (8) అజ్ఞ శ్చాశ్రద్దధాన శ్చ సంశయాత్మా వినశ్యతి । నాయం లోకో஽స్తి న పరో న సుఖం సంశయాత్మనః 4-40. (9) యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే । ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః 5-22.

సకల కర్మలందును ఫలాభిసంధి లేకుండవలెను.[1] ఇంద్రియముల నన్నిటిని జయింప వలెను.[2] సర్వభూతములను ద్వేషింపక వాటియందు మైత్రీభావముతో నుండుట, కరుణ గల్గియుండుట, అహంకార మమకారములు లేకుండుట, సుఖదుఃఖములను సమముగా చూచుట[3] ఓర్పుగల్గి యుండుట, నిత్యతృప్తుడై యుండుట, దంభము, అహింస, సన్మార్గప్రవర్తన, గురుభక్తి, బాహ్యాభ్యంతరశౌచము, స్థిరచిత్తత్వము[4] ఇంద్రియ విషయములందు వైరాగ్యము, జన్మజరాగ్రస్తదేహమందు దుఃఖదృష్టి,[5] దారాపుత్ర గృహక్షేత్రాదులందాసక్తి లేకుండుట, కార్యము సిద్ధించినను సిద్ధింపకున్నను ఎట్టి వికారమును బొందకుండుట[6] ఇత్యాదుల నలవరచుకొనవలెను. రాజస తామసాహారములను పరిత్యజించి సాత్త్వికాహారములను భుజింపవలెను. (భ.17-8 శ్లో. 9,10 వరకు) రాజసతామసదానముల నొనర్పక సాత్త్వికదానము నాచరింపవలెను. (భ. 17-20 శ్లో. నుంచి 21, 22 వరకు) ఆ యా ఇంద్రియములతో నొనర్చు కర్మలనన్నిటిని, రాజసతామస వృత్తితో నొనర్పక సాత్త్వికవృత్తితో నొనర్పవలెను.(భ. 18-23 శ్లో. నుంచి 24. 25 వరకు)ఆ యా పనులొనర్చు కాలమందు తనయందు రాజసతామస కర్తృభావమును గ్రహింపక సాత్త్వికకర్తృభావముతో నుండవలెను. (భ. 18-26 శ్లో. నుంచి 27, 28 వరకు) సర్వకాలమందును రాజస తామస బుద్ధితోనుండక సాత్త్వికబుద్ధితో నుండవలెను.(భ.18-30 శ్లో. నుంచి 31,32 వరకు) అట్లే సర్వకాలమందును రాజసతామస ధైర్యముతో నుండక సాత్త్వికధృతినొంది యుండవలెను. (భ. 18-33 శ్లో. నుంచి 34,35 వరకు) కామ, క్రోధ, లోభాదులను వదలవలెను.[7] ఇట్లన్నిటిని పుష్కలముగా నలవరచుకొనుటయే సర్వకర్మ ఫలత్యాగ మనబడును. ఇదియే జ్ఞాన, అభ్యాస, కర్మాదులకంటె శ్రేయస్కరమని స్తుతింపబడెను.[8] ఇందు క్రమముగా

(1) యస్య సర్వే సమారమ్భాః కామ సఙ్కల్ప వర్జితాః । జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః 4-19.(2) తస్మాత్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ ।। పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్ 3-41. (3) అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ । నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ 12-13.(4) అమానిత్వ మదంభిత్వం అహింసా క్షాంతి రార్జవమ్। ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః 13-8. (5) ఇంద్రియార్థేషు వైరాగ్యం అనహంకార ఏవ చ । జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ 13-9. (6) అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు । నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టో పపత్తిషు 13-10. (7) త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః కామః క్రోధ స్తథా లోభః తస్మా దేత త్త్రయం త్యజేత్ 16-21. (8) శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే। ధ్యానా త్కర్మ ఫలత్యాగః త్యాగా చ్ఛాంతి రనంతరమ్ 12-12.

నొక్కొకదాని నలవరచుకొనుటకు శ్రేయోభిలాషులందరును తప్పక ప్రయత్నించి తీర వలయును.[1] కర్మధ్యాన జ్ఞానయోగము లివి సిద్ధించుటకే ఏర్పడినవి. ఇందు కొన్నిటి నల వరచుకొన్నవారు కర్మయోగమును సాధనముగా చేకొనవచ్చును.

## విషయోపసంహారము

స్థూలదేహాది భౌతిక ప్రపంచమును (Mather) నియమించు శక్తి (Property) ఇంద్రియ మనస్సులు (సూక్ష్మదేహము) వాటిని నియమించునది (Kanatic Energy) ముఖ్యప్రాణము (కారణదేహము). ఇవి మూడును, క్రియారూపములు, పూర్వక్రియలకు ఫలరూపములు, అనంతరభావిక్రియలకు సాధనములు. క్రియ యనగా అనేక క్రియలసమూహము-వండుట యను క్రియ, నిప్పునేర్పరచు సన్నాహమునుండి, అన్నముడికినతర్వాత దింపుటవరకు గల అనేకక్రియల సమూహము. అందు ప్రతిక్రియయు, వెనుకటిక్రియకు ఫలరూపమున్ను ముందు క్రియకు సాధనరూపమున్ను అగుట యుక్త్యనుభవసిద్ధము. ఈ త్రివిధ ప్రపంచము ఆరు భావవికారములను పొందుచున్నది. దీనికి అధిష్ఠానము "పరబ్రహ్మయే" అని గుర్తిం చుట కొనర్చు ప్రయత్నమే సాధనము.

## విషయోపసంహారము

జీవుని అవిద్యానివృత్తికి నాల్గు సాధనములు :

1. సర్వకర్మఫలత్యాగము : తానాచరించు ప్రతిపనికి ఫలాపేక్ష ప్రయోజకము కారాదు. తానాచరించు పనియే తన పూర్వకర్మఫలమున్ను, ముందు రాబోవు ఫలమునకు సాధనమున్ను అగును. అట్లు చేయుట తన విధినిర్వహణమేగాని తను ఫలము నపేక్షించుట తనకు హక్కుగాదు. తాను పూర్వమొనర్చిన కర్మలే దైవమనియు. ఇపుడొనర్చుచున్న కర్మలే "పురుషకారమ"నియు చెప్పబడును. శాస్త్రీయముగా తాను ప్రతిక్షణమందును ప్రవ ర్తించుటయే ఈ మొదటిసాధనము. దానివలన కామక్రోధాది స్వభావములు విముఖము లగును.

---

(1) సర్వయోనిషు కౌన్తేయః మూర్తయ స్సంభవన్తి యాః । తాసాం బ్రహ్మ మహ ద్యోనిః అహం బీజప్రదః పితా 14-4.

2. కర్మయోగము : తానుచేయు ప్రతిపనియు లోకమందలి ఎట్టి జీవునకును అపకారము గాకుండునట్లు ఆచరించుటయు, ఇతరుల కపకారకమైనపనిని తనకుపకారమైనను ఆచరింపకపోవుటయు కర్మయోగమనబడును.

3. ధ్యానయోగము : (1) తనయందు (2) తనుచేయుచున్న సర్వక్రియలందు (3) తనకు దృశ్యములగు సర్వవిషయములందు బుద్ధిగ్రాహ్యముగాని గొప్పశక్తి గలదనియు, అదియే పై మూడింటిని పనిమొనర్చుచున్నదనియు, అదియే ఈశ్వరుడనియు సర్వకాల సర్వావస్థలందును జ్ఞాపకముంచుకొను ప్రయత్నమే ధ్యానయోగమనబడును.

4. జ్ఞానయోగము : సర్వము ఈశ్వరమయమే గాన, తానుగూడ ఈశ్వరుడే యను నిశ్చయముతో నుండి, తానేమియు బుద్ధిపూర్వకముగా చేయకుండుటయు, తన దేహేంద్రియ మనః ప్రాణములను వేరుగాను, ప్రపంచమును వేరుగాను చూడకుండుటయు, నిరంతరముగా మననమైయున్నది గాన, తాను "శాంత" స్థితిలో లేక "స్థితప్రజ్ఞు"డై యుండుట జ్ఞానయోగమనబడును.



శ్రీ

# గీతాసారసంగ్రహము

## 6. కర్మయోగ ప్రకరణము



తమ తమ వర్ణమునకు శాస్త్రముచే విధింపబడిన నిత్యకర్మల నాచరించుటయే కర్మయోగమనబడును. ప్రతి జీవుడును ప్రతి క్షణమందును ఎద్దియో యొకపని (కర్మ) నాచరించుచునేయుండును.[1] ఆ కర్మాచరణలోని పరిశ్రమ సంకల్పావస్థయే శ్రద్ధ యనబడును. పూర్వజన్మలందలి కర్మవాసనలలో ఫలోన్ముఖమగునది కారణదేహమునుండి సూక్ష్మదేహము లోనికి వచ్చు ప్రథమావస్థయే శ్రద్ధగాన నిది స్వభావముచే నేర్పడును.[2] ఇదియే క్రమముగా నా కార్యము నెరవేరువరకు దోహదమొనర్పబడి ఫలించును. గాన పురుషు డీ శ్రద్ధ యేర్పడినదిమొదలు నెరవేరువరకు శ్రద్ధామయుడగును.[3]

ఒకానొకడు బ్రహ్మహత్య యొనర్పవలయునను శ్రద్ధగలిగి తన్మయుడై తదనుకూల సాధన సహాయ సంపత్తిని సంపాదించి ఆ పనిని నెరవేర్చును. అంతవరకు ఆతడు ఆ బ్రహ్మహత్యాశ్రద్ధాస్వరూపుడే యగుచున్నాడు. అది వాని ఇంద్రియములద్వారా అంతఃకరణముద్వారా కారణదేహమందు వాసనారూపముతో నుండిన పరిణామము నొందుచు పూర్తిగా పరిణత మైనపు డాతనిచే క్షయవ్యాధిరూపముతో ననుభవింపబడును. ఇట్లే సురాపానమొనర్చినవాడు పిప్పిదంతములు గలవాడును. సువర్ణస్తేయ మొనర్చినవాడు, పిప్పిగోళ్లు గలవాడును, పరస్త్రీ వ్యసనుడు కుంటివాడును, అంధుడును, బధిరుడును అగును. గురునిందాపరుడు అపస్మారి యగును. పరగృహదహన మొనర్చినవాడు కుష్ఠువ్యాధి గలిగియుండును.

---

(1) న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః । యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే 18-11. (2) త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా । సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు 17-2. (3) సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత । శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః 17-3.

పంచయజ్ఞముల నొనర్పక భుజించువాడు వరాహమై పుట్టును. ఈ రీతిగా కర్మ విపాకమం దనేక విశేషములున్నవి. ఇట్లొక జన్మలో నొనర్చిన పాపము మరుజన్మలో నాతనికి, కామ క్రోధ లోభ హింసానృతాదిరూపముతోను, రాజస తామసములగు ఆహార, యజ్ఞ, దాన, తపోరూపముతోను బుద్ధిప్రాణములందుండును. [1]

ఇట్లు సర్వవాసనారూపమగు కారణదేహము సత్త్వరజస్తమస్సులను గుణత్రయము ద్వారా సకలేంద్రియ వ్యాపారచేష్టలకు కారణమగుచున్నది. పురుషకారముచే ప్రతి ఇంద్రియ వృత్తియందును రజస్తమస్సులను తగ్గించి సత్వము నభివృద్ధినొనర్చుటకు ప్రయత్నించుటలో కొందరు పూర్తిగా అన్ని ఇంద్రియములందును సాత్విక వృత్తులు గలిగియుందురు. మరికొందరు కొన్ని ఇంద్రియ వృత్తులను సాత్వికముగను మరికొన్నిటిని రాజసములుగను ఇంకా కొన్నిటిని తామసముగను గలిగియుందురు. కావుననే ఒకడు పరస్త్రీవ్యసనుడై సత్య, దాన, దయాది సద్గుణములతోను ఇంకొకడసత్యపరుడై బ్రహ్మచర్యాది సద్గుణములతోను ఇట్లు కొన్ని సాత్విక గుణములును మరికొన్ని రాజసగుణములును, ఇంకా కొన్ని తామసగుణములును గలిగియుండుట లోకానుభవసిద్ధమైనది. ఇదియే గుణకర్మ విభాగమనబడును.[2]

జన్మకొకసారి ఫలోన్ముఖకర్మవాసనలనుబట్టి, లేక ప్రారబ్ధకర్మయనబడు జన్మలోమాత్ర మనుభవింపదగిన కర్మనుబట్టి స్వభావమేర్పడుననియు, నట్టి స్వభావమునకు విరుద్ధమగు నెట్టి కార్యమున్ను వాని జన్మలో సిద్ధింపదనియు లోగడ చెప్పబడినది. కావున ఇట్టి స్వభావమగు గుణకర్మవిభాగమును బట్టియే కారణదేహము ఆ యా వర్ణములందు స్థూలదేహముల నొందును.[3] కావుననే ఈ సృష్టియందు ఈశ్వరునకు వైషమ్యదోషము రాదు. జీవుల పూర్వ జన్మల నన్నిటియందును చేసి అనుభవింపగా మిగిలియున్న పుణ్యపాపములన్ను, మరణకాలమునకు లెక్క నిలవతేల్చి, వాటినిబట్టియే ఈ జన్మలో బ్రాహ్మణాది గృహములందు

---

(1) ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః। యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు 17-7. (2) వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన। బహుశాఖా హ్యనన్తా శ్చ బుద్ధయో ఽవ్యవసాయినామ్ 2-41. (3) చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః। తస్య కర్తార మపి మాం వి ద్ధ్యకర్తార మవ్యయమ్ 4-13.

జన్మించునట్లు ఈశ్వరుడొనర్చును. ఒక జీవుడు శాస్త్రీయశ్రద్ధాభక్తులతో కర్మ, ధ్యానయోగములనభ్యసించుచు అందలి పరమావధి నభిలషించి ప్రయత్నించుచుండగానే అతని దేహము మరణించిన యెడల అతని కా అభిలాష, లక్ష్యము నెరవేరుట కనువగు దేహేంద్రియసముదాయమే మరుజన్మలో లభించును. వీరే బ్రాహ్మణులనబడెదరు. వీరు శమము, దమము, తపస్సు, శుచిభావము, ఓర్పు, ఋజుమార్గప్రవర్తనము, ఆస్తికత, జ్ఞానశాస్త్రమందు నైసర్గికాభిలాష గలిగియుండి, తదనుకూలముగా ప్రయత్నించు స్థితిలో మరణమొంది, ఆ ప్రయత్నమును కొనసాగింపగల సాధనస్వభావాదులు గలిగియుందురు. అట్లే శౌర్యము, తేజస్సు. ధైర్యము, సామర్థ్యము, ధర్మముకొరకు యుద్ధమొనర్చి అధర్మమును శిక్షించి. ధర్మమును కాపాడుట, అందు తనకు నష్టముగాని మరణముగాని సంభవించినను సంతోషించుట, ఇతరులకు దానమిచ్చుట, ప్రభుశక్తి, ఔదార్యము ఇత్యాదుల నభిలషించి తదనుకూలముగా ప్రవర్తించు దశలో మరణించి ఆ లక్ష్యము పొందుట కనువగు ప్రయత్నమును కొనసాగింపగల దేహేంద్రియాదులు గలిగియుండు జాతిలో పుట్టుదురు. వీరే క్షత్రియులనబడెదరు. అట్లే వ్యవసాయము, కృషి, గోరక్షణము, వర్తకము, ఇత్యాదుల నభిలషించి తదనుకూల ప్రవృత్తి గలిగి యత్నించు దశలో మరణించి, ఆ లక్ష్యమునే పొందుటకు ప్రయత్నింప నర్హమగు దేహేంద్రియాదులు గల నూతన జన్మ నెత్తి ఆ పనినే కొనసాగింతురు. వీరే వైశ్యులనబడెదరు. అట్లే ఇతరులకు పరిచర్యచేసి తాము జీవించుట నభిలషించి, తదనుకూల ప్రయత్నమొనర్చు దశలో మరణించి, ఆ లక్ష్యమునే పొందుటకు ప్రయత్నింప నర్హమగు దేహేంద్రియాదులుగల నూతనజన్మ నెత్తి ఆపనినే కొనసాగింతురు. వీరే శూద్రులనబడుదురు. ఏ లక్ష్యముకొరకు జీవుడు తన ప్రాణమునూ, ఇంద్రియ దేహములతో ప్రయత్నించునో తత్ఫలమే అతని భావి దేహేంద్రియ మనఃప్రాణ నిర్మాణము అనుట యుక్తి అనుభవములందు గోచరించుచునేయున్నది. ఒకరోజున మన మత్యంత ఈప్సితతమమని భావించిన ఫలముకొరకు ప్రయత్నించు కాలమంతలోను మన దేహేంద్రియ మనఃప్రాణములన్నియు పూర్తిగా ఆ ప్రయోజన వశమై. తత్ప్రేరితమై [illegible] సర్వావస్థ[illegible]సిద్ధముగదా ! అట్లా ప్రయోజన మా రోజు సిద్ధింపకపోయిన రోజున నిద్రలో గూడ తన్మయులమై ఆ యోచనతోనే మెలకువ వచ్చి, ఆ [illegible]యు, తత్ప్రయత్న

శేషమునే కొనసాగించుట మనమందరము చూచుచునేయున్నాము. ఇట్లొక రోజు చేసిన ప్రయత్నశేషమును మరురోజు చేయుటవంటిదే, జన్మాంతరముగూడ నైయున్నది.[1-4] యెవరికి విధింపబడిన కర్మలయందు వారు శ్రద్ధాభక్తులు గలిగి ఆచరించి పుష్కల ప్రయోజనమును అనగాజ్ఞానయోగ యోగ్యతను గాని ఉత్తరజన్మలో ఇపుడున్న వర్ణముకంటె ఉత్కృష్టజన్మనుగాని, వారి స్వధర్మాపనుష్ఠానబలమును బట్టి బొందుదురు.[5] వీరందరును తామున్నస్థితిలో నుండి అధఃపతన మొందకుండుటకున్ను అంతకంటె ఉత్కృష్ట స్థితి నొందుటకున్ను, ఈశ్వరునిచే నేర్పారుపబడిన సాధనమే "కర్మయోగము" లేక "స్వకర్మ" లేక "స్వధర్మము" యనబడును. సర్వులును ఏ బ్రహ్మవలన పుట్టుచున్నారో, ఏ బ్రహ్మ ఈ బ్రహ్మాండమంతయు వ్యాపించి యున్నదో అట్టి బ్రహ్మను తమ తమ వర్ణానురూపముగా శాస్త్రముచే విధింపబడిన కర్మయోగము నాచరించియే బొందవలయును.[6] అట్లయిన తమరున్నస్థితిలోనుంచి తక్కువస్థితిని బొందించుపాపము వీరలకుండదు. ఇట్టి స్వధర్మము ఎంత స్వల్పమైనను, గుణరహితమైనను శ్రేయస్కరమైనది. పరధర్మమెంత గొప్పదైనను, మంచిదైనను తన కెంతమాత్రము శ్రేయస్కరముగాక, పాపకరమగును.[7] అందుచే నెట్టి పరిస్థితులందును, స్వధర్మము దుష్టమైనదైనను పరిత్యజింపకూడదు. స్వధర్మములన్నియు ధూమముచే నగ్నివలె త్రిగుణములచే నావృతములైయున్నవి. అయినను వీరల కర్మవాసనలను బట్టి వీరలకదియే శ్రేయోదాయకమని సర్వకర్మవాసనాభిజ్ఞుడగు ఈశ్వరునిచే నియమింపబడినందున స్వధర్మము

---

(1) బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప । కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః 18-41. (2) శమో దమ స్తప శ్శౌచం క్షాంతిరార్జవ మేవ చ। జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మకర్మ స్వభావజమ్ 18-42. (3) శౌర్యం తేజోధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ । దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ 18-43. (4) కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్ । పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ 18-44. (5) స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు 18-45. (6) యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్ । స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః 17-46. (7) శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్ । స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ 18-47.

నెవరును వదలరాదు.[1] బాగుగా ఆచరించు పరధర్మముకంటె స్వధర్మము స్వల్పమైనను మంచిది.[2] దీని నాచరించువారలు త్రిగుణాత్మకమగు ప్రకృతి విశిష్టులు కావుననే వీరల ప్రకృతిలో క్రమముగా రజస్తమస్సులుతగ్గి సత్త్వమభివృద్ధినగుటకొరకును, ఆపైని త్రిగుణాతీత పరిజ్ఞానయోగ్యత కలుగుటకొరకున్ను ఈ కర్మయోగమేర్పడెను.[3] సత్వమభివృద్ధియైనకొలదియు సుఖమభివృద్ధియగును.[4] ఇది జనోలోకపర్యంతముగాగల జీవుల అపేక్షిక సుఖమైనపుడీ సుఖమే స్వర్గమనబడును. దీనికొరకు వేదకర్మయోగమును సాధనముగా నుపదేశించెను.[5] అట్లయిన ఈ కర్మయోగము బంధహేతువగుటచే ఆచరింపదగదని తలపరాదు. ఎట్లనగా ఈశ్వరార్పణమొనర్పు యజ్ఞము అను కర్మ బంధహేతువు కాదు. మిగిలిన కర్మలన్నియు బంధహేతువులగును గాన ప్రతిజీవుడును "ఈ యజ్ఞముచే ఈ ఫలము నాకు రావలయును" అను కోరిక లేక ఆచరింపవలయును.[6] ఈ కర్మయోగము సర్వులకు నిత్యమగుటచే నవశ్యకర్తవ్యము. ఎలననగా పూర్వము ప్రజలను యజ్ఞసహితముగానే సృష్ట్యాదిలో ప్రజాపతి సృజించి వారలతో నిట్లుచెప్పెను. "ఈ యజ్ఞము మీమీ కోరికలను నెరవేర్చుటకు సాధనమగును.[7] దీనితో మీరు దేవతల నభివృద్ధినొందింపుడు. వారు మీ చక్షుశ్శ్రోత్రాదీంద్రియముల కధిష్ఠానదేవతలే. వారుమిమ్ముల వర్షాములచే నభివృద్ధినొందింతురు. ఈరీతిగా నన్యోన్యాభివృద్ధినొనర్చుకొనుచు పరమశ్రేయస్సునుపొందుడు.[8] దేవతలు మీయజ్ఞముచే సంతోషించి మీ కభీష్టములగు స్త్రీ, పశు, పుత్రాది భోగముల నిత్తురు. అనగా మీ రనుభవించు ఆహారాదికమంతయు, ఆ దేవతలు మీకిచ్చినవే. గాన అద్దానికి ప్రత్యుపకారమును వారికొనర్చక మీ

---

(1) సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్। సర్వారమ్భా హి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః 18-48. (2) శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః 3-35. (3) త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున। నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ 2-45. (4) సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత। జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత 14-9. (5) త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే। తే పుణ్య మాసాద్య సురేంద్రలోకం అశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్ 9-20. (6) యజ్ఞార్థాత్ కర్మణో౽న్యత్ర లోకో౽యం కర్మబంధనః।తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసంగ స్సమాచర 3-9. (7) సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః। అనేన ప్రసవిష్యధ్వం ఏష వో౽స్త్విష్టకామధుక్ 3-10. (8) దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః। పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ 3-11.

రనుభవించే యెడల మీరు దొంగలగుదురు.[1] గాన మీ రనుభవించు అన్నవస్త్రాది ప్రతి పదార్థమును వారల నుద్దేశించి యజ్ఞమందు వినియోగించి ఆ శేషమును మీ రనుభవించుచో మీ కెట్టి పాపములును ఉండవు. అట్లుగాక మీ రా దేవతలను మరచి మీకొరకు మాత్రమే వంటచేసికొని భుజించినచో పాపమునే భుజించినవారగుదురు. ఎట్లనగా మీ ఆహారమగు ధాన్యము కందులు, పెసలు, మినుములు, కాయకూరలు మొదలగునవి యన్నియు జీవులేగాన మీరు వాటిని హింసించుచుంటిరి, పిండిగా విసరుచుంటిరి. ఈ మొత్తమంతయు జీవహింసయే. ఇది లేకుండునట్లు మీ కాహార మేర్పడదు. గాన ఇట్టి అనివార్యమగు పాపము మీ కవశ్యము గలుగును. గాన ఈ దోషనివృత్తికొరకు మీరు తప్పక ప్రతిదినమందును యజ్ఞ మొనర్పవలయును.[2] ఈ యజ్ఞ మాచరింపనిచో ఇహపరములు రెండును లేవు.[3] మీ ఆహారము రక్తమాంస రేతః క్రమముచే జీవోత్పత్తి హేతువగును. వర్షము వలన ఈ అన్న మేర్పడును. యజ్ఞఫలమువలన వర్ష మేర్పడును. ఈ యజ్ఞఫలము ఋత్విగ్యజమానాది వ్యాపారము(కర్మ)చే నేర్పడును.[4] ఆ కర్మ వేదముచే నేర్పడును. ఆవేదము అక్షరమగు బ్రహ్మ వలన నేర్పడును. ఇట్టిక్రమముచే సర్వగతమగు బ్రహ్మ యజ్ఞమందు ప్రతిష్ఠింపబడినది.[5] ఈప్రకారము నాచే ప్రవర్తింపచేయబడిన జగచ్చక్రమునను వర్తింపనివాడు పాపజీవనుడై, ఇంద్రియలోలుడై వ్యర్థముగాజీవించువాడగును.[6] ఇట్లు సృష్ట్యాదిలో సర్వప్రజలకును అధిపతి చెప్పినందున సర్వజీవులును దీని నవశ్య మాచరించవలెను. కర్మ చేయకపోవుటకంటె చేయుట చాలా మంచిది. అకర్మకునకు దేహయాత్రగూడ సిద్ధింపదు.[7] కర్మాచరణ కాలమందు ఫలవాంఛ

---

(1) ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః। తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః 3-12. (2) యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ 3-13. (3) యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనం। నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః ? కురుసత్తమ। 4-31. (4) అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః। యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః 3-14. (5) కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం। తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ 3-15. (6) ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః। అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి 3-16. (7) నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః। శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః 3-8.

లేనివాడై సాత్వికకర్తగా నుండవలెను. (18—26) రాజసకర్తగా నుండరాదు. (18—27) తామసకర్తగా నుండరాదు. (18—28) అట్లే రాజస, తామస, దానముల నొనర్పక సాత్వికదానమొనర్పవలెను. (17—20 నుంచి 22) రాజస, తామస కర్మల నాచరింపక సాత్విక కర్మల నొనర్పవలెను. (18—23 నుంచి 25). రాజస తామస బుద్ధిని వదలి సాత్విక బుద్ధిగలిగి యుండవలెను. (18—30 నుంచి 32) రాజస తామస ధైర్యముల నవలంబింపక సాత్విక ధైర్యమును నవలంబింపవలెను. (18—33 నుంచి 35). రాజస తామసాహారములను భుజింపక సాత్వికాహారమునే భుజింపవలెను. (17-8 నుంచి 10). ఇట్లు పూర్వము సర్వకర్మ ఫలత్యాగ ప్రకరణములో చెప్పిన ధర్మముల నెల్లప్పుడు ఆచరింప గలవాడు గొప్పవాడే. ఎల్లపుడును వాటి నాచరించలేని వాడీ యజ్ఞాచరణ కాలమందైనను వాటి నాచరింపవలెను. గావుననే ఆ కాలమందెవడు జ్ఞానేంద్రియములనన్నిటిని మనస్సుచే నియమించి ఫలవాంఛలేక కర్మేంద్రియములతో కర్మనాచరించునో వాడు గొప్పవాడగును.[1] అట్లుగాక కర్మేంద్రియముల నుపసంహరించి మనస్సులో శబ్దస్పర్శాదీంద్రియ విషయములను స్మరింపుచుండువాడు మిధ్యాచారుడనబడును.[2] దేహధారు లందరును, ఆ ప్రకృతివశులే గాన తత్ప్రేరితులై ఎద్దియో యొక పనిని చేయుచునే యుందురుగాని ఒక క్షణమైనను ఎట్టి కర్మ లేక ఉదాసీనులుగా నుండలేరు.[3] అట్టి సహజమగు సర్వేంద్రియ ప్రవృత్తి ఈ జీవుడు పాపము నాచరింప నిచ్చ లేనివాడైనను వీనిని బలాత్కారముగా పాపకార్యమందు ప్రవర్తింపజేయును.[4] ఆపాపము రజోగుణముచే నేర్పడి కామ, క్రోధాదిరూపముతో జీవుని ప్రవర్తిపజేయును. గాన నదియే వీని శత్రువు.[5] ధూమముచే నగ్నివలెను, మలముచే నద్దమువలెను, మావిచే గర్భస్థశిశువువలెను. ఈ కామాదులచే జీవుడు ఆవరింపబడియున్నాడు.[6]

(1) యస్త్విన్ద్రియాణి మనసా నియ మ్యారభతే ఽర్జున । కర్మేన్ద్రియైః కర్మయోగం అసక్తః స విశిష్యతే 3-7. (2) కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్। ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యా చార స్స ఉచ్యతే 3-6. (3) న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్। కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః 3-5. (4) అథ కేన ప్రయుక్తో ఽయం పాపం చరతి పూరుషః । అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః 3-36. (5) కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః। మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ 3-37. (6) ధూమే నావ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ । యథోల్బే నావృతో గర్భః తథా తేనేద మావృతమ్ 3-38.

ఈ మూడు దృష్టాంతముల సారస్యము ఈవలనే వివరింపబడినది. కావుననే జీవుడు తన నిజరూపమగు ఆత్మను మరచి తాను జీవమాత్రుడని తలచుచున్నాడు.[1] ఇట్టి కామాదులు సకలేంద్రియములను మనస్సును, బుద్ధిని ఆశ్రయించి జీవుని ఆవరించి, మోహింపజేయును.[2] అందుచే కర్మాచరణ చేయుట అట్టిప్రకృతి నరికట్టు ప్రయత్నముమాత్రమే. ఆ కాలములోనైనను ఇంద్రియములను నియమించి పాపరూపమగు కామాదులను పోగొట్టుకొనవలయును.[3] లేనిచో సముద్రమందలి పడవను వాయువువలె వీని ఇంద్రియములు వీని నపహరించును.[4] ఇట్లాచరించువానికి క్రమముగా చిత్తశుద్ధి ఏర్పడి, కామాది పాపములు నశించి ఇంద్రియ బుద్ధ్యాదులకంటె విలక్షణమగు తన ఆత్మ గోచరించును.[5] ఈ కర్మయోగము భూమికృషివలె ఒక రోజు హెచ్చుగా ప్రారంభించి తరువాత చేయనంత మాత్రముచే నశించదు, రోగికి చేయు చికిత్సవలె హెచ్చుతగ్గులవలన ప్రత్యవాయము దీనికి లేదు. ఏ కొంచెమాచరించినను భయమను పాపమును హరించును.[6] ఈ కర్మయోగమందు ప్రజాపశుధనాది ఐహిక ఫలమునిచ్చు భాగముగూడ గలదు. దానికి కామ్యకాండయని పేరు. అందభినివేశముగలవారు దానినే గొప్పగా చెప్పుదురు. ఐహిక ఫలప్రదమగుటచే పుష్పిత వృక్షమందువలె వాటియందు త్వరగా సంకుచిత దృష్టిగలవారికి ప్రరోచన గలుగును.[7] ఆ భోగలంపటులై పూర్వముకంటెను ఎక్కువ ఆవరణగలిగి, చిత్తశుద్ధి నెన్నటికిని పొందజాలరు.[8] ఆ యా కోరికలచే స్వరూపజ్ఞానము పోయి ఆ కోరికలను నెరవేర్చుకొనుటయే ప్రధాన

---

(1) ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా । కామరూపేణ కౌంతేయః దుష్పూరే ణానలేన చ 3-39. (2) ఇంద్రియాణి మనోబుద్ధిః అస్యాధిష్ఠాన ముచ్యతే । ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ 3-40. (3) తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ । । పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్ 3-41. (4) ఇంద్రియాణాం హి చరతాం య న్మనో ఽనువిధీయతే । త దస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమి వాంభసి 2-67. (5) ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా । జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ 3-43. (6) నేహాభిక్రమ నాశో ఽస్తి ప్రత్యవాయో న విద్యతే । స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ 2-40. (7) కామాత్మానః స్వర్గపరాః జన్మ కర్మ ఫల ప్రదాం । క్రియావిశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి 2-43. (8) భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసాం । వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే 2-44.

లక్ష్యముగా పెట్టుకొని, అందుల కనువగు నియమముగలిగి ఆ దేవతలనే ఆరాధింతురు.[1] ఇట్టి వారు తామొక యాపదలోనుండి తప్పించుకొనగోరువారున్ను, ధనాది ప్రయోజనము నపేక్షించువారున్ను అయియున్నారు. జిజ్ఞాసువులుగాని, జ్ఞానులుగాని గారు. ఈ నాలుగు రకములవారు ఈశ్వరు నారాధింతురు.[2] ఇందు తమ తమ ప్రకృతిచే నియమితులై ఎవ రెవరెట్టి కామ్యసిద్ధికోరకే యే దేవత నారాధింప శ్రద్ధగలిగియుందురో ఆ శ్రద్ధను ఈశ్వరు డచంచల మొనర్చును.[3] వారా శ్రద్ధతో నా కామ్యదేవతల నారాధించి ఈశ్వరుని వల్లనే ఆ యా కామ్యఫలమును బొందెదరు.[4] ఏలననగా ఆ యా కామ్యకర్మలందలి దేవతలగు ఇంద్రవరుణాదులందరు విరాట్పురుషుని అంగదేవతలే. అనగా ఒక్కొక్క అవయవమునకు మాత్రమే ప్రభువులు. కాన వారు ఫలమివ్వలేరు. అంగియగు విరాట్పురుషుడే ఫలమివ్వ వలెను గాని ఈ కర్మలు పరిణామము నొందునది స్థూలదేహమందుగాక కారణదేహమందని లోగడ చెప్పబడినందున ఈ విరాట్పురుషుడే ఆ కారణదేహమం దీశ్వరుడనబడుచు ఫల ప్రదాత ఈశ్వరుడనబడును.[5] అందుచే ఇంద్రాది దేవతలను శ్రద్ధతో నారాధించువారు గూడ అవిధిపూర్వకముగా నీశ్వరునే ఆరాధించువారగుచున్నారు.[6] గాన వీరల్పబుద్ధిగలవా రనియు, విశాలదృష్టి లేనివారనియు ననబడెదరు. ఏలననగా వీరు సాత్వికవృత్తితో కర్మ యోగమును ఫలాభిసంధిలేక ఆచరించుచో ఈశ్వరభావము నొందగలరు. వీరల కామ్యము లన్నను ప్రకృతిలోని కర్మఫలము ననుసరించి ఎట్లయినను రాదగినవి వచ్చిపోయేతీరును. వీరట్లా రాధింపక ఒకానొక అంగదేవతను మాత్రమే ఆరాధించినందున వీరలకు వచ్చు ఫలము కొద్దికాలముమాత్రమే యుండి నశించును. ఏ దేవత నెవరారాధింతురో వారా దేవతను బొందుట న్యాయమేగదా! అట్లగుటచే దేవతల నారాధించువారీశ్వరుని బొందెదరు.[7]

---

(1) కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః। తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా 7-20. (2) చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున। ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ 7-16. (3) యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి। తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ 7-21. (4) స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే। లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ 7-22. (5) భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్। సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి 5-29. (6) యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః। తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ 9-23. (7) అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్। దేవాన్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి 7-23.

అట్లే భూత ప్రేత పిశాచాదుల నారాధించు తామసులు ఆ భూత ప్రేతాదులనే పొందెదరు. అట్లే యక్షరాక్షసాదుల నారాధించు రాజసులు ఆ యక్షాదులనే పొందెదరు.[1] వీరట్టి కామ్యములు నెరవేర్చుకొనుటకుమాత్రమే ఆ యా భిన్నదేవతల నారాధింతురు. తత్ఫలము ననుభవించుటకు మరుజన్మలో ఈ భూలోకమందు చాతుర్వర్ణ్యములలో నొకానొకరుగా జన్మింతురు.[2] కావుననే యీ కామ్యకర్మ నికృష్టమైనది. ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణబుద్ధితో నొనర్చు కర్మయోగ ముత్కృష్టమైనది.[3] ఎవరును ఉదాసీనులై అకర్మ నపేక్షింపక, కర్మఫలము నపేక్షింపక తన వర్ణమునకు విధింపబడిన నిత్యకర్మల నాచరింపవలెను.[4] ఆ కర్మవలన నెట్టిఫలమువచ్చునో యని విచారింపక ఎట్టి ఫలము వచ్చినను సమబుద్ధితో నుండి ఆచరింపవలెను.[5] అట్టి సమబుద్ధితో నుండి ఆచరించువాడు చిత్తశుద్ధి గలిగి జ్ఞానప్రాప్తి ద్వారా పుణ్యపాపముల నన్నిటిని పోగొట్టుకొనును.[6] 'ఏలననగా కర్మఫలము ఇష్టముగాని, అనిష్టముగాని, మిశ్రముగాని తిరిగి అందుకు తగిన ఒకానొక దేహముతో ననుభవింపబడును. గాన కర్మఫల మపేక్షించువాడు తిరిగి తనకు దేహసంబంధమునే కోరుచున్నట్లగును. కర్మఫలాపేక్ష లేని యెడల క్రమముగా జనన మరణాది రాహిత్యభావము నొందగలరు.[7] ఎట్లనగా ఇట్టి నిష్కామమగు నిత్యకర్మానుష్ఠానము క్రమముగా పరిపక్వము కాగా చిత్తశుద్ధి గలిగి నిత్యానిత్య వస్తువివేకము, వైరాగ్యము మొదలగు సాధనచతుష్టయ సంపద గలుగును.[8] ఎవడు తన కర్మలు, దేహోద్యారంభకములై జన్మాంతర ప్రాపకములు గాజాలవనియు, తన కా కర్మలందు ఫలాపేక్ష లేదనియు, తానే ఆత్మరూపుడనియు తలచునో,

---

(1) యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః । భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్ 9-25. (2) కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః। క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా 4-12. (3) దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ। బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః 2-49. (4) కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన। మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి 2-47. (5) యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయః సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే 2-48. (6) బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే । తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ 2-50. (7) కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః। జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్ 2-51. (8) యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి । తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ 2-52.

వానికి కర్మబంధ మెంతమాత్రమును లేదు.[1] అట్టి నిశ్చయముతోనే పూర్వకాలము ముముక్షువు లందరు కర్మయోగము నవలంబించిరి.[2] అసలు కర్మ శబ్దార్థమును, అకర్మశబ్దార్థమును పుష్కలముగా గుర్తెరిగినవారు మోక్షమునే పొందెదరుగాని అనేక విద్వాంసులు గూడ ఈ రెండుశబ్దములయొక్క తాత్పర్యమును గ్రహించలేకున్నారు.[3] స్వవర్ణానురూపముగా విధింపబడినది కర్మయనబడును. 'బ్రాహ్మణుని చంపరాదు. మాంసమును భక్షింపరాదు. సురాపాన మొనర్ప రాదు.' ఇత్యాది ప్రతిషిద్ధకర్మలు వికర్మల నబడును. ఇందేమియు నొనర్పక తూష్ణీంభావముతో నుండుట అకర్మయనబడును. ఈ మూటి యొక్క యాథాత్మ్యము అతి గంభీరమై దుర్విజ్ఞేయమైనందున తెలియదగియున్నది.,[4] చక్షురాది సకల వ్యాపారమందు ఎవడు అకర్మను చూచునో, అకర్మయందెవడు కర్మను చూచునో వాడుత్తముడు. ఎట్లనగా ఒక పనియందు ప్రవర్తించుటగాని, నివర్తించుటగాని కర్తయధీనము. సర్వక్రియా కారకాదివ్యవహారమంతయు అవిద్యారోపిత దేహాది ధర్మమేగాని, ఆత్మధర్మ మెంతమాత్రము గాదని నిశ్చయించి తానొక కర్మ నాచరించుచున్నను తాను అకర్తయగు ఆత్మమాత్రుడే ననియు, అవిద్యారూపమగు దేహము ఏమిచేసినను తానుదాసీనుడేనని తలచువాడు జీవించియున్నట్లగుపడినను ముక్తుడని తాత్పర్యము.[5] ఇట్టి పరమావధిని బొందు నుద్దేశ్యముతో కర్మయోగము నాచరింపవలయును. అట్టి పరమావధిని బొందిన జ్ఞాని ఎపుడేపని నారంభించినను అవియన్నియు ప్రారబ్ధపరిణామములనియే తలచును గాని తాను వాటియందెంత మాత్రము సక్తుడుగాడు. వాని యాత్మజ్ఞానముచే సమస్త కర్మలును నశించును.[6] అట్టివాడు నిత్యతృప్తుడై దేహములేదను నిశ్చయముతో నుండును గాన వానికి కర్మఫలాపేక్ష ఎంతమాత్రమును ఉండదు. గాని లోకదృష్టిలో మాత్రమాతడు కర్మ నాచరించుచున్నట్లుం

---

(1) న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా । ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే 4-14. (2) ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః। కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ 4-15. (3) కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర [illegible] తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ 4-16.(4) కర్మణో హ్యపి బోద్ధవ్యం [illegible] చ వికర్మణః । అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః 4-17.(5) కర్మ ణ్యకర్మ [illegible] అకర్మణి చ కర్మ యః । స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్ [illegible] (6) [illegible] వర్జే సమారమ్భాః కామ సఙ్కల్ప వర్జితాః జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త [illegible]

డును.[1] ఈ కర్మలే యజ్ఞము లనబడును.

ఈ యజ్ఞములు 1. ద్రవ్యయజ్ఞము, 2. తపోయజ్ఞము, (3) యోగయజ్ఞము (4) స్వాధ్యాయ యజ్ఞము, 5. జ్ఞానయజ్ఞము అని ఐదు విధములు. అందు ద్రవ్యయజ్ఞ మనగా దేవతల నుద్దేశించి తన ద్రవ్యమును త్యజించుట.[2] ఇదియే కర్మయోగ మనబడును. జ్ఞానయజ్ఞమన్నిటిలో గొప్పది.[3] జ్ఞానయజ్ఞమనగా దేహమను ఉపాధితో నున్న తనను నిరుపాధికుడగు సచ్చిదానంద లక్షణ బ్రహ్మగా తలచుటయే. దీని వివరణమే జ్ఞానయోగ మను నాలుగవ సాధనము.[4] ఇక యోగయజ్ఞభేదములు వివరింపబడుచున్నవి.

1. శ్రోత్రాదీంద్రియముల నన్నిటిని సంయమమను అగ్నియందు హోమ మొనర్చుట.[5]

2. శబ్దస్పర్శాది విషయముల నన్నిటిని ఇంద్రియములను అగ్నిలో హోమ మొనర్చుట.

3. సకలేంద్రియకర్మలను ఆకుంచన ప్రసారణాది ప్రాణవాయు కర్మభేదములను జ్ఞానముచే నుద్దీపింపబడిన ఆత్మసంయమ యోగాగ్నియందు హోమమొనర్చుట.[6]

4. ప్రాణాయామాభ్యాసముచే ప్రాణవృత్తిని అపానవృత్తియందును, అపానవృత్తిని ప్రాణవృత్తియందును హోమమొనర్చుట.[7]

5. ఆహారనియమము గలిగి ప్రాణాదివాయు భేదములను ప్రాణాదులందే హోమ మొనర్చుట.[8] ఇట్లొక జన్మలో నొనర్చిన ఈ యజ్ఞముల లక్ష్యము సాధకుని బుద్ధిలో

---

(1) త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః । కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్కరోతి సః 4-20. (2) ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే । స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః 4-28. (3) శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప। సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే 4-33. (4) దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే । బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి 4-25. (5) శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి । శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి 4-26. (6) సర్వా ణీన్ద్రియకర్మాణి ప్రాణ కర్మాణి చాపరే । ఆత్మ సంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే 4-27. (7) అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం త థాపరే । ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః 4-29. (8) అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి । సర్వేఽ ప్యేతే యజ్ఞవిదో యజ్ఞ క్షపిత కల్మషాః 4-30.

రూఢమైయుండి, మరుజన్మలో వాటినే ఆ లక్ష్యసిద్ధిపర్యంతము కొనసాగించును గాన ఇవియే ఆరంభ మధ్య పరిపక్వాది దశాభేదముచే అనేకవిధములగును. ఇవియే వేదమందలి కర్మసముదాయము.[1]

ఈ ఐదు యజ్ఞములును జ్ఞానయజ్ఞమునకు అంతరంగసాధనమగుటచే యోగయజ్ఞమనబడును. ఇది ధ్యానయోగమను మూడవ సాధనమందు వివరింపబడును.

ఇకను తపోయజ్ఞము (1) శారీరము, (2) వాఙ్మయము, (3) మానసము అని మూడు విధములు. అందు దేవతలను, ద్విజులను, గురువులను, ప్రాజ్ఞులగు విద్వాంసులను, పూజించుటయు. బాహ్యాభ్యంతర శౌచమును, సన్మార్గప్రవర్తనయు, బ్రహ్మచర్యమును అహింసయును శారీర తపస్సనబడును.[2] ఏ ప్రాణికిని దుఃఖకరము గానట్లు మాట్లాడుటయు, సత్యమును, ప్రియమును, హితమును పల్కుటయు, వేదాభ్యాసమును వాఙ్మయ తపస్సనబడును.[3] నిర్మలమగు మనస్సు గలిగియుండుట, సౌమ్యభావము, మౌనము, ఆత్మనిగ్రహము ఇతరులతో వ్యవహరించుకాలమందు కపటభావ ముండకుండుట ఇత్యాదులు మానసతపస్సనబడును.[4] ఇది కర్మయోగమునకు ధ్యానయోగమునకును గూడ అంగమగును. ఇందలి మానసతపస్సు జ్ఞానయోగమునకు గూడ అంగమగును. ఇక స్వాధ్యాయ యజ్ఞమనగా వేదమును గురువువద్ద నభ్యసించుట, దాని యర్థమును తెలిసికొనుట, నిరంతర మననమొనర్చుట అట్లాచరించుట ఇతరులచే నాచరింపజేయుటయే. ఇది ఈ ప్రకరణమందలి సర్వసాధనములకు సమానము. దీని ప్రస్థాన భేదములే పై సాధనములు. అందును అసుర ప్రకృతితో కర్మయోగము నభ్యసింపరాదు. దంభము, అహంకారము, కామము, రాగము ఇత్యాదులు గలిగి శాస్త్ర విహితముగాని ఘోరతప మొనర్చుట, శరీరమందలి ఇంద్రియముల నన్నింటిని కృశింపచేయుచు శరీరమందలి సర్వసాక్షియగు బ్రహ్మ చెప్పిన

(1) ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే । కర్మజా న్విద్ధి తాన్ సర్వాన్ ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే 4-32. (2) దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్ । బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే 17-14. (3) అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ । స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే 17-15. (4) మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః । భావసంశుద్ధి రిత్యేతత్ తపో మానస ముచ్యతే 17-16.

ఉపదేశమగు శాస్త్రము నుల్లంఘించువారు ఆసురనిశ్చయము గలవారని తెలియనగును.[1&2] వీరలు శాస్త్రోల్లంఘన, ఈశ్వరదూషణము అను దోషము గలవారయినందున సింహవ్యాఘ్రాది అసురయోనులందే తిరిగి జన్మింతురు.[3] మనుష్యదేహము మాత్రమే సత్కర్మాది సాధనముగాని సింహవ్యాఘ్రాది దేహము లట్టి సాధనముగానందున వారెన్ని జన్మలకైనను యింకను నికృష్ట దేహములనే బొందుచు ఈశ్వరపరిజ్ఞానము నొందలేరు.[4] ఈ ఆసురభావమే కామ క్రోధ లోభ రూపముగా సర్వకాలమందును వుండి జీవునకు అనర్థకారి యగును.[5]

అట్టి స్వభావసిద్ధ కామాదికము నరికట్టి, జీవునకు శ్రేయస్సు కలుగజేయుట కేర్పడినదే కర్మయోగమనబడును. ఎట్లనగా జాగ్రద్దశలోని ప్రతి క్షణమందును, మనస్సులో ఎద్దియో యొక వృత్తి గలిగియుండుటయు, అది కామ క్రోధ లోభ సహితమై యుండుటయు స్వభావము. ఈ కర్మయోగము ప్రభాతకాలమునుండి తిరిగి రాత్రి నిద్రించువరకు ఆ యా వర్ణమును బట్టి నియతమగు స్నాన, సంధ్యా, అగ్నిహోత్ర, బ్రహ్మయజ్ఞ, దేవతార్చన, వైశ్వదేవాదికమును, విధించుటచే దీని నాచరించువారి కా సమయమందు, కామక్రోధాది స్వాభావిక ప్రవృత్తి పోవును.[6] మరియు పామరుడు తన దేహావయవములను, సమిథలను, ఆజ్య చర్వాది యాగద్రవ్యముల నన్నిటిని, పాంచభౌతిక పదార్థములనుగా చూచుట స్వభావసిద్ధము. ఈ కర్మయోగము యాగమునాచరించువాని శిరస్సు బృహస్పతి దేవతయనియు, వాని చక్షురింద్రియము ఆదిత్యదేవత యనియు, వాని వాగింద్రియము అగ్నిదేవత యనియు, వాని ప్రాణము వాయుదేవత యనియు, వాని మనస్సు చంద్రదేవతయనియు, వాని శ్రోత్రము దిగ్దేవత యనియు, వాని శరీరము పృథివీ [అదితి] దేవత

---

(1) అశాస్త్ర విహితం ఘోరం తప్యన్తే యే తపోజనాః । దంభాహంకార సంయుక్తాః కామరాగబలాన్వితాః 17-5. (2) కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః । మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ 17-6. (3) తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ । క్షిపా మ్యజస్రమశుభాన్ ఆసురీ ష్వేవ యోనిషు 16-19. (4) ఆసురీం యోని మాపన్నాః మూఢా జన్మని జన్మ ని । మా మప్రాప్యైవ కౌన్తేయ । తతో యా న్త్యధమాం గతిమ్ 16-20. (5) త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః । కామః క్రోధ స్తథా లోభః తస్మా దేతత్త్రయం త్యజేత్ 16-21. (6) ఏతై ర్విముక్తః కౌంతేయ । తమోద్వారై స్త్రిభి ర్నరః । ఆచర త్యాత్మన శ్శ్రేయః తతో యాతి పరాంగతిమ్ 16-22.

యనియు, వాని శిరోజములు వనస్పతి దేవతలనియు, వాని శ్మశ్రులోమాదులు ఓషధీదేవతలనియు, వాని రక్తమున్ను శుక్లధాతువున్ను ఉదకదేవతయనియు, వాని బాహువు లశ్వినీ దేవతలనియు, వాని హస్తములు పూషదేవతయనియు, వాని పాదములు విష్ణుదేవతయనియు, ఈ రీతిగా కర్మయోగియొక్క సకలావయవములును ఆ యా అధిష్ఠాన దేవతలనుగా శాస్త్ర ముపదేశించినది. అధిష్ఠానదేవతలకంటె వేరుగా ఎట్టి దేహావయవమున్ను లేదు- ఇట్లు కారణముకంటె వేరుగా కార్యము లేకపోవుటయే "మిథ్య" యనబడును.

అట్లే దర్భలను ప్రజాపతి దేవతగాను పలాశ సమిధను బ్రహ్మదేవతగాను ఈ రీతిగా యజ్ఞమం దుపయోగింపబడు సర్వవస్తువులను ఆ యా దేవతగా శాస్త్రముపదేశించినది గాన ఈ కర్మయోగి పూర్వమందు స్వభావముచే నుండు రాగద్వేష కామాదిసహిత భౌతిక భావమును పోగొట్టుకొని తన దేహావయవములను, ప్రపంచము ఆ యా దేవతలనుగా చూచుట యజ్ఞాచరణ కాలమందు సిద్ధము కాగా నిరంతరాభ్యాసముచే వానికి ప్రపంచమందు దేవతాభావము స్థిరముగా నేర్పడును. తన చక్షురాదీంద్రియములందు ఆదిత్యాద్యధిష్ఠాన దేవతాదృష్టి నొందినవాడు అవశ్యము తానే విరాట్పురుషుడై తీరవలెను. ఆదిత్యుడు తనకు కన్నుగాను, అశ్వినీదేవతలు తన బాహువులుగాను, ఈ రీతిగా ఆ యా అవయవము లన్నియు ఆయా దేవతలైనపుడు తానే విరాట్పురుషుడై తీరవలెననుట యుక్తి సహమే యగుచున్నది. ఇంద్రాదిదేవతలనగా స్థూలరూపులు. వారి సూక్ష్మరూపములే బలాది శక్తులు. ఎట్లనగా,

ఇంద్రుడనగా బలశక్తి, అగ్నియనగా ఉష్ణశక్తి, ఆదిత్యుడనగా దర్శనశక్తి, వాయువనగా స్పర్శశక్తి, దిగ్దేవతలనగా శబ్దశక్తి, ఉదకదేవతలనగా రసశక్తి, పృథివీ (అదితి) దేవతయనగా గంధశక్తి. ఈ రీతిగా ఇంద్రాదులు స్థూలదేవతలుగా గ్రహింపబడినపుడు విరాట్పురుషుని అంగదేవతలగుదురు. ఈ సూక్ష్మరూపులుగా గ్రహింపబడినపుడు హిరణ్యగర్భుని అంగములనబడెదరు. (రసోహ మప్సు 7–8 పుణ్యోగంధః 7-9 బీజం మాంసర్వ 7–10 బలం బలవతాం 7–11).

ఇట్లు స్థూలదేహమం దభిమానము వీనికి వశించి యాగఫలము ననుభవించుచు [illegible] ఉత్తమజన్మ నెత్తునని తలచుటచే సూక్ష్మదేహపరిజ్ఞాన మీతనికి గలిగి యీ కర్మయోగియే

హిరణ్యగర్భు డగుచున్నాడు. కావుననే కర్మయోగములో పరమావధి యగు క్రతువునకు 'సర్వస్వార' మని పేరు. అందు యజమానియే స్వయముగా తన స్థూలదేహము నాహవనీయాగ్నిలో హుతమొనర్చుట విధింపబడినది. ఆ సర్వస్వార క్రతువులోని మాధ్యందినసవన కాలమందు ఋత్విక్కు లందరకును దక్షిణాదానమొనర్చి తృతీయ సవనమందు ఆర్భవసామము గాన మొనర్పబడుచుండగా సదోమండపమందలి ఔదుంబరీ శాఖకు దక్షిణ భాగమునుండి అహతమగు వాసస్సుచే పరివేష్టించి "ఓ ఋత్విక్కులారా నా ఈ సర్వస్వార యజ్ఞమును మీరే సమాప్తి నొందింపుడు" అని ప్రేషనిచ్చి యజమాని స్వయముగా యజ్ఞకుండమందు తన శరీరమును హోమమొనర్చుట శాస్త్రముచే విధింపబడినది. ఈ స్థూలదేహ మిట్లు హుతముకాగానే అతడే హిరణ్యగర్భుడనబడును. ఇది కర్మయోగములో నుత్కృష్టమైనది. కావున ఇట్టి క్రతువు నాచరించుటకనువగు స్థూలదేహమిథ్యాత్వ నిశ్చయమా యజమానికి సంధ్యాగ్ని హోత్రాది కర్మల నాచరించుటవలన కలుగును. ఇట్లు కర్మయోగముకూడ జగన్మిథ్యాత్వమును బోధించుచున్నది. ఈ విషయము శాస్త్రముచే మాత్రమే తెలియదగినది గాని పురుషబుద్ధితో నూహింప నలవికాదు. గాన శ్రేయోభిలాషి ఏపని ఎపుడు ఎట్లు ఏ అభిప్రాయముతో చేయవలయునను విషయమును శాస్త్రము ద్వారానే గ్రహించి అట్లే ఆచరింపవలెను.[1] శాస్త్రమును పరిత్యజించి స్వేచ్ఛగా ప్రవర్తించువా రిహపర సౌఖ్యముల నెంతమాత్రమును బొందజాలరు.[2] ఇట్లే శాస్త్రీయకర్మయందు శ్రద్ధలేక ఆచరించినను ఇహపరసౌఖ్యముండదు.[3] విశ్వాసముతో ఆచరించగా గలుగు ఫలమే శ్రద్ధయనబడి ఆ లక్ష్యము పూర్తిగా సిద్ధించువరకు ప్రయత్నము చేయించును. దాని వలన సాధకునకు ఇంద్రియ నియమనము, సర్వాత్మనా దేవతాతాత్పర్యము పెరుగుచు జ్ఞానము కలుగును.[4]

---

(1) తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ । జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి 16-24. (2) య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః । న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్ 16-23. (3) అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్। అస దిత్యుచ్యతే పార్థ ః న చ తత్ప్రేత్య నో ఇహ 17-28. (4) శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిం అచిరే ణాధిగచ్ఛతి 4-39.

ఇట్టి కర్మయోగము క్రమముగా నాచరింపబడుచుండగా నా సాధకునకు దేహావయవములం దా యా దేవతాదృష్టి దృఢమై దేహమందు మిథ్యాత్వమున్ను, ఓషధీవటు వ్రీహ్యాదులం దాయా దేవతాభావమున్ను స్థిరమై జ్ఞానయోగమున కధికారముకల్గును.[1] ఇట్టి ఉత్తమ కర్మయోగి తన ద్రవ్యములగు పత్రపుష్పఫలాదుల నన్నిటిని ఈశ్వరార్పణబుద్ధితో యజ్ఞమందు త్యజించును. దానిని ఈశ్వరుడు తప్పక గ్రహించును.[2] ఇతడు సుఖదుఃఖము లనుగాని యజ్ఞఫల లాభమునుగాని, క్లేశమునుగాని, సమానముగా చూచి స్వధర్మమందు ప్రవర్తించును.[3]

వీరు సర్వకర్మలందును తమ దేహాభిమానమును విడిచి ఎట్టికోరికలేక దేహాదికమందు అహంకార మమకారములు లేకుందురు.[4] వీరు శ్రద్ధాభక్తులు గలిగి అసూయ లేక యావజ్జీవము ఈ కర్మయోగము నాచరింపుచు, ధర్మాధర్మాది కర్మలనుండి విముక్తులగుదురు.[5] ధర్మాధర్మములవలన తదనుకూల దేహపరంపర యేర్పడి జీవుడు బద్ధుడనబడును. కాన ఈ ధర్మాధర్మము లను కర్మసమూహము బంధమనబడును.

ఈ ఉత్తమ కర్మయోగులకు ఈ బంధముండదు.[6] కావుననే కర్మయోగముచేతనే పూర్వమునుండి జనకాదు లనేకులు మోక్షము నొందిరి. అట్టివారు తాము కృతకృత్యులైనను లోకము తమ ననుసరించుట యను లోకసంగ్రహముకొరకు గూడ ఈ కర్మయోగము నాచరించుచునే యుందురు.[7] పలననగా ఉత్తము డెట్టిపని నాచరించునో లోకసామాన్యమంతయు ఆపనినే చేతురుగాన వారలకొరకైనను ఇతడు కర్మయోగము నాచరించవలెను.[8] కావుననే ఆధికారిక పురుషుడైన శ్రీకృష్ణుడు గూడ తాను సర్వేశ్వరుడై

(1) ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే । యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే 6-3. (2) పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి । త దహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః 9-26. (3) సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ । తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి 2-38. (4) మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా । నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః 3-30. (5) యే మే మత మిదం నిత్యం అనుతిష్ఠంతి మానవాః । శ్రద్ధావన్తో ఽనసూయన్తో ముచ్యంతే తేపి కర్మభిః 3-31. (6) ఏషా తే ఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు । బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి 2-39. (7) కర్మణైవ హి సంసిద్ధిం ఆస్థితా జనకాదయః । లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి 3-20. (8) యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదే వేతరో జనః । స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే 3-21.

ఎట్టి కర్తవ్యము లేనివాడైనను కర్మయోగము నాచరించెను.[1] అట్లా కృష్ణుడీ కర్మయోగము నాచరింపకున్నచో లోకమండలి మనుష్యులెవరును 'ఈశ్వరుడగు శ్రీకృష్ణుడాచరింపని కర్మయోగము మనమేల నాచరింపవలె' నను తలంపుతో నాచరింపరు.[2] దానంజేసి లోకులందరు భ్రష్టులై హానిని బొందెడివారు.[3] కాని కర్మయోగములో ప్రారంభకులు మాత్రము ఆ కర్మను ఫలాపేక్షతో నాచరింతురు. ఉత్తములన్ననో ఎట్టి ఫలాపేక్ష లేక లోకసంగ్రహముకొరకుమాత్రమే ఆచరింతురు.[4] కాన ఈ ఉత్తముడట్టి ప్రారంభకులను బెదరగొట్టరాదు. కర్మయోగ తాత్పర్యమును వారే గ్రహించునట్లు పేతు చేయవలెను.[5] వారట్లు కర్మఫలాపేక్షతో ప్రవర్తించుట వారల ప్రకృతిలోని రాజస తామస గుణప్రభావమని తలచి ఉత్తముడు వారలను చలింపజేయరాదు.[6] ఈ ఉత్తముడు తన దేహేంద్రియాదికమునకు మంచి భోగ్యములు లభించినపుడు సుఖింపడు. చెడు, భోగ్యమైనపుడు దుఃఖింపడు. తాను సర్వము బ్రహ్మయేనను దృఢనిశ్చయము గలిగి, ఆ సుఖదుఃఖములను గూడ తన స్వరూపముగా తలచును.[7] ఈ ఉత్తముడొనర్చు యాగమందు అగ్నిని బ్రహ్మగాను, హవిస్సును బ్రహ్మగాను, తనను బ్రహ్మగాను, యాగరూపక్రియను బ్రహ్మగాను ఫలమును బ్రహ్మగాను, ఇట్లు సర్వమును బ్రహ్మగా చూచును.[8] కావుననే ఈ నిష్కామకర్మయోగి సన్న్యాసి యని స్తుతింపబడుచున్నాడు. ఎవరు కర్మఫలతృష్ణ లేనివారై తన వర్ణమునకు నిత్యకర్తవ్యముగా విధింపబడిన కర్మయోగము నాచరింతురో వారు సంన్యాసులని, యోగులనియు చెప్పబడెదరు. అంతేగాని కర్మాంగములగు అగ్నులులేనివారును, తపోదానాది

---

(1) న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన । నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి 3-22. (2) యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః । మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః 3-23. (3) ఉత్సీదేయు రిమే లోకాః న కుర్యాం కర్మ చే దహం । సంకరస్య చ కర్తా స్యామ్ ఉపహన్యా మిమాః ప్రజాః 3-24. (4) సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత । కుర్యా ద్విద్వాం స్తథా సక్తః చికీర్షు ర్లోకసంగ్రహమ్ 3-25. (5) న బుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినామ్ । జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్ 3-26. (6) ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు । తా నకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవి న్న విచాలయేత్ 3-29. (7) న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియం । స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః 5-20. (8) బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం । బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మ కర్మ సమాధినా 4-24.

క్రియలు లేనివారును మాత్రమే సంన్యాసులనియు, యోగులనియు తలపరాదు.[1] వీరు కర్మఫల సంకల్పమును త్యాగమొనర్చినందున సంన్యాసులనియు, యోగాంగముగా కర్మానుష్ఠానము నొనర్చుటచే చిత్తవిక్షేపహేతువగు కర్మఫలసంకల్పమును పరిత్యజించుటచే యోగులనియు, గౌణముగా చెప్పబడుదురు. సంన్యాసమే యోగమనబడును. సర్వసంకల్పములను పరిత్యజింపనివారెవరును యోగులనబడరు. గాన తురీయాశ్రమస్థులకును, వీరికిని ఈ ఫలత్యాగమను సాధారణ ధర్మమున్నందున ఆ గుణసంబంధముచే వీరిట్లు స్తుతింపబడుచున్నారు.[2] అసలీ యజ్ఞమను స్వధర్మముయొక్క స్వరూప మొకింత విచారింపబడుచున్నది.

ప్రపంచమనగా బ్రహ్మ (1), అధ్యాత్మము (2), కర్మ (3), అధిభూతము (4), అధిదైవము (5), అధియజ్ఞము (6) అను ఆరు పదార్థముల సమూహామే. వీటి స్వరూపమును పూర్తిగా గుర్తించువారుత్తము లనబడెదరు.[3] వీటి ఆరింటి స్వరూప మిట్లు ప్రశ్నింపబడినది.[4&5] వీటికి సమాధానమేమనగా,

1. సచ్చిదానందానంతరూపమగు అక్షరపరమాత్మయే బ్రహ్మయనబడును.

2. కారణదేహామందలి వర్తమాన దేహాభాగమగు స్వభావమే అధ్యాత్మ మనబడును. ఈ విభూతులనబడు దేవతలు అసంఖ్యాకములు. ప్రారంభవిద్యార్థికి దేవతల నారాధించుటయే కర్తవ్యము. పరిపక్వవిద్యార్థుల కపుడు భగవంతుడు జిజ్ఞాసావిషయుడగును. పలననగా పైచెప్పిన విభూతులు లేని ప్రపంచములేశము గూడ లేదు. (యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి 10–16).

పై చెప్పిన సంక్షేపముగా చెప్పబడినవే. అందు ప్రతియొకటి (1) జ్ఞానశక్తివిషయము (2) ఇచ్ఛాశక్తివిషయము, (3) క్రియాశక్తివిషయము, అని మూడు విషయములచే భేదించును. ఇంతేగాక దేహాధారియొక్క ప్రవర్తనలు (1) శృంగార, (2) వీర, (3) కరుణ,

---

(1) అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః । స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః 6-1. (2) యం సన్న్యాస మితి ప్రాహుః యోగం తం విద్ధి పాణ్డవ । న హ్యసన్న్యస్త సఙ్కల్పో యోగీ భవతి కశ్చన 6-2. (3) సాధిభూ తాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః । ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః 7-30. (4) కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।। అధిభూతం చ కిం ప్రోక్తం అధిదైవం కి ముచ్యతే 8-1. (5) అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।। ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః 8-2.

(4) భయానక, (5) బీభత్స, (6) రౌద్ర, (7) హాస్య, (8) అద్భుత అను యెనిమిది వృత్తిభేదముల నొందుచుండును. ఇవియే రసములనబడును. ఇం దేయొకటియు లేనట్టి పరివర్తనయే "శాంత" రసమనబడును. గాన 33 శక్తిభేదములు, ఒక్కొక్కటి 3 విషయ భేదములు గలదియు, 8 ప్రవర్తనాభేదములు గలదియునై యుండుటచే, శ్రేఢీగణితమర్యాదన (Permutations and Combinations) నుసరించి అసంఖ్యాకములగును.[1]

(33×8×7×6×5×4×3×2×1)

ఇట్లు సర్వభూతములకు సాధారణమైయున్న పై 33 శక్తులకు బీజరూపమే భగవత్స్వరూపము. బీజము, పత్రపుష్పఫల శాఖాది భేదభిన్నమగు వృక్షమగుచుండుటయు, అట్లే వృక్షము బీజరూపములో నిమిడియుండుటయు సర్వానుభవసిద్ధమైనట్లు, పై భగవత్స్వరూపము బీజరూపము. దాని వ్యక్తరూపముపై 33 ప్రధానరూపములు. నిజముగా దాని ప్రస్తారభేదము లనంతములు. ఇవి లేకుండా ఏ ప్రపంచభాగమున్ను లేదు.[2&3]

## స్వభావము — అధ్యాత్మము

ఈ స్వభావము దేహధారులందరియందును యీ 33 క్రింద నుదహరింపబడిన శక్తుల రూపముతో ప్రకటితమగుచూ పురుషకారముచే హానివృద్ధుల నొందుచుండును.

1. బుద్ధివృత్తులన్నిటికి బీజ (మూల) శక్తి
2. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, వచన, ఆదాన, గమన, విసర్గ, ఆనంద, శక్తులు
3. తన వృత్తాంతమును ఇతరులకు తెలియకుండునట్లు గుహ్యామొనర్చుశక్తి
4. ఇతర ప్రాపంచిక వస్తువులను జయించగోరు శక్తి (అతిక్రమించుశక్తి)
5. తనకడ్డమువచ్చిన ప్రాపంచిక వస్తువులను నశింపజేయుశక్తి
6. పూర్వమనుభవించిన విషయములను స్మరించు శక్తి

(1) హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః। ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ । నాస్త్యంతో విస్తరస్య మే 10-19. (2) యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।। న తదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరాచరం 10-39. (3) నాంతో ఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।। ఏష తూద్దేశతఃప్రోక్తో విభూతేర్విస్తరో మయా 10-40.

7. తాను గ్రహించిన విషయమును మనన మొనర్చుశక్తి

8. తనస్థితిని తాను నిలువబెట్టుకొను శక్తి

9. తాను భోక్తయగుటకుగాను ఇతర ప్రపంచమును భోగ్యముగా నొనర్చుకొను ఆలోచన, ప్రయత్న, నిశ్చయముల నొనర్పగల శక్తి

10. తన యభీష్టసిద్ధికొరకు, అవసరమైనపు డితరులను మోసగించునట్టి దబాయించు నట్టి శక్తి

11. తనకు కీర్తి, ఐశ్వర్యము, వచఃప్రాగల్భ్యము, మేధ, ఓర్పు, ధైర్యముల నవ లంబింపజేయు శక్తి

12. ముందు తనకు రాబోవు ఇష్టానిష్టముల నూహించి, అందుల కనువుగా ఇష్ట సిద్ధికి, అనిష్టనివృత్తికి అనుకూలమగున ట్లాలోచించి ప్రయత్నించు శక్తి

13. తన దోషములను దాచుకొని, అవికూడ తనకు మంచిఫలముతో సమాప్తమగు నట్లును, తన గుణములు తనకు మంచి ఫలముతో సమాప్తమగునట్లును కోరి ప్రయ త్నించు శక్తి

14. తనయొక్క భూత భవిష్యత్తుల నాలోచించి, తదనుకూలముగా వర్తమానము నేర్పరుచుకొను శక్తి

15. తానభ్యసించినట్టి ఇతరులవల్ల విన్నట్టి, చూచినట్టి, ప్రతివిషయమందలి పరి జ్ఞానమును తనకనుకూలమగునట్లు మలచి తన యనుభవములోనికి మార్చుకొనగోరు శక్తి.

16. ఉన్న ప్రపంచవస్తువులలోనుండి తన భోగ్యములను ఎప్పటికప్పుడు కొత్త కొత్తవిగా తయారుచేసుకొనగల ఆలోచనా, ప్రయత్నశక్తి

17. కోరికల నెటివంటివిగా ఎట్లు ఎపుడు కోరవలెనో నిర్ణయించు శక్తి

18. తన కోరికలకు రాగల ప్రతిబంధకముల నూహించి, వాటి నివారించు నుపాయశక్తి

19. తన భాషను ప్రపంచమందు తాను వినుచున్న భాషలతో సామ్యమొనర్చి ఐక్యమొనర్చు శక్తి

20. తన యభిలాషలలో, దేనిని ముందు నడిపింపవలెనో, దేనిని ముందు నడిపించి నందువల్ల మిగిలినవి అర్థసిద్ధములగునో నిర్ణయించు శక్తి

21. తన ఇంద్రియములలో ఏది ఎపుడు ప్రబలమో, ఏది ఎపుడు దుర్బలమో విచారించి ప్రబలమయిన దాని సహాయముతో, దుర్బలమైనదానిని బలపరచగల శక్తి

22. తన యభివృద్ధిలోను, జీవనస్థితిలోను యథార్థజ్ఞానసాధనలోను, ఎన్ని భేదము లున్నవో గమనించు శక్తి

23. ఆ భేదములలో, ఎపుడేవి ప్రధానమో, ఏవి దానికి అంగములగునో నిర్ణయించు శక్తి

24. ఆ భేదములలో, దేనికి ఏది ప్రయోజకమగునో నిర్ణయించి తదనుకూలముగా దేహేంద్రియములను నడపించు శక్తి

25. ఆ భేదముల నే క్రమమున ఆచరింపవలెనో నిర్ణయించు శక్తి

26. దేశకాల వస్తుభేదములను బట్టి ఎప్పటికపుడు తన యధికారమును నిశ్చయించుకొను శక్తి

27. ఒకదేశకాల వస్తువుల విషయమందు తా నొనర్చిన నిర్ణయము మరియొక దేశకాల వస్తువులందు గూడ పట్టునా, పట్టదాయని విమర్శించు శక్తి

28. ప్రపంచమందు తా ననుభవించు విషయములనుబట్టి తన స్థితిని, ప్రయత్నమును ఊహించు శక్తి

29. తన కోరికలు, క్రియలు, విజ్ఞానములు తనకేబాధ కలిగించకుండున ట్లాలోచించు శక్తి

30. ప్రకృతిలోని శీత వాత ఆతపాదుల కనువుగా తాను ప్రవర్తించు శక్తి

31. తన తోటిమానవు లందరితో కలిసియున్న తనకు, జాతిమొత్తం క్షేమము ద్వారా తన క్షేమమెట్లుగలుగునో అట్లే పశుపక్ష్యాది సర్వభూతముల సమష్టిక్షేమము ద్వారా, తనక్షేమమెట్లు గలుగునో, ఈ రెంటిని ఆలోచించి తదనుకూలముగా తాను ప్రవర్తించు శక్తి

32. పైవాటినన్నిటిని ప్రతిక్షణమందును, ఏకీభావమొనర్చు విజ్ఞానశక్తి

33. వీటియన్నిటి సమష్టివిజ్ఞానములచే తన ప్రవర్తనను సంపిండితమొనర్పగల శక్తి

ఇవన్నియు ప్రతి దేహధారిలోను గలవు. వాటి జాతిలో (Quality) ఎట్టిభేదము లేదుగాని పరిమాణములో (Quantity) భేదమున్నది. ఈ పరిమాణమును పెంచు మహా-

యమే పురుషకారమనబడును. ఆ ఉపాయముల నుపదేశించునదే ఋగ్వేదాదిశాస్త్రము, దాని ననుసరించు పాఠ్యక్రమమే (Carricullam) కర్మయోగమనబడును.

## దేవతలు

పై కీలి శక్తిజాతులే దేవతలనబడెదరు. మనుష్య పశుపక్ష్యాది దేహేంద్రియములు మారినను. ఈ శక్తులుమాత్రము ఎట్టిమార్పు లేక సర్వసాధారణ జాతీయములై యున్నవి. కావుననే ఒక దేహధారిగాని, ఒక ద్రవ్యముగాని, గుణముగాని, క్రియగాని, ఇంకొక దేహధారితో, ద్రవ్యముతో, గుణముతో. క్రియతో సంబంధించి ఒకదానిలో నొకటి లీన మగుచున్నవి. ఇట్లు లోకవ్యవహారమందు రెండు వస్తువులుగా కన్పడువాటిని ఒకటిగా చేయు శక్తియే "దేవత" యనబడును. లోకమందు మనమందరము మనకంటె భిన్నము లగు, శబ్దస్పర్శరూపాదులను పొంది అనుభవించి మనతో వాటి నిలయమొనర్చి, మనకు వాటికి ఐక్యమొనర్చుచున్నామనుట సర్వానుభవసిద్ధమేగదా! ఈ శక్తియే "దేవత" యన బడును. (Kinetice Energy) తద్భేదములే పై కీలి. ఇవియన్నియు సచ్చిదానందరూపమగు పరమాత్మ (Potential Energy) లోని వినియోగభాగములు గాన, నివియే భగవద్విభూతు లనబడును. పదియవ యధ్యాయములోని విభూతులన్నియు నివియే.

3. ఉత్తమ మధ్యమ అధమాది దేహముల నొందించు సాధనముగా అధిదైవము నుద్దేశించి తమ తమ ద్రవ్యమును త్యాగమొనర్చుటయే కర్మయనబడును.[1]

4. ఓషధీ వనస్పతి పశు, పక్షి, మనుష్యాది జగత్తంతయు అధిభూతమనబడును.

5. ఇంద్ర, అగ్ని, ఆదిత్య, వాయు, వరుణాదు లవయవములు గాగల విరాట్పురుషుడును ఆ యా దేవతాశక్తి విశేషముల సమూహరూపుడగు హిరణ్యగర్భుడును అధిదైవ మనబడును.[2]

6. పై అధ్యాత్మము శాస్త్రీయమగు తన స్వభావముచే నేర్పడిన తన వర్ణమున కనురూపముగా విధింపబడిన కర్మను శాస్త్రీయమగు అధిభూత సాధనములతో అధిదైవ

---

(1) అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే । భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః 8.3. (2) అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్ । అధియజ్ఞో ఽహ మేవాత్ర దేహే దేహభృతాంవర । 8.4.

తము నుద్దేశించి ఈశ్వరార్పణ బుద్ధితో నెట్టి ఫలాకాంక్షయు లేక ఆచరించుటయే అధియజ్ఞ మనబడును.[1]

దీనివలన అధ్యాత్మమను స్వభావము క్రమముగా మార్పును చెందుచూ చివరకు అక్షరమగు బ్రహ్మభావము నొందును. కావుననే జ్ఞానయోగమను సాంఖ్యమును, కర్మయోగమను నీయోగమును అను ద్వివిధమగు నిష్ఠ ఈశ్వరునిచే సాధనముగా నుపదేశింపబడినది.[2] ఈ రెండును భిన్న ప్రస్థానములని అవివేకులు తలతురు గాని వివేకులు తలపరు.[3] ఇందు సాంఖ్యమును సాధనముగా గైకొన్నను, యోగమును సాధనముగా గైకొన్నను ఫలము సమానమే. ఇట్లు నిపాద్వయ తత్వమును గుర్తించినవాడే వివేకి యనబడును.[4] అధ్యాత్మము మొదలు అధియజ్ఞమువరకుగల ఐదింటిని గుర్తించుట కొనర్చు సమగ్రప్రయత్నమే యోగమనబడును. సాధకు డీ విభూతులను, యోగమును యథార్థముగా గుర్తించినపుడు కృతార్థుడగును. అపు డాతడు సిద్ధుడే. ఇక నాత డొనర్పవలసిన పని ఏమియు లేదు.[5] అపుడాతడు దేహాది సమస్తప్రపంచము, శక్తి విభూతి బీజములయొక్క ప్రస్తారమేగాన, అంతకంటె వేరుగా లేదనియు, ఆ విభూతులన్నియు భగవంతుడను బీజముయొక్క ప్రస్తారమేగాన, అంతకంటె వేరుగా లేదనియు, గాన సర్వమున్ను, తానున్ను పరమాత్మయేగాని అంతకంటె వేరైనదెద్దియు లేదను. స్థిరనిశ్చయముతో నుందురు.[6] వాని చిత్తములో ఎల్లప్పుడు ఈ విషయమననమే యుండును. ప్రాణాయామాదులచే ప్రాణనిరోధమొనర్చి సమాధిలోనుండి వాని ప్రాణము నీ నిశ్చయముతో నుంచును. ఈ నిశ్చయమునే తా నితరుల కుపదేశించును. దేహేంద్రియము లన్నిటియొక్క భోగము

---

(1) అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్। అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర॥ 8-4. (2) లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ। జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్ 3-3. (3) సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి న పండితాః। ఏకమ ప్యాస్థిత స్సమ్యక్ ఉభయో ర్విన్దతే ఫలమ్ 5-4. (4) య త్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగై రపి గమ్యతే॥ ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి 5-5. (5) ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః। సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః 10-7. (6) అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే। ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః 10-8.

వాని కీ యొక్కవిషయముపైనే యుండును.[1] అట్టి వారికి వర్తమానదేహేంద్రియాదు లున్నంతవరకు, ఆ స్థిరనిశ్చయమునే భగవంతుడు ఉండునట్లు కాపాడును. అట్లు దేహ పతనపర్యంతము వారా స్థితిలో నున్నందున ఈ తర్వాతగూడ నా స్థితిలోనే యుందురు.[2] ఆ స్థిరనిశ్చయము వారికి కలుగునంతవరకు గల వారి పూర్వపుణ్యపాపములు మూడు రకములున్నా వారి బుద్ధి ఇంద్రియ ప్రాణముల నాశ్రయించియే యుండును గాన, ఇప్పు డాతని బుద్ధి ఇంద్రియ, ప్రాణములన్నియు భగవజ్జ్ఞానరూపములే గాన ఆ జ్ఞానముచే నవియన్నియు నశించును.[3]

ఇట్టి సర్వోత్కృష్టమైనది గావుననే ఈ స్వధర్మ మనబడు కర్మయోగము నాచరింపని వారల కిట్లు దోషము తెలియబడుచున్నది. స్వధర్మపరిత్యాగులు పాపమునొంది అపకీర్తి పాలగుదురు.[4] అపకీర్తికంటె మరణమే మేలయినది. మరణముకంటెగూడ అపకీర్తి హాని కరమయినది.[5] క్షత్రియునకు ధర్మముకొరకేర్పడిన యుద్ధమందు పాల్గొనుటకంటె గొప్ప శ్రేయస్సాధన మింకొకటి లేదు.[6] వీరలచే ప్రార్థింపబడకయే తలుపులు తెరవబడిన ద్వారము గల స్వర్గలోక మీ స్వధర్మానుష్ఠాతలకు సిద్ధముగా నుండును.[7] ఇదివరకు గొప్పవాడుగా తలపబడుచున్నను స్వధర్మపరిత్యాగ మొనర్చినవానిని భయగ్రస్తునిగాను, అలసునిగాను లోకులు తలచుటయేగాక శత్రువు లనేకవిధములుగా నీతని నిందింతురు. ఇట్లు ఇహలోక నిందను పొందును.[8] కాన ఫలాపేక్షలేక స్వధర్మము నాచరించినవాడు ఇహమందును పరమం దునుకూడ సుఖమునేపొందునుగాన ప్రతివాడునుస్వవర్ణమునకు అనురూపముగా శాస్త్రముచే

(1) మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయంతః పరస్పరమ్ । కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ 10-9. (2) తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ । దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే 10-10. (3) తేషా మే వానుకంపార్థం అహ మజ్ఞానజం తమః నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా 10-11. (4) అథచే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి 2-33. (5) అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తే ఽవ్యయామ్ । సంభావితస్య చాకీర్తిః మరణాదతిరిచ్యతే 2-34. (6) స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి । ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయో ఽన్యత్ క్షత్రియస్య న విద్యతే 2-31. (7) యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్ । సుఖినః క్షత్రియాః పార్థ । లభన్తే యుద్ధ మీదృశమ్ 2-32. (8) అవాచ్యవాదాం శ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః । నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ? 2-36.

విధింపబడిన కర్మయోగమును ఫలాపేక్ష లేక తప్పక ఆచరింపవలెను.[1] ఇట్లాచరింపగా వారే ఇంద్రియములతో యేపని చేయుచున్నను ఆహారము భుజించుచున్నను, యెట్టి హోమ మొనర్చుచున్నను, యెవరికి యెట్టి దానమొనర్చుచున్నను యెట్టి శారీర మానసిక వాఙ్మయతప మాచరించుచున్నను ఈశ్వరార్పణబుద్ధి స్థిరముగా నుండును.[2] ఇట్టివాడు జ్ఞాన ధ్యానయోగములను గూడ ఆచరింప నర్హుడగును. గాన ముందు ధ్యానయోగము అను ఉపాసన వివరింపబడుచున్నది.

## సింహావలోకనము

ఇందు జీవు డొక జన్మలో చేయు మంచి, చెడు పనులు వాని దేహేంద్రియ మనః ప్రాణముల నాశ్రియించి యుండి, వాడొనర్చు క్రియలకు సాధనములై ముందు కాలమున జన్మాంతరీయ దేహేంద్రియ మనఃప్రాణములను ఫలరూపములగుననియు, దానినిబట్టియే బ్రాహ్మణాది వర్ణములందు జన్మింతురనియు, అచట పూర్వజన్మకర్మ ఫలముల ననుభవించు సమయములోనే ఉత్తర జన్మసాధనములగు పనుల నాచరింతురనియు, గావున ప్రతివాడును తన వర్ణమునకు శాస్త్రముచే విధింపబడిన "కర్మ"నే ఆచరింపవలెననియు, అట్లయిన వాడుత్తమగతి నొందుననియు, ఆ పనులుగూడ తానెట్టి ఫలమును అపేక్షింపక, ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరింపుట ఇంకను ఉత్తమగతి సాధనమగుననియు. ఈకర్మ తాననుభవించు ఆహార, జల, వాయ్వాదులకు ప్రత్యుపకారరూపమై, తన విధినిర్వహణమేగాని, తా నితరుల కొనర్చు మహోపకారము గానేరదనియు, ఈకర్మ నాచరింపనివాడు దొంగ, కృతఘ్నుడు అగుచూ క్రమముగా ఆ నేరముల కనువగు శిక్ష ననుభవింపక తప్పదనియు, ఆ శిక్షలే కామక్రోధాద్యుద్రేకమనియు, దీని నుపేక్షించినచో, పశుపక్ష్యాది హీనజన్మలు సంభవించుననియు— కర్మారాధ్యుడగు ఈశ్వరుడు తన విభూతులను దేవతల ద్వారా మనకందరకు, సర్వదా అనుభూయమానముజేయుననియు, మన చక్షురాదీంద్రియ శక్తుల మూలమే దేవతలనియు, వారి నారాధించుటయే యజ్ఞమనబడుననియు, ఆ యజ్ఞము ద్రవ్య, తపో, యోగ, స్వాధ్యాయ, జ్ఞానాది భేదములతో నొప్పి అధికారానురూపముగా ఆచరింపబడి సాధకుని ఉత్తమజీవునిగా నొనర్చుననియు వివరింపబడినది.

---

(1) హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ । తస్మా దుత్తిష్ఠ కౌన్తేయః యుద్ధాయ కృతనిశ్చయః 2-37. (2) యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్। యత్తపస్యసి కౌంతేయః తత్కురుష్వ మదర్పణం 9-27.

శ్రీ

# గీతాసారసంగ్రహము

## 7. ఉపాసనా ప్రకరణము



ఇం దుపాసన, ధ్యానము, చింతనము, భావన, యోగము అనునవి పర్యాయపదములుగా వాడఁబడినవి. ఈ ఉపాసన 1. అవతారోపాసన, 2. అంగదేవతోపాసన, 3. విరాడుపాసన, 4. హిరణ్యగర్భోపాసన. 5. ఈశ్వరోపాసన, 6. బ్రహ్మోపాసన లేక అక్షరోపాసన యని ఆరు విధములుగా అధికారి భేదముచే బోధింపబడినది. వీటి స్వరూపము లన్నియు క్రమముగా వివరింపబడుచున్నవి.

1. అవతారములు : వ్యష్టి దేహాభిమానులగు జీవులు అవిద్యాకే వశులై యుండుదనియు, సమష్టిదేహాభిమానులగు విరాట్, హిరణ్యగర్భ ఈశ్వరులు, మాయ యనఁబడు తమ ప్రకృతినే తమ వశమం దుంచుకొందురనియు లోగడ చెప్పబడినది. ఈశ్వరుఁడు లోకమందు అశాస్త్రీయ ప్రవర్తకులను నశింపచేయుటకును, శాస్త్రీయ మార్గ ప్రవర్తనులను సంరక్షించుటకును, వేదోక్త ధర్మమును సుస్థిర మొనర్చుటకును ఆ యా అవసర దేశకాలము లందు జన్మించిన వానివలె నగుపడి పై కార్యములను నెరవేర్చును.[1] కేవల పురుష బుద్ధి గోచరములగు యుక్తులతో వేదార్థమును త్రోసిపుచ్చి, తమ తమ ఇచ్ఛానుసారముగా ఒక్కొక దర్శనమును కల్పించి అట్లాచరింపువారలను ప్రచారముచే సంపాదించి ఒక్కొక మతమును ఏర్పరచుటయే ధర్మగ్లాని యనియు, అధర్మాభ్యుత్థానమనియు చెప్పబడును. ఈ వేదవిరుద్ధమతము లనగా సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, బౌద్ధ, జైన, పాశుపత, పాంచరాత్రాది దర్శనములే. ఇట్టి ధర్మ గ్లానియు, అధర్మాభ్యుత్థానమును కలిగినపుడెల్ల

(1) పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ । ధర్మ సంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే 4-8.

ఈశ్వరుడవతరించును.[1] ఈ అవతారములే ఆధికారిక పురుషులని గూడ యనబడును. వాస్తవముచే నీఈశ్వరుడు జన్మాది వికారములులేని ఆత్మయైనను, సర్వభూతములకు ఈశ్వరుడైనను, తనకంటె వేరుగాని తన ప్రకృతిని వశమందుంచుకొని, మాయచే పుట్టినవానివలె నుండి వ్యవహరించి ఆ ధర్మగ్లానిని తొలగించి వైదిక ధర్మమును సుస్థిర మొనర్చును.[2] వీరెన్ని పర్యాయము లవతరించినను వీరి సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, నిత్యతృప్తత్వ, అనాది బోధత్వ, అలుప్తశక్తిత్వ, స్వతంత్రత్వ, అనంతత్వాదికమునకు ఎట్టి హానియు వుండదు.[3]

సర్వకర్మ ఫలత్యాగ ప్రకరణమందు చెప్పబడిన లక్షణము లన్నియుగాని, కొన్నిగాని ఉన్నవారీ ఉపాసనచేయ నర్హులు. ఈ ఉపాసన కర్మయోగముతో కలిపి అనుష్ఠింపవచ్చును. లేక ప్రత్యేకముగానైనను అనుష్ఠింపవచ్చును.

## ఉపాసన

ఉపాసన యనగా (ఉప + ఆసన) ధ్యేయవస్తు సమీపమందుండుట. ఇందు ప్రథమమందు ఇంద్రియ నిగ్రహము ముఖ్యావసరమైనది. శ్రోత్రాది ఇంద్రియములు స్వభావముచే శబ్దాది విషయములపై ప్రసరించుచుండును. వాటితోగూడ వీని మనస్సును గూడ ప్రసరింపనిచ్చినచో సముద్రమందలి నావను వాయువు హరించునట్లు వీని ప్రజ్ఞను హరించును.[4] ఈ సాధకుడా ఇంద్రియములను ఆ యా విషయములపై ప్రసరింపనీయక ఎట్టి విషయములందును రాగములేక ధ్యేయవస్తువునందు మాత్రమే చిత్తము నుంచవలెను.[5] అనేక జన్మసంచిత వాసనాబలముచే నా ఇంద్రియములు వీని మనస్సును బాహ్యవిషయములపైకి రాగమును కలుగజేయుటద్వారా ఆకర్షింపజేయుచుండును. ఈ సాధకుడట్టి రాగమును నిగ్రహించవలెను.[6] ధ్యేయవస్తువు నందలి అభినివేశము హెచ్చుగా నుంచుటచేత

(1) యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత । అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజా మ్యహమ్ 4-7. (2) అజో ఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరో ఽపి సన్ । ప్రకృతిం స్వా మధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా 4-6. (3) వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున । భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన 7-26. (4) ఇంద్రియాణాం హి చరతాం య న్మనో ఽనువిధీయతే । త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావమి వామ్భసి 2-67. (5) విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః । రసవర్జం రసో ఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే 2-59. (6) యతతో హ్యపి కౌన్తేయ । పురుషస్య విపశ్చితః । ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః 2-60.

మాత్రమే ఈ ఇంద్రియములు వీనికి స్వాధీనమైయుండును.[1] అట్లుగాక వీని కా ఇంద్రియ విషయములందు రాగమే యున్నయెడల వీడు సంగ, కామ, క్రోధ, సంమోహ, స్మృతి, విభ్రమ, బుద్ధి, నాశాది క్రమముగా నశించుననగా బద్ధుడగును.[2&3] అట్టి రాగద్వేషాదికము లేనిచో మనస్సు నిర్మలమగును.[4] అపుడు వీనికి సుఖాభాసగా నుండి దుఃఖకరములగు విషయము లన్నియు తొలగుటచే ధ్యేయవస్తువందు బుద్ధి స్థిరముగా నుండును.[5]

1. ఇట్లు శబ్దాదివిషయములను, హోమద్రవ్యముగా భావించి, శ్రోత్రాదీంద్రియముల నగ్నులుగా భావించి, ఈ అగ్నియందు ద్రవ్యమును హోమమొనర్చినట్లు భావించుట.

2. శ్రోత్రాదీంద్రియములను హోమద్రవ్యముగా భావించి, సంయమము నగ్నిగా భావించి, ఈ అగ్నియందా ద్రవ్యమును హోమమొనర్చినట్లు భావించుట.

3. కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ ప్రాణాదికర్మ సమూహమునంతను హోమద్రవ్యముగా భావించి, ఆత్మసంయమము నగ్నిగా భావించి, ఈ యగ్నియందా ద్రవ్యమును హోమమొనర్చినట్లు భావించుట.

4. అపానము నగ్నిగాను, ప్రాణమును హావిస్సుగాను, భావించి యీ అగ్నియందాహావిస్సును హుతమొనర్చినట్లు భావించుట.

5. ప్రాణము నగ్నిగాను, అపానమును హావిస్సుగాను భావించి ఈ అగ్నియందాహావిస్సును హుతమొనర్చినయట్లు భావించుట.

6. ఆహార నియమముతో నుండి, ప్రాణాపాన వ్యానోదాన సమానములను పంచ వాయువృత్తులను హావిస్సుగాను, అగ్నిగాను భావించి, ఒక వాయువను నగ్నియందు ఇంకొకవాయువను హావిస్సును హుతమొనర్చినట్లు భావించుట యను కర్మయోగ ప్రక్రి

(1) తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః । వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా 2-61. (2) ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తే షూపజాయతే । సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధో ఽభిజాయతే 2-62. (3) క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః । స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి 2-63. (4) రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్ । ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి 2-64. (5) ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోపజాయతే । ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే 2-65.

రణమందు చెప్పబడిన యజ్ఞభేదములన్నియు ఈ ఉపాసనావిశేషములున్ను, ఇంద్రియజయ సాధనములున్ను యగుచున్నవి. (4-26 నుంచి 30 వరకు) ఇట్టివాడు ఎట్టికోరికలు లేని వాడై, ఎట్టి భోగ్యవస్తువును పరిగ్రహింపక నిర్జనప్రదేశమందుండి మనస్సుతోగూడ భోగ్యము కల్పించక ఆత్మస్వరూపమును నిరంతరముగా భావించుచుండును.

ఈ చిత్తస్థైర్యము లేనివాడు, భావనను లేక ఉపాసనను చేయలేడు. అపుడు ఇంద్రియములయొక్క విషయతృష్ణ శమింపదు గాన వీనికి సుఖముండదు గాన సర్వానర్థమూల మీ ఇంద్రియ ప్రవృత్త్యనురాగమే.[1] కావున ఉపాసకునకు మున్ముందు ఇంద్రియనిగ్రహమే శ్రేయస్సాధనము.[2] ధ్యేయవస్తువునందు స్థిరాభినివేశముచే ఇంద్రియ జయము గలుగును. ఇంద్రియజయముచే ధ్యేయముమంచు స్థైర్యమేర్పడును.[3] ఈ శరీరము నశించులోగా తన ఇంద్రియములందలి కామ క్రోధాది వేగమును తగ్గించుటకు ప్రయత్నమొనర్చుచూ, పూర్తిగా వాటిని జయించుటయే ఉపాసన యనబడును.[4] నిశ్శేషముగా కామాదులు నశించగా ధ్యేయవస్తువే తానై పోవును. ఇదియే ఈ ధ్యానయోగమునకు పరమావధి యనబడును.[5] అపుడు వీరలకు పూర్తిగా కల్మషము నశించి, సర్వభూతములందు హితభావమేర్పడి క్రమముగా ఈతడే సర్వమై బ్రహ్మభావమునొందును.[6]

అందుకు సాధనమేమనగా బాహ్యమందలి శబ్దస్పర్శాదులను తన మనస్సులోనికి రానీయక దృష్టిని భ్రూమధ్యమం దుంచి ప్రాణాపానములను రెండింటిని సమానముగా నాసికాభ్యంతరమందుంచి అంతరింద్రియ బహిరింద్రియములను నిగ్రహించి కామ క్రోధములు లేక సర్వలోకాధిపతియు, సమస్తయజ్ఞ తపోదానాదులకు ఫలప్రదాతయు, దేవతయు, భోక్తయు, సర్వజీవ హృదయములందును ఉండి సర్వదేహ వ్యాపారములకు

---

(1) నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా । న చాభావయత శ్శాంతిః అశాంతస్య కుత స్సుఖమ్ ॥ 2-66. (2) తస్మా ద్యస్య మహాబాహో। నిగృహీతాని సర్వశః । ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా 2-68. (3) తస్మా త్సర్వేషుకాలేషు మా మనుస్మర యుధ్యచ।మయ్యర్పిత మనో బుద్ధిః మామే వైష్య స్యసంశయమ్ 8-7. (4) శక్నో తీహైవ య స్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ । కామ క్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః 5-23. (5) కామ క్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్ । అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్ 5-26. (6) లభన్తే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకల్మషాః । ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః 5-25.

సాక్షియు అగు ఈశ్వరుని ధ్యానించవలెను. అనగా, ఆ సమయమందు తన దేహముగాని, జగత్తుగాని, ధ్యానరూపమగు క్రియగాని భాసింపక ధ్యేయుడగు ఈశ్వరుడు మాత్రమే గోచరమగునట్టి స్థితి నొందుటయే ఉపాసన యనబడును.[1 to 3] ఫలాపేక్ష లేని కర్మయోగా నుష్ఠానముచే నిట్టి యోగ్యత కలుగును. దీనికి పరమావధి యేమనగా ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులందున్ను నిత్య నైమిత్తిక కామ్య ప్రతిషిద్ధ కర్మలందును కర్తృత్వాబుద్ధి లేకుండ ఐహికాముష్మిక ఫలభోగమునందు వైరాగ్యము నొందుటయే. ఇట్టివాడే యోగారూఢు డనబడును.[4] నిత్యకర్మలనగా తమ తమ వర్ణములకు యావజ్జీవము కర్తవ్యములుగా శాస్త్రముచే విధింపబడిన కర్మలు. పుత్రుడు జన్మించుటయను నిమిత్తము గలిగినప్పు డాచరింపవలసిన వైశ్వానర ద్వాదశకపాలయాగము ఇత్యాదులు నైమిత్తికకర్మ లనబడును. వర్షకాముడున్నపుడు కారీరేష్టి నాచరించుట మొదలగునవి కామ్యకర్మ లనబడును. బ్రాహ్మణుని చంపరాదు, అబద్ధమాడరాదు, ఇత్యాదులు ప్రతిషిద్ధ కర్మలనబడును.

ఇట్టి సాధకుడు శుద్ధమైనట్టియు, స్వభావముచే గాని, సంస్కారముచే గాని వివిక్తమైనట్టియు ప్రదేశమందు ఎక్కువ యెత్తు గానట్టియు, ఎక్కువ నీచము గానట్టియు, ఆసనస్థానమందు కుశలను, కృష్ణాజినాదులను, వస్త్రమును క్రమముగా నొకదానిపై మరి యొకటి యుంచి అచట స్థిరముగా పద్మాసనాదులలో ఒకానొక ఆసన విశేషమును ధరించి[5] కూర్చొని అంతరింద్రియ బహిరింద్రియ వ్యాపారములు లేక ఏకాగ్ర మనస్సుతో నుండి[6] కాయమును, శిరస్సును, మెడను సమముగాను అచలముగాను ధరించి దృష్టిని దశదిక్కులందును ప్రసరింపనీయక, స్వనాసికాగ్రమును చూచునట్లుంచి[7] నిర్మలాంతః కరణ

(1) స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాన్ చక్షు శ్చైవా న్తరే భ్రువోః । ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ 5-27. (2) యతేంద్రియ మనోబుద్ధిః ముని ర్మోక్షపరాయణః । విగతేచ్ఛాభయ క్రోధో య స్సదా ముక్త ఏవ సః 5-28. (3) భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్ । సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి 5-29. (4) యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే । సర్వసఙ్కల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే 6-4. (5) శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః । నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్ 6-11. (6) తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః । ఉపవిశ్యాసనే యుఞ్జ్యాత్ యోగ మాత్మవిశుద్ధయే 6-12. (7) సమం కాయ శిరో గ్రీవం ధారయ న్నచలం స్థిరః। సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్ 6-13.

గలిగి భయమునొందక భిక్షాగురు శుశ్రూషాది బ్రహ్మచారి వ్రతము నాశ్రయించి ధ్యేయవస్తువును ధ్యానించవలెను.[1] అధికముగా భుజించువానికిని, అత్యల్పముగా భుజింపువానికిని, అధిక నిద్ర గలవానికిని యెల్లపుడు మేల్కొనియుండువానికిని ఈ ధ్యానము కుదరదు.[2] ఉదరములో సగభాగమునకు సరిపోవు పరిమాణము మాత్రము సవ్యంజనమగుఅన్నముతోను, నాలుగవ వంతును ఉదకముతోనునింపి మిగిలిన నాలుగవభాగమును వాయుసంచారార్థము శేషింపచేయబడునట్లు సాత్త్వికాహారమును భుజించి అది సర్దుకొనునట్లు శతపదములు విహరించి సర్వకర్మలందును తగుమాత్రముగా ప్రవర్తించుచు ఏసమయమం దేకర్మ చేయవలెనో ఆ పని నాకాలమందు మాత్రమే యొనర్చుచు జాగ్రత్స్వప్నములు రెండును స్వాధీనమందుంచుకొనువానికీ యోగము ఫలప్రదమగును.[3] వారు ప్రతి దేహచేష్టయు, ఈశ్వరప్రేరణాజనితమేగాన ఈశ్వరరూపమనియు, తదారాధనమే తన దేహవ్యాపారమనియు భావించి తమను నిరంతరము ఈశ్వరసన్నిధిలో నున్నట్లు తలతురు.[4]

ఆ యా ఇంద్రియ విషయక కామములు గలుగుచుండగా వానిని మనస్సులోనే నియమించవలెను.[5] స్వభావ చంచలమగు మనస్సు ఆ యా విషయములపైకి ప్రసరింపుచుండ వెంటనే దానిని నిగ్రహించి ధ్యేయవస్తువునందు లయింపజేయవలెను.[6] ఈ మనస్సును నెమ్మదిగాను, క్రమముగాను ధైర్యముతో నిగ్రహించి ధ్యేయ వస్తువునందు బంధింపవలెను.[7] ఎట్టి స్వల్పమగు గాలి గూడ లేని ప్రదేశమందలి దీప మెట్లు నిశ్చలముగానుండునో అట్లే

(1) ప్రశాన్తాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః । మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః 6-14. (2) నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాన్త మనశ్నతః। న చాతిస్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున: 6-16. (3) యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు । యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా 6-17. (4) యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః। అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే 12-6. (5) సఙ్కల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః । మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః 5-24. (6) యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరం । తత స్తతో నియ మ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్. 6-26. (7) శనై శ్శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా। ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చి దపి చిన్తయేత్. 6-25.

సాధకుని చిత్తము నిశ్చలముగా ధ్యేయవస్తువునందు లీనముకావలెను.[1] అప్పుడాతనిచిత్తమే లేకుండును గాన తద్ధర్మములగు కామాదులేవియు నుండవు గాన నప్పుడాతడు యుక్తుడన బడును.[2] పామరులకు యోగ మసాధ్యము. వాయువును చేతిలో పట్టుకొనుటవలె స్వభావ చంచలమగు మనస్సును నిగ్రహించుట అతిదుష్కరము.[3&4] కాని వివేకి ప్రపంచమందు వైరాగ్యము నొంది క్రమముగా అభ్యాసపాటవముచేత మనస్సును నిగ్రహించును.[5] ఇట్లభ్యాసవైరాగ్యములచే అంతఃకరణనియమము గలవానికి ధ్యానయోగము సుసాధ్య మున్ను, అది లేనివానికి దుస్సాధ్యమున్ను అగును.[6] ఇట్లు సర్వేంద్రియ ద్వారములను నియమించి, మనస్సునుగూడ నిష్ప్రచార మొనర్చి, హృదయమునుండి ఊర్ధ్వముగా నుండు సుషుమ్నానాడియందు ప్రాణశక్తిని కేంద్రీకరింపచేసి ధ్యేయవస్తువును ధ్యానిం పుచు, ప్రణవము పలుకుచు దేహమును అవసానకాలమందు త్యజింపవలెను.[7&8] ఇందు ప్రణవము నాశరహితమైనదిన్ని, సర్వవేదసారమున్ను పరబ్రహ్మాయు, అపరబ్రహ్మాయు నగుటచే వీతరాగులగు యతులచే సర్వదా ఉపాసింపబడుటచే, ఉపాసన లన్నిటిలో ప్రణవోపాసన శ్రేష్ఠమైనది.[9] ఇట్లు ధ్యానించుట ఒకరోజు చేసినంతమాత్రముచే సిద్ధింపదు. శరీరపతనపర్యంత మొనర్చుచునే యుండవలెను. సర్వకాల సర్వావస్థలందును, సర్వాత్మనా

(1) యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా । యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగ మాత్మనః 6-19. (2) యదా వినియతం చిత్తం ఆత్మన్యే వావతిష్ఠతే । నిస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా 6-18. (3) యోఽయం యోగ స్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన । ఏత స్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్ 6-33. (4) చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢం । తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ 6-34. (5) అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం । అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే 6-35. (6) అసంయ తాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః । వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః 6-36. (7) సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ । మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణం ఆస్థితో యోగ ధారణామ్ 8-12. (8) ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్ । యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్ 8-13. (9) యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే 8-11.

ఈశ్వరుని ధ్యానించుచునే యుండవలెను.[1] ఏలననగా మరణకాలమందు దేవ డెట్టి చిత్తవృత్తి గలిగియుండునో వాని కట్టిఫలమే వచ్చును. అనగా ఆ కాలమందు దీశ్వర విషయకమగు చిత్తవృత్తిగలవాడు మరుజన్మలో ఈశ్వరుడేయగును. కుక్కవిషయక చిత్తవృత్తిగలవాడు కుక్కయేయై పుట్టును. కావున మరణకాలమందు దీశ్వరోపాసనయే చేయుచుండవలెను.[2,3] అట్టి మరణకాల మెపుడువచ్చునో తెలియదు గాన ఏ క్షణమందైనను మరణము రాదగి యున్నందున సర్వకాలములందును ఈశ్వరోపాసనను అనన్యచిత్తుడై చేయవలెను. వాని కీశ్వరుడు సులభుడగును.[4]

జనులలో అసురప్రకృతి గలవా రీశ్వరతత్వ మెరుగజాలక ఆయనగూడ మనుష్య దేహధారియే నని తలచి అవివేకులై అవతారములను ధ్యానింపరు.[5] అట్టి మూఢులు అవతారములను ఒకప్పుడు లేక, ఒకప్పుడు జన్మించి, మరియొకప్పుడు నశించు సామాన్య మానవునిగానే తలతురు గాని అవతారతత్వ మీశ్వరభావమేననియు, దానికి జన్మాదులు లేవనియు గుర్తింపలేరు.[6] వారిట్లు తలచుటకు కారణము ఈశ్వరుడు యోగమాయా సమావృతుడై యుండుటయే.[7] వారు అవివేకులనబడెదరు.[8] అవతారముల తత్వము నెరుగు వారును, వారి నారాధించువారును ఉత్తము లనబడుదురు. వారు గొప్ప శ్రేయస్సును

---

(1) తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ। మయ్యర్పిత మనో బుద్ధిః మా మేవైష్య స్యసంశయమ్. 8-7. (2) అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం। యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః 8-5. (3) యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరమ్। తం త మేవైతి కౌంతేయ। సదా తద్భావ భావితః 8-6. (4) అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః। తస్యాహం సులభః పార్థ। నిత్యయుక్తస్య యోగినః 8-14. (5) అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్। పరం భావ మజానంతో మమ భూత మహేశ్వరమ్ 9-11. (6) అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః। పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్ 7-24. (7) నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః। మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్ 7-25. (8) మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః। రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః 9-12.

పొందెదరు.[1] దైవీప్రకృతి కలవారు ఏకాగ్రచిత్తముచే ఈశ్వరుని ధ్యానించుచు ఈశ్వర తత్వము నెరిగి అనన్య మనస్కులై[2] ఈశ్వరుని వేదవాక్కులచే స్తుతింపుచు ఇంద్రియోప సంహార శమదమాహింసాదులు గలిగి దృఢవ్రతులై తమ చిత్తమునకు సర్వకాలమందును ఈశ్వరునే విషయమొనర్చి ఉపాసింతురు.[3] వీరుత్కృష్టమగు శ్రద్ధతో ఎల్లప్పుడు పరమేశ్వరునియందే మనస్సును నిశ్చలముగా నుంచి ఉపాసింతురు.[4]

ఇట్లుపాసనా సామాన్యముయొక్క స్వరూపము వివరింపబడినది.

1. అందు ధ్యేయము అవతారమైనపు డదియే అవతారోపాసన యనబడును.

2. ధ్యేయము, ఇంద్ర, వరుణ, ఆదిత్యాది అంగదేవతలయినపు డదియే అంగదేవతోపాసన యనబడును. ఆ యా ఐహిక సుఖకామనల నెరవేరుటకొరకు కొందరీ అంగదేవతోపాసన చేతురు.[5] ఎవరెట్టి దేవతలను శ్రద్ధతో నుపాసింతురో వారి శ్రద్ధను ఈశ్వరుడు అట్లే బలపరచును.[6] వారట్టి శ్రద్ధతో గూడి ఆ అంగదేవతోపాసననే చేతురు గాని అట్టి వారలకు ఫలమిచ్చు వాడీశ్వరుడేగాని అంగదేవతలు గారు. ఏలననగా ఈ అంగదేవతలు ఈశ్వరుని భృత్యులు. గావుననే పరమేశ్వరుని భయముచే సూర్య, వాయు, అగ్ని, ఇంద్ర, మృత్యువు లను దేవతలందరు తమ తమ వ్యాపారముల నొనర్చుచున్నారు.[7] అందుచే నీ యంగదేవతోపాసకులు ఈశ్వరుని అవిధిగా నుపాసించువారలుగా పరిగణింపబడుదురు.[8]

---

(1) జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః । త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున 4-9. (2) మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః । భజన్త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ 9-13. (3) సతతం కీర్తయంతో మాం యతంత శ్చ దృఢవ్రతాః । నమస్యంత శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే 9-14. (4) మ య్యావేశ్య మనో యే మాం నిత్య యుక్తా ఉపాసతే । శ్రద్ధయా పర యోపేతాః తే మే యుక్తతమా మతాః 12-2. (5) కామై స్తైస్తై ర్హృత జ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః । తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా 7-20. (6) యోయో యాం యాం తనుం భక్తః శ్రద్ధ యార్చితు మిచ్ఛతి । తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్ 7-21. (7) స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే । లభతే చ తతః కామాన్ మయైవ విహితా న్హి తాన్ 7-22. (8) యే ప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః । తేఽపి మామేవ కౌంతేయ యజం త్యవిధిపూర్వకమ్ 9 23.

ఎవరేప్రకారముగా ఎట్టిఫలాపేక్షతో ఎట్టి ధ్యేయము నుపాసింతురో వారల నా ఫలదాన ముతో ఈశ్వరు డనుగ్రహించును. మోక్షము నపేక్షించువాడు ఐహికాముష్మిక ఫలము ములలో ఎట్టిఫలమునున్ను అపేక్షింపడు. ఫలము నపేక్షించువాడు మోక్షము నపేక్షింపడు గాన ఈశ్వరునకొకనికి మోక్షమునిచ్చుట, మఱియొకనికి ఆ యాభిన్న భిన్న ఫలములనిచ్చుట యందు రాగద్వేషము లెంతమాత్రమును లేవు.[1] వారట్లు భిన్న భిన్న ఫలములను మాత్రమే కోరుటకును, మోక్షమును కోరకుండుటకును కారణము వారల త్రిగుణాత్మక ప్రకృతియే.[2]

3. ధ్యేయము విరాట్పురుషుడైనపు డిదియే విరాడుపాసన యనబడును. వీని స్వరూపము సమస్త బ్రహ్మాండమున్ను, పదకొండవ యధ్యాయమంతయు నీతని వర్ణనతో నొప్పుచున్నది.

## విరాట్పురుషుడు

అధ్యాత్మమనబడు (3కి3 శక్తులు) సర్వదేహధారి స్వభావము. జ్ఞానశక్తిరూపముతో నుండునపుడు కారణరూపమై యుండును. (Gassius Condition) అపు డది ముఖ్యప్రాణ మనబడును. అది కోరికలనబడు ఇచ్ఛాశక్తిరూపముగా మారినపుడు సూక్ష్మరూపమై యుండును. (Liquiod condition) అపు డది అంతఃకరణమనబడును. అదియే క్రియాశక్తి రూపముగా (Execution of thoughts) మారినపుడు స్థూలరూపమైయుండును. (Solid condition) అపు డది దేహేంద్రియరూపమనబడును. అధ్యాత్మమను కారణరూపము సర్వప్రపంచ మందును జాతిచే భేదములేనిదనియు, పరిమాణభేదముచే మాత్రము దేహభేద ముండు ననియు నీవఱకే వివరింపబడినది. గాన తత్పరిణామములగు సూక్ష్మ, స్థూలరూపములు గూడ జాతిచే భేదములేనివై ఒకటే కావలెను. ఆ ఒకటియే సమష్టి యనబడును. ఇందలి

---

(1) యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహం । మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః 4-11. (2) త్రిభి ర్గుణమయై ర్భావైః ఏభి స్సర్వ మిదం జగత్ । మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్ 7-13.

సూక్ష్మసమష్టి "హిరణ్యగర్భుడ"నియు స్థూలసమష్టి "విరాట్పురుషు"డనియు శాస్త్రములం దుపదేశింపబడిరి.

ఇందు అధ్యాత్మ రహస్యమును బాగా మననమొనర్చి, అపరోక్షముగా తానే అధ్యాత్మమయినపుడు మాత్రమే, తాను వ్యష్టిజీవుడనని, దేహధారినని, బద్ధుడనని తలచు మోహము తొలగును. తన నిజరూపమును మరచిపోయి, అన్యరూపమును, అన్యధర్మములను, తనయం దారోపించుకొనుటయే మోహమనబడును.[1] అట్లొనర్చిన అధికారికే, స్థూలసూక్ష్మ దేహములన్నియు ఈ కారణమగు అధ్యాత్మజనితములనియు, గావుననే దీనికంటె అత్యంత భిన్నములు గావనియు, తెలుసుకొని కారణముయొక్క గొప్పతనమును, నాశరాహిత్యమును గుర్తింపగలడు.[2] ఈ రెండు నిస్సంశయముగా తా నపరోక్షమొనర్చుకొన్న అధికారిమాత్రమే "విరాట్పురుష" రూపమును అనగా సర్వప్రపంచవ్యాప్త సర్వానుస్యూత పారమేశ్వరరూపమును చూడనర్హుడు.[3] అట్టి అర్హత తనకున్నదని సాధకుడు తలచినను, సిద్ధుడగు గురువు అతని కా యధికారమున్నట్లు నిశ్చయించినపుడు మాత్రమే సాధకుడా రూపమును చూచి, తర్వాత దాని నుపాసింపవచ్చును.[4] అపుడు గురువు వ్యష్టి జీవదృష్టితో నా పారమేశ్వరరూపమును చూడ నర్హుడు గాడనియు, సాధకుడా జీవభావమును పరిత్యజించి దివ్యభావమనబడు దేవతాభావమును, లేక అధ్యాత్మభావమును (ఇదివరకే వివరింపబడినది) పొంది ఆ దృష్టితోమాత్రమే చూడ నర్హుడగును.[5] అని బోధించి అట్టి భావముతో నున్న సచ్ఛిష్యునకు సద్గురువు తన పారమేశ్వరరూపమును ప్రదర్శించును.[6]

---

(1) మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్। యత్త్వయోక్తం వచ స్తేన మోహో౽యం విగతో మమ. 11-1. (2) భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా। త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ 11-2. (3) ఏవ మేత ద్యథాత్థ త్వం ఆత్మానం పరమేశ్వర। ద్రష్టు మిచ్ఛామి తే రూపం ఐశ్వరం పురుషోత్తమ। 11-3. (4) మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో। యోగేశ్వర। తతో మే త్వం దర్శ యాత్మాన మవ్యయమ్ 11-4 (5) నతు మాం శక్యసే ద్రష్టుం అనే నైవ స్వచక్షుషా। దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ 11-8. (6) ఏవ ముక్త్వా తతో రాజన్। మహాయోగేశ్వరో హరిః। దర్శయామాస పార్థాయ పరమం రూప-మైశ్వరమ్ 11-9.

ఈ బ్రహ్మాండమంతయు నీ విరాట్పురుషుడే. ఇందు దేశకాలాదిబాధ లుండవు. వ్యష్టిభేదముండదు గావుననే ముందు కొద్దిరోజులలో మరణింపబోవు ధార్తరాష్ట్రులు, రాజులు, భీష్మ, ద్రోణ, కర్ణాదులు పాండవ కౌరవ పక్షములందు యుద్ధసన్నద్ధులైన వారందరు ఈ విరాట్పురుషుని నోటిలోపడి ఇరుక్కొని పోవుచున్నట్లు అర్జునుడు చూచెను.[1] ఇందు కొందరు ప్రవేశించిరి. కొందరు జీర్ణమగుచుండిరి. మరికొందరు ప్రవేశింప నుద్యుక్తులగుచున్నారు.[2] ఈ రూపము సాధకుని ఉద్దేశ్యమునుబట్టియుండును. అర్జును డిపుడు దివ్యమాల్యాంబరధరుడై అనేక దివ్యాయుధధారియై యుద్ధరంగమందు శత్రువులను సంహరింప నుద్యుక్తుడై వచ్చియున్నందున అతని కా విరాడ్రూపమట్లే యగుపడెను.[3] అట్లే ఆయనకు కిరీట, గదా, చక్రాదులున్నవి. ఎవరున్ను ఆయనను చూడజాలనంతటి గొప్ప తేజోరాశిగా నున్నట్లగుపడెను.[4] ఇట్లు తా నిదివరకు ప్రపంచభేదమును చూచియున్నాడుగాని అభిన్నమగు ఐక్యప్రపంచము నెన్నడు చూచియుండలేదుగాన అర్జునున కాశ్చర్యముగలిగి రోమాంచపులకితాంగుడాయెను.[5] ఇదివరలో తాను పరోక్షముగా తెలుసుకొన్న అద్వైతభావ మిపు డాతనికి ప్రత్యక్షమాయెను. భీష్మ ద్రోణాదుల దేహములు. ఈ పారమేశ్వరరూపములో ఐక్యమగుచున్నందున, భీష్మ, ద్రోణాదుల, నామములున్ను, రూపములున్ను మాత్రమే పోవుచున్నవి గాని అధిష్ఠానమున కెట్టి నాశనమున్ను లేకుండుట యాతడు చూచెను. దేహాదుల ధర్మములను రక్షించుట, నాశరాహిత్యము, దేహధారులచే తెలియదగియుండుట, జగత్కారణత్వము, సనాతనత్వము ఇవన్నియు అతనికి ప్రత్యక్షమాయెను.[6] ఒకే పరమేశ్వరుని, కొందరు స్తుతించుట, కొందరు భయార్తులై శరణుజొచ్చుట, కొంద్దరు

---

(1) అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసంఘైః । భీష్మో ద్రోణస్సూతపుత్ర స్తథాసౌ సహాస్మదీయై రపి యోధముఖ్యైః 11-26. (2) వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని। కేచి ద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః 11-27. (3) దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం । సర్వాశ్చర్యమయం దేవం అనంతం విశ్వతోముఖమ్ 11-11. (4) కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతం । పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్ దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్ 11-17. (5) తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః । ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత 11-14. (6) త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ । త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషో మతో మే 11-18.

లోకకళ్యాణమగుగాక యని ప్రవర్తించుట ఇత్యాది కర్మయోగ ప్రకరణమందలి, సర్వకర్మ ఫలత్యాగము, నిత్యకర్మానుష్ఠానము, లోకసంగ్రహార్థకర్మానుష్ఠానము ఇత్యాది సాధన భేదములన్నియు, ఒకే అద్వైతసిద్ధికొరకు, భిన్నభిన్న అధికారులచే ఆచరింపబడునని యాతనికి ప్రత్యక్షమాయెను.[1] అధ్యాత్మమందలి దేవతలందరు అతని కిచట ఏకాధిష్ఠానమందు ప్రత్యక్షమైరి.[2] ఇందు లెక్కకు మించిన శిరఃపాణిపాదనేత్రాదు లొకే యధిష్ఠానమందుండుట అనుభూతమాయెను.[3] తానింకను సాధకుడై యుద్ధముచేయనా ? వద్దా ? యను జిజ్ఞాసతోనున్నందున, ఆ రూపము యుద్ధభయంకర దృశ్యరూపముగానే యాతని కగుపడెను.[4] నదులన్నియు భిన్నభిన్నదేశములందు ప్రవహించుచు, భిన్న భిన్న నామ రూపముల నొందుచున్నను, వాటికన్నిటికి ఉత్పత్తిమూలమగు మేఘమండలమున్ను, లయస్థానమగు సముద్రమున్ను ఒక్కటేయై ఆమేఘసముద్రమం దిన్ని నదులున్ను నామ, రూప భేదములు లేకుండా ఏకరూపముతో నున్నట్లే జీవులందరు ఇచట ఏకరూపులై యుండుట యాతనికి ప్రత్యక్షమాయెను.[5] మిడితలు అజ్ఞానముచేతను, తృష్ణచేతను, దీపమును, తమభోగ్యముగా పరిగణించి, అందుకొరకు ప్రయత్నించి నాశమొందునట్లు అజ్ఞులగు జీవులు, అజ్ఞాన, తృష్ణలచే నాశనమగుచుండుట అతనికి ప్రత్యక్షమాయెను.[6] అగ్ని తన జ్వాలలచే దాహ్యవస్తువుల నన్నిటిని తనలో లయమొనర్చుకొనునట్లు, పరమేశ్వరుడు తన ప్రజ్ఞాజ్వాలాకిరణములగు బుద్ధీంద్రియ జ్వాలలచే, దేహములన్నిటిని తనలో లయ మొనర్చుకొనుట నాతడు గాంచెను. జీవభావములో నుండి తాత్కాలికముగా అధ్యాత్మ భావములోనికి వెళ్ళిన సాధకుడగు అర్జునున కీ దర్శనముచే హాతము, ఆశ్చర్యముగలిగి తన

---

(1) అమీ హి త్వాం సురసంఘా విశంతి కేచి ద్భీతాః ప్రాంజలయో గృణంతి । స్వస్తీ త్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః । స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః 11-21. (2) రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః విశ్వే ఽ శ్వినౌ మరుత శ్చోష్మపా శ్చ । గన్ధర్వయక్షాసురసిద్ధసంఘాః వీక్షంతే త్వాం విస్మితా శ్చైవ సర్వే. 11-22. (3) రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో ! బహుబాహూరుపాదమ్ । బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితా, స్తథాహమ్ 11-23. (4) నభస్స్పృశం దీప్త మనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్। దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో! 11-24. (5) దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని । దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస ! 11-25. (6) యథా నదీనాం బహవో ఽంబువేగాః సముద్రమే వాభిముఖా ద్రవంతి । తథా తవామీ నరలోకవీరాః విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి. 11-28.

బుద్ధిని తాను నమ్మలేక, ఇది నిజమో, కల్లయో! నను సంశయముగూడ గలిగెను. అట్లే ప్రతిసాధకునకున్ను ప్రథమభావనాదర్శనా దశయందు కలుగును.[1] పరమేశ్వరుడు లేక గురుడు ఆసాధకున కపుడు ధైర్యముచెప్పి, తాను ఈశ్వరుడననియు, కాలుడననియు[2] జీవుని అహంభావ సహితప్రవృత్తియున్నను లేకున్నను, జగద్వ్యాపారము నీశ్వరుడు నిర్వహించుననియు[3] ఈ భీష్మ ద్రోణాదులు పరమేశ్వరునిచే ఇదివరకే సంహరింపబడిరనియు జీవులు తమ కర్మఫలము ననుభవించుట కనువగు దేహేంద్రియములను, ఆ పని పూర్తికాగానే త్యజించుట స్వాభావికమనియు[4] ఇచట ఉత్తమ సాధకునకు తన విధిని తాను నిర్వహించుటయే కర్తవ్యమనియు బోధించెను.[5] అపుడు శిష్యుడగు అర్జునుడు ఆ పరమేశ్వరరూపము నిట్లు స్తుతించెనుగాన ప్రతిసాధకుడున్ను అట్లే స్తుతింపవలెను.[6] నీవు సర్వజీవుల దేహేంద్రియ మనఃప్రాణములకు ప్రవర్తకుడవు. నీయందే దేహధారులందరు ప్రవణమైయుందురు అనగా తానొనర్చు ప్రతిపనియు తన యానందముకొరకే-ఆ యానందమే నీ స్వరూపము- నీవు సృష్ట్యాది వ్యాపారముల నొనర్చు నీ విభూతులకంటె గొప్పవాడవు. అట్టినీకు ఎందుకు నమస్కరింపరు? నీవు వ్యక్తమగు నామరూపములకంటెను, అవ్యక్తమగు మాయ కంటెను, విలక్షణుడవు - నాశరహితుడవు-నీవే, అనగా జ్ఞానమే. జీవవ్యవహారాలదశలో అసమగ్రజ్ఞానము గలిగియున్నవారికి, మూడుగా విభక్తమై 1 కర్త, 2 కర్మ, 3 క్రియ యను భేదములతో నొప్పియుండి పరిపక్వదశలో ఐక్యమగుదువు. నీవే వాయు వరుణ అగ్ని

---

(1) యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః విశంతి నాశాయ సమృద్ధవేగాః । తథైవ నాశాయ విశంతి లోకాః తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః 11-29. (2) లేలిహ్యసే గ్రసమాన స్సమంతాత్ లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః । తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో 11-30. (3) ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోస్తుతే దేవవర ప్రసీద । విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ 11-31. (4) కాలోస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః । ఋతే ఽపి త్వాం న భవిష్యంతి సర్వే యే ఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః 11-32. (5) తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూ న్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ । మయైవై తే నిహతాః పూర్వ మేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ 11-33. (6) ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథా న్యా నపి యోధవీరాన్ । మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ 11-34.

యమప్రజాపత్యాది సర్వదేవతారూపుడవు. నీవే ప్రాగాది దిశలన్నిటిలోనున్నావు. నీకు సర్వదా నమస్కరింతును. నేనింతవరకు అవిద్యాగ్రస్తుడనై శృంగార, వీర, కరుణాది రసావేశవశమున నిన్ను అవహేళన చేసియుంటిని. నేనొనర్చు ప్రతిపనియందును, నిన్ను దుర్వినియోగమొనర్చితిని. తల్లి దండ్రులు పిల్లల తప్పులను క్షమించి వారి శ్రేయస్సు నెల్లప్పుడు కోరునట్లు నీవు నా తప్పుల నన్నిటిని క్షమించి నా శ్రేయస్సును కోరుము. ఇట్టి పారమేశ్వరరూపము నిదివర కెన్నడు చూడలేదు. అనుగ్రహించి దీనినుపసంహరించి పూర్వపు సామాన్యరూపమునే ప్రదర్శింపుము. ఇట్లు సాధకుడు గురువునే పరమేశ్వరునిగా భావించి, వారిచే ప్రదర్శింపబడిన పారమేశ్వరరూపమును చూచినపు డద్దానిని చూచి తాను చదివిన విద్యలోని అంశములనన్నిటిని అనుభవము చేసికొనుచు, తన యనుభవము సరియైనదగునో కాదో యని గురువులచే నిర్ణయింపబడుటకొరకే దేవతాస్తోత్రము లేర్పడినవి. ఒక భక్తిచేతమాత్రమే ఈ పారమేశ్వరరూపము చూడనర్హమగునుగాని ఇతరములగు వేద, తపో, దాన, యజ్ఞాదులచే చూడ నలవిగాదు. ఇందు భక్తియనగానేమో ముందు పుటలో వివరింపబడును.

అట్లొనర్పజాలనివారు అనగా జగత్తే విరాట్పురుషుడు గాన ప్రతిపదార్థమును విరాట్టుగా భావింపలేనివారు ద్వాదశాదిత్యులలో విష్ణువును, జ్యోతిస్స్వరూపులలో రవిని, మరుత్తులలో మరీచిని, నక్షత్రములలో చంద్రుని[1] వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుని, ఇంద్రియములలో మనస్సును, భూతములన్నిటిలో చైతన్యమును,[2] రుద్రులలో శంకరుని, యక్షరాక్షసులలో కుబేరుని, వసువులలో పావకుని, పర్వతములలో మేరువును,[3] పురోహితులలో బృహస్పతిని, సేనాపతులలో స్కందుని, దేవఖాతములగు సరస్సులలో

(1) ఆదిత్యానా మహం విష్ణుః జ్యోతిషాం రవి రంశుమాన్ । మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ 10-21. (2) వేదానాం సామవేదో உస్మి దేవానా మస్మి వాసవః । ఇంద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతనా 10-22. (3) రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ । వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్ 10-23.

సాగరమును,[1] మహర్షులలో భృగువును, పదరూపమగు వాక్కులలో ప్రణవమును, యజ్ఞములలో జపమును, స్థావరములలో హిమాలయమును,[2] వృక్షములలో అశ్వత్థమును. దేవర్షులలో నారదుని, గంధర్వులలో చిత్రరథుని, సిద్ధులలో కపిలుని,[3] అశ్వములలో ఉచ్చైశ్శ్రవమును, గజములలో ఐరావతమును, మనుష్యులలో రాజును,[4] ఆయుధములలో వజ్రాయుధమును, ధేనువులలో కామధేనువును, పుట్టించువారిలో కందర్పుని, సర్పములలో వాసుకిని,[5] నాగములలో అనంతుని, జలజంతువులలో వరుణుని పితరులలో అర్యముని, నియమించువారిలో యముని,[6] దైత్యులలో ప్రహ్లాదుని, లెక్కపెట్టువానిలో కాలమును, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుని,[7] పవిత్రమొనర్చువాటిలో పవనుని శస్త్రభృత్తులలో రాముని, మత్స్యాదులలో మకరమును, ప్రవాహములలో గంగానదిని,[8] సృష్టులలో ఆదిమధ్యాంతములను, విద్యలన్నిటిలో అధ్యాత్మవిద్యను, మాట్లాడువారిలో వాదమును,[9] అక్షరములలో అకారమును, సమాసములలో ద్వంద్వసమాసమును, నాశములేని కాలమును, కర్మఫల విధాతను, సర్వతోముఖుని,[10] ప్రాణహారులలో మృత్యువును,

---

(1) పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ। బృహస్పతిం। సేనానీనా మహం స్కందః సరసా మస్మి సాగరః 10-24. (2) మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరం। యజ్ఞానాం జపయజ్ఞో౽స్మి స్థావరాణాం హిమాలయః 10-25. (3) అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః। గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః 10-26. (4) ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవం। ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ 10-27. (5) ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్। ప్రజన శ్చాస్మి కందర్పః సర్పాణా మస్మి వాసుకిః 10-28. (6) అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్। పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్ 10-29. (7) ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్। మృగాణాం చ మృగేంద్రో౽హం వైనతేయ శ్చ పక్షిణామ్ 10-30. (8) పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్। ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ 10-31. (9) సర్గాణా మాది రంత శ్చ మధ్యం చైవాహ మర్జున। అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహం 10-32. (10) అక్షరాణా మకారో౽స్మి ద్వంద్వ స్సామాసికస్య చ। అహమే వాక్షయః కాలో ధాతా౽హం విశ్వతోముఖః 10-33.

ఉత్కర్షప్రాప్తి యోగ్యులలో ఉత్కర్షను, స్త్రీలలోని కీర్తియు, శోభయు, వాక్కును, స్మృతియు, మేధయు, ధైర్యమును, ఓర్పును[1] సామగానములలో బృహత్సామను, ఛందస్సులలో గాయత్రిని, మాసములలో మార్గశిరమును, ఋతువులలో వసంతమును,[2] వంచకులలో ద్యూతమును, తేజస్సుగలవారిలోని తేజస్సును, జయమును, వ్యవసాయమును బలవంతులలోని సత్త్వమును,[3] వృష్ణులలో వాసుదేవుని, పాండవులలో ధనంజయుని, మునులలో వ్యాసుని, కవులలో ఉశనసుని,[4] శిక్షించువారిలో దండమును, జయింప నిచ్ఛగలవారిలో నీతిని, గుహ్యములలో మౌనమును, జ్ఞానవంతులలో జ్ఞానమును,[5] సర్వభూతములలోను బీజశక్తిని ఇత్యాదులనైనను విరాట్పురుషునిగా నుపాసింపవలెను. ప్రపంచములో ఏది, ఏ రీతిగా శ్రేష్ఠముగా నున్నను అది అంతయు ఈశ్వరాంశగానే ఉపాసింపవలెను.[6]

4. ఈ ధ్యేయవస్తువు హిరణ్యగర్భుడైనపు డదియే హిరణ్యగర్భోపాసన. ఉదకమందలి రసమును, సూర్య చంద్రులందలి ప్రభను, సర్వవేదములందలి ప్రణవమును, ఆకాశమందలి శబ్దమును, పురుషులందలి పౌరుషమును, భూమియందలి గంధమును, అగ్నియందలి తేజస్సును, తపస్సులయందలి తపస్సును, సర్వభూతములందలి బీజమును, సర్వభూతములందలి జీవమును, బుద్ధిమంతులబుద్ధిని, తేజస్స్వులందలి తేజస్సును, బలవంతులందలి కామరాగరహితమగు బలమును, భూతములందు ధర్మబద్ధమగు కామమును అంతఃకరణలోని సాత్త్విక రాజస తామస భావములను ఆలంబనములుగా గ్రహించి అందు పరమేశ్వరునిధ్యానించుట హిరణ్యగర్భోపాస

(1) మృత్యుస్సర్వహరశ్చాహం ఉద్భవశ్చ భవిష్యతాం । కీర్తి శ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా 10-34. (2) బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్ । మాసానాం మార్గశీర్షో உహం ఋతూనాం కుసుమాకరః 10-35. (3) ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ । జయో உస్మి వ్యవసాయో உస్మి సత్త్వం సత్త్వవతా మహమ్ 10-36. (4) వృష్ణీనాం వాసుదేవో உస్మి పాండవానాం ధనంజయః । మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః 10-37. (5) దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్ । మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ 10-38. (6) యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా । తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజో உంశసంభవమ్ 10-41.

నయే. (7–8 నుండి 12 వరకు) ఇక్లే (శ్రౌత, స్మార్త, కర్మ, స్వధా ఔషధ మంత్రి) ఆజ్యా అగ్ని, హవి, ర్వేద్య, ఋగ్యజుస్సామాధర్వణాదులను దేవతగా నుపాసించుట ఈ హిరణ్యాగర్భోపాసనయే— (9–16 నుంచి 19 వరకు) అక్లే సర్వజీవులందును గోచరించు బుద్ధి, జ్ఞాన, అసంమోహా, క్షమా, సత్య, దమ, శమ, సుఖ, దుఃఖ, భవ. అభావ, భయ, అభయ, అహింసా, సమతా, తుష్టి, తపో, దాన, యశో, ఉ యశ ఆదుల నన్నింటిని దేవతగా నుపాసించుట ఈ హిరణ్యాగర్భోపాసనయే.[1&2] సర్వదేహములందును జాఠరాగ్నిరూపుడై వారలచే భుజింపబడు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములను చతుర్విధాహారము ను ప్రాణాపానాదులతో గూడి పచనమొనర్చు వైశ్వానరు నుపాసించుట ఈ హిరణ్యాగర్భోపాసనయే.[3]

5. ఈ ధ్యేయవస్తు వీశ్వరుడైనపు డిదియే ఈశ్వరోపాసన యనఁబడును. సర్వ జీవుల యొక్క హృదయములందుండి వారల సర్వబుద్ధి వృత్తులకు ప్రేరకుడై సాక్షిగానుండు వాని నుపాసించుటయు, మనోవాక్కాయ కర్మలనన్నింటిని తత్స్వరూపముగా నుపాసించుటయు, సర్వవ్యాపారములందును ఆయననే శరణుజొచ్చుటయు ఈశ్వరోపాసన మన బడును.[4 to 6] ఏ ఓజస్సుచే ఈ పృథివి క్రిందకు పడిపోకుండగను, బద్దలు గాకుండగను ధరింపబడినదో యే శక్తిచే సమస్తౌషధులు తమ తమ శక్తిసామర్థ్యములతో వృద్ధిపొందుచున్నవో అట్టి శక్తిరూపుడగు వాని నుపాసించుట ఈశ్వరోపాసనయే.[7]

---

(1) బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః। సుఖం దుఃఖం భవో ఽభావో భయం చాభయమేవ చ 10–4. (2) అహింసా సమతా తుష్టి స్తపో దానం యశో ఽయశః । భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః 10–5. (3) అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః। ప్రాణాపాన సమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్ 15–14. (4) ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి । భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా 18–61. (5) తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత । । తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ 18–62. (6) సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్త స్స్మృతిర్ జ్ఞాన మపోహనం చ । వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంతకృ ద్వేదవి దేవ చాహమ్ 15–15. (7) గామావిశ్య చ భూతాని ధారయా మ్యహమోజసా । పుష్ణామి చౌషధీ స్సర్వాః సోమో భూత్వా రసాత్మకః 15–13.

ఈ ఉపాసన లన్నిటిలోను, ఉపాస్యదేవత సాధకుని భావనావిజ్ఞానబలముచే సాధకుని బుద్ధిలోనే ఆవిర్భవించి, ధ్యానకాలమంతలోను, సాధకుని బుద్ధిలో విజ్ఞానరూపుడై యుండి ధ్యానావసానమందు సాధకుని విజ్ఞానమందే లీనమగుచున్నాడు. గాన ఉపాస్యులగు 1 అవతార, 2 అంగదేవతా, 3 విరాట్పురుష, 4 హిరణ్యగర్భ, 5 ఈశ్వరులైదుగురును ఈ దశలో ఉత్పత్తి, స్థితి, లయములు గలవారగుచు, కార్యరూపులే యగుచున్నారు గాని కారణరూపులు గాలేదు. తన జ్ఞానము లేక తానే కారణరూపుడగుచున్నాడు. ఇట్టి ప్రజ్ఞానరూపుడగు లేక శాంతరస రూపుడగు తాను తనయొక్క ఉత్పత్తిలయములు తాను ఎంతదూరమాలోచించినను తెలుసుకొనలేకున్నాడు. ఇట్లే దేవతలుగాని, ఋషులుగాని తెలుసుకొనలేకున్నారు.[1] ఇట్లు ప్రజ్ఞానరూపుడగు తన యథార్థ రూపమగు పరమాత్మను ఆద్యంతములు లేనిదానినిగాను, కారణ, సూక్ష్మ, స్థూల రూపములతో నున్న ప్రపంచ మంతయు తనయందే కల్పించబడిన కార్యమనియు, దానికి స్వతంత్రమగుసత్తా లేదనియు, తన సత్తాయే దానికిగూడ సత్తాయనియు, స్థిరముగా నిశ్చయించుకొనియుండునో, అదియే "అక్షరోపాసన" యను ఆఖరవరకము.[2] వీరికెట్టిపాపములు ఉండనేరవు. పాపములన్నియు నశించును.

ఇట్లు తన బుద్ధికి గోచరమగు స్థూల, సూక్ష్మ కారణరూపములతో క్రమముగా నొప్పు ఈశ్వరు నుపాసించినవాని ఫలమే అక్షరోపాసన యనబడును.[3]

6. అక్షరోపాసన యనునదియే జ్ఞాననిష్ఠ యనబడును. గాన ముందు జ్ఞానప్రకరణ మం దద్దాని స్వరూపము వివరింపబచుడున్నది.

## సింహావలోకనము

ఈ ప్రకరణమందు కొంతకాలము కర్మయోగము ననుష్ఠించిన అధికారులు తాము భౌతికజడప్రపంచ సమీపమందున్నామను స్వాభావిక పామరదృష్టి తొలగి, పరమేశ్వర

---

(1) న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః । అహ మాది ర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః 10-2. (2) యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్।అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే 10-3. (3) ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః 12-1.

సమీపమందున్నామని భావించు క్రమమున్ను, అందు 1. అవతారమూర్తులను తమ ఎదుట బుద్ధితో భావించి తాము తత్సన్నిధి నుంటిమని ప్రారంభదశలోను, 2. ఇంద్రాది దేవతల నా యా యభీష్టఫలప్రదాతలనుగా పురాణాదులనుండి విని, వారిని భావించుదశ, 3. బ్రహ్మాండస్థూల సమిష్టిరూపమే పరమేశ్వరునిగా భావించు దశ, 4. శబ్ద, స్పర్శాది గుణములే పరమేశ్వరశక్తులుగా భావించి తాము వాటి సన్నిధినుంటిమని భావించుదశ, 5. సర్వజీవుల బుద్ధివృత్తులకు ప్రేరకమగు శక్తినే పరమేశ్వరునిగా భావించి, తాము వారి సన్నిధినుంటిమని భావించుట, 6. సర్వవ్యాపకమగు పరమాత్మయే సర్వప్రపంచాకారముగా గోచరించుచున్నదనియు, తామెల్లపు డాతని సన్నిధి నుంటిమని భావించుదశ యను ఆరు దశలు క్రమముగా సాధకుడగు జీవుని, ఉత్తమజ్ఞానాధికారిగా మార్చుననియు, ఇదియే ధ్యానయోగమనబడుననియు వివరింపబడినది.



శ్రీ

# గీతాసారసంగ్రహము

## 8. జ్ఞాన ప్రకరణము



శ్రేయస్సాధనకు కొన్ని మార్గములున్నవి. అందు-కొందరు ఇతరులవలన ఈశ్వరాముల అంగదేవతలను విని తమ అధికారానురూపముగా నుపాసింతురు. మరికొందరు కర్మయోగము నాచరింతురు. ఇంకొకరు ధ్యానయోగము నభ్యసింతురు. మరికొందరు సాంఖ్యయోగము నవలంబింతురు. వీరందరు శ్రేయస్సునే బొందుదురు.[1&2] అందు కర్మయోగ ధ్యానయోగము లిదివరలో వివరింపబడినవి. ఈ ప్రకరణమందు సాంఖ్యయోగము వివరింపబడును. ఈ సాంఖ్యమే జ్ఞానయోగమనియు, భక్తియోగమనియు గూడ ననబడును.

ఇంతవరకు చెప్పబడిన కర్మఫలత్యాగ, కర్మయోగ ఉపాసన లన్నియు, అధికారభేదమును బట్టి సర్వవర్ణాశ్రమస్థులకును సాధనములగును. ఈ జ్ఞానయోగము బ్రాహ్మణులై పుట్టి సర్వకర్మ సంన్యాసమును శాస్త్రీయముగా నొనర్చిన పరమహంస పరివ్రాజకులకు మాత్రమే సాధనమగును. ఈ జ్ఞానము మాత్రమే మోక్షమను పరమపురుషార్థ సాధనము. వెనుక కర్మ ఫలత్యాగమను శీర్షికక్రింద వివరింపబడిన ఇంద్రియ నిగ్రహాది లక్షణము లన్నియు వీరికి పుష్కలముగా సిద్ధమైయుండవలెను. వీరు ధర్మసంమూఢులై తీవ్రమోక్షార్థులై గురువుయందు దృఢమైన భక్తి గలిగియుండి వారిని సమీపించవలెను.[3] వీరు 1. నిత్యానిత్య వివేకము, 2. ఐహికాముష్మిక ఫలభోగ వైరాగ్యము, 3. శమదమాది సాధనసంపత్తు,

---

(1) ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా । అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే 13-25. (2) అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే । తే ఽపి చాతితరం త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః 13-26. (3) కార్పణ్య దోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మ సంమూఢ చేతాః । య చ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ 2-7.

4. మోక్షేచ్ఛయను సాధనచతుష్టయ సంపత్తిగలవారై తత్వవేత్తయై జీవన్ముక్తుడగు పరమహంస పరివ్రాజకాచార్యవర్యుని యథావిధిగా గురూపసదనమొనర్చి సేవచేసి, ప్రణిపాతముచేసి, ప్రశ్నింపగా నాగురూత్తము లీతనికి తామెట్టి జ్ఞానముచే కృతార్థులైరో అట్టి వేదాంతజ్ఞానము నుపదేశింతురు.[1] శిష్యుడు గురువును అనన్యభక్తితో సేవించి సందేహ నివృత్తి నొందవలయును.[2] ఈ వేదాంతజ్ఞానమందలి ప్రధాన విషయములు 1. ద్వైతమగు జగత్తునకు మిథ్యాత్వము, 2. సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమగు బ్రహ్మమే జగత్కారణమని గ్రహించుట, 3. బ్రహ్మాశ్రిత మాయావిలసితమే జగత్తని గుర్తించుట, 4. ఒక్క బ్రహ్మవిజ్ఞానముచేతనే సర్వవిజ్ఞానములు గలుగునని గుర్తించుట. 5. ఎట్టి దేహ సంబంధము లేక తానే సర్వ జగదధిష్ఠాన మగు సచ్చిదానందబ్రహ్మ యని అపరోక్షానుభవమునొంది స్వస్వరూప స్థితుడగుటయే మోక్షమనియు గుర్తించుట, ఈ అయిదింటి వివరణము నా గురువు ఉపనిషత్తుల ద్వారా బోధించును. ఇది శ్రవణ మనబడును.

## ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము

1. అందు జగన్మిథ్యాత్వము, 2. అద్వితీయ బ్రహ్మయే జగత్కారణమని, 3. బ్రహ్మాశ్రిత మాయావిలాసమే జగత్తని లోగడనే వివరింపబడినది. ఇక 4. ఏక విజ్ఞానముచే సర్వ విజ్ఞానసిద్ధి నిరూపింపబడుచున్నది. ధ్యానయోగముచే సమాహిత చిత్తముగలవాడు పుష్కలముగా బ్రహ్మను గుర్తించును.[3] ఈ బ్రహ్మజ్ఞానమొక్కటియే స్వానుభవ సిద్ధమయిన వానికి బ్రహ్మాండమందలి సర్వవిజ్ఞానములు సిద్ధించునేగాని వేరొక జ్ఞాతవ్యముండదు.[4] బ్రహ్మతత్వమును, అవతార తత్వమును పుష్కలముగా నెరిగినవారు పూర్తిగా బ్రహ్మయే యగుచు తిరిగి జన్మింపరు.[5] ఇదివరలో అనేకు లిట్లు సర్వాత్మభావమును ఏకత్వ

---

(1) తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా। ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః 4-34. (2) ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః। త్వదన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే 6-39. (3) మ య్యాసక్తమనాః పార్థ! యోగం యుఞ్జ న్మదాశ్రయః। అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు 7-1. (4) జ్ఞానం తే ఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యా మ్యశేషతః। యద్జ్ఞాత్వా నేహ భూయో ఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే 7-2. (5) జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః। త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సో ఽర్జున.

మును పొందిరి.[1] ఎపుడు భూతనానాభావమును అద్వితీయబ్రహ్మగా శాస్త్రాచార్యోపదేశ ముల ననుసరించి అపరోక్షముగా సాక్షాత్కరించుకొనునో అపుడాతడే ప్రాణ, ఆశా, స్మర, ఆకాశ, తేజ, ఆప, అన్న, ఆవిర్భావతిరోభావాదికమగు సర్వ బ్రహ్మాండమగును.[2] ఇంకను ఈ విశేషము ఫలప్రకరణమందలి మోక్షస్వరూప మందు బాగా వివరింపబడును.

౮. అపరోక్షాత్మసాక్షాత్కారమునొందుట, 1 సంన్యాసము, 2 వేదాంత శ్రవణమనన ములు, 3 నిదిధ్యాస, 4 జీవన్ముక్తి యను శీర్షికలక్రింద క్రమముగా వివరింపబడుచున్నది.

## 1. సంన్యాసము

లోకమందు త్యాగమనియు, సన్న్యాసమనియు ప్రసిద్ధిగలదు. ఆ రెండు శబ్దముల తాత్పర్యము ముందు తెలుసుకొనవలయును.[3] కామ్యకర్మలను పరిత్యజించుట సంన్యాస శబ్దార్థమని కొందరందురు. నిత్యనైమిత్తికాది సర్వకర్మలవలన తనకు సంబంధించి నట్లుగా ప్రాప్తమగు ఫలమును పరిత్యజించుట త్యాగశబ్దార్థమందురు. ఇట్లు పరిత్యాగ మీ రెంటికి సమానము గాన ఈ రెండు శబ్దములకును ఒకే తాత్పర్యము.[4] అన్ని విధములగు కర్మలును, దేహబంధ హేతువులగుటచే త్యజింపదగినవేనని కొందరందురు రాగాది ద్వేషములతో గూడిన కర్మ పరిత్యజింపదగినదందురు. యజ్ఞము, దానము, తపస్సు అనునవి ఎట్టి పరిస్థితులలోను త్యజింపరాదని మరి కొందరందురు.[5] ఈ త్యాగ విషయములో ఈశ్వర నిర్ణయ మిట్లున్నది.[6] సాత్త్విక, రాజస, తామస భేదముచే నీ త్యాగము మూడు విధములు. అందు తన వర్ణమునకు శాస్త్ర విహిత

---

(1) వీతరాగభయక్రోధాః మన్మయా మాముపాశ్రితాః । బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః 4-10. (2) యదా భూతపృథగ్భావం ఏకస్థ మనుపశ్యతి । తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా 13-31. (3) సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్ । త్యాగస్య చ హృషీకేశ । పృథక్కేశినిషూదన । 18-1. (4) కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః । సర్వకర్మ ఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః 18-2. (5) త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః । యజ్ఞ దాన తపఃకర్మ న త్యాజ్య మితి చాపరే 18-3. (6) నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ । త్యాగో హి పురుషవ్యాఘ్ర । త్రివిధ స్సంప్రకీర్తితః 18-4.

మగు నిత్యకర్మను మోహాముచే పరిత్యజించుట తామసత్యాగ మనబడును.[1] కాయక్లేశాది శరీరదుఃఖభయముచే తమ నిత్యకర్మలను పరిత్యజించుట రాజసత్యాగ మనబడును. వీనికి త్యాగఫలముండదు[2] తమ జాత్యాశ్రమవిహిత నిత్యకర్మను ఫలాపేక్ష లేక ఆచరించుట సాత్త్వికత్యాగమనబడును.[3] ఇట్టివాడు తన కనుకూలఫలమందు సంతోషమునుగాని, ప్రతికూల ఫలమందు దుఃఖమునుగాని పొందక నిత్యకర్మానుష్ఠానముచే క్రమముగా చిత్తశుద్ధి గలిగి ఆత్మజ్ఞాన యోగ్యుడగును.[4] యజ్ఞతపోదానములు, చిత్తశుద్ధిహేతువగుటచే వాటిని పరిత్యజింపరాదు.[5] కాని వాటియందు ఫలాభిలాషలేక ఆచరింపవలెను.[6] దేహధారియై యున్నంతకాలము నిశ్శేష కర్మపరిత్యాగ మశక్యము గాన రాజస తామస త్యాగములు లేక, సాత్త్విక త్యాగమొనర్చుటయే శ్రేయస్కరమని ఈశ్వర నిర్ణయము.[7] కేవల కాయముచేతను, కేవలమనస్సుతోను, కేవలేంద్రియములతోను ఈశ్వరార్పణబుద్ధితో ఫలాభిసంధ లేక కర్మల నాచరించి[8] తనయందలి కర్తృత్వమునుగాని, చేయుకర్మను గాని, తత్ఫలమును గాని స్వభావమాత్రమేనని గుర్తించి[9] కర్మఫలాపేక్ష లేకపోవుటచే చిత్తశాంతిని బొంది[10] ఆ జన్మలో గాని, మరుజన్మలోగాని, సర్వకర్మలను మనస్సుతో సంన్యసించి జితేంద్రియుడై నవద్వారసహిత

---

(1) నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే । మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః 18-7. (2) దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్ । స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ 18-8. (3) కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున । సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః 18-9. (4) న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే । త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్న సంశయః 18-10. (5) యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ । యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్ 18-5. (6) ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ । కర్తవ్యానీతి మే పార్థ । నిశ్చితం మత ముత్తమమ్ 18-6. (7) న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః । యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే 18-11. (8) కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి । యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽత్మశుద్ధయే 5-11. (9) న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః । న కర్మ ఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే 5-14. (10) యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీం । అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే 5-12.

దేహమందు సుఖమాత్ర స్వరూపముతో నుండువాడు సంన్యాసి యనబడును.[1]

ఎవనిపనులన్నియు, కామసంకల్పాది వర్జితములో వాని జ్ఞానాగ్నిచే కర్మలన్నియు నశించును గాన పండితు డనబడును. అనగా ఆత్మజ్ఞానియగు సంన్యాసి[2] వీరెట్టి వాంఛయు లేక, నిత్యతృప్తులై దృష్టాదృష్టేష్ట ఫలసాధనాశ్రియరహితులు,[3] ఎట్టి కోరిక లేక, దేహేంద్రియాది నియమములు గలిగి దారా పుత్ర ధనాది పరిగ్రహముల నన్నిటిని వదలి శరీరస్థితి మాత్రప్రయోజనమగు పనిని చేతురు.[4] తమ కోరికలేక దానియంతట అది వచ్చి నట్టి ఆహారాదికముతో సంతోషించి, సుఖదుఃఖ శీతోష్ణాది ద్వంద్వముల కతీతులై పక్షాత మందును వైరబుద్ధి లేక ఆహారము లభించినపుడు హర్షముగాని, లభింపనపుడు విషాదము గాని లేకుందురు.[5] నివృత్తాసక్తులై ముక్తులై ధర్మాధర్మాది బంధరహితులై స్వస్వరూప మగు జ్ఞానమందు లయింపజేయబడిన చిత్తము గలిగియుందురు గాన వీరి కర్మ నిశ్శేష ముగా నశించును.[6] ఇదియే శ్రేష్ఠమగు జ్ఞానయజ్ఞ మనబడును గాన వీరు దీనికంటె తక్కు వదయగు ద్రవ్యయజ్ఞమును పరిత్యజింతురు.[7] కావుననే కర్మయోగ, కర్మసన్న్యాసములలో నేది శ్రేయస్కరమని సందేహము గలుగ[8] నవి రెండును అధికారినిబట్టి శ్రేయస్కరములని చెప్పబడెను.[9] ఆతని కీ జన్మలోగాని పరజన్మలోగాని జ్ఞానమును గలుగజేయును. (సర్వం

---

(1) సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్నకారయన్ 5-13. (2) యస్య సర్వే సమారమ్భాః కామ సఙ్కల్ప వర్జితాః । జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః 4-19. (3) త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః । కర్మ ణ్యభిప్రవృత్తో ఽపి నైవ కిఞ్చి త్కరోతి సః 4-20. (4) నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ 4-21. (5)యదృచ్ఛా లాభ సన్తుష్టో ద్వన్ద్వాతీతో విమ త్సరః । సమ స్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే 4-22. (6) గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః । యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే 4-23. (7) శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప । సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే 4-33. (8) సన్న్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగం చ శంససి । య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్ 5-1. (9) సన్న్యాసః కర్మయోగ శ్చ నిఃశ్రేయసకరా వుభౌ । తయో స్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే 5-2.

కర్మాఖిలం 4–33) ఈ కర్మయోగము నాచరింపనివాని కెన్నటికిని సంన్యాసము సిద్ధింపదు.[1] కావుననే ఇదివరకు ఆచరించిన సర్వధర్మములను పరిత్యజించి స్వస్వరూపముతో నుండుమని ఈశ్వరు డుపదేశించెను.[2] ఎవరు ద్వేష, కాంక్షాది సకలాంతఃకరణ ధర్మవర్జితులై సుఖ దుఃఖాది ద్వంద్వములు లేకుందురో వారే నిత్యసంన్యాసు లనబడెదరు[3] ఇట్టిది అనేకజన్మ లందు కర్మయోగము నాచరించినవారికి సాధ్యమగును. ఇట్టి యోగ్యత లేకుండగనే సంన్యసించినంత మాత్రముచే పురుషార్థసిద్ధి గలుగదు.[4] వీరికి ఆత్మయందే రతియుండును గాని ప్రపంచవిషయములం దుండదు. ఆత్మచేతనే తృప్తికలుగునుగాని అన్నరసాదులచే కలుగదు. ఆత్మయందే సంతోషముండును గాని, బాహ్యార్థలాభముచే నుండదు.[5]

## 2. శ్రవణ మననములు

అసూయ లేక సర్వవిజ్ఞాన రూపమగు ఆత్మైకత్వ విజ్ఞానమును మోక్షకాముడై సంపాదింపవలెను.[6] ఈ జ్ఞానము అన్నివిధములగు ఇంద్రియ విజ్ఞానములకు, బుద్ధి వృత్తుల కును అధిష్ఠానమైనది గాన ప్రత్యక్షమైనదేగాని పరోక్ష మెంతమాత్రము గాదు. ఇతర విద్య లన్నిటికంటె ఈ బ్రహ్మవిద్య గొప్పదగుటచే రాజవిద్య యనబడును. జనన మరణాది సంసార దుఃఖమును పోగొట్టునదగుటచే సుఖరూపమును, పవిత్రతమమును అగుచున్నది.[7] ఆర్త అర్థార్థు లిద్దరికంటె జిజ్ఞాసువుత్తముడు. వానికంటె జ్ఞాని బ్రహ్మయే.[8] వీరు క్షేత్రి

---

(1) సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః । యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి 5–6. (2) సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ । అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః 18–66. (3) జ్ఞేయ స్స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి నిర్ద్వన్ద్వో హి మహాబాహో । సుఖం బన్ధా త్ప్రముచ్యతే 5–3. (4) న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషో ఽశ్నుతే । న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి 3–4. (5) య స్త్వాత్మరతి రేవ స్యాత్ ఆత్మతృప్త శ్చ మానవః । ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే 3–17. (6) ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే। జ్ఞానం విజ్ఞాన సహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్ 9–1. (7) రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ । ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ 9–2. (8) ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ । ఆస్థిత స్స హి యుక్తాత్మా మామే వానుత్తమాం గతిమ్ 7–18.

మును క్షేత్రజ్ఞుని, వేరు వేరుగా వివేచనమొనర్చి సర్వలోకములందలి జీవులందరియందును క్షేత్రజ్ఞు డొక్కడేనని తెలుసుకొందురు.[1] సర్వశాఖలందలి వేదాంతమును బ్రహ్మసూత్రములను గీతాది ఋషిప్రోక్త గీతాదులను పుష్కలముగా నధ్యయనమొనర్చి అద్వితీయ బ్రహ్మాత్మైకత్వ సమన్వయ మొనర్చుకొందురు.[2] పంచభూత ఇంద్రియ శబ్దస్పర్శాది విషయ ఇచ్ఛాద్వేష సుఖ దుఃఖాదులను క్షేత్రధర్మములనియే గుర్తింతురు.[3 to 5] వీరు అమానిత్వ, అదంభిత్వ, అహింసా, క్షాంతి, ఆర్జవ, ఆచార్యోపాసన, శౌచ స్థైర్య ఆత్మనిగ్రహ, ఇంద్రియార్థ వైరాగ్య అనహంకార జన్మమృత్యు జరావ్యాధి దుఃఖ దోషానుదర్శన పుత్రదారాద్యసంగ ఇష్టానిష్ట సమచిత్తత్వాదులు గలిగి వివిక్తదేశము నుండి జనసంబంధ పరిత్యాగమొనర్చి సర్వదా అధ్యాత్మజ్ఞాననిష్ఠులై యుందురు. (అమానిత్వ 13-7 నుంచి 11 వరకు) దేహేంద్రియాదికము లా యా పనులొనర్చుచుండ ఈ జ్ఞాని ఉపద్రష్టగా నుండి వాటిక్రియలందు ప్రవృత్తుడుగాక అనుమోదకునివలె ఆ కార్యముల నివారింపక జడమగు దేహాదికము యొక్క చలనాదికమునకు నిమిత్తమగుటచే భర్తయనబడును. అగ్ని ఉష్ణతవలె నిత్యచైతన్య స్వరూపముచే బుద్ధియొక్క సుఖ దుఃఖ మోహాత్మక విజ్ఞానవృత్తులుద్బుద్ధములగుటయే భోక్తృత్వ మనబడును. దేహాదిక మంతకును ప్రత్యగాత్మయై సాక్షిమాత్రుడగుటచే పరమాత్మయనబడును. ఈ రీతిగా తన నిజరూపమే బ్రహ్మయని విచారించి నిశ్చయించువాడు జ్ఞాని లేక సంన్యాసి.[6] దేహాదులెన్ని నశించుచున్నను నశింపక అన్ని జీవులందును యేకరీతిగా నుండు ఆత్మను వీరు గుర్తింతురు.[7] ఇట్లు సమముగా బ్రహ్మదృష్టి

(1) క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత। క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ 13-3. (2) ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్। బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః 13-5. (3) తత్‌క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్। స చ యో యత్ప్రభావ శ్చ తత్సమాసేన మే శృణు 13-4. (4) మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ। ఇన్ద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః 13-6. (5) ఇచ్ఛా ద్వేషః సుఖం [illegible] సంఘాత శ్చేతనా ధృతిః। ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ 13-7. (6) ఉపద్రష్టా [illegible] మంతాచ భర్తా భోక్తా మహేశ్వరః। పరమాత్మేతి చాప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః [illegible] (7) సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్। వినశ్య త్స్వవినశ్యన్తం [illegible] పశ్యతి 13-28.

గలిగి పూర్వము అజ్ఞానావస్థలోని తన ఆత్మను అపుడు అనాత్మగా గుర్తింతురు.[1] తన దేహాది వ్యాపారము ప్రారబ్ధమగు ప్రకృతిచే జరుగుచున్నను తమ నా వ్యాపారమందు అకర్తగానే భావింతురు.[2] ఈ రీతిగా ఆత్మ దేహమందున్నను దేహ గత సుఖ దుఃఖాదులతో నెట్టి లేపమును బొందదు.[3]

ఇట్లు క్షేత్ర క్షేత్రజ్ఞ వివేచన మొనర్చుచు తమ కారణదేహము గూడ కల్పితమైనదనియు, ఆత్మయందు లయించుననియు గుర్తింతురు.[4] కర్త, కర్మ, చక్షురాదీంద్రియ క్రియలు అను మూడు పదార్థములు గలది కర్మయోగము. అట్లే జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను త్రిపుటిగలది ఉపాసన.[5] ఇవన్నియు సాత్వికాది గుణత్రయ భేదముచే భిన్నములు. ఈ జ్ఞాని వీటి యన్నిటియందును, రాజస తామస భావములను వదలి సాత్విక భావము విదివరకే అలవరచుకొన్నవాడు.[6] గాన వీనికి అహంకారముగాని, ఎట్టి సంకల్పముగాని లేనందున వీనికి ధర్మాధర్మసంబంధ ముండదు.[7] ఇదియే జ్ఞానయజ్ఞ మనబడును.[8] వీరికి బంధువులు శత్రువులు. మొదలగు జగత్తంతయు ఆత్మయే. పూర్వము సంసార సాగర మందు మునుగుచున్న తమను తామే ఈజ్ఞాని ఉద్ధరించుకొనును.[9] దేహేంద్రియ సంఘాతము తన స్వాధీనమం దుంచుకొన్నవానికి, ఆ దేహాదికము బంధువే యగును. జితేంద్రి-

---

(1) సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్। న హి నస్త్యాత్మనా త్మానం తతోయాతి పరాం గతిమ్ 13-29. (2) ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః। యః పశ్యతి తథాత్మానం అకర్తారం స పశ్యతి 13-30. (3) అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః। శరీరస్థోఽపి కౌంతేయ। న కరోతి న లిప్యతే 13-32. (4) క్షేత్రక్షేత్రజ్ఞయో రేవం అంతరం జ్ఞాన చక్షుషా। భూతప్రకృతి మోక్షం చ యే విదు ర్యాంతి తే పరమ్ 13-35. (5) జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా। కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః 18-18. (6) జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః। ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తా న్యపి 18-19. (7) యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే। హత్వాపి స ఇమాన్ లోకాన్ న హన్తి న నిబధ్యతే 18-17. (8) జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే। ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ 9-15. (9) ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్। ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః 6-5.

యుడుగాని వాని కా దేహాదికమే శత్రువగును.[1] ఇట్టి జితేంద్రియుడును, ప్రశాంతుడును, శీతోష్ణ, సుఖదుఃఖ, మానావమానములను సమముగా తలచువాడును అగు ఈ సంన్యాసి సమాహితుడై పరమాత్మభావము నొందును.[2] శాస్త్రోక్తపదార్థ పరిజ్ఞానముచేతను, స్వానుభవముచేతను తృప్తుడై మట్టియందు, బంగారమునందు సమదృష్టి గలిగి నిశ్చలుడగును.[3] వీనికి స్నేహితులు ప్రత్యుపకారాపేక్ష లేక ఉపకరించువారు, శత్రువులు, ఎట్టిపక్షమును స్వీకరింపని ఉదాసీనులు, వాది ప్రతివాదు లిద్దరి హితమునుకోరు మధ్యస్థులు, అప్రియులు, బంధువులు, సాధువులు, పాపులు అను భేదము భాసింపదు. తనను, ఇతరులను, సర్వమును సచ్చిదానంద బ్రహ్మమేనని నిశ్చయించి యుండును.[4]

తననే సర్వభూతములందున్న క్షేత్రజ్ఞునిగాను సర్వభూతములందున్న క్షేత్రజ్ఞుడే తానని స్థిరనిశ్చయముతో నుండును.[5] ఈ జ్ఞాని సర్వభూతములను సచ్చిదానంద బ్రహ్మగాను, స్వస్వరూపముగాను చూచును.[6] సర్వభూతములకు ఈ జ్ఞాని వలన ఎట్టి భయము లేదని ప్రతిజ్ఞ చేసి, అట్లే ప్రవర్తించి అహింసకుడై సుఖదుఃఖాదుల నన్నిటిని తనకువలెనే సర్వులకు చూచును.[7] ప్రారంభమందు వీరు రాజస తామస జ్ఞానాదులను పరిత్యజించి సాత్విక జ్ఞానము నవలంబించి[8] సర్వేంద్రియ జయమునొంది సర్వత్ర సమబుద్ధి గలిగి

---

(1) బన్ధు రాత్మా ఽఽత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః।అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ 6-6. (2) జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః । శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః 6-7. (3) జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః । యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః 6-8. (4) సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు । సాధు ష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే 6-9. (5) సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని । ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః 6-29. (6) సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః । సర్వథా వర్తమానో ఽపి స యోగీ మయి వర్తతే 6-31. (7) ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యో ఽర్జునః । సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః 6-32. (8) సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ। ప్రమాదమోహౌ తమసో భవతో ఽజ్ఞాన మేవ చ 14-17.

యుందురు.[1] దేహవ్యాపారము లన్నిటియందును ఆత్మస్వరూప జ్ఞానము తొలగకుండును.[2] శాస్త్రాచార్యోపదేశముల ననుసరింతురు.[3] వీరి మనస్సు సర్వదా బహిర్ముఖము గాక ఆత్మ యందే లీనమైయుండును.[4&5] పూర్వమున్న అవిద్యనంతను, నిశ్శేషముగా పోగొట్టుకొని జ్ఞానమాత్రస్వరూపులై యుందురు. దేహాదికమంతయు, తత్కృత ధర్మాధర్మాదులును అవిద్యావిషయములే నని నిశ్చయింతురు.[6] వీరు సంసార వృక్షమును అసంగమను శస్త్రముచే ఛేదించి[7] సంసార నివృత్తికరమగు అద్వితీయాత్మైకత్వ పదనిరతులై బ్రహ్మాత్మకంటె వేరుగా జగత్తు లేనేలేదని నిశ్చయింతురు.[8] ఎట్టి దేహవ్యాపారమందును సక్తులు గారు.[9] అజ్ఞాన విలసితమగు సర్వజగత్తును జ్ఞానముకంటె వేరుగా తలపక ఎట్టి విపర్యాసము నొందరు.[10] సక్తతగాని, అహంకారము గాని, ఫలేచ్ఛగాని లేక దేహవ్యాపార మొనర్తురు.[11] అందుకు కారణమేమనగా, ప్రతి దేహధారి యొనర్చు క్రియామాత్రము మూడు దశలలో నుండును.

1. ఆలోచనాదశ—ఇదియే "తపస్స"నబడును.

---

(1) సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః । తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః 12-4. (2) సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః । మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ 18-56. (3) సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః । ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్ 18-64. (4) మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు। మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే 18-65. (5) మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు । మామేవైష్యసి యుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః 9-34. (6) జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః తేషా మాదిత్యవ జ్జ్ఞానం ప్రకాశయతి త త్పరమ్ 5-16. (7) న రూపమస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాది ర్న చ సంప్రతిష్ఠా । అశ్వత్థ మేనం సువిరూఢమూలం అసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా 15-3. (8) తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తన్తి భూయః । త మేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ 15-4. (9) తది త్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపఃక్రియాః । దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః 17-25. (10) తస్మా దజ్ఞానసమ్భూతం హృత్స్థంజ్ఞానాసి నాత్మనః । ఛిత్త్వైనం సంశయం యోగం ఆతి ష్ఠోత్తిష్ఠ భారత । 4-42. (11) తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర । అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః 3-19.

2. తదనుకూలముగా ప్రవర్తించుటకొరకు తన దేహేంద్రియ, ద్రవ్యాదికమును వినియోగమొనర్చుట. ఇది దానమనబడును.

3. పై పెట్టుబడిద్వారా తనకు తెలిసినంతవరకు గొప్ప ఫలమును తాను పొందు టకు ప్రయత్నించుట ఇది యజ్ఞమనబడును.

ఇందులకు అతనికి ప్రయోజకములు మూడు. (1) తాను గొప్పవాడు కావలెనను అభిలాష, (2) తన తాహతు, జ్ఞానము లేక అధికారము, (3) తానొనర్చు పని యందలి ఏకాగ్రతా, శ్రద్ధాభక్తులు.

ఇది నెఱవేఱకపోవుటకు గల ప్రతిబంధకములు మూడు :

1. తాను పనిని ఆలోచించిన ప్రారంభకాలమునుండి గూడ తీవ్రఫలాభిలాష గలిగియుండుట—పని పూర్తిగా తానాచరించినపుడుగదా ఫలమేర్పడుట, పనిని ప్రారంభిం చినంతమాత్రముననే ఫలమేర్పడదుగదా ! తీవ్రఫలేచ్ఛతో వాని ఏకాగ్రత, తాహతు, జ్ఞానము నశించును గాన, ఆ పనిని పూర్తి చేయజాలడు.

2. తానొనర్చు పని మంచిదగునో కాదో యను సంశయము తాను ఫలానుభవ కాలమువరకు, ఉండునో లేదో యను సంశయము.

తనపనిలోని విషయముగాని, సాధనములుగాని, ప్రయత్నముగాని మంచివగునో కావో యను సంశయము.

3. ఈశ్వరుడున్నాడో, లేడో, ఉన్నను, తనకు, ఈశ్వరునకు సంబంధమున్నదో, లేదో, ఉన్నను ఈశ్వరుడు తన కనుకూలించునో లేదో యను ఆత్మదౌర్బల్యము.

ఈ త్రివిధ ప్రతిబంధక నివృత్తికొరకు తానొనర్చు ప్రతిక్రియలోను "ఓం తత్ సత్" అని ఉత్తమాధికారులు ప్రయోగింతురు. దాని యభిప్రాయమేమనగా, "ఈశ్వరుడున్నాడు. నాతో నిత్యము సంబంధించియున్నాడు. నా బుద్ధీంద్రియవ్యాపారము లన్నియు అంతర్యామి ప్రేరణచేతనే కలుగుచున్నవి. నే జేయు పని ఈశ్వరవాక్కగు శాస్త్రములో నా కర్తవ్య ముగా విధింపబడినది. నే నీశ్వరాజ్ఞను పాలించుచున్నాను. ఈ పని, నేనొనర్చు ప్రయత్నము, నా సాధనములు, ఇవన్నియు మంచివి. నేను నిత్యసత్యుడను— ఎట్టిఫలమును కోరుటలేదు.

నేనీ పనిలో ఇతరులకెట్టి యపకారమును తలపెట్టుటలేదు. ఈశ్వరాజ్ఞను పాలించుటయే నా కర్తవ్యము గాన, ఏకాగ్రితతో, నిస్సందేహముగా, స్థిరనిశ్చయముతో ఈ పని నెరవేర్తును. అంతవరకు ఇతరసంకల్పమును గూడ నా దరికి రానీయను" అని ఇట్టి స్థిరనిశ్చయముతో వారు దేహధారణమొనర్తురు.

ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా 17-23.
తస్మా దోమిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ 17-24.
తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపఃక్రియాః
దాన క్రియా శ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః 17-25.
సద్భావే సాధుభావే చ స దిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ ! యుజ్యతే 17-26.
యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం స దిత్యేవాభిధీయతే 17-27.

ఇట్లు తాను పురుషకారమొనర్పకున్నచో, వీని స్వభావజనిత కర్మసముదాయము వీని ఇష్టము లేకున్నను బలాత్కారముగా వీనిని స్వాభావిక ప్రవృత్తిలో నడిపించును.[1] పరమార్థసాధకులగు కర్మయోగి ధ్యానయోగులకంటె ఈ సన్న్యాసియే ఉత్తముడై భక్తుడనబడును.[2] ఆత్మయే పరమానందరూపమగుటచే వీరికి స్వరూపానందముకంటె వేరగు సుఖముగాని ప్రేమాస్పద పదార్థముగాని లేదు.[3]

ఈ జ్ఞానయోగముకంటె పవిత్రతమముగాని, దీనితో సమానముగాని యగు సాధన మింకొకటి లేదు.[4] వీరు దేహేంద్రియ సంఘాతమును, శబ్దస్పర్శాది విషయములను కర్తృ

(1) స్వభావజేన కౌంతేయ నిబద్ధ స్స్వేన కర్మణా ! కర్తుం నేచ్ఛసి య న్మోహాత్ కరిష్య స్యవశో౽పి తత్ 18-60. (2) తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తి ర్విశిష్యతే । ప్రియో హి జ్ఞానినో౽త్యర్థం అహం స చ మమ ప్రియః 7-17. (3) న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః । భవితా న చ మే తస్మాత్ అన్యః ప్రియతరో భువి 18-69. (4) న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే । తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి 4-38.

భావమును, త్రిగుణాత్మకమగు ప్రకృతిపరిణామమేనని తలచి తమను గుణవ్యాపార సాక్షిభూతునిగా గుర్తింతురు.[1] వీరు ప్రతి జన్మలోను నశించు క్షరమగు స్థూలదేహమును, ఎన్ని జన్మలనుంచియు నశింపక అక్షరమగు మాయాశక్తిని మిథ్యాభూతములని గ్రహించి, సర్వవ్యాపకుడైన ఉత్తమపురుషుడను సచ్చిదానంద పరమాత్మను తననుగానే నిశ్చయింతురు.[2&3] కేవల కర్మఠులు, దక్షిణాయన మార్గమున పోయి సుఖముల ననుభవించి తిరిగి పుణ్యక్షయమందు భూలోకమందు జన్మింతురనియు విద్యాసహితముగా ఫలాపేక్షలేక కర్మయోగమునుగాని, ధ్యానయోగమునుగాని ఆచరించువారు ఉత్తరాయణమార్గమునపోయి బ్రహ్మలోకమం దుందురనియు, గుర్తించిగూడ ఆ రెంటియందుగూడ విరాగులై జ్ఞాననిష్ఠులై యుందురు.[4] వీరికి కర్మతో నెట్టి ప్రయోజనము లేదనియు, కర్మల నాచరింపనిచో ఎట్టి ప్రత్యవాయము లేదనియు, బ్రహ్మాండమం దెట్టి పదార్థము నాశ్రయించియు సాధించదగిన ప్రయోజనములేదనియు నిశ్చయముండును.[5] ఇహజన్మలోగాని, పూర్వజన్మలోగాని, స్వధర్మానుష్ఠానమొనర్చి సిద్ధులై ఈ జన్మలో సంన్యాసులై,[6] శబ్దాదివిషయములను పరిత్యజించి, రాగద్వేషములులేక నిర్మలమగు సాత్త్వికబుద్ధితో సాత్త్విక ధైర్యముతో దేహమును నియమించి[7] అరణ్య, నదీపులిన, గిరిగుహాది వివిక్తదేశమందుండి, లఘువుగా సాత్త్వికాహారమును భుజించి మనోవాక్కాయములను నియమించి బ్రహ్మలోకమునుగూడ తృణీకరించు వైరాగ్యము గలిగి ధ్యానయోగనిరతులై సమాధినిష్ఠులగుదురు.[8] అహంకార, మమకార, బల, దర్ప, కామక్రోధరహితులై బ్రహ్మభావము నొందుదురు.[9]

---

(1) నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి । గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి 14-19. (2) ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ । క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే 15-16. (3) ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః । యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః 15-17. (4) నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున । 8-27. (5) నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన । న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థ వ్యపాశ్రయః 3-18. (6) సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే। సమాసేనైవ కౌంతేయ: నిష్ఠా జ్ఞానస్య యా పరా 18-50. (7) బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్యచ । శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ 18-51. (8) వివిక్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః 18-52 (9) అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే 18-53.

వీరెల్లపుడు అసత్యజడదుఃఖమగు త్రిగుణాత్మకప్రకృతిని సచ్చిదానంద లక్షణమగు బ్రహ్మాత్మను వివేచనచేసియుందురుగాని అన్యోన్యాధ్యాసలో నుండరు.[1] వీరికి శీతోష్ణ సుఖ దుఃఖాదులను కలుగజేయునట్టియు, ఉత్పత్తినాశములుగలవి గనుకనే అనిత్యములగునట్టియు శబ్దస్పర్శాదులున్ను, శ్రోత్రాదీంద్రియములున్ను, ఎట్టి బాధను కలుగజేయజాలవు.[2] వీరు స్వస్వరూపమునుండి యెపుడును ప్రచ్యుతులై మోహమునొందరు.[3] అగ్ని కట్టెలను భస్మ మొనర్చునట్లు జ్ఞానము సర్వజన్మ కర్మలను భస్మమొనర్చుటచే వీరికి కర్మబంధముగాని, తన్మూలమగు జననాదులుగాని యుండవు.[4] ప్రారబ్ధకర్మ ననుసరించి వీరిదేహ మెట్లు ప్రవర్తించుచున్నను, అందు వీరికి అహంకార మమకారము లుండవు. వీరికి సంచితకర్మ నశించునుగాని ప్రారబ్ధకర్మ యుండును.[5] అనేకజన్మలం దాచరించిన కర్మయోగముచే చిత్తశుద్ధి గలిగి పాపము సమాప్తప్రాయముగా నుండువారికి మాత్రమే ఇట్టి జ్ఞానయోగము సిద్ధించును.[6] జన్మజరామరణాది నివృత్తికొరకు ఇట్టి సంన్యాసయోగము సిద్ధించి సమగ్రముగా ఆత్మైకత్వ విజ్ఞానమును, సమస్త కర్మవిజ్ఞానమును పొందెదరు.[7] వీరు తమనే అధిభూత, అధిదైవ, అధియజ్ఞాదిరూప సర్వజగత్తుగాను, జగత్తే తాముగాను గుర్తింతురు. ఈజ్ఞానోదయ కాలమునుండి దేహపతన పర్యంతము అట్టి నిశ్చయము తొలగకయే యుందురు. వాపీకూప తటాక నదీజలాదు లెట్లు మహాసముద్రోదకాంతర్భాగములో అట్లే ఈ సంన్యాసులు తమ నిజరూపమగు బ్రహ్మాత్మయందు వేదములు, అందలి కర్మోపాసనాదు లన్నియు, అంత

---

(1) య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ । సర్వథా వర్తమానోపి న స భూయోఽభిజాయతే 13-23. (2) యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ। సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే 2-15. (3) యజ్ జ్ఞాత్వా న పున ర్మోహం ఏవం యాస్యసి పాణ్డవ। యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి 4-35. (4) య థైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసా త్కురుతేఽర్జున। జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా 4-37 (5) య దహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే । మిథ్యైవ వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి 18-59. (6) యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ । తే ద్వంద్వమోహ నిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః 7-28. (7) జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే । తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం అధ్యాత్మం కర్మ చాఖిలమ్ 7-29.

ర్భాగములేనని తలచును.[1] సమస్త కర్మయోగమును జ్ఞానములో పరిసమాప్తమగును.[2] వీరిది వరలో దురాచారులైనను అనన్యచిత్తముతో నీరీతిగా స్వస్వరూపజ్ఞానులైనచో వారు కృతార్థులే యగుదురు.[3]

## 3. నిదిధ్యాస

వీరు సద్గురువుల మూలముగా శ్రవణముచే గ్రహించిన ప్రమేయమును మనన మొనర్చునపుడు కొంతకాలము స్వరూపస్థితిని, మరికొంతకాలము దేహాత్మభ్రాంతిని పొందుచు వెంటనే స్వరూప జ్ఞానముచే నాభ్రాంతిని వారించుకొనుచుందురు. ఏలననగా అనేక జన్మలనుంచి వీని అవిద్య అంతఃకరణద్వారా ద్వైతదృష్టిని స్థిరీకరించియున్నది. ఈ అంతఃకరణమే అంతర్వృత్తిచే అహంకారమును, బాహ్యవృత్తిచే ఇదంకారమును కలుగచేయుచున్నది. "నేను చూచుచుంటిని, వినుచుంటిని" ఇత్యాది వ్యవహారమంతయు అంతఃకరణముయొక్క అంతర్వృత్తియే. అట్లే "ఇదిఘటము, వృక్షము, భూలోకము, స్వర్గలోకము" ఇత్యాది బాహ్యవ్యవహారమంతయు నీ అంతఃకరణముయొక్క బాహ్యవృత్తియే. గాన అంతఃకరణమున్నంతవరకు ఇతడే జీవుడు. అంతఃకరణ దాని కారణమగు జ్ఞానమందు లీనమైనపు డీతడే బ్రహ్మయగుటచే ఈ జ్ఞాని అంతఃకరణ విలయమునకు ప్రయత్నింపవలెను. ఈ ప్రయత్నమే నిదిధ్యాస యనబడును.

అంతఃకరణ ప్రతిక్షణచంచలమై అనేకజన్మవాసనాబలముచే నీతనిని స్వవ్యాపారమందు శక్తునిచేయ ప్రయత్నించుచుండ నీజ్ఞాని క్రమముగా అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను దానిని విలయింపజేసి బ్రహ్మభావము నొందును.[4] వివేకబుద్ధిచేత సర్వేంద్రియ విష

(1) యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే । తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః 2-46. (2) శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప। సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే 4-33. (3) అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ । సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః. 9-30. (4) అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా । పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్. 8-8.

యక అంతఃకరణవృత్తులను సంన్యసింపజేసి జ్ఞానమాత్రస్వరూపు డగును.[1] కావుననే వీరు తపస్వులకంటె, కర్మయోగులకంటె, ధ్యానయోగులకంటె గొప్పవారు.[2] అంతఃకరణ ధర్మములగు ఆయా కామము లన్నిటిని పరిత్యజించి చిత్తమును స్వరూపజ్ఞానమందు లయింపచేతురు.[3] గాలిలేని ప్రదేశమందలి దీపశిఖవలె వీరి స్వస్వరూపస్థితి నిశ్చలమగును.[4] అపుడు వీరికి ఆత్మయే సర్వమగును. అంతకంటే వేరుపదార్థముండదు.[5] బుద్ధికి గోచరమగు విషయానందాదులకు మూలభూతమగు ఆత్మానందము వీరి కపుడు భాసించును.[6] ప్రపంచ మందలి ఆనందములన్నియు దీనిమాత్రలేగాని దీనికంటె గొప్పవిగావు. అందుచే వీరపుడు సుఖస్వరూపులగుటచే సుఖదుఃఖాత్మికమగు జగత్తు వీరిని బాధింపలేదు.[7] అట్టి స్థితియే నిది. ధ్యాస యనబడును. ధ్యానకాలమం దీస్థితి నభిలషించి ప్రయత్న మొనర్చును. ఇపుడాస్థితియే అయత్నసిద్ధమగును. అపు డీతడు సాధకదశలోను, ఇపుడు సిద్ధదశలోను ఉండును. ఇది పరి పక్వమైనపుడు సమాధియనబడును.[8] ఇదియే అంతఃకరణవలన గలుగు దుఃఖసంయోగము లను వేరుచేయుచున్నందున యోగమనబడును.[9] శ్రవణ మననములచే నిశ్చయింపబడిన స్వస్వరూపమందు చిత్తమును లయింపజేయుటచే భక్తియనిగూడ యనబడును.

వీరికి త్రిగుణాత్మకమగు ప్రకృతి సంబంధముండదు. బ్రహ్మాభావమను మోక్షము

---

(1) చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః। బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ 18-57. (2) తపస్విభ్యో ఽధికో యోగీ జ్ఞానిభ్యో ఽపి మతోఽధికః । కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ః 6-46. (3) యదా వినియతం చిత్తం ఆత్మన్యే వాఽవతిష్ఠతే । నిస్పృహ స్సర్వ కామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా 6-18. (4) యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగ మాత్మనః 6-19. (5) యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగ సేవయా । యత్ర చైవాత్మ నా ఽఽత్మానం పశ్య న్నాత్మని తుష్యతి 6-20. (6) సుఖ మాత్యన్తికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియం । వేత్తి యత్ర న చైవాఽయం స్థిత శ్చలతి తత్త్వతః 6-21. (7) యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః । యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచా ల్యతే 6-22. (8) శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా । సమాధా వచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి 2-53. (9) తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం । స నిశ్చయేన యోక్తవ్యో యోగో ఽనిర్విణ్ణచేతసా. 6-23.

నొందుట కర్హులు వీరే[1] మరణధర్మ రహితమైనట్టియు, వికారము లేనట్టియు, సచ్చిదానంద బ్రహ్మ తామేనని వీరు తలచి సుఖరూపులగుదురు.[2] వీరు మోక్షము పరమావధిగాగల శాంతిని పొందియుందురు.[3] వీరికి నిశ్శేషముగా అవిద్యాకల్మషము నశించినందున బ్రహ్మా నందరూపులగుదురు.[4] వీరు మనోవాక్కాయములకు గోచరము కానట్టియు, సత్య, జ్ఞాన, ఆనంద, అనంతలక్షణమైనట్టి కూటస్థ బ్రహ్మరూపులే యైయుందురు.[5] ఈ భక్తియోగము సామాన్యులకు మహాక్లేశకరమై సాధ్యపడదు.[6]

## సగుణ, నిర్గుణ సమన్వయము

ఒకే సచ్చిదానంద లక్షణముగు పరమాత్మ సగుణమని ఒకదశలోను, నిర్గుణమని వేరొకదశలోను చెప్పబడును. ఎట్లనగా వేదవిద్యకు 1 అధ్యయనము 2 తదర్థబోధ 3 తదా చరణ 4 తత్ప్రచారము అను నాల్గుదశలు గలవు. ఇవి ఒక గురువు, ఒక శిష్యుడు ఇద్దరకు సంబంధించియున్నది. అందు గురువు వేదము నధ్యయనమొనర్చి, దాని యర్థమంతయు నెరిగి, అట్లుగా తా నాచరించుచు, అందలి మర్మముల నన్నిటిని తా ననుభవించి ఇతరుల కుపదేశింప సమర్థుడగు వేదవిదుడు—ఇక శిష్యుడు ఐదేండ్ల వయస్సుకు పైన ఏవయస్సులో నైనను వేదాధ్యయనాభిలాష గలవాడు - ఇందు గురువుయొక్క విద్య, తన ప్రయత్న మెంతమాత్రము లేకున్నను స్థిరముగా నుండి తనతో ఐక్యము నొందియున్నది. ఆ దశలో అతని విద్య అతడే గాని అతనికంటె ఎంతమాత్రము వేరుగాదు. సర్వకాల సర్వావస్థ లందును అతడు విద్యారూపుడే. గాన అతని విద్య "నిర్గుణము"—అతని బుద్ధి వ్యాపార జనితమైన దశలో మాత్రమే యది సగుణమనబడును.

ఇక విద్యార్థియగు శిష్యుడు ప్రారంభదశనుండి, తనకంటె వేరై తనకు తెలియని

---

(1) మాం చ యో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే । సగుణా న్సమతీత్యైతాన్ బ్రహ్మ భూయాయ కల్పతే. 14-26.(2)బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమ్ అమృతస్యావ్యయస్య చ శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ 14-27. (3) యుఞ్జ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియత మానసః । శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి 6-15. (4) యుఞ్జ న్నేవం సదాఽఽత్మానం యోగీ విగత కల్మషః । సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యన్తం సుఖ మశ్నుతే. 2-28. (5) యే త్వక్షర మనిర్దేశ్యం అవ్యక్తం పర్యుపాసతే । సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువం 12-3. (6) క్లేశోఽధికతర స్తేషాం అవ్యక్తాసక్త చేతసామ్ । అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే 12-5.

విద్యను గురువునుండి తన బుద్ధీంద్రియాది సాధనములతోను, పుస్తకము, దీపము మొదలగు బాహ్యసాధనములతోను గ్రహించును. ఆ దశలో వాని విద్య అనేక గుణములతో కూడి యున్నది. కొంత అభ్యాసమైన తర్వాత గురువు అను గుణము లోపించి, పుస్తక, దీప-బుద్ధీంద్రియాది సాధనములతో పఠించును. ఆ దశలో వాని విద్య సగుణమే గాని, వెనుకటి కంటె ఒక గుణము తగ్గినది. ఇంకను కొంతకాలమునకు పుస్తక, దీప చక్షురాది సాధనములు లోపించి, కేవలబుద్ధియను సాధనముతోనే మనన మొనర్పబడును. ఆ దశలో వాని విద్య సగుణమే గాని వెనుకటికంటె కొన్ని గుణములు తగ్గినవి. ఇట్లు నిరంతర మనన మొనర్చి, అందలి యర్థమెరిగి, ఆ ధర్మముల నన్నిటిని తా నాచరింపగా పరిపక్వ దశలో నాతని విద్య, ఆతని బుద్ధివ్యాపారము లేకయే నిత్యసిద్ధమను. ఆ స్థితిలో నాతని విద్య "నిర్గుణ" మనబడును. ఇట్లే అతడు తన విద్య నితరులకు బోధింపదలచినపు డది విద్యార్థి బుద్ధిబలము ననుసరించి, చిన్న చిన్న పదములతో బోధించు దశలో తన బుద్ధి వ్యాపార గుణ విశిష్టమై సగుణమనబడును. ఇట్లు వినియోగ దశలో సగుణమనియు, తదతిరిక్తస్థిర దశలో నిర్గుణమనియు వ్యవహరింపబడును. ఈ వేదవిద్య సాధకునకు ఇట్లు సగుణమైన దశలో దానిచే ప్రతిపాదింపబడు పరమేశ్వరుడుగాని, తత్ఫలమగు మోక్షముగాని ఇవన్నియు సగుణమనియు, ఆ వేదవిద్యయే సిద్ధునకు నిర్గుణమైన దశలో, దానిచే ప్రతిపాదింపబడు పరమాత్మగాని, తత్ఫలమగు మోక్షముగాని నిర్గుణమనియు చెప్పబడును. అట్లే శబ్ద ముచ్చరించి అర్థమేమి యను విచారించు దశలో నది సగుణము. అట్లు గాక అర్థమెరిగి శబ్దముచ్చరించు దశలో, శబ్దార్థములకు భేదమే లేని దశలో నది "నిర్గుణము"—

అనేక జన్మలందలి కర్మయోగబలముచే చరమజన్మలో వీరి కిది సిద్ధించును.[1] వీరు ధర్మమునుండి తొలగనట్టియు, మరణ ధర్మరహితమైనట్టియు, ఈ బ్రహ్మభావమందు స్థిరమగు భక్తిశ్రద్ధలు గలిగి బ్రహ్మయే యగుదురు.[2] వీరే సర్వభూతములకు ఆత్మ. వీరి కంతఃకరణము లయమొందినందున జగత్సంబంధముండదు.[3] వీరు అన్నివిధములగు ధ్యానయోగులలోను

(1) బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే । వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః 7-19. (2) యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే । శ్రద్దధానా మత్పరమాః భక్తా స్తేఽతీవ మే ప్రియాః 12-20. (3) యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః । సర్వభూతాత్మ భూతాత్మా కుర్వ న్నపి న లిప్యతే 5-7.

శ్రేష్ఠులు.[1] వీరి స్వస్వరూపజ్ఞానముచే సర్వకర్మలును, సర్వసంశయములును నిశ్శేషముగా దహింపబడినవిగాన వీరికి కర్మబంధ మెంతమాత్రమును ఉండదు.[2]

## భక్తిలో వివిధ దశలు

భక్తి ఐదు దశలలో నుండును :-

1. ఊడుగచెట్టున వ్రేలాడుకాయ, ఉరుము ధ్వనిచేయు కాలమందు చెట్టున కంటుకొని యుండి యితర కాలములో వ్రేలాడునట్లు జీవుడు ప్రారంభదశలో తన కెద్దియేని ఆపద సంభవించినపుడు మాత్రము పరమేశ్వరుని భజించి, వానియందుదాగి, శరణుజొచ్చి, ఆ దుఃఖభయ నివృత్త్యనంతరము తిరిగి యథాప్రకారము, దేవుని మరచి, స్వతంత్రముగా వ్యవహరించును. ఇదియే వేదబోధిత కామ్యకర్మ-ఆ భయకాలమందు మాత్రము వేదోక్త కామ్యకర్మ నాచరించి, అనంతర మెట్టి వేదకర్మను ఆచరింపదు.

2 ఇనుము, సూదంటుఱాయి సమీపములో నున్నపుడు మాత్రము, తత్ప్రవణమై, దాని యం దతికియుండునట్లు, జీవుడు తన సంధ్యాది వేదోక్తకర్మకాలములందు మాత్రము, భగవత్ప్రవణుడై, భగవంతునకతుగుకొని యుండును. ఇతరసమయములందు భిన్న దేశములందున్న, ఇనుము, అయస్కాంతముల కాకృష్యాకర్షకభావములేనట్లు జీవునకు, ఈశ్వరునకు ఆకృష్యాకర్షకభావ ముండదు. ఈ రెండవదశయే, వేదమందలి వర్ణాశ్రమాచార కర్మయనబడును.

3. పతివ్రత తన భర్తసన్నిధియందున్నను, దేశాంతరమందున్నను, నిరంతరము, తన చిత్తములో భర్తను ధ్యానించుచుండునట్లు, జీవు డీదశలో, సర్వకాల సర్వావస్థలందును, 1 వేద, 2 తదర్థ, 3 తదుదిత ధర్మాచరణ, 4 సత్ప్రచారములద్వారా, నిరంతరముగా

---

(1) యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా । శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః 6-47. (2) యోగసన్న్యస్త కర్మాణం జ్ఞానసఞ్ఛిన్న సంశయం । ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయః 4-41.

వేదవేద్యుడగు భగవంతుని ధ్యానించును. ఈ స్థితియే వేదమందలి ఈశ్వరార్పణబుద్ధ్యా నిత్యకర్మానుష్ఠాన మనబడును.

4. లత, ఒక ఆలంబనము లేకుండా ఎట్లు తాను క్షణమాత్రముగూడ నిలువజాలదో, అట్లు జీవు డీదశలో తాను వేదము నభ్యసించినది మొదలు దేహము మరణించువరకు, నిరంతరముగా తాను ఈశ్వరావలంబకుడననియు, ఆ యవలంబనమే లేకున్నచో తానాలోచించలేనని, చూడలేనని, వినలేనని, ఎట్టి వ్యాపారముచేయలేనని తలచి, సర్వకాల సర్వావస్థలందును ఆయన సమీపమందె తన చిత్తము నుంచును - వేదమందలి ఉపనిషత్తులలోనున్న ఉపాసనా "భాగము లేక ధ్యానయోగ మనబడును.

5. గంగా గోదావర్యాది నదులు, సముద్రములో కలసిపోయినతర్వాత, తమ నామరూప భేదములనువదలి, అన్నియు "సముద్ర" సంజ్ఞను పొందినట్లు జీవుడు సర్వదా తాను సముద్రస్థానీయుడగు పరమాత్మలో కలసిపోయి తాను సముద్రమో లేక పరమాత్మయే నను నిశ్చయముతో నుండును. తాను దేహధారిననిగాని, జీవభేదములుగాని, ప్రపంచ భేదముగాని ఎంతమాత్రము తలపడు. ఈదశకే వేదములోని ఉపనిషద్భాగములో నున్న జ్ఞానభాగమని పేరు.

## జీవన్ముక్తి

వీరిట్లు బ్రహ్మభావము నొందినను ప్రారబ్ధకర్మ లక్ష్యము పై వదలబడిన బాణమువలె అప్రతీకారమగుటచే ప్రారబ్ధకర్మఫలమగు దేహముండునుగాని, వేయించిన ధాన్యము లెట్లు భక్షణామాత్రోపయుక్తములై తిరిగి మొలచుటకు శక్తిలేకుండునో అట్లే వీరి దేహము అనుభవించుచున్నను, వీరికర్తృత్వాభిమానము లేనందున ఈ దేహాచరణలవలన ధర్మాధర్మములద్వారా భవిష్యజ్జన్మరాదుగాన వీరు జీవించియున్నట్లు లోకదృష్టిలో మున్నను, ముక్తులేగాన జీవన్ముక్తులనబడుదురు. వీరిస్థితికే బ్రాహ్మీస్థితియని పేరు.[1] వీరే స్థితప్రజ్ఞులనబడెదరు. జీవదశలో, వారి ప్రజ్ఞా, దీపమొక్కటే, హృదయాకాశ కుండలోనుండి,

(1) ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి । స్థిత్వాస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి 2.72.

శ్రోత్రాదీంద్రియములను రంధ్రభేదములద్వారా, ప్రసరించుచూ శబ్దాదిద్వారా, ప్రజ్ఞాదీప భేద భ్రాంతిని కలిగించుచున్నది గాన ఆ దశలో వారి ప్రజ్ఞ చలమైయుండును. ఈ జ్ఞాని దశలో అట్లుగాక సర్వశబ్దాదులు ఒకే ప్రజ్ఞయొక్క విశేషములేనను నిశ్చయమున్నది గాన వీరు స్థితప్రజ్ఞు లనబడెదరు. వీరి స్వరూప భాషాదిలక్షణము లెట్లుండునో తెలుసుకున్నచో వాటి నభిలక్షించు స్థితి నభ్యసింప వీలగును.[1] వీరు మనస్సులో ఎట్టి కోరిక లేకుందురు. ఆత్మ స్వరూపమందే నిత్యతృప్తులైయుందురు.[2] దేహమునకు దుఃఖములు సంభవించినపుడు ద్వేష మొందరు. సుఖము సంభవించినపుడు తృష్ణలేకుందురు. రాగద్వేష భయక్రోధాదులు వీరి కుండవు.[3] దేహవ్యాపారములగు స్నానాహారాదులందు ప్రాప్తించు శుభాశుభములందు సుఖదుఃఖముల నొందరు.[4] తాబేలు తన అంగముల నుపసంహరించుకొన్నట్లు వీరు తమ ఇంద్రియములను శబ్దాదివిషయములనుండి ఉపసంహరింపజేతురు.[5] తీవ్ర తపస్సులోనున్న సామాన్యులకు విషయములు గ్రహింపబడక మరలిన, వాటియం దనురాగము మాత్రము మరలక యుండును. ఈ జీవన్ముక్తున కాయనురాగముగూడ నుండదు. వీరి విషయవిజ్ఞానము నిర్బీజమగును.[6] ఒకవేళ వీరి యింద్రియములు వీనిమనస్సును బలాత్కారముగా హరించినను వెంటనే వాటిని నిగ్రహించి మనస్సునుగూడ స్వస్వరూపమందు లయింపజేతురు.[7] వారి విషయజ్ఞానము నిర్బీజమైనందున అంతఃకరణము లేనందున, వీరి కెట్టి దుఃఖమును గలుగదు. పగలు జాగ్రద్దశయందలి సర్వలోక వ్యవహారమును అవిద్యావిలాసమైనది. రాత్రి సుషుప్తి దశయం దెట్టి అవిద్యావిలాసము లేకుండునుగాన ఈజ్ఞాని లోకులందరి జాగ్రత్తమ

(1) స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవః స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత, వ్రజేత కిమ్ 2-54. (2) ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థః మనోగతాన్ । ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే 2-55. (3) దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః । వీత రాగ భయ క్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే 2-56. (4) యః సర్వ త్రానభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభం । నాభి నందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా 2-57. (5) యదా సంహరతే చాయం కూర్మో ఽంగా నీవ సర్వశః । ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా 2-58. (6) విషయా వినివర్తంతే నిరా హారస్య దేహినః । రసవర్జం రసో ఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే 2-59. (7) యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః । ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః 2-60

రాత్రిగాను, లోకులందరి సుషుప్తిని తనకు పగలుగాను చూచును.[1] సముద్రము, నదులు తనలో కలువని వేసవియందు క్షీణింపదు. నదీ జలమంతయు తనలో కలియునపుడు పెరుగదు. అట్లే ప్రాపంచకవిషయము లీ జ్ఞానికి సన్నిహితములైనను కాకున్నను ఎట్టి వికారమును పొందింపలేవు.[2] వీరు ఎట్టికోరికనుగాని, అహంకార మమకారములుగాని ఇత్యాది అంతఃకరణ కార్యములేక స్వస్వరూపస్థితిలో నుందురు.[3]

వీరు తమ దేహవ్యాపారము త్రిగుణాత్మకమగు దేహము ఆ యా గుణములందు ప్రవర్తించుచున్నట్లు గుర్తించి తమను దానికంటె విలక్షణమైన వానినిగా నిశ్చయించి యుందురు.[4] సర్వము వీరి ఆత్మమాత్రమే. అంతకంటె వేరుగా నేమియు వీరిదృష్టిలో లేదు గాన వీరెట్టి పనియందు ప్రవర్తింపరు.[5&6] ఒకవేళ దేహము అహోరాత్రములందు ప్రవర్తించినను వీరి కర్తానితో నెట్టి లేపమున్ను లేదు.[7] వీరుచూచుట, వినుట, స్పృశించుట, వాసనచూచుట, భుజించుట, నడచుట, నిద్రించుట, ఊపిరిపీల్చుట, మాట్లాడుట, ఇత్యాది సర్వదేహ వ్యాపారములందును ఆ యా దేహేంద్రియాదు లా యా విషయములందు ప్రవర్తించుచున్నట్లును తమ కర్తానితో నెట్టిసంబంధము లేనట్లును నిశ్చయింతురు.[8&9] తామరాకుపై ఉదకబిందువు వలె వీరెట్టి దేహవ్యాపారములకును అంటరు.[10]

---

(1) తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః । వశేహి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా 2-61. (2) యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః 2-69. (3) ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠమ్ సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్ తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న కామకామీ 2-70. (4) విహాయ కామాన్ య స్సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః । నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి 2-71. (5) తత్త్వవి త్తు మహాబాహో। గుణకర్మ విభాగయోః । గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే 3-28. (6) యస్త్వాత్మరతి రేవ స్యాత్ ఆత్మతృప్త శ్చ మానవః । ఆత్మ న్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే 3-17. (7) యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి । త స్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి 6-30. (8) యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః । సర్వ భూతాత్మ భూతాత్మా కుర్వ న్నపి న లిప్యతే 5-7. (9) నైవ కిఞ్చి త్కరో మీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ పశ్యన్, శృణ్వన్, స్పృశన్, జిఘ్రన్, అశ్నన్, గచ్ఛన్, స్వపన్, శ్వసన్ 5-8. (10) ప్రలపన్ విసృజన్, గృహ్ణన్, ఉన్మిషన్, నిమిష న్నపి । ఇన్ద్రియా ణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ 5-9. (11) [illegible]ణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః । లిప్యతే న స పాపేన పద్మపత్ర మివా[illegible] 5-10.

వీరు విద్యాంసుడగు బ్రాహ్మణుని యందు, గోవునందు, ఏనుగు నందు, కుక్క యందు, శ్వపాకుని యందును, ఉపాధియగు దేహమును చూడక ఆత్మను మాత్రమే చూచుటచే సమదృష్టి గలిగియుందురు.[1] కావుననే వారు జీవించి యున్నప్పుడే జన్మ జయింపబడినది గాన వారెల్లపుడు బ్రహ్మయే యగుదురు.[2] వీరికి సుఖముగాని, ఆరామముగాని, ప్రకాశముగాని, ఇత్యాదులన్నియు వారిఆత్మయేగాని వేరొకటిలేదు.[3] ఈసంన్యాసులే భక్తులనియు జీవన్ముక్తులనియు చెప్పబడుదురు. వీరు సర్వభూతములను ద్వేషింపక మిత్రులై దయగలిగి అహంకార మమకారములు లేక సుఖదుఃఖములందు సములయి.[4] నిత్య సంతుష్టులై.[5] ఏహ్యాఘాతులై లోకులచే వీరుద్వేషమునొందక లోకులనుద్వేషింపకహర్షామర్షములులేక[6] ఏట్టిఅపేక్ష లేక శుచులై యెట్టికార్యములనుప్రారంభింపక[7] సుఖ,ద్వేష,శోక,కాంక్షలులేక[8] శత్రుమిత్రభేదములేక శీతోష్ణసుఖదుఃఖాది విరుద్ధద్వంద్వములందు భేదదృష్టిలేక[9] తమను లోకులు నిందించినను స్తుతించినను యేకరీతిగాభావించి యదృచ్ఛాలబ్ధఆహారవస్త్రశయనాదులతో దేహయాత్ర చేయుచు నొకచోట స్థిరముగా నుండక స్వరూపమునుండి తొలగకుందురు.[10] వీరు జ్ఞాన

(1) విద్యా వినయ సమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని । శుని చైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః 5-18. (2) ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః । నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః 5-19. (3) యో౽న్తస్సుఖో౽న్తరారామః త థాన్తర్జ్యోతి రేవ యః । స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతో౽ధిగచ్ఛతి 5-24. (4) అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ । నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ 12-13. (5) సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః । మ య్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్త స్స మే ప్రియః 12-14. (6) యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః । హర్షామర్ష భయోద్వేగైః ముక్తో య స్స చ మే ప్రియః 12-15. (7) అనపేక్ష శ్శుచి ర్దక్షః ఉదాసీనో గతవ్యథః । సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః 12-16. (8) యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి । శుభాశుభ పరిత్యాగీ భక్తిమా న్య స్స మే ప్రియః 12-17. (9) సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః । శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః 12-18. (10) తుల్య నిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ । అనికేతః స్థిరమతిః భక్తిమా న్మే ప్రియో నరః 12-19.

మాత్ర స్వరూపులగుటచే సర్వము వీరేగాన ప్రియద్వేషాదులుండవు.[1] గావుననే వీరి ప్రవర్తకు నైష్కర్మ్యసిద్ధి యని పేరు.[2] సర్వభూతములందును తనయందును యేకరీతిగా నున్న బ్రహ్మయే వీరు గాన శోక, మోహ, కాంక్షాదు లుండవు.[3] సత్యజ్ఞాన ఆనంద లక్షణమగు బ్రహ్మను వీరు దృఢముగా గుర్తించి బ్రహ్మయైరి.[4]

సర్వకర్మఫలత్యాగ ప్రకరణమందు వివరింపబడిన సాధనము లన్నియు వీరి లక్షణములే. ప్రారంభకుడగు సాధకున కవియే సాధనములున్ను, సిద్ధున కవియే లక్షణములున్నుయగును. అవి యన్నియు సమగ్రముగా నుండును. ఇక కర్మ, ధ్యాన, జ్ఞానములయొక్క ఫలము వివరింపబడును.

## సింహావలోకనము

కర్మయోగముచే, చిత్తశుద్ధి గలవారు, సాధన చతుష్టయ సంపత్తు గలవారై, జగత్తంతయు నామరూపాత్మకమగు కార్యమాత్రమని, ఇది ఆరు వికారముల నెల్లపుడు పొందుచూ, కారణమగు పరమాత్మకంటె భిన్నముగాదనియు, తత్వదృష్టిలో ఆత్మయందు కల్పించబడినదిగాన ఒకే పరమాత్మ విజ్ఞానమే సర్వదా తమ కనుసరణీయమని నిశ్చయించి, సర్వకర్మ సంన్యాసులై, వేదాంతవాక్య శ్రవణ, మనన, నిదిధ్యాసల నొనర్చుచు ఆరూఢ జ్ఞానులగుదురని ప్రదర్శింపబడినది.



---

(1) సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః । యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ 9-29. (2) అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః । నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి 18-49. (3) బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి । సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ 18-54. (4) భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః । తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ 18-55.

శ్రీ

# గీతాసారసంగ్రహము

## 9. ఫల ప్రకరణము



వెనుక సాధన ప్రకరణమందు వివరింపబడిన సాధనములలో సర్వకర్మ ఫలత్యాగమను శీర్షిక క్రింద వివరింపబడినవన్నియు, కర్మ, ధ్యాన, జ్ఞానములను మూడు యోగములకును సహాయములగు సాధనము లగుచు క్రమముగా అభ్యసింపబడి జ్ఞానసిద్ధునకు పూర్తియగును. గాన ఈ ప్రకరణమందు మిగిలిన సాధనముల ఫలము వివరింపబడును.

ఈ ఫలము 1. దక్షిణాయన మార్గము, 2. ఉత్తరాయణ మార్గము, 3. మోక్షము అని మూడు విధములుగ చెప్పబడుచున్నది. వీటి స్వరూప మీ ప్రకరణమందు వివరింపబడును.[1]

### దక్షిణాయన మార్గము

ఇందు కర్మయోగమును విద్యారహితులై కేవలముగా ననుష్ఠించినవారును, స్వర్గాది సుఖము నపేక్షించి ఆచరించువారును ఈ ఫలము నొందెదరు. వీరు సోమపాన మొనర్చి కొంతపాపమును పోగొట్టుకొని స్వర్గములో నొక భాగమగు సురేంద్రలోకము నపేక్షించుటచే మరణానంతర మచట జన్మించి దివ్యభోగముల ననుభవింతురు.[2] ఆ యజ్ఞఫలముపక్షు పరిపోవు నంతకాల మచట వారనుభవించి, ఆ పుణ్యము క్షీణింపగానే తిరిగి భూలోకమందు

(1) యత్ర కాలే త్వనావృత్తిం ఆవృత్తిం చైవ యోగినః । ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 8-23. (2) త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే । తే పుణ్య మాసాద్య సురేంద్రలోకం అశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్ ॥ 9-20.

జన్మించుదురు. ఈ రీతిగా గమనాగమనముల నొనర్తురు.[1] ఈ గమనాది మార్గముతోని ప్రదేశములు ధూమాభిమాని, రాత్ర్యాభిమాని, కృష్ణపక్షాభిమాని, దక్షిణాయనాభిమాని దేవతల ఆధిపత్యములోనివి. అచట చంద్రుని కాంతినే వీరు పొంది తిరిగి భోగానంతరము తిరిగి వత్తురు.[2&3]

## స్వర్గము

భూలోకాది సత్యలోకాంతములగు లోకము లేడింటి యందును, ఉత్తరోత్తరోత్కృష్ట సుఖముండును. ఈసుఖమే స్వర్గమనబడును. ఇది 11 విధములు, 1. యౌవన వంతుడై సర్వవిద్యా పారంగతుడై, ఆరోగ్యబల శోభితుడై సమస్త భూమండలాధిపతియగు సార్వభౌముని యానందము, 2. దీనికి నూరురెట్లు మనుష్య గంధర్వానందము, 3. దానికి నూరురెట్లు దేవగంధర్వానందము, 4. దానికి నూరురెట్లు చిరలోక లోకపితరుల యానందము, 5. దానికి నూరురెట్లు అజానజాన దేవానందము, 6. దానికి నూరురెట్లు కర్మదేవానందము 7. దానికి నూరురెట్లు దేవానందము, 8. దానికి నూరురెట్లు ఇంద్రానందము, 9. దానికి నూరురెట్లు బృహస్పత్యానందము, 10. దానికి నూరురెట్లు ప్రజాపత్యానందము, 11. దానికి నూరురెట్లు బ్రహ్మానందము, పుణ్యోత్కృష్టచే ఈ ఆనందము హెచ్చగును. అనగా బ్రహ్మానందము నూటికినూరుపాళ్ళు ఆనందమేగాని దుఃఖలేశముగూడ అందుండదు. ప్రజాపత్యానందము 99 పాళ్ళు సుఖము ఒకపాలుదుఃఖము. బృహస్పత్యానందమందు 90 పాళ్ళు సుఖము 10 పాళ్ళుదుఃఖము. ఇంద్రానందమందు 80 పాళ్ళుసుఖము 20 పాళ్ళుదుఃఖము. దేవానందమందు 70 పాళ్ళు సుఖము 30 పాళ్ళు దుఃఖము. ఈరీతిగా పుణ్యఫలమగు సుఖము పెరిగినకొలది పాప ఫలమగు దుఃఖము తగ్గును. ప్రకృతిలో రజస్తమస్సులు తగ్గి సత్వము పెరిగినకొలది సుఖము హెచ్చి దుఃఖము తగ్గును. ఇట్టి హెచ్చుతగ్గులతో నొప్పు మనుష్యానందము మొదలు బృహస్పత్యానందము వరకుగల సుఖమంతయు స్వర్గమనబడును. అనగా సంపూర్ణసుఖము మోక్షమని అసంపూర్ణసుఖమంతయు స్వర్గముగ సాధకు డాచరిం

(1) తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి। ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే 9-21. (2) ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే 8-25. (3) శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే । ఏకయా యా త్యనావృత్తిం అన్యయా ఽఽవర్తతే పునః 8-26.

చిన కర్మబలమును బట్టి పైలోకములలో నెద్దియో యొకటి సిద్ధించి అనుభవింపబడి పునరావృత్తి గల్గును. ఈ మొత్తమంతయు దక్షిణాయనమార్గ మనబడును.

## ఉత్తరాయణ మార్గము

కర్మ యోగమును విద్యా సహితముగాను, ఫలాపేక్ష లేకుండగను ఆచరించినవారికిన్ని ధ్యానయోగమును చక్కగా నాచరించినవారికిన్ని సత్యలోకప్రాప్తి గలుగును. అచట వీరి సుఖమే ప్రజాపత్యానంద మనబడును. వీరు వెళ్ళు మార్గమునకు ఉత్తరాయణ మార్గమని పేరు. దీని మార్గప్రదేశములు అగ్ని, జ్యోతిస్సు, అహరభిమాని, శుక్లపక్షాభిమాని, ఉత్తరాయణాభిమాని దేవత అధిపతులుగాగలది.[1] ఇచటకు వెళ్ళినవారు కల్పాంతము వరకు ఒక జగద్వ్యాపారమందు తప్ప మిగిలిన విషయములందు ఆ లోకాధిపతియగు ప్రజాపతితో సమానులై స్వయంప్రతిభాత వేదము గలవారయి వేదాంతమనన నిదిధ్యాస లొనర్చుచు కల్పాంతమందు ఆ లోకాధిపతితో గూడ మోక్షము నొందెదరు. అంతేగాని తిరిగి భూలోకాదులందు దేహధారులు గారు[2] వీరి ప్రకృతి పూర్తిగా సత్వప్రధానముగా నుండును. నిమిత్తమాత్రముగా రజస్తమస్సులు లేశమాత్రముగా నుండును.[3]

## మోక్షము

కర్మయోగికి గాని, ధ్యానయోగికి గాని అవిద్య సమాప్తమయినచో వారల కీ జన్మలోనే సర్వకర్మ సంన్యాస పూర్వకమగు జ్ఞానయోగము సిద్ధించి జీవన్ముక్తులగుదురు. జీవన్ముక్తుడనగా లోకుల దృక్పథమునుబట్టి జీవుడనియు, శాస్త్రదృక్పథమునుబట్టి ముక్తుడనియు వ్యవహరింపబడు ఒకేవ్యక్తి. ఈస్థితి మూడుదశలలో నుండును.

1. సమాధి ప్రధాన జీవన్ముక్తి:—

ఈదశలో అధికారి, సర్వదా సమాధిలో నుండదలచును. అపుడీతనిబుద్ధి సక్రియము గాకుండుటచే ఇతడు నిశ్చలుడు, నిర్వికారుడు, నిష్క్రియుడు. ఒకవేళ సమాధిలోనుంచి

---

(1) అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ । తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః 8-24. (2) శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే । ఏకయా యా త్యనావృత్తిం అన్యయా వర్తతే పునః 8-26. (3) కర్మణ స్సుకృత స్యాహుః సాత్త్వికం నిర్మలమ్ ఫలం । రజస స్తు ఫలం దుఃఖం అజ్ఞానం తమసః ఫలమ్.

ఏకాలమునకైనను లేచినయెడల, తిరిగి తనబుద్ధి దుర్బలమై సక్రియము, సవికారము అగునేమోనను సందేహ మీతనికుండుటచే అతడిట్లు సమాధిప్రధాను డగును. ఎప్పుడైనను ఈదోషము పోగొట్టి తీరవలసినదేగాన వీరిసాధన పూర్తిగాలేదు.

2. విద్యాప్రధాన జీవన్ముక్తి:—

ఈదశలో, అధికారి 'నిరంతరము' బ్రహ్మవిద్యను తాను మనన మొనర్చుట లేక జిజ్ఞాసువులకు బోధించుటలందుమాత్రమే తనసర్వకాలమును వినియోగించును. అట్లొనర్పనిచో నితనిబుద్ధి ఒకవేళ పొరపడునేమోనను అనుమానలేశముండుటచే నిదియు సమగ్ర స్థితిగాదు.

3. వ్యవహార ప్రధాన జీవన్ముక్తి:—

ఈదశలో అధికారి 'లోకమందరివలె' దేహ వ్యాపారముల నొనర్చుచు, తాను ఏమాత్రము గొప్పవాడుగా లోకమున కగపడునట్లుండడు– అతి సామాన్యునివలె మాత్రమె కనుపించును. గాని తాను నేను అకర్తను, అభోక్తను, అక్రియుడను, నిర్వికారుడు, సర్వభూతాత్మభూతుడను" అను దృఢనిశ్చయముతో నుండును. ఎట్టి ప్రాపంచిక పరిస్థితులున్ను ఈ నిశ్చయమును మార్పజాలవు. ఇతడే సిద్ధుడు, కృతకృత్యుడు.

లేక అవిద్య యింకను బలముగానున్నచో తదనురూపముగా పై రెంటిలో నెద్దియో యొక మార్గప్రాప్తి గలుగును. ఒక్క క్షణకాలమైనను జీవన్ముక్తస్థితిలో నుండనివారు ఆత్యంతిక మోక్షము నొందలేరు. జీవన్ముక్తులుగా నున్నవారైనను అవిద్యాశేషమున్నవారికి యింకను కొన్ని జన్మలు వచ్చి నిశ్శేషముగా ప్రారబ్ధాది నాశమందు మోక్షము నొందుదురు, లేక సత్యలోక ప్రాప్తి గలుగును. ఉత్తమ ధ్యానయోగికిన్ని, శ్రవణ మనన నిదిధ్యాస లొనర్చిన వారికిన్ని సమాధి స్థితి గలుగును. అందు పరిపక్వావస్థ రాకపూర్వమే వారి దేహము నశింపుచో వారిగతి యేమగును? ఉభయ భ్రష్టులై ఛిన్నమైన మేఘము వలె నశింతురా? యను సందేహము కలుగగా[1, 2, 3] ఇట్లు సమాధానము చెప్పబడుచున్నది.

---

(1) అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః । అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి 6.37. (2) కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి । అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి 6.38. (3) ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః । త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే 6.39.

అట్టి యోగభ్రష్టులకు ఇహమందుగాని, పరమందుగాని వినాశనముండదు. శాస్త్రీయ మార్గప్రవర్తన గలవారి కెన్నటికిని దుర్గతి గలుగదు.[1] వారు పుణ్యలోకములనొంది దీర్ఘకాల మచట భోగము ననుభవించి భూలోకమందలి కర్మభూమియగు భరతవర్షమందు వేద వేదాంగ పారంగతులగు శ్రీమంతుల గృహమందు జన్మింతురు[2] లేక దరిద్రులగు వేదవేత్తల కుటుంబమందు జన్మింతురు. అట్టి కుటుంబములందు సామాన్యులకు జన్మ దుర్లభము.[3] అచట పూర్వజన్మలో నొనర్చిన ప్రయత్న విశేషజ్ఞానము గలిగి ఆపై ప్రయత్నము నొనర్తురు.[4] పూర్వాభ్యస్తయోగము బలమైనచో ప్రతిబంధములగు అధర్మమును అణగద్రొక్కును. అధర్మమే బలమైనచో దాని యనుభవమైన తరువాత నీ యోగ సంస్కార ముద్బుద్ధ మగును. ఎట్లయినను యోగభ్యాససంస్కారము మాత్ర మెన్ని జన్మలకైనను నశింపదు.[5] ఇట్లు ప్రయత్న మొనర్చుచు ఎన్ని జన్మలకైనను సిద్ధిని బొందును.[6] మోక్షమే పరమసిద్ధి యనబడును. అపుడంతయు నిత్య సత్యమగు పరమాత్మయే తాను గాన, తా నపుడు భోక్త గాడు. భోగ్యప్రపంచము వేరుగా లేదు.[7]

ప్రళయకాలమందు నశింపక, సృష్టికాలమందు తిరిగి దేహసంబంధము నొందక, సర్వదా సచ్చిదానందరూపుడై సర్వవ్యాపకమై యుండుటయే మోక్షమనబడును.[8] వీరు విగూఢముగా ప్రతిప్రాపంచిక వస్తువునందును నిత్య చైతన్య లక్షణులై కృతకృత్యులగు

---

(1) పార్థ ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ; న హి కల్యాణకృ త్కశ్చిత్ దుర్గతిం తాత ! గచ్ఛతి 6-40. (2) ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీ స్సమాః ; శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో ఽభిజాయతే 6-41. (3) అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్ 6-42. (4) తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం ; యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునన్దన 6-43. (5) పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశో ఽపి సః ; జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే 6-44. (6) ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ; అనేకజన్మ సంసిద్ధః తతో యాతి పరాం గతిమ్ 6-45. (7) వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం ; కథం స పురుషః పార్థః కం ఘాతయతి హన్తి కమ్ 2-21. (8) ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ; సర్గే ఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ 14-2.

దురు.[1] వీరికి త్రిగుణసంబంధమెన్నటికిని కలుగదు.[2] వీ రవ్యయమగు బ్రహ్మయే.[3] వీరు బ్రహ్మకంటె అనన్యులు. వీరి యోగములను పరమాత్మయే వహించును.[4] వీరికి శుభాశుభ ఫలసంబంధ మెన్నటికి ఉండదు.[5] సర్వదా శాంతిరూపులై యుందురు.[6] వీరికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, స్త్రీ పురుషాది భేదముండదు.[7&8] ద్వేషకాంక్షాదు లెన్నటికిని ఉండవు. బుద్ధి, దేహము, తద్వ్యాపారము లెవ్వియు ఉండవు.[9] దేహేంద్రియ మనఃప్రాణ వ్యాపారముల నన్నిటిని ఆత్మరూపముగా భావించి గుర్తింతురు.[10]

లోకమందలి విషయసుఖములకంటె అనేకవేల రెట్లు గొప్పదగు ఆనందమే వీరి స్వరూపము.[11] వీరికెట్టి కర్మబంధమును ఉండదు.[12] వీరికి జన్మజరామరణాదు లుండవు.[13] వీరే సర్వజగత్కారణమై సర్వేశ్వర, హిరణ్యగర్భ విరాడాదిరూపములతో జగద్వ్యాపార

(1) ఇతి గుహ్యతమం శాస్త్రం ఇదముక్తం మయా౽నఘ । ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యాత్ కృతకృత్యశ్చ భారత ॥ 15-20. (2) గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ । జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తో౽మృత మశ్నుతే 14-20. (3) నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మ నిత్యా వినివృత్తకామాః। ద్వన్ద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయంతత్ 15-5. (4) అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే। తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ 9-22. (5) శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః। సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి 9-28. (6) క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి । కౌంతేయ ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి 9-31. (7) మాం హి పార్థ ! వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః । స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపి యాంతి పరాం గతిం 9-32. (8) కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయ స్తథా ! । అనిత్య మసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మామ్ 9-33. (9) జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి । నిర్ద్వన్ద్వో హి మహాబాహో ! సుఖం బన్ధా త్ప్రముచ్యతే 5-3. (10) తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః । గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః 5-17. (11) బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్ద త్యాత్మని య త్సుఖమ్। స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖ మక్షయ్య మశ్నుతే 5-21. (12) యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీం । అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే 5-12. (13) జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతియే తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం అధ్యాత్మం కర్మ చాఖిలమ్ 7-29.

మొనర్తురు.[1] వీరే బ్రహ్మ, బ్రహ్మరే వీరు. ఎంతమాత్రము భేదములేక సర్వాత్మనా ఐక్యమగుదు.[2] వీరు అక్షయ సుఖరూపులు, ఎట్టి కల్మషము ఉండదు.[3] సర్వబ్రహ్మాండమందలి జీవులను వీరియందారోపితదేహములను ధరించినవారే. వీరే సర్వప్రపంచాధిష్ఠానము.[4] వీరే సర్వక్షేత్రములందును క్షేత్రజ్ఞరూపులు.[5] వీరు తమనే సర్వజగత్తుగాను సర్వమునే తామునుగాను గుర్తించియుందురు.[6] వీరు తమను వ్యాపకులనుగా చూతురు. ప్రకృతి వీరి దృష్టిలో లేనేలేదు. రజ్జుజ్ఞానికి అచట సర్పము లేనేలేనట్లు వీరికి మాయలేదు.[7] వీరికి పాపముగాని, తన్నివృత్త్యుపాయానుష్ఠానముగాని లేదు.[8] ప్రపంచమునందుండదగు ఆచరించువనులన్నియు వీరే. వీరే శాశ్వతమగు మోక్షరూపులు.[9] వీరే కర్మయోగులకు, ధ్యానయోగులకు ఫలప్రదుడగు ఈశ్వరుడు. వీరే విరాట్పురుషుడు. వీరే హిరణ్యగర్భుడు. వీరే సర్వజగత్తు. వీరికంటె వేరగు నెట్టి జగత్తే లేదు.

## సింహావలోకనము

ఈ ప్రకరణమందు ఫలాభిలాషతో, ఈశ్వరారాధనముచేయువారికి దక్షిణాయన మార్గగమనము, పునరావృత్తి గలుగుననియు, చిత్తశుద్ధితో సగుణమగు ఈశ్వరధ్యాన

(1) తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్ । భవామి న చిరా త్పార్థ । మ య్యావేశితచేతసామ్ 12-7. (2) ప్రయాణకాలే మనసా చలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ । భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష ముపైతి దివ్యం 8-10. (3) ప్రశాన్త మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం। ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్ 6-27. (4) యదా భూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి। తత ఏవచ విస్తారం బ్రహ్మసంపద్యతే తదా 13-31. (5) క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత । । క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ 13-3. (6) యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి । త స్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి 6-30. (7) య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ। సర్వథా వర్తమానోపి న స భూయోఽభిజాయతే 13-24. (8) అపి చే దసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః । సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సన్తరిష్యసి 4-36. (9) సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః । మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ 18-56.

మొనర్చు వారికి ఉత్తరాయణ మార్గగమనము-బ్రహ్మలోకప్రాప్తి గలుగుననియు, సిద్ధులగు జ్ఞానులు స్థితప్రజ్ఞులై ఇచట దేహాదిప్రపంచమం దుండికూడ, స్వార్థమెంతమాత్రము లేకుండగా అసంగవ్యవహారులై లోకులు వారిని గూర్చి ఎట్లు తలచినను, వారు మాత్రము తాము ముక్తులమని ఆత్మరూపులమని ఎల్లప్పుడు నిశ్చయముతో నుందురనియు అదియే జీవన్ముక్తియనియు, అట్టివారి వర్తమాన దేహపతనానంతరము, వారే విదేహముక్తులగుదురని ప్రదర్శింపబడినది.



శ్రీ

# గీతాసారసంగ్రహము

## 10. శాస్త్రార్థప్రకరణము



జిజ్ఞాసువునకు వేదాంతశాస్త్ర తాత్పర్యము పుష్కలముగా మననమగుటకు పురుష బుద్ధి సహజమగు సందేహము లనేకములు కలుగును. వాటికి సమాధానము కుదిరినగాని అద్వితీయాత్మ సాక్షాత్కారము గలుగదు. ఇట్టి పురుష బుద్ధి కల్పిత జ్ఞానప్రస్థానములే దర్శనములను పేరుతో నున్నవి. గాన ఈ ప్రకరణమందా యా దర్శన స్వరూపము అతి సంగ్రహముగా వివరింపబడి తత్సమాధాన మీ గీతాశాస్త్రమునుండి ప్రదర్శింపబడును.

### 1. చార్వాక దర్శనము

త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణములను ఇంద్రియములకు గోచరమగునది మాత్రమే జగత్తు. ప్రత్యక్షమొక్కటియే ప్రమాణము. పరలోక, పుణ్య, పాప, ఈశ్వరాదులు లేవు. లోకమును పరిపాలించు రాజే ఈశ్వరుడు. దేహమే ఆత్మ. మరణమే మోక్షము. కాంతా కనకాదులచే గల్గు సుఖమే పురుషార్థము. రోగదారిద్ర్యాది దుఃఖమే నరకము, (గ్రావాణః ప్లవంతే) రాళ్ళు, నీళ్ళలో తేలుచున్నవి. ఇత్యాద్యసత్యవదనము, 2. జీవహింసతో గూడిన కర్మల నుపదేశింపుట, 3. అభిచారిక కర్మలను బోధించుట, 4. ఐశ్వర్యము, పశువులు, పుత్రులు ఇత్యాది లౌకికఫలములు వచ్చునని యొకచోటను, లౌకిక ఫలము రాదు, పర లోకఫలమే వచ్చునని యొకచోటను, మిథ్యయని మరియొకచోటను, ఆత్మకర్తయు భోక్తయు నని యొకచోట అకర్త, అభోక్త యని వేరొకచోట, ఈరీతిగా పరస్పర విరుద్ధార్థ బోధచేతను వేదమున్మత్త ప్రలాపము అని ఈ దర్శన సంగ్రహరూపము ఇతరులు చెప్పినట్లు వినుటయను పరతంత్రతయే వీరికి బంధము. స్వేచ్ఛగా ప్రవర్తించుటయే వీరికి మోక్షము.

## 2. బౌద్ధదర్శనము

దీనిని ప్రవర్తింపజేసిన బుద్ధునకు నలుగురు శిష్యు లుండిరి. వారల కాతడు సర్వము శూన్యమని ఉపదేశింప ఒక శిష్యుడట్లే గ్రహించెను. వీనిపరంపర మాధ్యమిక మనబడును. వీరిది సర్వశూన్య వాదము.

రెండవశిష్యుడా గురూపదేశముపై సర్వము శూన్యమైనచో జ్ఞానము గూడ శూన్యమై జగదాంధ్య మేర్పడును గాన అట్లనుట యెట్లుసమంజస మగునని ప్రశ్నింప బాహ్య జగత్తు మాత్రమే శూన్యమనియు. శిష్యుడు తనకు తెలియబడని జ్ఞానముకొరకు ప్రయత్నించుట యోగ మనబడుననియు, గురూక్తరీతిన ప్రవర్తించుట ఆచారమనబడు ననియు గురువు చెప్పెను. ఈతని పరంపర యోగాచారమనబడును. వీరిది బాహ్యార్థశూన్య వాదము, విజ్ఞాన మాత్రాస్తిత్వ వాదము.

మూడవ శిష్యుడు బాహ్యవస్తువు శూన్యమైనచో తద్విజ్ఞాన మెట్లుగల్గునని ప్రశ్నింప, బాహ్యార్థ శూన్యమనగా బాహ్యార్థము ప్రత్యక్షముగా లేదు. అనుమేయమై యున్నది. విజ్ఞానముచే నిది సూత్రితమైనది అని గురువు బోధించెను. అతని పరంపర సౌత్రాంతిక మనబడును. వీరు బాహ్యార్థానుమేయత్వ వాదులు.

నాల్గవ శిష్యుడు పైమూడు ఉపదేశములును విరుద్ధముగా భాషించితి రేమియని ప్రశ్నింప బాహ్యార్థము ప్రత్యక్షము గూడనగుగాక గాని యది విజ్ఞానముకంటె వేరుగాదు. అని గురువు సమాధానము చెప్పెను. ఆతని పరంపర వైభాషికమనబడును. వీరిది బాహ్యార్థప్రత్యక్ష వాదము. సర్వాస్తిత్వ వాదము.

ఇట్లీ నాలుగువిధములగు బౌద్ధదర్శనమందు ప్రత్యక్షము, అనుమానము అను రెండే ప్రమాణములు. 1. దుఃఖము, 2. సముదాయము, 3. మార్గము, 4. నిరోధము, అని నాలుగు విధములగు తత్వమే ఆర్యసత్యమనబడును.

1. దుఃఖము:—౧. విజ్ఞానస్కంధము, ౨. వేదనాస్కంధము, ౩. సంజ్ఞాస్కంధము, ౪. సంస్కారస్కంధము, ౫. రూపస్కంధము అని ఐదువిధములు. అందు శబ్దస్పర్శాది విషయసహిత జ్ఞానేంద్రియములు రూపస్కంధ మనబడును. 'ఇది ఘటము' ఇత్యాది పరిజ్ఞానము విజ్ఞానస్కంధ మనబడును. వీనివలన గలుగు సుఖదుఃఖాదికము వేదనాస్కంధ మనబడును. అయాశబ్దములచే గలుగు అయా పదార్థ స్ఫూర్తియే సంజ్ఞాస్కంధ మనబడును.

వేదనాస్కంధ నిమిత్తక రాగద్వేష మదమాన ధర్మాధర్మాదులు సంస్కారస్కంధ మన బడును. ఇదియే దుఃఖమనబడును.

2. సముదాయమనగా దుఃఖకారణమగు స్థిరత్వభ్రాంతి.

3. మార్గమనగా పై రెంటి నివృత్తికొరకు నిరంతరముగా "సర్వము క్షణికము" అని భావించుచుండుట.

4. నిరోధమనగా 'ఏదియు నేనగాను' అని సర్వ నైరాత్మ్యవాసనయే. ఇదియే వీరిమతమందలి మోక్షము. క్షణిక విజ్ఞానమే ఆత్మ. 1. ఆలయవిజ్ఞానము. 2. ప్రవృత్తివిజ్ఞానము. అని అది ద్వివిధము, 'నేను' అనునదియే ఆలయవిజ్ఞానము. ఇది అనాదివాసనా వశముచే అనేకాకారముగా భాసించును. ఘట పటాది బాహ్యవస్త్వాకారముగా భాసించునదియే ప్రవృత్తివిజ్ఞాన మనబడును.

## 3. అర్హత దర్శనము

ఇదియే జైనదర్శనమనియు, దిగంబర మతమనియుగూడ ననబడును. బౌద్ధుల క్షణిక విజ్ఞానవాదమందు సుఖముకొరకు ప్రయత్నించువాడు. తత్ఫలానుభవ కాలమందు లేడు. సర్వము క్షణికము గదా !

అట్లగుచో ఒకడొనర్చిన ప్రయత్నమునకు ఫల మింకొకనికి వచ్చునుగదా! సుఖము కొరకు ప్రతిజీవుడును ప్రతిక్షణమందును ప్రవర్తించుచునేయున్నాడు. గాన స్థాయి యగు ఒక పదార్థము అవశ్య ముండితీరవలెనని అర్హన్నను సంజ్ఞనొందిన జిను డొక దర్శనమును గల్పించెను. వీరి మతమందు తొమ్మిది తత్వములు.

1. జీవుడు:- చేతనుడు, శరీరపరిమాణుడు, సావయవుడు. ఇందు నిత్యసిద్ధ దర్హ తుడు, 2. ఇపుడు ముక్తుడగు జీవుడు, 3. బద్ధుడు అని జీవుడు త్రివిధము.

2. అజీవుడు=పృథివ్యాది నాల్గు భూతములు స్థావరములు, జంగమములు.

3. ఆస్రవము=ఇంద్రియ సంఘాతము.

4. సంవరము=అవివేకము.

5. పుణ్యము.

6. పాపము.

7. నిర్జరము = కేశోల్లుంచనము, తప్తశిలారోహణము, దిగంబరత్వము, ఇత్యాది తపస్సు.

8. బంధము = పుణ్యపాపములచే నేర్పడిన జననమరణ పరంపర.

9. మోక్షము = ఈ తొమ్మిది తత్వములను వివేకముతో తెలిసికొని నిర్జరమను ఏడవ తత్వము నభ్యసింపగా, దేహసంబంధము పోయి జీవునకు నిరంతరము ఊర్ధ్వగమనము గలుగుట.

ఈ మూడును నాస్తికదర్శనము లనబడును. ఇందు వేదప్రామాణ్యము, చాతుర్వర్ణ్యభేదము, కర్మ, ధ్యాన, జ్ఞానయోగము లను సాధనములు, శ్రాద్ధాది పారలౌకికములు, ఇవన్నియు ఆక్షేపింపబడినవి. లోకపదార్థము లన్నియు, ఉన్నవనుటకుగాని, లేవనుటకుగాని వీలులేదు. గాన నవి భావాభావరూపములగును. వీరందరును 'బ్రహ్మాక్షయం' అను మాటను నిద్రలేచిన క్షణమందును, నిద్రింపబోవు క్షణమందును కనీసము ముమ్మారైనను స్మరింపవలెను. ఎప్పుడును అట్లనువారు సర్వోత్తములు. బ్రహ్మశబ్దమునకు బ్రాహ్మణజాతి, జీవుడు, కమలాసనుడు, బ్రహ్మలోకము, వేదము అని ఐదర్థములున్నవి. వీరు ఆ ఐదింటిక్షయమును ఎల్లప్పుడు కోరువారు.

## సమాధానము

**వేదము అన్నివిషయములందును పరమప్రమాణము. (తస్మాచ్ఛాస్త్రం 16-24) దీనిని పరిత్యజించి స్వేచ్ఛగా ప్రవర్తించువాడు ఇహపర సుఖములకు దూరుడగును. (యశ్శాస్త్రవిధిం 16-23) ఈశ్వరుడు సర్వజీవులందును ఉన్నాడు. (ఈశ్వరస్సర్వ 18-61) పరలోకములున్నవి. (ఊర్ధ్వం గచ్ఛంతి 14-18), (ఆ బ్రహ్మభువ 8-16) శ్రాద్ధాదిక మనుష్య కర్తవ్యము (సంకరోనర 1-42) జన్మాంతరములున్నవి. (ప్రాప్యపుణ్యా 6-41, దేహినోస్మిన్ 2-13) (తత్ర తం బుద్ధి 6-43) పుణ్యాపాపములున్నవి. (దైవీసంపత్ ఆసురసంపత్ 16 అధ్యా) కాంతా కనకాదులచే గలుగు సుఖము అనిత్యము, దుఃఖరూపము (యేహి సంస్ప 5-22) దేహము వేరు ఆత్మ వేరు (దేహీ నిత్యం 2-30) (అసత్యం 16-8 నుండి 24 వరకు) ఈ నాస్తికదర్శన ఖండనము ప్రదర్శింపబడినది.**

**ఇక అస్తిక దర్శనము లను ప్రసిద్ధిగల దర్శనములస్వరూపము వివరింపబడుచున్నది.**

## 4. రామానుజ దర్శనము (భాగవత దర్శనము)

ఇందు మూడు తత్వములు : 1. చిత్, 2. అచిత్, 3. ఈశ్వరులని. అందు చిత్ అనగా జీవులు, భోక్తలు. వీరణు పరిమాణులు, నిత్యులు, మోక్షకాలమందుగూడ నానాగా నుందురు. పరమాత్మకు శరీరమై అచిత్తుకు ఆత్మలగుదురు. భగవద్దాసులు. అచిత్ అనగా జడమైన సర్వప్రపంచమును. అర్హతదర్శనమందు జీవుడు దేహపరిమాణు డన్నందున దోషము, ఏనుగుల దేహమందు ఒకేజీవుడు పర్యాయముగా నుండునపుడు జీవ విచ్ఛేదము సంభవించునని వీరిట్లు కల్పించిరి.

ఈశ్వరుడనగా చిత్, అచిత్ అను రెంటియందును అంతర్యామిగా నుండి వాటిని నియమించుచుండి అనంత కల్యాణగుణములు గలవాడు. ఆత్మశబ్దవాచ్యుడు. చిదచిత్తులతని శరీరమేగాన సజాతీయ విజాతీయ స్వగతభేదములు గలవాడు 1. అర్చ, 2. విభవ, 3. వ్యూహ, 4. సూక్ష్మ, 5. అంతర్యామి భేదముచే అయిదు విధములుగ నుండును.

1. అర్చ యనగా ప్రతిమాదులు
2. విభవమనగా రామ కృష్ణాద్యవతారములు
3. వ్యూహమనగా ౧. వాసుదేవుడు= ఈశ్వరుడు, ౨. సంకర్షణుడు = జీవుడు, ౩. ప్రద్యుమ్నుడు=మనస్సు, ౪. అనిరుద్ధుడు=అహంకారము ఈ నాలుగే.
4. సూక్ష్మమనగా అపహతపాప, విజరా, విమృత్యు, విశోక, విజిఘత్స, అపిపాస, సత్యకామ, సత్యసంకల్పాది గుణగణములే.
5. అంతర్యామియనగా సర్వభూతములందుండు శక్తియే. క్రమముగా ఈ ఐదింటిని కర్మసహితముగా ఉపాసించువాడు ఈశ్వరసాలోక్య సారూప్య సామీప్యముల నొందును. ఇదియే మోక్షము. అపుడుగూడ జీవులు నానాగానే ఉందురు. ఈశ్వరునికంటె భిన్నులై యుందురు. దేహములుండును. జగత్తు సత్యమైనది. ఈశ్వర జగత్తులకు భేదమున్ను అభేదమున్ను, అంగీకరింపబడెను.

ఈశ్వరుడే జగత్తుకు ఉపాదానమున్ను, కర్తయు. ఈ చిదచిదీశ్వరులు యథార్థముచే పరస్పర భిన్నములైనను ఒకటిగా భాసించుచుందురు. జ్ఞానము చిద్రూపులగు జీవులకును, ఈశ్వరునకును గుణము. వీరు పరిణామవాదులు, సత్ఖ్యాతివాదులు. జీవన్ముక్త్యవస్థ లేనే లేదు. వేదము, పాంచరాత్రము రెండును ప్రమాణములైనను పాంచరాత్రమే పరమ ప్రమాణము. తదనుకూలముగా వేదార్థమును చెప్పుదురు. ప్రపంచభేదము సత్యమైనది.

### సమాధానము

ఇందు జగత్సత్యత్వ వాదమునకు గీతాశాస్త్ర ముపదేశించు సమాధానము జగన్మిథ్యాత్వమేనని జగత్ప్రకరణమందు వివరింపబడినది. జీవనానాత్వవాదమునకు సమాధానము ఆత్మప్రకరణమందు జీవైకత్వమేనని వివరింపబడినది. మోక్షస్వరూపమందలి భేదవాదమునకు సమాధానము ఐక్యమేనని ఫలప్రకరణమందు వివరింపబడినది. జీవుడణుపరిమాణుడు కాడని ఆత్మప్రకరణమందు వివరింపబడినది. ఒకవేళ వీరివాదము పాంచరాత్ర ప్రామాణ్య సిద్ధమైనను నదృష్టిని వేదవిరుద్ధమును, గీతాశాస్త్ర విరుద్ధమును ఐనందున అప్రమాణమే యగును. జ్ఞానము గుణము గాదు. బ్రహ్మాయే (ఆత్మప్రకరణము) ఆత్మకు కర్తృత్వభోక్తృత్వములు లేవు. (ఆత్మప్రకరణము) సాలోక్యాదులు మోక్షము గాదు. (ఫలప్రకరణము).

## 5. మధ్వ దర్శనము

పూర్ణ, ప్రజ్ఞ, మధ్వమునుమందిర, ఆనందతీర్థ, మధ్వాచార్యులను నామములుగల వ్యక్తిచే ప్రారంభింపబడిన దీదర్శనము—వీరి దర్శనములోగూడ రామానుజ దర్శనతుల్యా సిద్ధాంతములే ఈశ్వర జగత్తుల భేదాభేదములు పరస్పర విరుద్ధమని యాక్షేపించి ఇట్టి దర్శనమును నిర్మించెను.

ఇందు 1. స్వతంత్రము, 2. పరతంత్రము అని రెండే తత్వములు. అందు సర్వజ్ఞత్వాది సకల గుణములతో నెల్లపుడు శోభించు విష్ణువే స్వతంత్ర తత్వము. మహాలక్ష్మి మొదలగు జగత్తంతయు పరతంత్రతత్వ మనబడును. ఇది 1 చేతనము 2 అచేతనము నని ద్వివిధము.

చేతనము 1 నిత్యముక్తము 2 సంసారియని ద్వివిధము నిత్యముక్తము ఒకమహాలక్ష్మి మాత్రమే. సంసారి, ముక్తు డని, అముక్తుడని ద్వివిధము— వీరు ఉత్తమ, మధ్యమ, అధమ భేదములచే మూడు విధములు. అందుత్తములనగా చక్రాంకణాదులచే కొంత దేహమును కాల్చుకొనుటచే ముక్తియోగ్యులగు భక్తులు. మధ్యములనగా వేద వేదాంగముల నభ్యసించుచు అందలి రీతిన ప్రవర్తించువారు. వీరికెల్లపుడు సంసారమే గాని మోక్షముండదు. అధములనగా దైత్య రాక్షస పశుపక్ష్యాదులు. వీరు నిత్య నరకలోకవాసు లవబడెదరు.

ఇక అచేతనము 1. దేశకాలాదులు నిత్యాచేతనమని 2. దేహాదికార్య మనిత్యాచేతనమని ద్వివిధము.

ఇందు ముక్తియోగ్యులగు జీవులు 1. శంఖచక్రాది చిహ్నములతో కొంత దేహము బ్రతికియుండగనే కాల్చుకొనుట, 2. నామకరణము (పుత్రాదులకు కేశవాది నామములతో పిలుచుట), 3. భజనయను త్రివిధభగవత్సేవచే, విష్ణుసాలోక్య సారూప్య సామీప్యము పొందుదురు. ఇదియే మోక్షము. ముక్తిలోకూడ జీవులు పరస్పర భిన్నులు, ఈశ్వరునికంటె భిన్నులు. ప్రపంచము సత్యము. పాంచరాత్రమే వేదములకంటెకూడ పరమ ప్రమాణము, ప్రత్యక్షము, అనుమానము. శబ్దము అను మూడే ప్రమాణములు. జీవులు అణుపరిమాణులేగాని, మధ్యమ పరిమాణులు కారు. విభువులు గాక పరిచ్ఛిన్నులు, మోక్షస్థితిలో గూడ భగవద్దాసులు. దేహధారులు. పారతంత్ర్యసహిత, దుఃఖరహిత సుఖము పొందుటయే మోక్షము. ఆత్మలు, కర్తలు, భోక్తలున్ను.

### సమాధానము

జగత్తు సత్యముగాదు. మిథ్యయైనది. (జగత్ప్రకరణము) ఆత్మ నానా గాదు. ఏకమే. సజాతీయ విజాతీయ స్వగతభేదము గలది గాదు. లేనిదే. ఆత్మ కర్తగాదు, భోక్తగాదు. (ఆత్మప్రకరణము) మోక్షమందు దేహము లేదు. దాస్యము లేదు. భగవంతుడు వేరు. జీవులు వేరుగాదు. (ఫలప్రకరణము) తప్తచక్రాంకణము గీతాశాస్త్రమందు చెప్పబడలేదు. సాలోక్యాదులు మోక్షముగాదు. (ఫలప్రకరణము).

## 6. నకులీశ దర్శనము

1. ఇందైదు తత్వములు 1. కార్యము=చేతనా చేతనాత్మక జగత్తు.
2. కారణము=స్వతంత్రుడును, జగత్తుకు తటస్థుడును అగు ఈశ్వరుడు.
3. యోగము=శివధ్యాన శివమంత్ర జపాదికము.
4. విధి=త్రికాలములందును భస్మస్నాన రుద్రాక్షధారణాదికము.
5. దుఃఖాంతము=దుఃఖనిరాసపూర్వక ఈశ్వరభావము. ఇదియే మోక్షము.

వీరి మతమందు జీవులు మధ్యమ పరిమాణులు, పరస్పర భిన్నులైనను, ఈశ్వరున కభిన్నులు. కర్తలు, భోక్తలు. మోక్షస్థితిలో జీవు లీశ్వరుడే యగును. ఈశ్వరుడు సర్వజ్ఞత్వాది గుణములుగల దేహధారి. సర్పరుద్రాక్షాదులను ధరించును. మోక్షప్రదాత. మోక్షావస్థలో గూడ దేహముండును.

సమాధానము

ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వములు లేవు. నానాత్వము లేదు. మధ్య పరిమాణత్వము లేదు. (ఆత్మప్రకరణము). ఈశ్వరుడు జగత్తుకు తటస్థుడు గాడు. బ్రహ్మయే జగత్తుకు ఉపాదాన కారణము, నిమిత్తకారణమున్ను (జగత్ప్రకరణము). మోక్షములో దేహముండదు (ఫలప్రకరణము).

## 7. శైవ దర్శనము

ఇందు 6 తత్వములు : 1. పతి, శివుడు జగత్తు, తటస్థుడు, దేహధారి, రుద్రాక్ష, భస్మ సర్పాదులను ధరించియుండును. సర్వజ్ఞత్వాది గుణములు గలవాడు. మోక్షప్రదాత.

2. విద్యా=తత్వజ్ఞానము ఈశ్వరుని పూర్తిగా గుర్తించుట.

3. అవిద్యా=మిథ్యాజ్ఞానం ఈశ్వరు నెరుగక ప్రవర్తించుట.

4. పశువులు=జీవులు—తామే దేహమని వ్యవహరించువారు.

5. పాశము=ఈశ్వరజ్ఞానము లేక జనన మరణాదుల నొందుట.

6. కారణము=పాశనివృత్తి కారణముగు భస్మోద్ధూళన, రుద్రాక్షధారణ, త్రిశూల గ్రహణ శివమంత్ర జపాదికము. మిగిలినదంతయు నకులీశ దర్శన తుల్యము.

సమాధానము

తటస్థవాదమునకు సమాధానము జగత్ప్రకరణమం దున్నది. ఒకరిచ్చునది క్రియచే పుట్టునది గాన మోక్షము గాదు (ఫలప్రకరణము). భస్మోద్ధూళనాదులు మోక్షసాధనములు గావు. ఆత్మైకత్వజ్ఞాన మొక్కటియే సాధనము (జ్ఞానప్రకరణము).

## 8. రసేశ్వర దర్శనము

సర్వజీవుల దేహము తల్లిదండ్రుల శుక్లశోణితములచే నేర్పడును. అందు త్వక్ అసృక్ మాంసము లను మూడు కోశములు తల్లిశరీరముచే నేర్పడును. మేదస్సు, అస్థి, మజ్జలను మూడు కోశములు తండ్రి శరీరముచే నేర్పడును. స్త్రీజీవులందరును అభ్రకమను రూపము గల గౌరీరూపులు. పురుషులందరును పాదరసమను రూపుగల శివునిరూపులు. ఈ జ్ఞానము లేనివారు జనన మరణ ప్రవాహము నొందుచున్నారు. దీని నివృత్తికై, అభ్రక, పాదరసములను సేవించగా వారి దేహము దివ్యదేహమై స్థిరమైనదగును. తామే యీశ్వరులా

ము) నిరంతరము ధ్యానింపగా వీరే శివస్వరూపు లగుదురు. ఇదియే మోక్షము. మిగిలిన దంతయు నకులీశ దర్శనతుల్యము.

సమాధానము

అభ్రక పాదరసాదు లెన్ని సేవించినను దేహము స్థిరముగా నుండదు. స్థూలదేహ మొక్కటియే గాక, ఇంకను సూక్ష్మకారణదేహములు రెండున్నవి (అనాత్మ ప్రకరణము). ఎప్పుడైనను స్వధర్మానుష్ఠాన మొనర్పని వాని కీ జన్మలో తామే ఈశ్వరులమను భావన సాధ్యపడదు (సాధనప్రకరణము, ఉపాసనా ప్రకరణము). మోక్షమందు దేహధారణ లేదు (ఫలప్రకరణము).

## 9. ప్రత్యభిజ్ఞా దర్శనము

చైతన్యమాత్రమే ఆత్మ. ఈశ్వరుడు సర్వస్వతంత్రుడై జీవుల పుణ్యాపాపాదికము నపేక్షింపక, స్వేచ్ఛచేతనే జగత్తును నిర్మించును. జీవులు పరస్పర భిన్నులైనను ఈశ్వరునికంటె భిన్నులు గారు. మాయావశముచే జీవుడు ఒక భాగముచే మాత్రమే చైతన్యస్వరూపుడు. ఈశ్వరుడు మాయాతీతుడగుటచే పూర్తిగా చైతన్యప్రకాశస్వరూపుడు. తానే సర్వజ్ఞత్వాది గుణములు గల స్వతంత్రుడగు ఈశ్వరుడనని నిరంతరభావన చేయుటచేతనే జీవుడు ఈశ్వరుడగును. అంతేగాని కాయశోషణ తపస్సు, జపము, ప్రాణాయామాదులుగాని, వర్ణాశ్రమ ధర్మములు గాని, ఎంతమాత్రము సాధనములు గావు. ఈశ్వరుడగుటయే మోక్షము.

సమాధానము

జీవుల పుణ్యాపాపాపేక్షతోనే ఈశ్వరుడు సృజించును (జగత్ప్రకరణము). జీవులు భిన్నులుగారు (ఆత్మప్రకరణము). తపః ప్రాణాయామాదు లవసరము (ఉపాసనా ప్రకరణము). వర్ణాశ్రమ ధర్మములున్నవి. దీనిచేతనే చిత్తశుద్ధి గలుగును ( కర్మయోగ ప్రకరణము ).

## 10. వైశేషిక దర్శనము

ఇదియే ఔలూక్యదర్శనమనియు, కణాద దర్శనమనియు చెప్పబడును. వీరు 1. ద్రవ్యము=పృథివి, ఉదక, తేజో, వాయు, ఆకాశ, కాల, దిక్, ఆత్మ, మనస్సులు తొమ్మిది.

2. గుణము=రూపరస, గంధ, స్పర్శ, సంఖ్యా, పరిమాణ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వ, అపరత్వ, బుద్ధి, సుఖ, దుఃఖ, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్నములును, 17 న్ను చకారముచే గ్రహింపబడిన గురుత్వ, ద్రవత్వ, స్నేహ, సంస్కార, అదృష్ట, ధర్మ, అధర్మము లేదును మొత్తం 24.

3. కర్మ=ఉత్క్షేపణ అపక్షేపణ, ఆకుంచన, ప్రసారణ గమనము లైదు.

4. సామాన్యము=ద్రవ్యత్వాద్యపరము, ద్రవ్యగుణ సమవేతమగు సత్తాయును, పరము నని ద్వివిధము.

5. విశేషము=నిత్యద్రవ్యవృత్తులు అనంతములు.

6. సమవాయము=గుణ గుణులకు వలె విభాగింప నలవిలేనిది ఒకటే.

7. అభావము=లేకుండుట, 1. సంసర్గాభావము, 2. అన్యోన్యాభావము అని ద్వివిధము. అందు సంసర్గాభావము–1. ప్రాగభావము, 2. ప్రధ్వంసాభావము, 3. అత్యంతాభావము అని త్రివిధము,

ఈ సప్త పదార్థములను ఉద్దేశ, లక్షణ, పరీక్షలతో విమర్శించుట ద్వారా దుఃఖమును పోగొట్టుకొని సుఖమును పొందుటయే మోక్షము.

పృథివ్యాది పరమాణువులు నిత్యములుగా ప్రళయకాలమందు గూడ ఉండును. అవి జగత్తుకు ఉపాదానకారణము. జగత్తు సత్యము. పరస్పర భిన్నులు, జ్ఞానము, ఇచ్ఛ మొదలగు గుణములు గలవారు ఆత్మలు. వీరు ప్రవృత్తిధర్మముచే అభ్యుదయమును, నివృత్తిధర్మముచే మోక్షమును పొందెదరు. దుఃఖధ్వంసమే మోక్షము, అపుడు జ్ఞానము, ఇచ్ఛ మొదలగు స్వగుణములు లేక, జడభూతులై భిన్నభిన్నులుగా నుందురు. ధర్మముచేతనే జగత్కార్యము నిర్వహింపబడును గాన ఈశ్వరునితో పనిలేదందురు,

### సమాధానము

మోక్షమందు జడీభావము లేదు. మోక్షమనగా జ్ఞాన ఆనందరూపము (ఫలప్రకరణము). పరమాణువులు నిత్యము గావు. ప్రళయకాలమందు ఎట్టి పరమాణువులును ఉండవు. జగత్తు సత్యముగాదు (జగత్ప్రకరణము). జీవులు భిన్నులు గారు (ఆత్మప్రకరణము). జ్ఞానము, ఇచ్ఛ, ధృత్యాదు లాత్మధర్మములుగావు. క్షేత్రధర్మములే (ఇచ్ఛాద్వేష శ్లోకం 13_16.

## 11. న్యాయ దర్శనము

ఇది గౌతమీయ దర్శనము. అక్షపాద దర్శనము అనియుండ ప్రసిద్ధి గలిగియున్నది. ఇందు 16 పదార్థములు. ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండ, హేత్వాభాస, ఛల, జాతి, నిగ్రహ స్థాన ములని వాటి పేర్లు. వీటియొక్క ఉద్దేశలక్షణ పరీక్షలచే దత్త్వజ్ఞానము గలుగును వీరి యాశ యము. వైశేషికదర్శనముకంటె వీరు ఈశ్వరునికూడ అంగీకరించిరి జగత్తుకు పరమాణు వులు ఉపాదాన కారణమనియు, ఈశ్వరుడు నిమిత్తకారణమనియు వీరి మతము. మిగిలిన దంతయు వైశేషికదర్శనతుల్యమే. వీరిద్దరును ప్రళయకాలమందలి జగదభావమునలన సృష్టి కాలమందు జగద్భావము పుట్టుననుటచే అసత్ఖ్యాతివాదు లనబడెదరు. పరమాణువులను కారణములవల్ల జగత్తను కార్యము ఆరంభింపబడు ననుటచే ఆరంభవాదు లనబడెదరు.

### సమాధానము

అసత్తగు కారణమువలన సత్తగు కార్యము పుట్టుట యుక్తిశూన్యమైనందున అసత్ఖ్యాతివాదము దుష్టమైనది. ఆరంభింపబడిన జగత్తు నిత్యమగుట యుక్తిశూన్యము (జగత్ప్రకరణము).

## 12. సాంఖ్య దర్శనము

కపిలునిచే ప్రవర్తింపజేయబడిన దీ దర్శనమే. ఇందు నాల్గు విధములగు తత్వములు. 1. కేవల ప్రకృతి 2. కేవల వికృతి 3. ఉభయాత్మకము 4. అనుభయాత్మకము.

అందు సత్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థయే మూలప్రకృతి యనియు ప్రధానమనియు ననబడును. 2. ఇది క్రమముగా 1. మహత్=అంతఃకరణము 2. అహం కారము 3. శబ్దతన్మాత్ర 4. స్పర్శతన్మాత్ర 5. రూపతన్మాత్ర 6. రసతన్మాత్ర 7. గంధ తన్మాత్రలుగా పరిణమించును. మహత్తు ప్రధానమునకు వికృతియు, నహంకారమునకు ప్రకృతియు నగును. ఇట్లీయేడును ప్రకృతిభావమును వికృతిభావమును పొందుటచే ఉభ యాత్మకము లనబడును.

3 శబ్దాది తన్మాత్ర లైదింటిచేతను క్రమముగా ఆకాశాది పంచభూతము లేర్ప డెను. అహంకారము త్రివిధము. అందు సాత్వికాహంకారము వైకారిక మనబడును. రాజ

సాహంకారము వైకారిక మనబడును. తామసాహంకారము భూతాది యనబడును. దీనిచే పంచతన్మాత్రలనుండి ఆకాశాది పంచభూతములు పరిణమించెను. సాత్త్వికాహంకారముచే జ్ఞానేంద్రియ పంచకమును, కర్మేంద్రియపంచకమును, ఉభయప్రేరకమగు మనస్సు అను నీపదునొకండును పుట్టినవి. వీనినుండి పుట్టినవేవియు లేవు గాన యీ 11 న్ని పంచభూతములు 5 అను నీ 16 న్ని కేవల వికృతు లనబడును.

4. నిత్యులు, అసంగులు, చిద్రూపులు పురుషు లనబడెదరు. భోక్తలేగాని కర్తలు గారు. ప్రధానమువలెగాక పరిణామ భిన్నాభిన్నులుగానే యుందురు. నిత్యులు - ఈశ్వరుడు లేడు - ఈ పురుషుడు ప్రకృతిగాడు. వికృతిగాడు. ఉభయాత్మకమున్నుగాడు. గాన అనుభయాత్మక మనబడును.

| | |
|---|---|
| ఇట్లు కేవలప్రకృతియను ప్రధానము | 1 |
| అనుభయాత్మక పురుషతత్త్వము | 1 |
| కేవల వికృతులను తత్త్వములు | 16 |
| ఉభయాత్మ తత్త్వములు | 7 |
| మొత్తము తత్త్వములు | 25 |

అసంగచిద్రూపులగు పురుషుల సన్నిధిమాత్రముచే జడమగు ప్రధానమాయా కార్యరూపముతో పరిణామించుచూ సుఖ దుఃఖాది కర్తృత్వమును వహించి పురుషులకొరకు ప్రవర్తించుచుండును. పురుషు డసంగ చిద్రూపుడై తత్ఫలము ననుభవించుచుండును. ప్రళయమందుగూడ ఈ ప్రధాన పురుషు లిద్దరు నశింపరు గాన వీరిది సత్ఖ్యాతివాద మనబడును. ప్రధాన మాయా కార్యాకారములుగా పరిణమించును గాన వీరు పరిణామవాదు లనబడెదరు. ప్రకృతి పురుష వివేచనముచే మోక్షము గలుగునందురు.

### సమాధానము

జీవభేదము లేదు (ఆత్మప్రకరణము). జగత్తు సత్యముగాదు (జగత్ప్రకరణము). ప్రళయమందుండు వస్తువు నాశరహిత మనగా సత్ అనబడును గాన దానినుండి పుట్టుటకు వీలులేదు. పుట్టుచో నది సత్తుగాదు గాన సత్ఖ్యాతి తప్పు.

## 13. యోగ దర్శనము

ఇదియే పాతంజల దర్శనమనిగూడ ననబడును. సాంఖ్య దర్శనములోని తత్త్వముల కంటె ఈశ్వరుడను 26 వ తత్త్వముగూడ దీనికి గలదు. ఈ ఈశ్వరుడు క్లేశ, కర్మ విపాకాశయములచే పరామర్శింపబడని పురుషవిశేషుడే. సర్వజ్ఞులకును ఈశ్వరునియందు ఐశ్వర్యము ఎపుడును ఉండదు. మిగిలినదంతయు సాంఖ్యదర్శన సిద్ధాంతమే.

### సమాధానము

క్షీరపరిణామమగు అజ్ఞము ఎన్నిటికిని స్వార్థరూపము నొందదు. ప్రధానము పూర్తిగా పరిణమించి మహత్తయినచో ఇక ప్రధానము లేదుగాన ప్రధానము ప్రళయమం దుండుననుట తప్పు. కొంత ప్రధానము పరిణమించి, మరికొంత పరిణమించదనుట యుక్తి శూన్యము గాన పరిణామవాదము కల్పనా మాత్రమే. ఈశ్వరుడు నిరవయవుల కంటె అన్యుడుగాడు (జగత్కారణము). అద్వైతతత్త్వ విజ్ఞానములేక కేవల చిత్తనిరోధ మొనర్చిన వారి కామములయం దవిద్యయుండదు. గాని తత్త్వాత్మ జ్ఞానము సంభవించదు గాన మోక్షముండదు (ఫలప్రకరణము). ఇట్టి దర్శనము లన్నిటికి సమాధానముగా శ్రీ . . . . పదేశించిన సారములోని సంగ్రహ మిట్లున్నది.

1. వేదముచేతనే తెలియదగినది బ్రహ్మ. 2. ఇది సత్య జ్ఞాన, ఆనంద, అనంతలక్షణము. స్వయంజ్యోతి. 3. ఇది నిర్గుణమైనను, జగత్తున కిదియే ప్రకృతి. 4. ఇది అవికారమైనను, మాయ కధిష్ఠానమైనది. 5. మాయ బ్రహ్మకంటె వేరు గాక బ్రహ్మాశ్రయమగు అనాది పదార్థము. 6. దీనిని నాశమొనర్చుటచే స్వస్వరూపస్థితి సిద్ధించును. ఇదియె మోక్షము. 7. ఈ మాయా పరిణామమే జగత్తు. 8. ఇందలి బ్రహ్మ ప్రతిబింబమే సర్వజగత్సృష్టి స్థితిలయ కారణము. 9. ఇదియే ఈశ్వరుడని, అవ్యాకృతమని, నామరూప వ్యాకర్త యని అంతర్యామి యని, ఈక్షణకర్తయని, సోపాధిక బ్రహ్మయని సర్వజీవ ప్రవర్తకుడని, ధాతయోని యని, సర్వేశ్వరుడని, సర్వజ్ఞుడని, జగదాయతనమని, నామరూప నిర్వాహకుడని, ఇత్యాది పేర్లతో చెప్పబడును. 10. ఈ బ్రహ్మయే జగత్తుకు ఉపాదాన కారణమున్ను, నిమిత్తకారణమున్ను. 11. ఈయనయే సర్వజీవ కారణదేహ సమిష్టిరూపుడు. 12. కార్యమనునది కారణముకంటె అభిన్నమైనది గాన జగత్తు బ్రహ్మకంటె అభిన్నమైనది. 13. ఈయనయే సర్వులకు కర్మఫలప్రదాత. 14. ఈ కర్మఫలము ననుసరించియే భిన్న భిన్న జీవుల నీతడు సృజిం

చును. 15. కావుననే యీశ్వరునికి వైషమ్యనైర్ఘృణ్యాదోష ముండదు. 16. విజ్ఞానమయ్యు, మనోమయ్యు, ఇంద్రియాదులన్నియు, ఈ కర్మఫల పరిణామములే. 17. మాయాపరిణామమే స్థూల సూక్ష్మ కారణములను త్రివిధ దేహజాతము. 18. పారమార్థికముగా బ్రహ్మ ఒక్కటియేగాని ఈ మాయ లేనేలేదు. 19. ఈ కర్మఫలమే మాయ. 20. దీనిచే ఆవరింపబడి కర్తృత్వాదులచే నొప్పుచు స్వస్వరూపము మరచినవారే జీవులు. 21. ఆకాశాది భూతము లన్నియు ఈ కర్మఫల భోగముకొరకు యేర్పడినవే 22. ఈ కర్మఫలమందలి హెచ్చుతగ్గులే చతుర్దశ భువనములు. 23. పుణ్యపాపములను కర్మఫలభేదముచే సూక్ష్మకారణదేహములు లోకాంతర గమనాగమనము లొనర్చును. 24 ఈపాపమును తగ్గించి పుణ్యమును హెచ్చించి ఊర్ధ్వలోకమును పొందించు నాదనవిశేషములే వేదములోని కర్మకాండ. 25. ఇంద్రియాదు లన్నియు అధిష్ఠాన దేవతోపేతములు 26. వాస్తవముచే ప్రపంచమం దేవస్తువు పుట్టునదే లేదు. అవిద్యచే పుట్టినట్లు భాసించుచున్నది. 27. ఇట్టి ఆత్మైకత్వ విజ్ఞానము ఈ జన్మలో గాని, జన్మాంతరమందుగాని స్వధర్మము నాచరించిన వారికిమాత్రమే గలుగును. 28. ఈ జ్ఞానమొక్కటియే మోక్షముగాని వేరొకటి గాదు. 29. కర్మకుగాని, ఉపాసనకుగాని బ్రహ్మలోకమే ఫలముగాని, మోక్షము ఫలముగాదు. 30. అచటనైనను ఈ జ్ఞానమువల్లనే మోక్షసిద్ధి. 31. అంగదేవతలు, విరాట్పురుషుడు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు అను ఉపాస్య దేవతలలో ప్రతి ఒకరును సాధకునియందే యున్నారుగాని సాధకునికంటె వేరుగాలేరు.

## వేదములో అసాధారణములు

1. జగత్తును స్థూల సూక్ష్మ కారణములను త్రివిధదేహముగాను, బ్రహ్మను దీని కంటె విలక్షణునిగాను బోధించినది వేదమొక్కటియే. ఏ దర్శనమైనను స్థూల సూక్ష్మ దేహములను రెంటినేగాని కారణదేహమును, తద్విలక్షణబ్రహ్మను చెప్పలేదు.

2. ఇంద్రియాది ప్రతి దేహావయవమున్ను అధిష్ఠాన దేవతోపేతమని అనగా ఇంద్రియమందలి సామర్థ్యమే దేవతయని వేదమొక్కటియే బోధించెనుగాని, ఏ దర్శనము బోధింపలేదు.

3. ఇతర దర్శనములు బోధించిన మోక్ష నిర్వచనము లన్నియు, వేద మువదేశించిన బ్రహ్మలోక ప్రాప్తికంటె గూడ నికృష్టములు. బ్రహ్మయే తానై, దేహ సంబంధ మెంతమాత్రము లేక సర్వాత్మభావము నొంది సర్వము తానేయగు మోక్షము వేద మొక్కటియే బోధించినది గాని ఏదర్శనమున్ను బోధింపలేదు.

4. ఈ మనుష్యలోకమందు దేహధారిగా నుండి యే శాస్త్రదృష్టిచే మోక్షము నొందుట యను జీవన్ముక్తి స్థితిని సయుక్తికముగా వేదమొక్కటియే బోధించినదిగాని ఏ దర్శనము బోధింపలేదు.

5. జాగ్రద్దశలోని యనుభవము స్వప్నకాలమందు మిథ్యగా నగుచున్నట్లును, స్వప్నానుభవము జాగ్రద్దశలో మిథ్యగా నగుచున్నట్లును సర్వలోక ప్రత్యక్షమును బట్టి సోపపత్తికముగా జగన్మిథ్యాత్వమును వేద మొక్కటియే బోధించినదిగాని, ఏ ఇతర దర్శనమున్ను బోధింపలేదు.

6. అవిద్యయను కారణదేహమును సోపపత్తికముగా స్థాపించినది వేదమొక్కటియే గాని ఏ దర్శనము కారణదేహమునే గుర్తింపలేదు.

7. మనుష్యానందము, మనుష్యగంధర్వానందము, దేవగంధర్వానందము ఇత్యాదిగా ఆనంద తారతమ్యమును, సర్వోత్కృష్ట నిరతిశయానందరూపమే బ్రహ్మమనియు సయుక్తికముగా నిరూపించినది వేదమొక్కటియే గాని యే దర్శనమున్ను గాదు. ఆనందము జ్ఞానభేదమనియు, అంతఃకరణధర్మమనియు దర్శనములు బోధించినవే గాని ఆనందమే బ్రహ్మయని యే దర్శనము గుర్తింపలేదు.

8. జ్ఞానము అంతఃకరణ ధర్మమనియును, ఆత్మద్రవ్యమనియు ఆత్మకీ జ్ఞానము గుణమనియు దర్శనములు బోధించినవే గాని ఆత్మయని యే దర్శనము బోధింపలేదు. వేదమొక్కటియే బోధించినది.

9. అతలాది సత్యలోకాంతములగు చతుర్దశ భువనము లున్నవనియు, అందిట్టి పుణ్యాభావములు గలవారీ ఈ లోకములం దుందురనియు యిట్టి సుకృతముచే యిట్టి లోకమందు జన్మించుననియు యిట్టి దుష్కృతముచే యిట్టి లోకమందు జన్మించుననియు యీ దుష్కృతముచే నీ వ్యాధి గలుగుననియు వేదమొక్కటియే బోధించినది గాని ఏ దర్శనము బోధింపలేదు.

10. ఏ దర్శనమైనను సాధకుని వేరుగాను, ఉపాస్యదేవతను వేరుగాను బోధించెనే గాని ఒకటిగా బోధింపలేదు. వేదమొక్కటియే ఉపాస్యదేవత సాధకుని యందే వున్నదనియు వీరలకు ఐక్యమే వాస్తవమనియు ఐక్యప్రతిబంధకమగు అవిద్యను తొలగించుట మాత్రమే సాధకుని కర్తవ్యమనియు బోధించినది. ఈ వేదమంత్రముల అసాధారణ విశేషము

లన్నియు ఆయా దర్శనసమాధానముగా గీతాశాస్త్రమందు శ్రీకృష్ణునిచే అర్జునుని నిమిత్తముగా జేసికొని సర్వలోకమునకు ఉపదేశింపబడెను. దాని సంగ్రహ మిచట దిఙ్మాత్రముగా వివరింపబడినవి. ఇది వేదసారమని, అనాదియని ఆయా కాలమందా యా అధికారుల కిదివరలో నుపదేశింపబడినదేగాని ఈ ద్వాపరాంతమందు కృష్ణుడు క్రొత్తగా చెప్పినది గాదనియు అందు పై అర్జునుడు తన సవయస్కుడగు శ్రీకృష్ణు డీ శాస్త్రమునే పూర్వకాలికుల కెట్లుపదేశించెనని సందేహించుటయు శ్రీకృష్ణు డతని సందేహనివృత్తి యొనర్చుచు తాను జన్మాదులు లేనివాడని చెప్పుటయు ఈ విషయమును స్ఫుటపరచు చున్నవి. (ఇమం వివస్వతే 4—1 నుంచి 10 వరకు).

అందుపసంహార మిట్లున్నది. "ఈ వేదమాత్ర వేద్యమగు జ్ఞానము నీ కుపదేశింప బడినది. దీనిని మనన మొనర్చి నీ ధర్మసంమూఢతను నివర్తించుకొనుము. (ఇతి తే గుహ్యం 18—63) ఈశ్వరాసక్తుడవై యెల్లప్పుడును వుండుటయే ముఖ్యోపదేశము (సర్వ గుహ్య 18—64 మన్మనాభవ 18—65) అన్ని ధర్మములును బ్రహ్మలో పరిసమాప్తమగును. ఆ బ్రహ్మ సర్వజీవ స్వరూపుడైనను యెట్టి పుణ్యపాప సంబంధము లేనిది. నీ వా బ్రహ్మభావముతో నుండుము (సర్వ ధర్మాన్ 18—66)" అని.

గీతాశాస్త్ర సంప్రదాయవిధి యిట్లున్నది. తపోవంతుడు భక్తుడు శుశ్రూషుడు ఈశ్వరాభ్యసూయా రహితుడు అగు శిష్యునకే యిట్టి లక్షణములతో కృతార్థుడైన గురువే బోధింపవలెను. అట్లు శ్రద్ధాభక్తులతో గ్రహించు వారందరు బ్రహ్మభావమగు మోక్షము నొందుదురు. (ఇదంతేనాత 18—67 య ఇమం పరమం 18—68 న చ తస్మాత్ 18—69 అధ్యే ష్యతే 18—70 శ్రద్ధావాననసూయః 18—71)

గ్రహించిన అర్జును డిద్దానివలన మోహ, శోక, సందేహాదులను పోగొట్టుకొని ఈశ్వ రార్పణబుద్ధితో స్వధర్మానుష్ఠానమగు యుద్ధము నొనర్చెను. (నష్టో మోహః 18-72)

ఇట్లర్జునుడు ధర్మకాండయను ప్రవృత్తిరూప వేదార్థమును మాత్రమే ఎరిగి, జిజ్ఞా సువై బ్రహ్మవేత్తయగు పరివదూపిపమున, శ్రీకృష్ణుని ప్రశ్నింప శ్రీకృష్ణు డాతనికి ధర్మ మును, బ్రహ్మను, రెంటిని బోధించెను. ధర్మము, బ్రహ్మజ్ఞానేచ్ఛ జనింపచేయుట కనువగు

చిత్తశుద్ధిని గలుగజేయుటతో సమాప్తమగుననియు. ఆ ధర్మమే విశేషవివేక, ఈశ్వరధ్యాన నిష్ఠతోను, స్వవర్ణాశ్రమానురూప కర్మయోగముతోను, పుణ్యలోకప్రాప్తి హేతువగునే గాని, మోక్షహేతువు గాదనియు, ఆత్మైకత్వ విజ్ఞాన మొకటియే మోక్షసాధనమనియు. అది ఇచటగాని, బ్రహ్మలోకమందుగాని అభ్యాసము సంపాదింపదగినవనియు బ్రహ్మ సమన్వయము నుపదేశించెను.

ఇతి శ్రీ



# I

ధృతరాష్ట్ర వాక్యము :

1. అనేక పెద్దలు ధర్మము నాచరించిన కురుక్షేత్రమందు యుద్ధాభిలాషతో సమాయత్తులైన నా వారున్ను, పాండవులున్ను ఏమిచేసిరో చెప్పుము సంజయా !

సంజయ వాక్యము :

2. రాజగు దుర్యోధనుడు మోహరింపబడిన పాండవ సైన్యమునుచూచి, వైలక్షణ్యము నొంది ధనుర్విద్యాచార్యుడగు ద్రోణాచార్యుల వద్దకు వెళ్ళి ఇట్లు పలికెను.

3. ఓ ఆచార్యా ! నీ శిష్యుడు, బుద్ధిమంతుడున్ను అగు ద్రుపదపుత్రునిచే మోహరింపబడిన ఈ పాండుపుత్ర సంబంధమైన గొప్ప సైన్యమును చూడుడు. అందు యుద్ధమందు భీమార్జునులతో సమానమగు శూరులు, మహాధనుర్ధరులు, మహారథులు (అగువారిని చెప్పుదును)

4. అందు 1 యుయుధానుడు, 2 విరాటుడు, 3 ద్రుపదుడు.

5. 4 ధృష్టకేతుడు, 5 చేకితానుడు, 6 వీర్యవంతుడగు కాశిరాజు, 7 పురుజిత్తు, 8 కుంతిభోజుడు, 9 మనుష్యశ్రేష్ఠుడగు శైబ్యుడు.

6. 10 విక్రమశాలియగు యుధామన్యుడు, 11 వీర్యవంతుడగు ఉత్తమౌజుడు, 12 అభిమన్యుడు, 13, 14, 15, 16, 17 ద్రౌపదీపుత్రులైదుగురున్ను మహారథులు.

7. ఓ ద్విజోత్తమా ! నా సైన్యములో నాయకులగు విశిష్టపురుషులను, నీకు తెలిసినను, జ్ఞాపకార్థము చెప్పుచున్నాను.

8. 1 తమరు, 2 భీష్ముడు, 3 కర్ణుడు, 4 యుద్ధమందు జయశాలియగు కృపుడు, 5 అశ్వత్థామ 6 వికర్ణుడు, 7 సౌమదత్తియనువారు.

9. ఇంకను చాలామంది, శూరులు, నాకొరకు ప్రాణత్యాగ మొనర్ప సిద్ధపడినవారు. నానావిధ ఆయుధధారులు, యుద్ధతంత్రము లన్నిటియందు విశారదులున్ను గలరు.

21. (ఓ రాజా!) కృష్ణునితో నీ వాక్యమును పలికెను. "ఓ అచ్యుతా! నా రథము ఉభయ సైన్యముమధ్య నుంచుము" అని

22. అట్లునిన, నేను యుద్ధమునే, కోరినా యెదుటనున్నవారి నందరిని చూచి ఈ యుద్ధ ప్రయత్నములో, యెవరెవరితో నేను యే క్రమమున యుద్ధముచేయవలెనో ఆలోచించి నిశ్చయించుకొనగలను.

23. ఇందు దుర్బుద్ధియగు దుర్యోధనునకు, యుద్ధమందు ప్రియమొనగూర్చుట మాత్రమే అభిలషించి ఇచటకు వచ్చి, ఇకముందు యుద్ధముచేయబోవువారిలో తమతమభావమును పరిశీలింతును.

**సంజయ వాక్యము :**

24. ఓ ధృతరాష్ట్రా! అర్జునునిచే నిట్లు పలుకబడిన కృష్ణుడు రథశ్రేష్ఠమును, ఉభయసేన మధ్యలో,

25. భీష్ముడు, ద్రోణుడు మిగిలిన సమస్తరాజులు ఇతనికి కనుపించునట్టిచోట స్థాపించి "ఓ పార్థా! ఒకే ప్రయోజనముకొరకు, ఐక్య నిశ్చయముతో నిచట కూడియున్న ఈ కౌరవులను చూడు"మని పల్కెను.

26. అచట అర్జునుడు వావి వరుసను, బంధుత్వమును బట్టి తన తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, తన ప్రేమకు పాత్రులను, అచట నున్నవారి నందరను,

27. ఇంకను మామగార్లను, తనయందుప్రేమగలవారిని ఉభయసైన్యములందును చూచెను. అట్లు పరిశీలించి, ఆ అర్జునుడు తన కన్నివిధములగు బంధువులను యుద్ధసన్నద్ధులనుగా గమనించి,

28. జాలియొక్క పరతాపను పొంది పరవశుడై, దుఃఖించుచు ఇట్లు పలికెను. "ఓ కృష్ణా! యుద్ధమందు దృఢాభినివేశము గలిగి ఇచటకు వచ్చియున్న ఈ స్వజనమును చూచి,

29. నా దేహావయవములు ఈడ్చుకుపోవుచున్నవి. నోరు ఆరిపోవుచున్నది. వణుకు, రోమాంచము గలుగుచున్నది.

30. చేతినుండి గాండీవము జారుచున్నది. చర్మము వేడెక్కి దహింపబడుచున్నది. నిలబడలేక కూర్చొనలేకయున్నాను. నా మనస్సు పరిపరివిధముల తిరుగుచున్నట్లున్నది.

31. నేను విపరీతములైన దుర్నిమిత్తముల ననుభవించుచున్నాను. యుద్ధమందు స్వజనమును చంపి నే ననుభవింపగల శ్రేయస్సు నాకు గోచరించుట లేదు.

32. ఓ కృష్ణా! నేను నా కొరకు, యుద్ధజయమును, తత్ఫలమగు రాజ్యమును, తత్ఫలమగు వివిధ సుఖానుభవములను కోరుటలేదు. ఓ గోవిందా! ప్రస్తుత స్థితిలోనున్న నా వాండ్లకు రాజ్యముతోగాని, భోగములతోగాని, జీవితముతోగాని ఏమి ప్రయోజనము?

33. రాజ్యాది సుఖములు, సర్వసాధారణముగా ఏ బంధుమిత్రాది జనులకొరకు కోరి ప్రయత్నింపబడునో అట్టి బంధువులు, తమ ప్రాణములు, ధనాదులను విడనాడి నిలిచి యున్నారు.

34. వా రెవరనగా ఆచార్యులు, తండ్రులు, పుత్రులు, తాతలు, మేనమామలు, మామగార్లు, మనుమలు, బావమరదులు, ఇంకను ఇతరవిధ సంబంధములుగల బంధువులు.

35. వీరందరు నన్ను అస్త్ర శస్త్రములతో కొట్టుచున్నప్పటికిని, త్రిలోకాధిపత్యము కొరకైనను, వీరలను నేను అస్త్ర శస్త్రములతో చంపదలచుట లేదు. అట్టిచో ఒక భూలోకాధిపత్యమాత్రముకొరకు చంపనిచ్చగించిన వేరుగ చెప్పనేల?

36. ఈ ధృతరాష్ట్రపుత్రులున్ను వారి సైన్యములున్ను, శస్త్రధారులు, ఆతతాయులు, దురాత్ములు. అట్టివారిని చంపినచో మనకెట్టి క్షేమప్రాప్తి గలుగును? ఓ జనార్దనా! వీరలను చంపుటచే మనలను పాపమే ఆశ్రయించగలదు.

37. అందుచే మనము మన బంధువులయిన ధార్తరాష్ట్రులను చంపదగము. ఓ మాధవా! స్వజనమును చంపి మనమెట్లు సుఖముగలవారము కాగలము?

38. తీవ్రమగు పరద్రవ్యాభిలాషచే తమ విజ్ఞానము కోల్పోయినట్టి ఈ ధార్తరాష్ట్రులు స్వకులక్షయముచే నేర్పడబోవు దోషమును, మిత్రులకు ద్రోహమొనర్చుటచే గలుగు పాతకమును గమనింపకున్నను,

39. ఓ జనార్దనా! కులక్షయముచే కలుగు దోషపరంపరను బాగా తెలుసుకొన్న మన వాండ్లచే ఈ పాపకార్యమునుండి నివర్తించుట ఏల గమనింపబడరాదు?

40. కులక్షయము కాగా సృష్ట్యాదినుండి అవిచ్ఛిన్నపరంపరగా వచ్చుచున్న సాంప్రదాయిక కులధర్మములు పూర్తిగా నశింపగలవు. ఆ ధర్మము నశింపగా కులము నంతను అధర్మము పూర్తిగా ఆక్రమింపగలదు.

41. ఓ కృష్ణా ! ఆ యధర్మాక్రమణముచే కులస్త్రీలు దుష్టలగుదురు. అందుచే వర్ణసంకర మేర్పడగలదు.

42. అట్టిది కులమునకు, కులక్షయకారులకు నరకమే రాగలదు. వీరల పితృదేవత లందరు ఉదక, పిండాది క్రియలు లోపించినవారై అధఃపతనము నొందగలరు.

43. వర్ణసంకరమునకు కారకములగు నట్టి కులక్షయకరుల ఈ దోషము లన్నిటిచేతను, సంప్రదాయానుగతములగు శాశ్వతమైన జాతి, కులధర్మములు తుడిచిపెట్టుకుపోవును.

44. ఓ జనార్దనా ! ఇట్లు లోపించిన కులధర్మములు గల మనుష్యుల కందరకు, నరకలోకమునందు లెక్కకు మించినంత కాలము నివాసముండగలదని మనము గురుశాస్త్రముల ద్వారా తెలిసికొనియుంటిమి.

45. ఎంతఘోరము ! మనము రాజ్యమందు, సుఖములందు గల తీవ్ర లోభముతో, స్వజన సంహారమొనర్చ సిద్ధపడి ఎంత గొప్ప పాపమొనర్చుటకు నిశ్చయించితిమి !

46. అస్త్రశస్త్రములతో శత్రువుల దెబ్బకు ప్రతిగా దెబ్బతీయనట్టి, అసలు ఆయుధమునే ధరింపనట్టి నన్ను, ఆయుధధారులగు ధార్తరాష్ట్రులు, యుద్ధమందు చంపే యెడల అది నాకు, నే నొనర్పదలచిన బంధువధకంటె ఎక్కువ క్షేమమునే గలుగజేయగలదు.

**సంజయవాక్యము :**

47. ఇట్లర్జునుడు పలికి, యుద్ధరంగమందు రథముపై చేతులలోని ఆయుధములను విసర్జించి తీవ్రశోకసంతప్త మనస్కుడై చతికిలబడెను.



# II

సంజయ వాక్యము :

1. అట్లు దీనమగు జాలిచే పరవశుడై, కన్నులు కన్నీరుగా విషాదము నొందుచున్న అర్జును నుద్దేశించి కృష్ణు డీ వాక్యములను పలికెను.

2. ఓ అర్జునా! నీ వాక్యములవల్ల వెల్లడింపబడిన ఈ భావము చాల తప్పు. విద్వాంసులకు తగినది గాదు. స్వర్గహేతువు గాదు. అపకీర్తికారకమైనది. అ[illegible]యమంచు [illegible] నది. నీ కిదెక్కడేర్పడినది ?

3. ఓ పార్థా! నపుంసకభావము నొందకుము. ఇది నీయందుండరానిది. నీచాతిరీచమగు, నీ హృదయ దౌర్బల్యమును వదలిపెట్టి లెమ్ము-నీ విధ్యుక్తము స్మరింపుము.

అర్జునవాక్యము :

4. ఓ మధుసూదనా! అరిమర్దనా! పూజింప నర్హులగు భీష్మద్రోణులను, అస్త్రశస్త్రములతో నెట్లెదిర్చి పోరాడగలను ?

5. మహానుభావులగు కులగురు, విద్యాగురువులను చంపకుండగా ఈ లోకమందు భిక్షాటనముచేసి జీవించుట యైనను నాకు శ్రేయస్కరమే - ఆ గురువులను చంపినచో, ఈ లోకమందుండు స్వల్పకాలము మాత్రమే నెత్తురుతో పొదగబడిన ప్రయోజనములను, కోరికలను అనుభవింపగలను.

6. మనపక్ష కౌరవపక్షములలో నెవరిబల మెక్కువదో ఎవరెవరిని జయింతురో తెలియజాలము. ఎవరిని చంపితే మనము బ్రతుకుట కభిలషింపమో, అట్టి బంధువులు మన ఎదుట యుద్ధమునకు సిద్ధముగా నున్నారు.

7. నేను అతిజాలి యనుదోషముచే, నా స్వభావమును కోల్పోతిని. ఈ యుద్ధకారణము, మనకు ధర్మమో, శత్రుపక్షమునకు ధర్మమో, నిర్ణయింపజాలు బుద్ధిలేకున్నాను. గాన నిన్నడుగుచున్నాను. ఇప్పుడు నేను యుద్ధముచేయుట ధర్మమో, మానుట ధర్మమో, ఏది నాకు ఎక్కువ శ్రేయస్కరమో, శాస్త్రనిశ్చయము వమపరించి నా కుపదేశింపుము. నేను నీకు శిష్యుడనై, పరమాత్మనా నిన్ను శరణుజొచ్చితిని. ఇట్టి నన్ను శాసించుము.

8. ఇప్పటి నా ఇంద్రియములను శోషింపజేయుచున్న ఈ శోకమును ఒకవేళ పొందినట్లు తలచునదే శత్రుబాధ లేని సమస్త భూమండలాధిపత్యముగాని, దేవలోకాధిపత్యముగాని పోగొట్టజాలదు. నీకంటె ఇతరుల నెవరిని నాశోకనివర్తకులను నేనెరుగజాలకున్నాను.

సంజయవాక్యము :

9. ఓ ధృతరాష్ట్రా ! అర్జును డిట్లు కృష్ణుని గూర్చి పలికి, “ నేను యుద్ధముచేయను ” అని చెప్పి ఊరకుండెను.

10. అట్లుభయసేనల మధ్యలో విషాదము నొందుచున్న అర్జునుని గూర్చి కృష్ణు డిట్లు ఎగతాళి చేయుచున్నట్లుగా పలికెను.

భగవద్వచనము :

11. నీవు దుఃఖింపదగనివారి నుద్దేశించి దుఃఖించుచున్నావు. మాటలలోమాత్రము గొప్ప విద్వాంసుల వాక్యములను పల్కుచున్నావు. విద్వాంసులు చనిపోయిన వారిని, బ్రతికియున్నవారని ఉద్దేశించి దుఃఖింపరు.

12. నేను, నీవు, ఈ సైన్యములందలి రాజులు, మనమందరము, ఈ పుట్టుకకు పూర్వము లేనివారముగాము. ఈ దేహముల మరణానంతర ముండనివారముగాము.

13. దేహధారికి దేహమందు, బాల్య, యౌవన, వార్ధకాదులు ప్రాప్తించుచున్నట్లే, మరికొన్ని దేహాంతరములుగూడ ప్రాప్తింపగలవు. ఈ విషయము నెరిగిన ధీరు డీ విషయములో మోహము నొందడు.

14. చక్షురాదీంద్రియములు, వాటికి విషయములగు రూపాదులతో సంబంధము నొంది శీతోష్ణ సుఖదుఃఖముల నిచ్చుచున్నవి. ఇవి రాకపోకలు గలవి. అనిత్యములైనవి. ఓ అర్జునా ! వాటి నోర్చుకొనుము.

15. ఓ పురుషశ్రేష్ఠా ! సుఖదుఃఖములను రెంటిని సమానముగా చూచు ధీరుడగు నే పురుషుని ఇవి బాధింపజాలవో వాడే మరణరహితుడగుట కర్హుడు.

16. “ఉండకపోవుటకు” స్థైర్యములేదు. “ఉండుటకు” మార్పులేదు. పురుషప్రయత్నమునకు పూర్వమే సిద్ధమైయుండి ఆ ప్రయత్నమునకుగూడ కారణమైనది. “ఉండుట” యనబడును. లేక ఏ పురుషప్రయత్నమే “మార్పు”లేక భావమనబడును. అస[illegible]

మగు వస్తువు సంపూర్ణమగుట కొఱకు సాధనముచే సాధ్యమగు మార్పు భావమన బడును. ఇట్టి రెంటియొక్క స్పష్టనిర్ణయముల నెఱిగినవాడే యథార్థదర్శి.

17. ఆ "ఉండుట" ఎట్టి దేశకాలావస్థలందును నశించదు. దానిచే నీ సమస్తమును వ్యాపింపబడినది. ఎట్టి వ్యయములేని ఆ "ఉండుటకు" లేక "ఉనికి" వినాశ మెవరును చేయజాలరు.

18. ఆ ఉనికి నిత్యమైనది. ఎట్టి మార్పు లేనిది. ఎట్టి ప్రమాణమైనను, అనుకొంచు పెనుగా, తన బుద్ధికి గోచరముగానిది, అనేక మార్పుల నొందుచున్న ఈ దేహములన్నియు దానివె.

19. ఈ "ఉనికిని" చంపువానినిగా, చంపబడువానినిగా తలచువా రిద్దరు అజ్ఞానులే. ఉనికి చంపదు. చంపబడదు.

20. (1) పుట్టుట, (2) ఉండుట, (3) వృద్ధినొందుట, (4) మార్పునొందుట, (5) క్షీణించుట, (6) నశించుట యను ఆరు వికారములు "సాధనసాధ్యముగు భావము" లనబడును. పురుషప్రయత్నమను సాధనముచే సాధ్యములగు ఈ మార్పులు ఆరున్ను 'ఉనికి'కి లేవు. ఈ ఆరు వికారములే శరీరమనబడును. శరీరము చంపబడుచున్నపుడు గూడ 'ఉనికి' నశింపదు.

21. ఈ ఉనికి నాశములేనిదని, నిత్యమని, జన్మలేనిదని, మార్పులేనిదని గుర్తించిన పురుషుడు ఎట్లు ఎవరిని చంపగలడు ? చంపించగలడు ?

22. మనుజుడు పాతబట్టలను వదలి క్రొత్తవాటిని గ్రహించినట్లే ఈ'ఉనికి' దేహముగలదై దేహమున కధిష్ఠానమై, ప్రాతశరీరములను వదలి క్రొత్తశరీరములను పొందును. దేనికి దేహములుగలవో అది 'దేహి' యనబడును.

23. ఈ 'దేహి'ని ఆయుధములు ఛేదింపలేవు. అగ్ని దహింపలేదు. ఉదకము తడుపలేదు. వాయువు శోషింపజేయలేదు.

24. ఇది ఛేదింపబడజాలదు. దహింపబడజాలదు. తడుపబడజాలదు. శోషింపబడజాలదు. నిత్యమైనది. సర్వదేశకాల వస్తువులందు సిద్ధమైయున్నది. బాధింపబడదు. మార్పుల నొందదు. నిత్యమూతనమైనది.

౨౫. ఇది ఏ ఇంద్రియములకు గోచరముగాదు. బుద్ధితో ఊహింపదగనిది. మార్పు నొందింపబడనిది. అందుచే దీని నెరిగి శోకింపతగవు.

౨౬. ఒకవేళ నీవు లోకప్రసిద్ధి ననుసరించి ప్రతి దేహముతోను దేహి పుట్టుచు, చచ్చుచు ఉండునని తలచినను ఇట్లు దుఃఖింపతగవు.

౨౭. పుట్టినవారందరికు మరణము నిశ్చయము. చచ్చినవారందరకు జన్మ గలుగుట నిశ్చయము. అందులో నీవు పరిహరింపదగిన దెద్దియు లేదు. అట్టి విషయములో నీవు దుఃఖింపదగవు.

౨౮. ఈ ప్రపంచములోని దేహములన్నియు పుట్టుకపూర్వమెట్లున్నవో మనకు తెలియదు. అట్లే మరణానంతర మెట్లుండునో తెలియదు. కేవలము ఈ రెంటిమధ్యనుండు స్థితి మాత్రమే తెలియును. అట్టిచో దుఃఖమునకు తావు ఏదీ ?

29. ఈ "దేహి" యొక్క స్వరూపాదికమును, మొట్టమొదట గమనించిన ఒకానొకడు తా నిదివర కెన్నడును కనివిని యెరుగనందున ఆశ్చర్యముగా చూచును. మరియొకడు ఆశ్చర్యముగా దీనిని గూర్చి పలుకును. వేరొకడు ఆశ్చర్యముగా వినును. ఇంకొకడు పెద్దలవల్ల దీని విషయము విన్నను గ్రహింపలేడు.

౩0. ఈ 'దేహి' అసంఖ్యాకములగు దేహములన్నిటిలోను ఒక్కటిగాను, నిత్యముగాను వధార్హము గాకుండగను సిద్ధమైయున్నది. అందుచే నీ వీ దేహముల నుద్దేశించి శోకింపతగవు.

౩1. స్వజాతి ధర్మము నాలోచించి చూచినను నీవు దుఃఖింపదగవు. ధర్మముకొరకు ధర్మ బద్ధముగా యుద్ధము చేయుటకంటె గొప్ప శ్రేయస్సాధనము క్షత్రియునకు లేదు.

౩౨. మంచి క్షత్రియులుమాత్రమే తమకు కోరకయే తలుపులు తెరవబడిన స్వర్గద్వార ప్రవేశసాధనమగు ఇట్టి యుద్ధములో పాలొందగలరు.

౩౩. ఒకవేళ నీ వీ ధర్మబద్ధమగు యుద్ధము నొనర్పని యెడల, నీ స్వజాతి కర్తవ్యధర్మమును. కీర్తిని వదలుకొని పాపమునొందగలవు.

౩౪. లోకులందరు ప్రపంచ ప్రళయ పర్యంతము అవిచ్ఛిన్న సంప్రదాయ పరంపరతో నీ అపకీర్తిని చెప్పుకొనగలరు. ఇట్లూహింపదగిన అపకీర్తి మరణముకంటె గొప్పది.

35. యుద్ధరంగమునకు వచ్చి, వీరులను చూచినభయమువలన నీవు పారిపోతివని మహారథు లందరు భావింపగలరు. ఇంతవరకు నీయందు అత్యంత గౌరవభావముగలవారి దృష్టిలో నీ విక మీద తేలికకాగలవు.

36. నీ శత్రువులు నిన్ను గూర్చి పలుకరానిమాటల ననేకవిధములుగా పలుకగలరు. నీ విది వరలో ప్రదర్శించియున్న ఘనకార్యసామర్థ్యమును నిందింపగలరు. అంతకంటె గొప్ప దుఃఖ మేముండగలదు ?

37. నీ వీ యుద్ధములో శత్రువులచే చంపబడే యెడల స్వర్గ సుఖమును, శత్రువులను జయించే యెడల భూమండల సామ్రాజ్య సుఖమును అనుభవింపగలవు. అందుచే యుద్ధమొనర్ప నిశ్చయించి లెమ్ము !

38. నీ వీ యుద్ధమందు ఎట్లయినను రాగల సుఖదుఃఖములను, లాభాలాభములను జయ, అపజయములను సమానముగా భావించి యుద్ధమొనర్పుము. అట్లయిన నీవు పాపము నొందవు.

39. ఉత్తమాధికారుల శ్రేయస్సాధన విద్యాభాగమగు "సాంఖ్య" దృక్పథము ననుసరించి నీకిపుడు బోధించితిని. ఇక సామాన్యాధికారుల శ్రేయస్సాధన విద్యాభాగమగు "యోగ" దృక్పథము ననుసరించి చెప్పబోవుచున్నాను వినుము. దానిచే ధర్మ అధర్మములను కర్మబంధమును విడనాడగలవు.

40. ఈ శ్రేయస్సాధనములలో ఆచరించిన ఏ చిన్నపనియు ఫలమునివ్వకుండా నశింపదు. అతి స్వల్పమగు ఈ ధర్మము గొప్ప భయమునుండి దేహధారిని రక్షింపగలదు.

41. వెనుకటి "సాంఖ్య"విద్య ఒకే దృఢనిశ్చయరూపమైనది. ఓ కురునందనా ! అట్టి విద్యాధికార మేర్పడువరకు సాధకుల బుద్ధి ఒక స్థిరనిశ్చయములేనిదై బహుశాఖలతో అనంతముగా నుండును.

42. ఈ బుద్ధి స్థైర్యములేనివారు అవివేకులై చెట్టును గమనింపకయే దూరమునుండి దాని పుష్పములను మాత్రమే చూచి ఆనందించు మూఢులవలె వేదవిద్యలోని స్వర్గ, పశు, పుత్ర, ఐశ్వర్యాది ఫలబోధక వాక్యములను మాత్రమే గమనించి అంతకంటె వేరుగా నేమియు లేదని పల్కుదురు.

43. వారు నిరంతరముగా కోరికల పరంపరగలవారై తత్ప్రమాపుతే యగుచు ఫలమగు [illegible] సుఖము దాసక్తులై జన్మాంతరములను, అందలి కర్మఫలభేదములను, భోగ ఐశ్వర్యాదులను పొందుట కొరకు అనేక క్రియావిశేషముల నాచరింపుచుందురు.

44. [illegible] భోగ ఐశ్వర్యములందా సక్తులై దానిచే అపహరింపబడిన స్వస్వరూప వివేక జ్ఞానము గలవారికి బుద్ధిస్థైర్యము రానేరదు. ఎల్లప్పుడు బుద్ధి చంచలముగానే యుండును.

45. దేహధారులు సాధారణముగా (1) కొన్ని క్రియలు, (2) కొన్ని కోరికలు, (3) కొన్ని పదార్థజ్ఞానములు గలిగి, వానిని పరస్పర కార్య కారణభావముతో ప్రవర్తింపచేతురు. అట్టివారికి తగు సాధనములను వేద ముపదేశించినది. ఇదియే యోగము లేక కర్మకాండ. ఓ అర్జునా, నీ వా మూడిటిని పరిత్యజింపగోరుము. పరస్పర విరుద్ధములగు శీతోష్ణ సుఖదుఃఖాదుల నతిక్రమింపుము. లేనిదానిని పొందుటకును, ఉన్నదానిని రక్షించుకొరకున్ను వ్యర్థప్రయత్నమొనర్పకుము. నీ యథార్థస్వరూప మేదియో తెలిసికొనుము. ఇదియే సాంఖ్యము లేక "జ్ఞానకాండ".

46. ఒక దేహధారికి పరిమితమగు పాత్రలోని ఉదకమువలన తన స్నానపానాది ప్రయోజనము ఘటించును. అట్లే గొప్ప నదీ తటాకాదులందునుగూడ అంతే ప్రయోజనము. అట్లు భిన్న భిన్న పాత్రలందలి ఉదకప్రయోజనము తటాకోదక ప్రయోజనాంతః పతితమగునట్లే కర్మకాండలోని ఫలములన్నియు జ్ఞానమను మహాఫలములో నంతర్భవించును.

47. నీవు శాస్త్రీయమగు పని చేయుటకే అధికారివి గాని ఫలము నీశ్వరుడిచ్చును. గాన నీ వద్దాని నపేక్షించి తదాసక్తబుద్ధితో కర్మల నాచరింపకుము. అట్లని శాస్త్రీయ కర్మల ననుష్ఠింపకుండుటను కోరకుము.

48. తనబుద్ధి నిశ్చలముగా ప్రశాంతముగా నుండుటయే ఈశ్వరానుగ్రహ మనబడును. నీవు నీ కర్మలయొక్క ఫలము సిద్ధించునను ఆశతోను, సిద్ధింపదను నిరాశతోను ఉండక సమబుద్ధితో నీ వర్ణాశ్రమధర్మము ననుష్ఠింపుము.

49. ఇట్లాచరించు కర్మకంటె ఫలతృష్ణతో ఆచరించు కర్మ చాలా తక్కువది. ఫలమును యాచించు స్వభావము బుద్ధియందలి దౌర్బల్యమైనందున నీవు స్వాతంత్ర్యమును కోరుము.

రూపముగా నుండును. చక్షురాదీంద్రియము లన్నిటిలోనుగల జ్ఞానసామాన్యమే "ప్రజ్ఞ" యనబడును. సామాన్యజీవుని కా ప్రజ్ఞ అనేక భేద విశేషములతో చలించుచుండును ఇతనికి స్థిరముగా నుండును.

58. తాబేలు దానికవసరమైనప్పుడు తన అవయవములను బయటకు ప్రసరింపజేసి వ్యవహరించును. దాని కవసరము లేనప్పుడు అవయవముల నన్నిటిని లోపలకుపసంహరించును. అట్లే ఈతడు గూడ తన జ్ఞానేంద్రియముల నన్నిటిని పూర్తిగా తనలో నిముడ్చుకొనియుండును. బైటకు ప్రసరింపనీయడు.

59. తన ఇంద్రియములతో శబ్దస్పర్శాది విషయములను గ్రహింపకుండగా, ఏకాగ్రతతో నున్న స్థితప్రజ్ఞునకు ప్రారంభమందు విషయానురాగము తప్ప మిగిలినదంతయు అనగా కోరికలు, ప్రయత్నములు మరలిపోవును. క్రమముగా అతడు తన నిజరూపము నెరిగి నిశ్చయించుకున్న తర్వాత, ఆ యనురాగము గూడ తొలగి, విషయవిజ్ఞానము నిర్బీజమగును.

60. ఇట్లభ్యాసమొనర్చు నాతనిని విషయాభిముఖ మొనర్చుటకు సర్వప్రయత్నములను చేయు నాతని ఇంద్రియములు బలాత్కారముగా మనస్సును వ్యాకులపరచి ఆకర్షించును.

61. అతడపుడు ఆత్మయందే ఆసక్తుడై వాటినన్నిటిని నియమింపవలెను. ఇట్లొనర్చినవాని ప్రజ్ఞయే స్థిరమగును.

62. శబ్దాది విషయములను మనస్సులో ధ్యానమొనర్పగా వాటియం దాసక్తియు, కోరికయు, అది నెరవేరనిచో క్రోధమున్ను క్రమముగా గలుగును.

63. క్రోధముచే తా నభ్యసించిన శాస్త్రవిజ్ఞాన సంమోహమును, దానిచే మఱపును, దానిచే బుద్ధి నాశము, దానిచే అధఃపతన నాశమున్ను కలుగును.

64. ఇష్టప్రాప్తికొరకు రాగము, అనిష్టనివృత్తికొఱకు ద్వేషము లేకుండా తనకు వశ్యములైన ఇంద్రియములతో తన దేహధారణ మాత్రోపయుక్త విషయములను గ్రహించుచున్నను బుద్ధి నిశ్చలముగా నున్నందున అతడు ప్రశాంతుడే యగును.

65. అట్టి ప్రసన్నచిత్తునకు దుఃఖము లన్నియు నశించి, బుద్ధి స్థిరమైన "ఉనికి" యగును.

66. ఈ సమాధి స్థితి నొందలేనివాని బుద్ధికి పరవశమైయుండుటచే ఆత్మజ్ఞానాభినివేశముండదు. అది లేకున్నచో ప్రశాంతత ఉండదు. అది లేనపుడు నిత్యసుఖముండదు.

67. తమతమ శబ్దాదివిషయములపైకి సంచరించు ఇంద్రియములను అనుసరించి ఎవని మనస్సు ప్రవర్తించునో వాని ప్రజ్ఞను తుఫానుగాలి ఉదకమందలి పడవనువలె హరించి వైచును.

68. ఇట్లు ఇంద్రియ ప్రవృత్తియందు దోషమున్నదని గుర్తించి వానిని శబ్దాదివిషయముల నుండి మరలించినవాని ప్రజ్ఞయే స్థిరమైన ప్రతిష్ఠనొందియుండును.

69. దేహధారులు పగటియందు విషయేంద్రియ వ్యాపారయుక్తులై మేల్కొనుచుంటిమని తలచెదరు. ఈ స్థితప్రజ్ఞుడు దానిని పరమాత్మేతర బంధనముగా నిశ్చయించును. దేహధారులు తమ సుషుప్తిలో ఏమియు ఎరుగకయుంటిమని తలచగా స్థితప్రజ్ఞుడు దానిని విక్షేపరహితమైన స్వస్థతగా భావించును.

70. నదులు, సముద్రము రెండును ఉదకమయములేయైనను నద్యుదకము ప్రతిక్షణము వేగముతో ప్రవహించుచు సముద్రమందే లీనమగును. కాని సముద్రము నిశ్చలముగా నుండి అప్రయత్నముగానే నదులనన్నిటిని తనలో లయింపజేసికొనును. వాస్తవముచే నదీ సముద్రములకు ఆభాసమాత్రమగు నామ, రూప, భేదమేగాని వాస్తవభేదము లేదు. అట్లే పామరులై సాధకులగువారు నదులవంటివారు. సిద్ధులగు స్థితప్రజ్ఞులు సముద్రమువంటివారు.

71. ఎవడు విద్యచే ధీరుడై సమస్తకోరికలను పరిత్యజించి, ఆత్మేతర వస్తువు లేదుగాన ఎట్టి స్పృహయు లేనివాడై, తన, దేహ, బంధు, గృహాదులందు, "నేను" అను బుద్ధిగాని, "ఇది నాది" అను బుద్ధిగాని లేకుండ దేహయాత్ర చేయునో, వాడే శాంతినొందును.

72. ఓ పార్థా! బ్రాహ్మీస్థితి యనగా నిట్టిది - దీనిని బొందినవాడెట్టి మోహమును పొందడు. తనజీవితకాలములో నేదశనుండియైనను దీనియందుండువారు మోక్షము నొందుదురు. బ్రాహ్మీస్థితియే కైవల్యమని, ప్రశాంతతయని, మోక్షమని, నిర్వాణమని యనబడును.



# III

అర్జునవచనము :

1. ఓ జనార్దనా! కర్మానుష్ఠానముకంటె జ్ఞానయోగము గొప్పదని నీయభిప్రాయమైనచో, నన్నేల ఘోరమగు కర్మయోగమందు నియోగించుచున్నావు ?

2. నాకర్థమైనదానినిబట్టి నీవు పరస్పర విరుద్ధమగు రెండుపదేశముల నొసర్చితివి అందుచే నన్ను మోహపెట్టుచున్నట్లుగా కనబడుచున్నది. గాన నాకు శ్రేయస్కరమైన ఒకే సాధనమునాలోచించి చెప్పుము.

భగవద్వచనము :

3. సృష్ట్యాదినుండి ఇప్పటివరకు ఈశ్వరరూపుడను, వేదరూపుడను అగు నాచే ఒకే శ్రేయస్సాధనము అనుష్ఠించుటయందే తాత్పర్యముగలది రెండువిధములుగా బోధింపబడినది. 1 ప్రారంభస్థితిలో "కర్మ" యోగము, 2 పరిపక్వస్థితిలో "జ్ఞానయోగము"అని.

4. వేదోపదిష్ట కర్మానుష్ఠానము నారంభించక పోయినంత మాత్రముచేతను, సంన్యసించినంతమాత్రముచేతను ఏ పురుషుడున్ను ప్రయోజనసిద్ధి నొందజాలడు. అనగా తన వర్ణాశ్రమ విహితనిత్యకర్మలను ఈ జన్మలోగాని. జన్మాంతరములందుగాని బాగా అనుష్ఠించిన "కర్మయోగి"కి జ్ఞానయోగాధికారముగల్గి, సర్వకర్మ సంన్యాసమొనర్చును.

5. దేహధారి ఏక్షణమందును ఏపని చేయకుండా ఉండలేడు. తనప్రయత్నము లేకుండగనే వాని ప్రకృతివల్ల పుట్టిన గుణములచే, ప్రేరితుడై పని చేయించబడును.

6. ఎవడు మనసులో అనేకవిషయముల నాలోచించుచు పైకిమాత్రము వాక్పాణి పాదపాయూపస్థల నుపసంహరించి నిర్వ్యాపారముగా నుండునో వాడు మూఢుడు, మిథ్యాచారుడు లేక పాపి.

7. ఎవడు మనసులో ఎట్టి శబ్దస్పర్శాది విషయములను అభిలషింపక ఫలాభిలాష లేకుండా తన వర్ణాశ్రమ విహితధర్మము నాచరించుట తన విధి యని భావించి ఆచరించునో వాడు గొప్పవాడు, పుణ్యపురుషుడు.

13. అట్లు దేవతలనుద్దేశించి కృతజ్ఞతా సూచకముగా ప్రారంభదశలోను తమ విధిగనుక చేసితీరవలెనని పంపక్వ దశలోను తానసుభవించు భోగ్యముల నన్నిటిని అర్పించుట యజ్ఞమనబడును. ఆ శేషము ననుభవించు ఉత్తమ సాధకుడు సర్వపాప వినిర్ముక్తుడగును. అట్లుగాక తమతృప్తి కొరకే వండి సంపాదించి అనుభవించు మూఢుడు పాపమును మాత్రమే అనుభవించుచున్నాడు.

14. ఈయజ్ఞము ఎట్లు జగచ్చక్ర ప్రవృత్తి హేతువగునో చెప్పబడుచున్నది. అన్నము వలన ధాతుక్రమ పరిణతములగు శుక్ల శోణితముల ద్వారా భూతములున్ను, వృష్టివలన అన్నమున్ను, యజ్ఞఫలమువలన వర్షమున్ను, సాధకులాచరించు వర్ణాశ్రమధర్మము (కర్మ) వలన యజ్ఞఫలమున్ను ఏర్పడుచున్నది.

15. ఆ కర్మ వేదమువలన ఏర్పడును. ఆవేదము పరమాత్మవలన ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములవలె అప్రయత్నముగా వెలువడినది. అందుచే సర్వవ్యాపకమగు పరమాత్మ యజ్ఞముల ద్వారా తెలియదగి ప్రతిష్ఠితమై యున్నది.

16. ఇట్లు పరమేశ్వరునిచే ప్రవర్తింప చేయబడిన స్వాభావిక పరస్పరోపకార రూపమగు జగచ్చక్రము ననుసరింపనివాడు పాపమే జీవనముగాగల్గి ఇంద్రియములచే శబ్దాది ఉద్యానవనములందు విహరించుచు వ్యర్థజీవు డనబడును.

17. ఇట్టికర్మకాండను నిరంతరముగా ఆచరింపగా ఎపు డాతనికి 1 తనమనస్సు ఇంద్రియములద్వారా శబ్దాదిసర్వప్రపంచమును పొందగల శక్తికలుగునో అది ఆత్మయనబడును. 2 ప్రపంచ విషయములను తాను గ్రహించుశక్తి ఆత్మయనబడును. 3 శబ్దాది విషయముల నన్నిటిని అనుభవింపగలశక్తి ఆత్మయనబడును. 4 అంతట నిరంతరముగా దేశకాలాది బాధ లేకుండగా వ్యాపించియున్న శక్తి ఆత్మయనబడు నను నీనాలుగు నిర్వచనముల ద్వారా ప్రపంచమంతయు "ఆత్మ"యేగాని వేరెద్దియు లేదని నిశ్చయించునో అపుడతడు చేయదగినదేమియు లేదు.

18. అతను చేయుపనివలన ప్రయోజనముగాని, చేయకపోవుటవలన ప్రయోజనము గాని లేదు. ఈ ప్రపంచవస్తువులలో అతనికెద్దియు సాధనముగాదు సాధ్యమున్ను గాదు. అతనికి వర్ణ ఆశ్రమ, కుల, ధర్మవిధి, నిషేధములుండవు.

19. అందుచే అతని లక్షణములను నీవు ఆదర్శముగా నుంచుకొని ప్రతిఫలములోను ఎట్టి ఆసక్తియు లేకుండగా నీ వర్ణాశ్రమధర్మము నాచరింపుము. దానిచే నీవుత్తమ దశను, సిద్ధుడవు కాగలుగుట కవకాశముండును.

20. ఇట్టి కర్మయోగముచేతనే పూర్వమునుండి జనకాది అనేకులు క్షత్రియశ్రేష్ఠులు, సిద్ధులు అయిరి. నీవు సిద్ధుడవైన తర్వాత గూడ లోకులను ఈ మార్గమునందు నడిపించుట కొరకైనను ఇట్టి కర్మయోగము ననుష్ఠింపుము.

21. లోకమందు శ్రేష్ఠుడే యే పని నాచరించునో దేని ప్రమాణముగా (సత్యార్థ జ్ఞాన సాధనముగా) గ్రహించునో దానినే సామాన్యులందరు ననుసరింతురు.

22. ఓ పార్థా! నాకీ మూడులోకములందు చేయవలసిన పనిగాని, పొందవలసినదిగాని, పొందుటకు ప్రయత్నింపవలసినదిగాని లేదు. నేను కర్తవ్యరహితుడనైనప్పటికి "కర్మ యోగ" ము ననుష్ఠించుచుంటిని. అందలి యథార్థకారణమేమనగా,

23 నేనట్లు ఎప్పుడైనను, పొరపాటుగానైనను "కర్మయోగ"ము ననుష్ఠింపకున్నచో లోకులందరు అట్లే "శ్రీకృష్ణు డాచరింపలేదు, మనమెందుకు నాచరింపనక్కరలేదు" అని భావించి నన్ననుసరింతురు.

24. దానిపరిణామమువల్ల లోకము తమ స్థైర్యము లేకుండా భ్రష్టమై, వర్ణసంకరము గలుగును. నేను లోకానుగ్రహముకొరకు మనుజుడనైనా, లోకమును పాడుచేసినవాడ నయ్యెదను. అద్దాని నివారించుటకై కర్మ నాచరించుచుంటిని.

25. అజ్ఞానులగు సాధకులు ప్రారంభదశలో తమ స్వార్థసిద్ధికొరకు మాత్రమే ఆ ఫలమందు రూఢమగు బుద్ధితోనే ప్రతిక్షణమందును "కర్మ"ల ననుష్ఠించును. జ్ఞానియగు ఈ సిద్ధుడు నిష్కామబుద్ధితో, నిర్మలాంతఃకరణుడై, ఫలాసక్తి లేనివాడై లోకులను తనవలె ప్రవర్తింపజేయుటకొరకు మాత్రమే కర్మల ననుష్ఠించును.

26. ఇట్టిజ్ఞాని తానుమాత్ర మట్టి లోకసంగ్రహార్థముగు నిష్కామకర్మ ననుష్ఠింపుచు అజ్ఞానులై ఫలాసక్తబుద్ధితో కర్మల ననుష్ఠింపువారలకు వారి నిష్ఠయను తప్పని బోధింపరాదు.

27. అవిద్యాంశ అహంకారముచే విమూఢుడై 1 ప్రకృతిగుణములగు సత్వరజస్తమస్సుల చేతను, 2 వాటి స్వరూపములగు జ్ఞాన, ఇచ్ఛా క్రియాశక్తులచేతను, 3 తన జన్మాంతర

[illegible] కర్మఫలము లేదు. తన పనులన్నియు ప్రవర్తించుచుండగా. తానే దీనికంతకు కర్తనని, ప్రయోజకుడనని తలచును.

28. [illegible] జ్ఞాని త్రి[illegible] గుణరూపములగు ఇంద్రియములు, గుణ [illegible] విషయములందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించి, తానందు [illegible] గాక [illegible] తాదాత్మ్యము [illegible].

29. అజ్ఞానులు ప్రకృతి గుణములగు పైమూటివలను, వాటివల్ల జరుగు పనులతోటిన్ని, [illegible] మహా మోహితులై తాము, తాదాత్మ్యము పొందుదురు. జ్ఞాని వారలను చూచి వారి యజ్ఞానమిట్లు ప్రకటమగుచున్నదని మాత్రమే భావించి వారల నందులో నుంచి చలింపజేయరాదు.

30. [illegible] అదియే నీ బుద్ధీంద్రియు, విషయ ప్రపంచరూపముగా భాసించుచున్న దను నిశ్చయముతో నుండి, ఎట్టి కోరికలు లేకుండా, ఏవస్తువునందు "నాది" యను మమత్వబుద్ధి లేకుండా, ఎట్టి దుఃఖము లేక సర్వమును ఆత్మగా భావించి యుద్ధమొనర్పుము.

31. ఏ మానవులు నా యీ నిశ్చితసిద్ధాంతము నెరిగి, శ్రద్ధా భక్తులు గలిగి, ఈర్ష్యాసూయాదులు లేకుండ అనుష్ఠింతురో, వారు కర్మఫలమగు జనన మరణాది బంధమునుండి విముక్తులయ్యెదరు.

32. ఎవరు నా యీ సిద్ధాంతమును జీవస్వభావ దౌర్బల్యముచే మనుష్యప్రోక్తమే వేదమనియు భగవంతుడు గూడ మనవంటి మనుజుడేననియు, అసూయాదిగ్రస్తులై ఆచరింపరో వారు మూఢులని. అజ్ఞానులని, బుద్ధిలేనివారని, నాశమొందినవారని తెలిసికొనుము.

33. వారట్లు భావించుటకు కారణమేమనగా, సర్వులు ఆత్మరూపులేయైనను ఎరుగక భిన్నభిన్నులై దుఃఖించుచూ తన్నివృత్తికై అసూయా, ఈర్ష్యా, కామ, క్రోధాదులతో అనేకవిధములుగ ప్రవర్తింతురు. దాని పరిణామమే వారు ముందనుభవింప బోవు దేహాదికము. ఇదంతయు "ప్రకృతి" యనబడును. దాని కనువుగా ప్రవర్తింతురు. అట్టివారిని నిషేధించుటవలన నేమి ప్రయోజనము ?

34. ప్రతి ఇంద్రియ విషయకమగు పదార్థములందును, ఇష్టమైన [illegible] రాగముగా, అనిష్టమైనదానిపై ద్వేషముగాని స్వాభావికముగా ఉండును. [illegible] వశుడు గారాదు. అవియే ఇతనికి ప్రతిబంధకములు.

35. స్వధర్మమునకు, ఆశ్రమమునకు [illegible] గుణ వంతు [illegible] అనుష్ఠించుట [illegible] ధర్మము ఎక్కువ గుణములు [illegible] భ [illegible]

అర్జున ఉవాచ :

36. ఓ వృష్ణికులనందనా! సామాన్యమనుష్యుడు తను కోరని విషయములో గూడ దాని యొక గొప్ప శక్తిచే బలాత్కారముగా ప్రేరణచేయబడి, ప్రవర్తించి, పాపమునొందును ఆ శక్తి ఏమి?

శ్రీ భగవద్వచనము :

37. అదియే ఇష్టవస్తువిషయకమగు కోరికయు, అనిష్టవస్తువిషయకమగు క్రోధమున్ను, రజోగుణమూల నొంది, రాజససాధనములతో రాజసకార్యములందు రాజసముగా ప్రవర్తించినందులకు ఫలమే అదియెందు. అది చాలా ఆకలిగలది. ఎంత ఆహారము దానికిచ్చినను తృప్తిపడదు. అదియే గొప్పపాపము శత్రువు.

38. ఈ శత్రువు 1 అగ్నితో కూడా పుట్టిన పొగ అగ్ని నావరించినట్లు జీవుని స్వరూపము నావరించును. ఆ దశలో అగ్నియొక్క దాహక ఉష్ణత్వాది స్వభావము నశింపనట్లు జీవుని జ్ఞానస్వభావము నశింపదు. 2 అది ముదిరిన దశలో అద్దము బైటనుంచి వచ్చి పడిన దుమ్ముచే, ఆవరింపబడి కొంతకాలమున కసలే ప్రతిబింబగ్రహణ సామర్థ్యమును పోగొట్టినట్లు జీవుని జ్ఞానశక్తిని పోగొట్టును. ఈ దశలో అద్దము పేరుమాత్రమున్నట్లు జీవుడు చైతన్యవంతుడని పేరుమాత్రమే. 3 ఇంకను ముదిరిన దశలో తల్లి గర్భమందున్న శిశువును దాని చుట్టుయున్న మావి దాని ఇంద్రియవృత్తుల నన్నిటిని ఆవరించి స్తంభింపజేసినట్లు జీవుని ఇంద్రియవృత్తుల నన్నిటిని ఆవరించి స్తంభింపజేయును.

39. దేహధారి జ్ఞానియగుటకు ప్రయత్నించుటలో ఈ శత్రువును ప్రతిక్షణమందు గమనింప వలెను. అగ్ని ఎన్ని కట్టెలు వేసినను తృప్తినొందనట్లు ఈ శత్రువు ఎన్ని విషయ

ముల నాతనికి సమర్పించినను తృప్తి నొందదు. ఇతడే జ్ఞానాభ్యాసకునకు నిత్య శత్రువై జ్ఞానము నావరించును.

40. ఇతనికి దేహధారు లందరియొక్క 5 జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు 5 మనస్సు 1, బుద్ధి 1 మొత్తం 12 ఆశ్రయస్థానములు. ఇచట ఉండి ఈ 12 తోనే ప్రాణిని జ్ఞానము నావరించి మోహింపజేయును.

41. ఓ భరతవంశ శ్రేష్ఠా! అందుచే నీవు శత్రుదుర్గములగు విషయ ఇంద్రియాదులను ముట్టడించి వశపరచుకొని లౌకిక జ్ఞానమును, పారమార్థిక జ్ఞానమును నశింపజేయు శత్రువును సంహరింపుము.

42. ఎట్లనగా నీవు దేహము నాశ్రయించి విషయదుర్గమును ఇంద్రియముల నాశ్రయించి దేహదుర్గమును, మనస్సు నాశ్రయించి ఇంద్రియదుర్గమును, బుద్ధి నాశ్రయించి మనోదుర్గమును, ఆత్మ నాశ్రయించి బుద్ధి దుర్గమును ముట్టడించి వశపరచుకొనుము. ఇవన్నియు శత్రుదుర్గములు. ఉత్తరోత్తర బలిష్ఠములు – ఆత్మమాత్రమే సర్వము – అది శత్రువుగాదు, మిత్రము గాదు.

43. ఇట్లుత్తరోత్తర క్రమముచే ఆత్మ సర్వోత్కృష్టమైనదని తెలిసికొని, నీవు సర్వాత్మ రూపుడవై సామాన్యముగా తెలియశక్యముగాని అనేక విశేషరూపములు గల కోరిక యనుశత్రువును చంపుము.



# IV

భగవద్వచనము :

1. అట్టి యోగ్యత లక్షణము [illegible] గలదో, వానికి [illegible] [illegible] [illegible] గలదై [illegible] [illegible] [illegible] ఉపదేశించెను.

2. [illegible] విద్య [illegible] [illegible] అనేక [illegible] [illegible] విచ్ఛిన్నమైనది.

3. ఆ విద్యనే ఇపుడు నీకుపదేశించితిని. [illegible] వేదమును చదివి అర్థము గ్రహించి క్రమముగా తానే వేదమూర్తుడు, తత్త్వార్థమగు పరమాత్మ రూపుడు [illegible] [illegible] పొందుటవరకు గల కలాపము [illegible] భక్తి [illegible]. ఒకరి క్షేమము నొకరు కోరువారు సఖులనబడెదరు. ఈ రెండు లక్షణములు గల వాడుమాత్రమే విద్యకు అర్హుడు. అతడే క్రమముగా మోక్షమునొందును. నీకట్టి లక్షణములుండుటచె నుపదేశించుచున్నాను.

అర్జున వచనము :

4. నీవు నాతో సమానవయస్సు గలవాడవు. సూర్యుడు అనేక కోట్ల సంవత్సరముల పూర్వుడు. అట్టిచో నీవే ఆయనకీ విద్య నుపదేశించితివని నేనెట్లు విశ్వసించగలను ?

భగవద్వచనము :

5. ఓ అర్జునా! నీకు, నాకుగూడ ఇదివరకనేక జన్మలు గడచినవి. వాటినన్నిటిని నే నెరుగుదునుగాని నీ వెరుగవు.

6. వాస్తవముచే నేను జన్మాది ఆరు వికారములు లేనివాడను. పంచభూతములకు దేహధారులకు ప్రభువును. సాధకులగు జీవులు నన్ను వేదవిద్యాద్వారా తమబుద్ధితో తెలిసి

కొందురు. అప్పుడు నేను సర్వవ్యాపకుడనై నను వారి బుద్ధిలో నిమిడియుందును. వారు క్రమముగానే నిమిడిన బుద్ధినిని పెరుగుదురు. ఆ పెరిగిన బుద్ధిలో నిమిడిన నేనున్ను పెరుగుదును. ఇట్లు పరిపూర్ణావస్థనందునట్లే మేమిద్దరము పెరుగుచూరాగా, ఆ జీవుని బుద్ధి సర్వవ్యాపకమై నిర్విశేష ఆనందరూపమగును. అనగా నా లక్షణములే ఆ బుద్ధికి పట్టును. దీనినే "ముక్తి" యనబడును. అప్పుడాతడు సాధకుడు గాడు. జీవుడు గాడు. అతడు ఈశ్వరుడే—నేనే అగును. ఇట్లు భిన్న భిన్న సాధకులు ప్రారంభమునుండి చివరదశవరకు గల అందరి బుద్ధులకు గోచరమొనర్చుకొను నేను "ఈశ్వరు"డ ననబడె దను. నా "శుద్ధ" స్వరూపమునకు "ఈశ్వర" రూపమునకు గల భేదమే ప్రకృతి యని, మాయ యని వ్యవహరింపబడును. ఇది నాదే-నాలో నొక భాగమందు సాధకుల కొరకు సాధకులచే కల్పించబడినది. ఇది నా స్వాధీనమందుండును. దాని నవలంబించి నేను పుట్టుచుందును.

7. జీవులు క్రమముగా బాగుపడుటకు వేదముచేబోధింపబడిన ఉపాయములు, సాధనములు, ప్రవృత్తులు "ధర్మ" మనబడును. జీవులు క్రమముగా చెడిపోవుటకుపాయములు సాధనములు, ప్రవృత్తులు "అధర్మ" మనబడును. ఎపుడెపుడు ధర్మమునకు హానియు, అధర్మమున కుద్భవమున్ను ఏర్పడునో, అపుడపుడు నేను నన్ను దేహధారినిగా సృజించుకొందును.

8. ధర్మము ననుష్ఠించు "సాధువు"లను రక్షించుటకొరకున్ను, అధర్మము ననుష్ఠించు పాపులను నశింపజేయుటకొరకున్ను, అవసరమైనపుడెల్ల నే నిట్లు పుట్టుదును.

9. ఓ అర్జునా! ఇట్టి నా జన్మ అపుడొనర్చు పనులు లోకమర్యాద ననుసరించిన "ప్రాకృతము"లు గావు. దేవతామయము లేక పారమేశ్వరములని ఎవడు యథార్థముగా గుర్తించునో, వాడీ వర్తమాన దేహ పతనానంతరము తిరిగి జన్మింపక నన్నే పొందును.

10. ఇట్టి వేదవిద్యవల్ల క్రమముగా రాగ, భయ, క్రోధాదులు పోయి నన్ను సర్వదా ఆశ్రయించి యుండి, సర్వమును పరమేశ్వర మయముగా భావించి, జ్ఞానాభ్యాసముచే పవిత్రులై బహుమంది సృష్ట్యాదినుండి నేటివరకు నాలో లీనమైరి. అనగా ముక్తు

16. "కర్మ", "అకర్మ" అనగానేమో స్పష్టముగా తెలియక పండితులు గూడా మోహ పడుచున్నారు. నీకు వాటి స్వరూపములను వివరింతును. నీవు గ్రహించినచో నీ అజ్ఞానము తొలగగలదు.

17. వేదమందు అభ్యుదయసాధనముగా విధింపబడిన "కర్మ"ను గురించియు, అభ్యుదయ ప్రతిబంధకముగా నిషేధింపబడిన "వికర్మ"ను గురించియు ఏమియు చేయకుండుటనెడు "అకర్మ"ను గురించియు చాలా, సూక్ష్మముగా తెలియదగియున్నది. వాటి నిజస్వరూపములు తెలిసికొనుట చాలా కష్టము.

18. ఆత్మవిదులగువారు ప్రపంచమందలి ప్రతి (కర్మ) పనియందును అంతర్లీనముగా అధిష్ఠానమైన ఆత్మను గుర్తించి ఇది "అకర్మ" యనుదురు. అనగా ఆత్మకు వికారము లేదనుట. ఏమియు చేయని "అకర్మ"ను అతడు కర్మయే యనును. ఏలనగా అకర్మస్థుని దేహేంద్రియములు మాత్రమే ఏమియు పనిచేయుటలేదుగాని, మనఃప్రాణములు క్రియ చేయుచూ, మారుచూ యున్నందున అది కర్మయేగాని, అకర్మ ఎంతమాత్రము గాదు. ఇట్టివాడు మనుష్యులందరిలో బుద్ధిమంతుడు. బుద్ధిని పూర్తిగా ఉపయోగించుకొని బుద్ధివలన పూర్తిప్రయోజనమునందినవాడు. సర్వకర్మలు వాడు చేసినవాడే యనగా వాని కర్మ లేక పురుషకారము పూర్తిగా ఫలించినది.

19. ఎవని దేహాదివ్యాపారములన్నియు కోరిక ఫలాభిసంధి కనువగు రూపకల్పనలు లేకుండునో వాడె పండితుడనబడును. వాని ఆత్మైకత్వ విజ్ఞానముచే వాని పుణ్య, పాప కర్మలన్నియు నిర్వీర్యములగును.

20. కోరికలు లేకుండా నిత్యము తృప్తుడై, దేహాదుల నాశ్రయింపక "ఇది నాది" యను భావములేకుండా ఎట్టి ఫలాభిలాషతోను ప్రేరితుడు గాకుండా దేహాది వ్యాపారముల నొనర్చువాడు. అతని దృష్టిలోను, శాస్త్రదృష్టిలోను ఏమియు చేయుటలేదు.

21. ఎట్టి కోరిక లేక బుద్ధీంద్రియాదులను నియమించి, దేహాది ప్రపంచవస్తువుల నన్నిటిని "నావి కావు" అని భావించి శరీరస్థితి మాత్రావశ్యకమగు పనుల నొనర్చువా డెట్టి పాపమును పొందడు.

22. దానియంతట అది తనకు ప్రాప్తించిన దేహధారణావశ్యక వస్తులాభముచేతనే సంతుష్టుడై, శీతోష్ణాది పరస్పర విరుద్ధ ధర్మముల నతిక్రమించి అనగా అన్నిటిని

వారందరు యజ్ఞతాత్పర్యవేత్తలే. ఇవన్నియు జీవభావము, ప్రపంచభేదము. ఇవి క్రమముగా శుద్ధి, బ్రహ్మజ్ఞానము ప్రపంచాభేదములను ప్రయోజనము నిచ్చునవే.

31. [illegible] యజ్ఞావశిష్ట [illegible] అమృతము ననుభవించుచు క్రమముగా బ్రహ్మ జ్ఞానము నొందుదురు. ఏ యజ్ఞము చేయనివారికి ఈ లోకసుఖమే లేదు: ఇక పరలోక సుఖమెట్లుండును ?

32. వేదము నిట్టి యజ్ఞములు అనేకవిధములుగా బోధింపబడినవి. ఒకజన్మలో దేహధారి యొక్క మనో, వాక్కాయ వ్యాపారముల ఫలితమే వానిమరుజన్మలోని దేహేంద్రియాదులు. అవి తిరిగి ఉత్తరజన్మ సాధనములు. ఆత్మ నిర్వ్యాపారమైనది గాన ఇవన్నియు. వ్యాపారరూపములైనందున అనాత్మరూపములగుచు క్రమముగా ఆత్మజ్ఞానమున కంతరంగసాధనమును చిత్తశుద్ధినిచ్చును.

33. ద్రవ్యసాధనసాధ్యములగు యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. మిగిలినవాటి ఫలములన్నియు ఇతరగతి యజ్ఞములకు సాధనమగుటచే అవి తక్కువవి. జ్ఞానయజ్ఞ ఫలము మోక్షమేగాన అతడే పరమాత్మరూపుడైనందున, ఇకపై నాతడాచరింపదగినదే లేనందున, మిగిలిన ఫలములన్నియు మోక్షఫలములో నంతర్భూతములైనందున ఇది సర్వోత్కృష్టమైనది.

34. అటి జ్ఞానవిద్యను, బ్రహ్మవిదులగు గురువులను వినయపూర్వకముగా సమీపించి, నమస్కరించి, వారిని సేవించి, నీ సందేహముల నన్నిటిని ప్రశ్నించి, భక్తి శ్రద్ధలతో వారుపదేశించు విషయములను గ్రహించి మననమొనర్చవలెను. నీ కట్టి గురువులు తమ యనుభవమునే నీకు జ్ఞానసాధనముగా నుపదేశింతురు.

35. ఆ జ్ఞానము నెరిగిన తర్వాత ఇట్టి మోహమును తిరిగి పొందజాలవు. ఏలననగా ఆ జ్ఞానివైన నీ దృష్టిలో ప్రపంచమంతయు పరమాత్మకంటె భిన్నము గానందున ఆయనలో ఇమిడియుండును. ఆయనయే నీవు.

36. అన్నిరకములగు పాపములకంటెను గొప్ప పాపములను నీవు చేసియున్నప్పటికి ఈ జ్ఞానముచే వాటినన్నిటిని సమూలముగా పోగొట్టుకొనగలవు.

37. కట్టెలనన్నిటిని అగ్ని తగులబెట్టి భస్మమొనర్చునట్లు ఈ అద్వైతజ్ఞానము, కర్మల నన్నిటిని భస్మమొనర్చును.

# V

అర్జునవచనము:

1. కృష్ణా! నీవు కర్మల సన్న్యాసమును, మరల యోగము ననుష్ఠించుమని రెంటిని ప్రశంసించుచున్నావు. ఆ రెంటిలో నేది నాకు శ్రేయస్కరమో నిశ్చయించి చెప్పుము.

భగవద్వచనము:

2. కర్మసన్న్యాసమును, కర్మయోగమును రెండును మోక్షకారులే. ఆ రెంటిలో కర్మసన్న్యాసముకంటె కర్మయోగము విశేషము గలది.

3. ఎవడు ఇష్టవస్తువులను కోరడో అయిష్టవస్తువులను ద్వేషింపడో, శీతోష్ణాది పరస్పర విరుద్ధములందు సమదృష్టి గలిగియుండునో, కర్మము ఆత్మగా గ్రహించునో వాడు నిత్యసన్న్యాసి యనబడును. అతడు సుఖముగ బంధవినిర్ముక్తుడగును.

4. ఒట్టి జ్ఞానకాండమును సాంఖ్యము, కర్మకాండమును "యోగము" భిన్నమైనవని విద్యాతత్త్వమెరుగనివారు పలుకుదురు. ఒకం దే నొకదాని ననుష్ఠించినను రెండింటి ఫలమును పొందగలడు.

5. జ్ఞానులచే పొందబడుఫలమే కర్మఫలముచే గూడ పొందబడును గాన ఈ రెండు ఒకటేనని గుర్తించువాడే తన బుద్ధీంద్రియములను సార్థకపరచినవాడగును.

6. కొంతకాలము కర్మల ననుష్ఠించి తద్రహస్యముల నెరుగనివాడు సంన్యాసమును పొందలేడు. ఈశ్వరార్పణబుద్ధితో ఫలాభిసంధి లేకుండా చేయు కర్మయోగి క్రమముగా సంన్యాసియగును.

7. అతడట్టి యోగముచే స్వచ్ఛమనస్కుడై దేహేంద్రియ విషయాదుల నన్నిటిని తన స్వాధీనమందుంచుకొని తన ఆత్మయందే సమస్త ప్రపంచము గలదని, సమస్త ప్రపంచమందు తన యాత్మ గలదని నిశ్చయించుకొనును. వాని దేహేంద్రియవ్యాపారముల వలన వాతని కెట్టి సంబంధము లేదు.

17. అట్టివారు నిరంతరముగా బ్రహ్మమునందే బుద్ధిగలిగి, బ్రహ్మమే తామై ఆత్మయందే స్థిరాభినివేశముగలిగియుండి జ్ఞానముచే పోగొట్టబడిన సర్వకల్మషములు గలవారై పునరావృత్తిరహిత మోక్షము నొందెదరు.

18. వారు విద్యావినయసంపన్నుడగు విప్రునియందును గోవు, ఏనుగు, కుక్క చండాలుడు మొదలగు దేహభేదములను గుర్తింపక, సర్వాధిష్ఠానమగు పరమాత్మయే సర్వమునను సమదృష్టితో నుందురు.

19. వారి బుద్ధి ఈ దేహమునందున్నప్పుడే సర్వసమ బ్రహ్మాత్మభావము దున్నందున వారిప్పుడే బ్రహ్మమైరి. ఈ ప్రపంచసృష్టి వారి నిప్పుడే బాధింపలేదు గాన ముందు గూడ బాధింపదు.

20. బ్రహ్మవేత్త నిరంతరము బ్రహ్మమునందే యుండి ప్రియాప్రియములు లేకుండుటచే ప్రియమును పొంది సంతసింపడు. అప్రియమునొంది ఉద్వేగము నొందడు. బ్రహ్మమునందే స్థిరుడై యుండి ఎప్పుడును మూఢుడు గాడు.

21. బైట విషయప్రపంచమునందు శబ్దముగాని, స్పర్శాదులుగాని ఒకటిలో భాగము మాత్రమే గలదు. తన ఇంద్రియములందు పూర్తిగా ఒకటి గలదు గాన, బాహ్య విషయములం దాసక్తి లేక తనలో తానే సుఖించును. అదియే శాశ్వతసుఖము. అతడు సర్వాత్మరూపుడు.

22. బైటనున్న విషయములకు దేహధారి ఇంద్రియములతో సంబంధమువల్ల ఏర్పడిన సుఖములు, దుఃఖభూయిష్ఠములు, క్షణికములు, అవి అంతములు గలవి గాన విద్వాంసు డట్టి విషయసుఖములందు రమింపడు.

23. దేహధారులలో ఎవడు తన దేహపతన (మరణము) ము లోగా, ఈ విషయమును గ్రహించి కామక్రోధాది వేగములను నిగ్రహించునో వాడే సుఖించును. ఇచట బ్రహ్మభావమునొంది దేహమరణమువరకు అదేస్థితిలో నుండుట "జీవన్ముక్తి" యన బడును.

24. జీవన్ముక్తుడు తనలోనే సుఖము, ఆరామము, కాంతి, శక్తి మొదలగునవన్నియు కలవను నిశ్చయముతో నుండును. వాడిపుడే బ్రహ్మభూతుడు. వాని వర్తమాన దేహమరణానంతరమందు వాని స్థితికి "విదేహముక్తి" యని పేరు.

# VI

భగవద్వాచనము :

1. కర్మఫలము నాశ్రయింపక ప్రత్యాహారపరుడై, తన వర్ణాశ్రమ ధర్మమును కర్తవ్యముగా భావించి కర్మను అనుష్ఠించువాడే పరిత్యాగి గాన సంన్యాసియనియు చిత్తశుద్ధి గలవాడు గాన యోగియనియు చెప్పబడును. అంతేగాని, అగ్నిహోత్రము, కర్మలు లేనివాడు మాత్రమే సంన్యాసి కాడు.

2. సంన్యాసమని ప్రఖ్యాతమైనది సర్వకర్మ, తత్సాధనత్యాగము, కర్మయోగమునుకూడ. ఈ త్యాగమును క్రమముగా నలవరచుటకే ప్రధానముగా నేర్పడినవి. గాన రెండు ఒక సాధర్మ్యమునకే.

3. ఆత్మజ్ఞానము నభ్యసించి, ప్రారంభించుచుండి, క్రమాభివృద్ధి నొందవలసిన సాధకుని సాధనమే "కర్మయోగము". ఆలక్ష్యము సిద్ధించినవాని స్థితియే సంన్యాసము లేక శాంతి.

4. దానికి గుర్తు ప్రధానముగా సాధకుని కే దశయందో శబ్దాదివిషయములందు కోరికలు, తత్ప్రయత్నములు ఉండవో అప్పుడాతడు ఎట్టి సంకల్పమును చేయడు గాన "యోగారూఢు" డనబడును.

5. వాడు తనను తాను సంసారాబ్ధి [illegible] ఉద్ధరించుకొనును. ఆత్మజ్ఞాన బాధకమైన ఏ పనిని చేయడు. వానికాత్మయే బంధువు, శత్రువుగూడ. అనగా సర్వము వానికాత్మయేగాని భేదముండదు.

6. ఇట్టి నిశ్చయము గలిగి దేహేంద్రియ మనస్సుల నింద్రియల కనువుగా నుపయోగించుచు, తన అనాత్మలను జయించిన వానికి ఆత్మయే బంధువైనది. అట్లుగాక దేహేంద్రియాదులనే తన యాత్మగా భావించినవానికి నిజమైన 'ఆత్మ' శత్రువగును.

7. అట్లు తానుగాని బుద్ధీంద్రియాదులను జయించి "నిజమైన ఆత్మ" రూపములో నిశ్చలముగాను, ప్రశాంతముగాను ఉండువాడు శీతోష్ణ సుఖదుఃఖ మానావమానములందు సమదృష్టితో నుండును.

8. ఇంద్రియములన్నియు జయింపబడుటచే తన జ్ఞానముచేతనే తృప్తుడై ఎట్టి మార్పు లేకుండా మట్టి, రాయి, బంగారములందు వస్తుదృష్టి జనితభేదజ్ఞానముండక సర్వమందు ఆత్మదృష్టి యుండి "యుక్తు"డని యోగియని చెప్పబడును.

9. తనయందు ప్రేమగలవారు, తాను ప్రేమించువారు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, బంధువులు, సాధువులు, పాపులు ఇత్యాదులందరిని ఏకవిధముగా ఆత్మరూపులనగా చూచును.

10. యోగి దేహేంద్రియ మనస్సులను నియమించి, కోరికలను సాధనములను పరిత్యజించి, ప్రశాంతముగా ఏకాకియై నిర్జనప్రదేశమందుండి ఆత్మనే నిరంతరముగా భావించుచుండును.

11. పరిశుద్ధ ప్రదేశమందు, ఎక్కువ ఎత్తు, ఎక్కువ పల్లముగాని, స్థిరమైన ఆసనము నేర్పరుచుకొని దానిపై 1 దర్భను, 2 కృష్ణాజినమును, 3 బట్టను క్రమముగా ఒకదానిపై నొకదానిని వేసికొని,

12. అచట కూర్చొని మనస్సును ఆత్మయందే నిశ్చలముగా స్థాపించి బుద్ధీంద్రియ క్రియల నన్నిటిని నియమించి తన అంతఃకరణ పరిశోధనకొరకు యోగము ననుష్ఠించును.

13. దేహమును, శిరస్సును, మెడను, సమముగాను, నిశ్చలముగాను స్థాపించి, తన దృష్టిని అంతర్ముఖమొనర్చి బాహ్యప్రపంచమును చూడక,

14. ప్రశాంతచిత్తుడై, ఎట్టి భేదదృష్టియు, దాని కార్యమగు భయమున్ను లేనివాడై, గురు శుశ్రూషా, విద్యామనన, భిక్షాన్నభోజనాది మాత్రదేహచేష్టుడై, మనస్సుకు ఆత్మనే పరమలక్ష్యముగా నొనర్చి అప్రమత్తుడై యుండవలెను.

15. ఇట్లు నిరంతరాభ్యాసముచే క్రమముగా వానిబుద్ధియే ప్రశాంతమైన ఆత్మ యగును.

16. ఈ యోగము అత్యధికాహారము, ఆహార మసలే తినకుండుట, ఎక్కువ నిద్రపోవుట, అసలే నిద్రపోకుండుట, ఇత్యాదుల నొనర్చువానికి సిద్ధించదు.

17. ఆహార, విహార, కర్మచేష్టా, స్వప్న, జాగ్రదాదులు, తగుమాత్రముగా నుంచువానికి యోగము సిద్ధించి, సర్వసంసార దుఃఖములను పోగొట్టును.

18. అట్టి నిశ్చలచిత్తము, చాలా కాలము "ఆత్మ" యందే ఉండగా, సమస్త కోరిక లందు విస్పృహుడై "యుక్తు"డని యనబడును. —"యోగ" మనగా నెట్టిదో వివరింపబడు చున్నది.

19. ఈస్థితి కపటరహితమైన బాలికంటె ఎక్కువ గాలిలేని ప్రదేశమందుంచిన దీపశిఖ ఎట్లు నిశ్చలముగా నుండునో, ఓపి చిత్తమట్లుంచుము.

20 ఇట్టి యోగసేవచే, ప్రారంభములో నిరోధింపబడిన వీని చిత్తము పరిపక్వ దశలో స్థిరపడును. అపుడు ఆత్మ మాత్రమే తాను, తన దృశ్యముగూడ - తనలో తానే సంతసించును.

21. ఆ సుఖము దేశకాలపరిమితి లేనిది. ఇంద్రియగోచరముగానిది. తన బుద్ధ్యనుభవ రూపము మాత్రమే. తానే ఆ సుఖము, ఆ సుఖమే తాను. ఇట్టి స్థితిలో నుంచి తొలగడు.

22. దాని నొందినవాడు, అంతకంటె గొప్పది లేనే లేదు గాన కోరడు. ఆస్థితిలో నుంచి ఎట్టి దుఃఖమున్ను అతనిని తొలగించలేదు.

23. ప్రాపంచిక సుఖదుఃఖములు రెండును ఆస్థితిలో నుండవు. ఏలననగా కర్త, కర్మ, క్రియ లను త్రిపుటీ మిశ్రితములు ప్రాపంచిక దుఃఖ సుఖములు- ఈ సుఖము త్రిపుటీ రహితమైనది. ఇదియే యోగమనబడును. చిత్తమున కెట్టి నిరాశా భావము లేకుండగా దాని నభ్యసించవలెను.

24. తా నిదివరలో అనుభవించియున్న విషయసుఖమునే తిరిగి కోరును. అపుడా పూర్వానుభూత సుఖమును ముందుగానే కల్పనచేయును. దాని వలన కోరికపుట్టును. ఇట్టి వాటి నన్నిటిని పూర్తిగా వదలి పెట్టి, ఇంద్రియసముదాయమును మనస్సుతోనే నియమించి,

25. శాస్త్రజ్ఞాన ధైర్యముతో తాదాత్మ్యము నొందిన బుద్ధితో క్రమముగా మనస్సును, అద్వితీయ సర్వాత్మ యందు స్థిరముగా స్థాపించి, తదితరముల నాలోచింపరాదు.

26. మనస్సుచలించుటకు పది ఇంద్రియవిషయములును, శృంగారాది రసవిషయములున్ను ద్వారములు. ఇందేద్వారమున మనస్సు స్వభావముచే చలించునో అచట అధిష్ఠానమైన 'ఆత్మ'ను స్ఫురణకు తెచ్చికొని, దానిచే మనస్సును ఆత్మవశ మొనర్చుకొనవలెను.

27. ఇట్లొనర్చగా చివరకు ఇతడు ప్రశాంతమనస్కుడగును. అపు డితడు బ్రహ్మయే. ఎట్టి రజఃకార్యములగు కామాదులున్ను ఉండవు. అట్టి యోగియొక్క స్థితియే "శాశ్వత సుఖము"—

28. ఇట్లొకరోజున కొద్దికాలముమాత్రమే బ్రహ్మీభూతుడైన యోగి క్రమాభ్యాసముచే ఎక్కువ కాల మీ స్థితిలోనుండగలడు. ఆ కాలము పెరిగినకొలది ఇతని పాపములు నశిం

చును. రాగద్వేషాదులే పాపము గాన నిష్పాపచిత్తముతో, ఆ తరువాత కాలమం దింకను ఎక్కువకాలము బ్రాహ్మీస్థితి నొందగలడు. చివర కతడు శాశ్వత సుఖరూపు డగును.

. ఆ స్థితి సిద్ధించినవాడు, తనను సర్వభూతములందును ఏకరీతిగా నున్నవానినిగాను, తన ఆత్మలోనే సర్వభూతము లున్నవనియు నిశ్చయించి, సర్వవస్తువులను సమముగా ఆత్మగా భావించును.

). ఎవడు "ఆత్మను" సర్వద్రవ్య, గుణ, క్రియాదులందును ఉన్నదానినిగాను, ద్రవ్యాదు లన్నియు ఆత్మయందే ఇమిడియున్నవనియు గమనించి నిశ్చయించునో అతనికి నాశను లేదు. అతని దృష్టిలో నేను నశించను. నా దృష్టిలో అతడు నశింపడు.

31. ఏ యోగి సర్వద్రవ్యాదులందును ఏకరీతిగా నుండి సర్వమునకు "ఆత్మ"యైన నన్ను సర్వకాల సర్వావస్థలందు ఏమరకుండా గమనించియుండునో, అట్టివానిదేహ మెట్లు ప్రవర్తించుచున్నను వాడు నాయందే ఉంటున్నాడు.

32. ఆ యోగి తన సుఖమును సర్వప్రాణిసుఖముగాను, తన దుఃఖమును సర్వప్రాణి దుఃఖముగాను ఇట్లు ప్రతి విషయమందును తనతో సర్వమును తాదాత్మ్యము నొందించుకొని ఎట్టి ప్రాపంచిక ద్రవ్యాదులను హింసింపడు. అతడే ఉత్తముడు.

అర్జునవచనము :

33. ఓ మధుసూదనా! ఇపుడు నీవు చెప్పిన సర్వసామ్యయోగము కొద్దికాలము మాత్రము ధ్యానమొనర్చువాని కుండవచ్చునుగాని శాశ్వతముగా నుండుట కవకాశము లేదని నాకు తోచుచున్నది.

34. ఓ కృష్ణా! జీవుని మనస్సు స్వభావముచే చంచలమైనది. శరీరేంద్రియాదుల నన్నిటిని మథించి పరవశమొనర్చునది. చాలా బలముగలది, ఛేదింపదగనిది గాన వాయువును మూటగట్టుటవలె ఈ మనస్సును స్థిరముగున ట్లొనర్చుట అసంభవముగా నాకు తోచు చున్నది.

భగవద్వచనము :

35. మహాబాహువులు గల ఓ అర్జునా! నీవు చెప్పినదంతయు నిజమే. సందేహము లేదు. కాని ఒకేవిషయము నెక్కువ కాలము మనస్సులో నాలోచించుటయను వళ్యాసము

చేతను, మనస్సుచే కోరబడు ప్రపంచవిషయములందున్న యథార్థదోషదర్శనమను "వైరాగ్యము"చేతను క్రమముగా సాధ్యమగును.

36. ఈ అభ్యాసవైరాగ్యములచే కొంచెము కొంచెముగా మనస్సు వశమగును. అట్టి మనస్సుతో ఇంకను ఎక్కువ అభ్యాస, వైరాగ్యము లేర్పడుటయు, వాటిచే ఇంకాఎక్కువ మనోనిశ్చలతయు కల్గి స్థైర్యము పెరుగుటయును "నుపాయము"చే స్థైర్యము సిద్ధించును.

అర్జునవచనము :

37. ఓ కృష్ణా ! ఒక సాధకుడు ధ్యానకాలములో మాత్రమే ఆత్మరూపుడై ఆ కాలము నభివృద్ధిచేయుటకు శ్రద్ధగలిగియు, చేయలేకపోయి మనశ్చాంచల్యమును నియమించ లేక యోగసిద్ధిని పొందకుండగనే మరణించినచో నతనిగతి ఏమి ?

38. గాలిచే విడగొట్టబడిన మేఘము వర్షింపలేదు మేఘరూపమున్ను గాదు. అట్లే ఇట్టివాడు ఇహ, పరశ్రేయోభ్రష్టుడై నశించునా ఏమి ? అతడు నిరాశ్రయుడు. బ్రహ్మప్రాప్తి మార్గమందు విమూఢుడైనాడుగదా !

39. ఓ కృష్ణా ! ఈ సంశయమును నీవుతప్ప మరియొకడు తీర్పజాలడు. గాన సమగ్రముగా నా సందేహమును తీర్పుము.

భగవద్వచనము :

40. ఓ అర్జునా ! అతడు ఇహమందుగాని, పరమందుగాని నశింపడు. అతడేగాదు వేదబోధిత మగు ఏ పనిని, ఏ కొంచెము ఆచరించినవాడున్ను గూడ దుర్గతిని పొందడు. పొందుట యసంభవము.

41. ఆ సంపూర్ణయోగి వేదమందలి పుణ్యకర్మల నాచరించినవారు పొందు లోకములో దేహాంతరమునొంది, తనయోగము నీ మనుజలోకములోని కాలమానముచే నెంత కాల మభ్యసించెనో అంతకాలము ఆ పుణ్యలోకమందలి కాలమానముచే ఆ లోకభోగముల ననుభవించుచు యుండి, తిరిగి మనుష్యలోకములో వేదముయొక్క 1 అధీతి, 2 బోధ, 3 ఆచరణ, 4 ప్రచారము అను దశలుగల పరిసరమందు జన్మించును.

42. [illegible] అధికయోగియైనచో, అజన్మ విద్వాంసుడును, యోగియునై,

43. పూర్వజన్మలో నాతని యోగాభ్యాసమే స్థాయిలో నుండెనో అది లభ్యమైయున్న [illegible] దానిపై స్థాయికి ప్రయత్నించును.

44. పూర్వజన్మలోని యభ్యాసముచే నతడు [illegible] ఆకర్షింపబడును. అతని వాదము, యోగాభ్యాసములలో ఏది [illegible] అది [illegible] నతిక్రమి కున్నను. కావున, యోగసిద్ధిని [illegible] యోగసిద్ధిని బొందనివాడున్ను, వేదోక్తకర్మల నాచరించువాని కంటెను నతిక్రమించును.

45. ఇట్లు ప్రయత్నించుచు క్రమముగా పాపరహితుడుకాగా, ఇంకను ఎన్నైన వైరాగ్య అభ్యాసముల నొనర్చుచు కొన్నిజన్మలకైనను తప్పక సిద్ధుడగును.

46. ఓ అర్జునా! తపస్సు ,చేయువారికంటెను, శాస్త్రజ్ఞానపాండిత్యము నభ్యసించువారి కంటెను, వేదోక్త కర్మల ననుష్ఠించువారికంటెను ఈ యోగి అధికుడు. నీ వట్టి యోగివి కమ్ము.

47. ఈ యోగు లనేకదశలలో నుందురుగదా! అందును శ్రద్ధాభక్తులతో నిత్యము సర్వుల కు ఆత్మనగు నన్నుమాత్రమే తన బుద్ధితో భజన మొనర్చువాడు "యుక్తతముడు".



# VII

1. ఓ పార్థా! ఇట్లు నాయందాసక్తుడవై, నన్నే ఆశ్రయించి, యోగము నభ్యసించు సాధకు డెట్లు నన్ను సంపూర్ణముగా తెలిసికొనునో చెప్పుచున్నాను. సావధానుడవై వినుము.

2. నీ, నా ఇద్దరి యనుభవమునకు సరిపడునట్లుగా ఈ జ్ఞానవిద్యను పూర్తిగా చెప్పగలను. ఈ ఒక్కదానినే నీవు నేను చెప్పినదంతయు పూర్తిగా గ్రహించి, జీర్ణించుకొని, ఆచరించినచో సర్వము తెలియబడును. ఇక తెలియనిది, తెలియదగినది బాకీవుండదు.

3. అనేకవేల మనుష్యులలో నొకడే తన సిద్ధికొరకు ప్రయత్నించును. అట్టి వార లనేకులలో నొకడే, నన్ను నిజముగాను, పూర్తిగాను తెలిసికొనును.

4. 1 భూమి, 2 ఉదకము, 3 అగ్ని, 4 వాయువు, 5 ఆకాశములయొక్క తన్మాత్రలు (అనగా అసంకీర్ణమగు శబ్దము మాత్రమే ఆకాశతన్మాత్ర యనబడును. అట్లే స్వతంత్రములు ఇతరములతో సంకర మొందక, కేవలములగు స్పర్శ, రూప, రస, గంధములే, వాయు, అగ్ని, జల, పృథివీతన్మాత్ర లనబడును,) 6 దేహాదికమందు "నేను" అను అభిమానము, 7 దానికి కారణమగు సర్వజీవబుద్ధి సమష్టి, 8 అవిద్యతోగూడి, తనకు గూడ గోచరింపని "అవ్యక్తము" అని ఈశ్వరుడ నగు నా ప్రకృతి యెనిమిదిగా విభజింపబడియున్నది.

5. అది "అపరాప్రకృతి" యనబడును. ఇది నికృష్టమై, అశుద్ధమై, అనర్థకరమైనది. అంతకంటె భిన్నమై "జీవు"లను పేరుతో విశుద్ధముగానున్న నా ఆత్మయే అయియున్నది. "పరాప్రకృతి" యనబడును. ప్రతివస్తువులోను అంతర్లీనమైయున్న ఈ పరాప్రకృతి చేతనే ఈ ప్రపంచము ధరింపబడియున్నది.

6. సర్వభూతములు నా ఈ రెండు ప్రకృతులే మూల(కారణ)ముగా గలవని నిశ్చయింపుము. కావుననే నేనే సమస్తజగత్తుకు ఉత్పత్తి, స్థితి, లయ రూపుడను.

7. ఇట్టి నాకంటె వేరైనదెద్దియు త్రికాలములందును లేదు. దారమందు నానావిధమణులు గుచ్చబడి, 'మాలా' యను నేకవచన భాక్కైనట్లు, ప్రపంచభేదమంతయు నాయందు గుచ్చబడియున్నది.

8. ఇట్లనగా మంచి రసరూపుడనగు నాయందు ఉదకము గుచ్ఛబడినది. ప్రభారూపుడనగు నాయందు సూర్యచంద్రాదులు గుచ్ఛబడియుండెను. ప్రణవరూపుడనగు నాయందు వేద వేదాంగము లన్నియు గుచ్ఛబడియున్నవి. శబ్దరూపుడనగు నా[illegible] ఆకాశము గుచ్ఛబడియున్నది. పురుషభావరూపుడనగు నాయందు పురుషులు గుచ్ఛబడియుండిరి.

9. సుగంధరూపుడనగు నాయందు భూమి ప్రోతమైయున్నది. తేజోరూపుడనగు నాయందు అగ్ని ప్రోతమైయున్నది. ప్రతివస్తువునకు [illegible] జీవనమిచ్చుచున్నాను, అట్టి జీవన రూపుడనగు నాయందు సర్వభూతములు ప్రోతమైయున్నవి. తపోరూపుడనగు నాయందు తపస్విజనులందరు ప్రోతమైయుండిరి.

నోటు:— మంచిగంధము, మంచిరసము ఇత్యాదులే పరమేశ్వరాంశలు. దుర్గంధాదులు, అవిద్యచేతను, ధర్మాధర్మములచేతను, దేహధారులలోనున్న పంచభూతముల వాళ్ళలోని హెచ్చుతగ్గులను బట్టియు ఏర్పడును.

10. ప్రరోహకారణమగు 'బీజ'రూపుడనగు నాయందు సర్వభూతములు ప్రోతమైయున్నవి. వివేకశక్తిరూపుడనగు నాయందు బుద్ధిమంతులందరు ప్రోతమైయున్నారు. ప్రాగల్భ్య శక్తిరూపుడనగు నాయందు తేజస్వులందరు ప్రోతమైయున్నారు.

11. సామర్థ్యరూపుడనగు నాయందు బలవంతులందరు ప్రోతమైయున్నారు. నాయొక్క ఆ సామర్థ్యము కామ, రాగములు లేనట్టిది (దూరమందున్న పదార్థములందలి తృష్ణయే కామమని పొ్రప్తించిన విషయముల ననుసరించి తన బుద్ధికి రంగువేయుట 'రాగము') కామరాగములు జీవుల అవిద్యా, ధర్మ, అధర్మములను బట్టి ఏర్పడును. వేద తాత్పర్యమగు ధర్మమునకు విరుద్ధము గాకుండా దేహధారణ మాత్రప్రయోజనమగు కామము రూపముగాగల నాయందు సర్వభూతములు ప్రోతమైయున్నవి.

12. జీవులందరకు సత్వరజస్తమో గుణములచే తమ పూర్వజన్మ కర్మవశమున ఏర్పడునట్టి భావములన్నియు నావల్ల ఏర్పడునవియే. గాని నేను వాటియధీనుడై పరవశుడ గాను. అవియన్నియు నా యధీనములో నాకు వశమైయుండును.

13. ఇట్టి నన్ను జీవులు గుర్తింపకుండుటకు కారణమేమనగా, సత్వ, రజస్తమోగుణములు, వాటి పరస్పర సమ్మేళనముచే నేర్పడు వికారములగు రాగ, ద్వేష, మోహ, క్రోధ, ఈర్ష్యామాయాదులు, ఇత్యాదులన్నిటిచే ఆవరింపబడుటచే మోహితులై నన్ను తమ స్వస్వరూపముగా నెఱుగలేకున్నారు.

14. ఇదియే ఈశ్వరుడనగు నాయొక్క స్వభావమగు మాయ యనబడును. ఇది సత్వ రజస్తమోగుణమయము. తీవ్రప్రయత్న మొనర్చువారిచేతమాత్రమే అతిక్రమింపబడ గలదు. నన్నుమాత్రమే యథార్థముగాను, పూర్తిగాను, గుర్తించినవారే దీని నతిక్ర మింతురు.

15. ఈ మాయచే అపహరింపబడిన జ్ఞానముగలవారై, దేహేంద్రియాదులందు మాత్రమే రమించు "ఆసురభావ"ము నాశ్రయించిన మహాపాపులు నన్నెఱుగలేరు. ఎఱుగుటకు ప్రయత్నింపరు.

16. నన్నెరుగుటకు కోరి ప్రయత్నించువారు పూర్వజన్మ పుణ్యమందలి భేదముచే నాలుగు విధములు : 1 వ్యాధి మొదలగు బాధపడుచూ తన్నివృత్తికొరకుమాత్రమే. అంత పర్యంతము సేవించువాడు, 2 ధనము మొదలగు తన ఇష్టమైన వస్తువుల నొందుటకు, ఫలప్రాప్తివరకు నన్ను సేవించువాడు, 3 భగవంతునియొక్క నిజస్వరూపమును వినోదముకొరకు తెలిసికొనగోరువాడు, 4 తనయొక్క నిజరూపము, పరమాత్మకు, తనకు గల సంబంధము, తనకు, జగత్తునకు గల సంబంధమునకు కారణము. వీటినన్నిటి నెరిగి తాను జనన మరణాది సంసారబాధనుండి విముక్తుడగుటకు తీవ్రవేదన పడుచు అందుకనువుగా, శ్రవణ, మననాదుల నొనర్చుచుండు జ్ఞాని-

17. ఆ నలుగురిలో క్రమముగా ఒకరికంటె తర్వాతవారు శ్రేష్ఠులు. మొదటి దశయొక్క ఫలమే రెండవ దశ. జ్ఞాని సర్వదా నాయందే ఏకరూపమగు భక్తితో నుండును గాన అతనికి నేను, నా కతను అత్యంతప్రియము.

18. పై నలుగురున్ను సామాన్య పామరజనముకంటె ఏ నిమిత్తముచేనైనను భగవద్భజన మొనర్చువారు గాన ఉదారులు, ఉదారదృష్టిగలవారు, జ్ఞాని, ఏకాగ్రచిత్తముతో నన్ను పొందుటకు తీవ్రముగా ప్రయత్నించువాడు గాన నేనే అతడు, అతడే నేను.

19. అనేక జన్మలలో పై మూడువిధముల నన్నారాధించినవారు మాత్రమే తత్ఫలముగా జ్ఞానులనబడు ఉత్తమాధికారులై సర్వము ఆత్మయేనను నిశ్చయానుభవము నొంది నేనే యగుదురు. అట్టివారు చాలా అరుదు.

20. జీవులు వివిధములగు కోరికలచే అపహరింపబడిన వివేక విజ్ఞానము గలవారై భిన్న భిన్న దేవతల నారాధించుటకు, తమ స్వభావమనబడు పూర్వజన్మ కర్మ ఫలము ననుసరించి, ఆ యా నియమముల నొంది ప్రవర్తింతురు.

21. ఎట్టిభక్తు డెట్టి దేవతాదేహమును తన భావనానురూపముగా కల్పించుకొని శ్రద్ధతో పూజింపదలచునో వాని ఆ శ్రద్ధనే పరమేశ్వరుడనగు నేను స్థిరముగునట్లొనర్తును.

22. వాడా శ్రద్ధతో ఆ రూపము నారాధింపఁగోరును. వానియందు జ్ఞానరూపములోనున్న నేనే 1 ఆరాధించు కర్తగాను, 2 ఆరాధన క్రియగాను, 3 ఆరాధ్య దేవతామూర్తి గాను భాసింతును గాన ఆరాధన క్రియాఫలమగు వాని యభీష్టఫలము గూడ నావల్ల యేర్పడునదే.

23. కానివాని బుద్ధికి నిజముగోచరింపక తాను వేరు, దేవత వేరు అని అల్పమేధాశక్తితో నున్నందున వాని యభీష్టఫలము గూడ తదనురూపముగా అల్పమైనదై కొంతకాల కాలమునకు నశించును. వాడారాధించు దేవతామూర్తియే వాని పరమేశ్వరుడనని వాడు సమగ్ర ప్రయత్నమొనర్చినను వాడా దేవతామూర్తియె కాగలడు గాని "నేను" గాలేడు. అట్లుగాక నన్ను సర్వవ్యాపకునిగా, సర్వముగా, తానుగా అద్వైత భావముతో ఆరాధించుచు సర్వాత్మనగు నన్ను పరమపదముగా భావించి ప్రవర్తించువారు నన్నే పొందుదురు.

24. వారట్లు నన్నారాధింపకుండుటకు కారణమేమనగా, నా యవతారములను మాత్రమే వారు విని, తద్రహస్యమును గాని, నా నిజస్వరూపమును గాని తెలిసికొనక, నేను అప్రకాశుడనని, అవతారకాలమందుమాత్రమే పుట్టిపెరిగి ప్రకాశించితిననియు మాత్రమే తమ యల్పబుద్ధితో తెలిసికొందురు.

25. నేను నాదైనట్టిన్ని, త్రిగుణఘటనాత్మకమైనట్టిన్ని మాయచే కప్పబడి, అట్టి మూఢ లోకుల బుద్ధులకు ప్రకాశింపను. అందుచే వారు నన్ను జన్మాది వికారరహితునిగా తెలియ జాలరు.

26. నేనందరు జీవులయొక్క భూత, భవిష్యద్వర్తమాన కాలములందలి దేహముల నన్నిటిని ఎరుగుదును. నన్నుమాత్రము వారెరుగరు.

27. దేహధారులు స్వాభావికములగు ఇచ్ఛద్వేషాదులచే ఏర్పడినశీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములలో నొకదానిని కోరి రెండవదానిని ద్వేషించును. కాలాంతరమందు తద్విపరీతముగా ఇదివరలో కోరినదానిని ద్వేషింతురు. ఇదివరలో ద్వేషించినదాని నిప్పుడు కోరెదరు. ఒకపుడు సుఖసాధనమగు కోరిక దుఃఖసాధనమగును. అట్లే ఒకపుడు ఫల

మను కోరిక ద్వేషముగా మారును. ఇట్లు ఇచ్ఛాద్వేష వశీకృతచిత్తునకు యథార్థ వస్తుజ్ఞానము కలుగదు. అందుచే వారి ఇచ్ఛా ద్వేషముల కనురూపముగా పుట్టుచు అనుభవించుచు, మరణించుచూ యుందురు.

28. ఎవరికి తన స్వధర్మానుష్ఠానాదులచే పాపము సమాప్తప్రాయమై పుణ్యా మతిశయించి యుందునో వారు ద్వంద్వ మోహ విముక్తులై నన్నెరుగుటకు దృఢనిశ్చయులై ప్రయత్నించి తెలిసికొందురు.

29. వారు తమ జనన మరణ ప్రవాహ మను బంధమునుండి విముక్తులగుటకొరకు నన్నాశ్రయించి ప్రయత్నింతురు. అపుడు దేహాదులకు లోపల అంతర్లీనముగా నున్నట్టిన్ని, దేహచేష్టారూపముతో నున్నట్టిన్ని బ్రహ్మను పూర్తిగా నెరుగుదురు.

30. 1 భూతములద్వారా, 2 దేవతలద్వారా, 3 యజ్ఞముద్వారా నన్ను మరణ కాలమునైనను తెలిసికొన్నవారు ఏకాగ్ర నిశ్చల చిత్తులగుదురు.



# VIII

1,2. (1) బ్రహ్మయన నేమి ? (2) అధ్యాత్మ మనగ నేమి ? (3) కర్మ యనగ నేమి ? (4) అధిభూతమన నేమి ? (5) అధిదైవమన నేమి ? (6) అధియజ్ఞమన నేమి ? (7) నిశ్చల చిత్తులచే మరణకాలమందు నీ వెట్లు తెలియబడి యుందువు ?

3. (1) బ్రహ్మ యనగా గొప్పది, నాశరహితమైనది. (2) ఆ బ్రహ్మమే ప్రతి దేహమందును, బుద్ధీంద్రియాదులకు ప్రవర్తకముగా నుండు ప్రత్యేకముగా జీవుడు ముక్తుడగువరకు గల స్థాయిస్వభావమే అధ్యాత్మమనబడును. (3) జీవులీ దేహమందుండి చేయు పుణ్యపాపములచే మరుజన్మలోని దేహమేర్పడును. అట్టి పుణ్యాదిరూపమే కర్మ యనబడును.

4. (4) జీవులందు నశించు దేహభాగమే "అధిభూత" మనబడును. (5) సర్వజీవులందును వ్యాపించియుండి బుద్ధీంద్రియానుగ్రాహకుడైన "హిరణ్యగర్భుడే" అధిదైవతమనబడును. (6) దేహధారులందరు తమ దృష్టిలో గొప్పగా భావించిన దేవత నుద్దేశించి తమ భోగ్యద్రవ్యములను త్యజించుటయే అధియజ్ఞమనబడును. ఈ దేవతగాని, తదుద్దేశ్యముగాని పరమేశ్వరుడనగు నేనే.

5. నన్ను జీవులలో తమ విజ్ఞానానుసారముగా స్మరింపుచూ, ఆ సంస్కార బలముచే ప్రాణోత్క్రమణకాలమందు గూడ నన్నే స్మరింపుచూ దేహత్యాగ మొనర్చినవారు నా భావమునే పొందగలరు. సందేహము లేదు.

6. మరణకాలమందే జీవు డెట్టి వస్తువును ధ్యానించుచు, దేహత్యాగమొనర్చునో, ఆ జీవు డా వస్తువుగానే జన్మించును. ధ్యానమనగా తన యభీష్టవస్తువుముగా తన బుద్ధిని మరల్చుటయే.

7. అందుచే సర్వకాలములందును నన్నే స్మరింపుము, యుద్ధము చేయుము, నీ బుద్ధీంద్రియములను నాయందే అర్పించినవు డవి నా రూపములే యగును. గాన తత్ఫలము నన్ను పొందుటయే.

8. అట్లు క్రమముగా అభ్యసించగా ధ్యానకాలము పెరుగుచూ చివరదశలో బుద్ధి నాయందే నిశ్చలముగా నిలిచియుండి సర్వవ్యాపకము, స్వయంజ్యోతిస్స్వభావమున్ను అగును.

9. సర్వజ్ఞుడు, నిత్యపురాతనుడు, సర్వులను శాసించువాడు, అణువుకంటెగూడ సూక్ష్మతరుడు, జీవకోటులకు పుణ్యపాప కర్మలకు ఫలమునిచ్చువాడు, బుద్ధికి గోచరముగాని, అచింత్యస్వరూపుడు, ఆదిత్యునివలె నిత్యప్రకాశుడు, అజ్ఞానమోహాదుల కతీతుడు అగు పరమేశ్వరుని ధ్యానింపవలెను.

10. మరణకాలమందుగూడ అట్లు యోగయుక్తుడై నిశ్చలమనస్సుతో భక్తి పురస్సరముగా తన ప్రాణమును హృదయమందు వశపరచుకొని నాడీ మండలభూమి జయక్రమముచే భ్రూమధ్యలోపల (ఆజ్ఞాచక్రమందు) స్థాపించి అప్రమత్తుడై ధ్యానించువాడు అట్టి పరమేశ్వరునే పొందగలడు.

11. వేదతాత్పర్యవేత్తలే పరమాత్మను నశింపనివానినిగా చెప్పుచున్నారో సంన్యాసులు జ్ఞానపరిపాకదశలో నే పరమాత్మలో ప్రవేశించి ఐక్యమగుచున్నారో, ఎవరిని తెలిసికొనగోరి, పొందగోరియు బ్రహ్మచర్య విద్యాభ్యాసాదుల నాచరింపుచున్నారో అట్టి పొందదగిన పరమాత్మను నీకు క్లుప్తముగా చెప్పుదును.

12. పదార్థజ్ఞానోపలబ్ధిసాధనములగు ఇంద్రియముల నన్నిటిని నియమించి మనస్సును హృదయమందు నిరోధించి, ప్రచారరహితముగా నొనర్చి, హృదయమునుండి ఊర్ధ్వముగా నుండు సుషుమ్నా నాడిద్వారా ప్రాణమును శిరస్సునందలి సహస్రారమందు స్థాపించి యోగశాస్త్రమందలి "ధారణ" నవలంబించి,

13. ప్రణవముతో నన్ను స్మరింపుచూ దేహమును త్యజించువాడు సర్వోత్కృష్టస్థితి నొందును.

14. ఎవడు నిరంతరముగా తన చిత్తములో నన్నే స్మరించునో వానికి నేను సులభుడను.

15. సర్వదుఃఖములకు గనియై అనిత్యమగు జన్మాదిబంధము నన్ను పొందినవారికి ఉండదు.

16. అతలలోకము మొదలు బ్రహ్మలోకము వరకు అన్నియు పునరావర్తనస్వభావములే. నన్ను పొందినవారికి మాత్రమే పునర్జన్మ ఉండదు.

17. బ్రహ్మలోకము గూడ పల పునరావృత్తముగునవగా, అచట పగలు భూలోకమందు వెయ్యి మహాయుగముల కాలము - అంతే రాత్రి కూడ - ఇట్లు కాలశాస్త్రవిదులు చెప్పుచున్నారు.

18. ఆ పగటియందు అవ్యక్తమగు పరమేశ్వరునిలో ప్రళయకాలమునందు లీనమైన జీవులందరు పుట్టుదురు. ఆ రాత్రియందు వారందరు ఆయనలో లీనమగుదురు.

19. ఆ జీవులే తిరిగి తిరిగి తమ పుణ్యపాపకర్మల ననుసరించి పుట్టుచూ, లీనమగుచూ తిరుగుచుందురు.

20. ఇట్లు వ్యక్తమగు భూతసమూహముకంటెను, తద్బీజమగు అవ్యక్తముకంటెను, విలక్షణమై ఇంద్రియగోచరము గానట్టిన్ని, భావరూపమైనట్టిన్ని పరమాత్మ, భూతములు నశించుచున్నను, నశింపక, శాశ్వతముగా, సర్వానుగతముగా నుండును.

21. అదియే నాశరహితము గాన "అక్షర" మని ఇంద్రియగోచరము గానందున "అవ్యక్త" మని చెప్పబడును. అదియే ఉత్తమాధికారుల లక్ష్యము. దానిని పొందినవారు తిరిగి జన్మించరు. ఆ స్థానమే నేను.

22. అట్టిపరమాత్మభావము అనన్యభక్తిచే మాత్రమే లభ్యమగును. ఆయనలో ఈ భూతము లున్నవి. ఆయనచే ఈ బ్రహ్మాండమంతయు వ్యాప్తమైయున్నది.

23. ఏయే కాలములందు మరణించిన యోగులు గాని, కర్ములు గాని తిరిగివత్తురో ఏ కాలమందు మరణించినవారు తిరిగి జన్మించరో ఆ కాలవిశేషములను నుపదేశింతును.

24. బ్రహ్మోపాసకులు క్రమముగా అగ్నిదేవత, జ్యోతిర్దేవత పగటిదేవత, శుక్లపక్షదేవత, ఉత్తరాయణదేవతలను పొంది బ్రహ్మలోకము పొందెదరు.

25. ఇష్టాపూర్తాది కర్మల నాచరించినవారు, యోగులు, క్రమముగా ధూమదేవత, రాత్రి దేవత, కృష్ణపక్షదేవత, దక్షిణాయన దేవతలను పొంది చంద్రసంబంధి జ్యోతిస్సును పొందెదరు.

26. మొదటిది జ్ఞానప్రకాశకము గాన శుక్లగతి యనబడును. తన్మార్గగాములు తిరిగి జన్మింపరు. రెండవది జ్ఞానప్రకాశకము గానందున "కృష్ణగతి" యనబడును. తన్మార్గగాములు తిరిగి జన్మింతురు.

27. యోగి యగువాఁడీ రెండుగతులను వాటి సాధన, ఫల, అధికారులను తెలిసికొన్నాఁడు గనుకనే మోహపడఁడు. ఓ అర్జునా! అందుచే నీవు సర్వకాలములందు యోగివి కమ్ము.

28. ఇట్లీ యధ్యాయమందలి యేడు ప్రశ్నలను, తత్సమాధానములను తెలిసికొని, మనన మొనర్చి తదనుసారముగా ప్రవర్తించు యోగి వేద, యజ్ఞ, తపో, దానాది ఫలముల నతిక్రమించు "మోక్షము" నొందును.



# IX

1. నీవు అసూయాదులు లేని ఉత్తమాధికారివి గాన రహస్యమగు అనుభవయుక్త జ్ఞానమును చెప్పబోవుచున్నాను. అది పూర్తిగా తెలిసికొని, సర్వ అశుభములనుండి విముక్తుడవు కాగలవు.

2. ఇది సర్వోత్తమ విద్య. రహస్యములన్నిటికెల్ల గొప్పది. పవిత్రమైనది. అనేక జన్మలందలి కర్మల నన్నిటిని క్షణములో భస్మీకరించగలది. ప్రత్యక్షానుభవరూపమైనది. ధర్మబద్ధమైనది. సులభసంపాద్యమైనది. నాశరహితమగు ఫలమునిచ్చునది.

౩. ఇట్టి విద్యయందు శ్రద్ధాభక్తులు లేనివారై నిత్యమగు పరమేశ్వరభావము నెరుగక అనిత్యమగు దేహాదులందుండి జననమరణ ప్రవాహరూపమగు సంసారమందు నిరంతరము తిరుగుచుందురు.

4. ఇంద్రియగోచరముగాని నాచే నీ జగమంతయు వ్యాపింపబడియున్నది. ఈ భూతములన్నియు నాయందున్నవి గాని నేను వాటియందు లేను. (ఆభరణ విశేషములన్నిటిలోను బంగారమున్నది గాని బంగారమం దాభరణవిశేషము లేనట్లు),

౫. నా వాస్తవమగు "సచ్చిదానంద" రూపములో ప్రపంచము లేనేలేదు. మాయాసహితమగు నా వ్యావహారిక ఈశ్వరరూపమందు మాత్రమే యున్నవి. ఆశ్చర్యకరమగు నా ఈశ్వరయోగమును గమనింపుము. నే నసంగచిద్రూపుడనైనను భూతముల నన్నిటిని భరించువాటియందు తాదాత్మ్యభావముతో లేను. భూతములను సృజింపుచు, పెంచి పోషింపుచు లయింపజేయుచున్నాను. ఆశ్చర్యముగదా !

౬. లోకమందు ఆకాశములోనున్న వాయువు సర్వత్ర సంచరించునట్లే నాలోనున్న భూతములు జననమరణాది సంచార మొనర్చును.

7. ఈ భూతములన్నియు నా అపరాప్రకృతిని కల్పక్షయమందు పొందుచున్నవి. కల్పాదియందు వాటినే నేను సృజింతును.

౮ ఇటు పరవశమై కర్మఫలము ననుభవించుచు, మరు జన్మ సాధవమొనర్చుచూ పరవశమై

యున్న ఈ భూతసముదాయము నంతను వశీకృతమాయుడనగు నేను నా ప్రకృతి నవలంబించి మాటిమాటికి సృజించుదును.

9. ఓ ధనంజయా ! నేను నా పనులందెట్టి కర్తృత్వము పొందక ఉదాసీనుడనై యుందును గాన ఆ పనులు నన్ను, సామాన్యమనుష్యులను బంధించునట్లు బంధింపవు.

10. నేను సాక్షిమాత్రుడనుగా అధ్యక్షుడ నగుచుండగా నా ప్రకృతియే స్థావరజంగమాది సర్వప్రపంచమును సృజింపుచున్నది. కావుననే కార్యమగు ప్రపంచములో గూడ దేహాదికము వ్యవహరించుచు మార్పు నొందుచున్నది. తదధ్యక్షుడగు ఆత్మ వాటియన్నిటికి సాక్షిమాత్రమైయున్నది.

11. మూఢులు నన్ను మనుష్యశరీరము నాశ్రయించితినని తలచి నా నిజరూపమెరుగక పరిభవించుచున్నారు.

12. వ్యర్థములగు ఆశ, ప్రయత్నము, జ్ఞానము గలిగి వివేకరహితులై రాక్షసప్రకృతిని దేహపోషకము మాత్రమే రమించు ఆసుర ప్రకృతిని దేహమే ఆత్మ యని మోహించు ప్రకృతిని ఆశ్రయించి యుందురు.

13. దైవీప్రకృతి (16 వ అధ్యాయములో గలదు) నాశ్రయించిన విశాలబుద్ధులు శమ దమాది పురస్సరముగా నన్ను జగత్కారణముగాను, జగదధిష్ఠానముగాను ఏకాగ్రతతో భజింతురు.

14. నన్ను అట్లు పరస్పరము బోధించుకొనుచు, ప్రయత్నింపుచూ, నమస్కరింపుచూ దృఢ నిశ్చిత భక్తితో ఉపాసింతురు.

15. మరికొందరు ఒకేపరమాత్మను శ్రవణమననాది రూపమగు జ్ఞానయజ్ఞముతో నుపాసింతురు. వేఱొకరు ఇంద్ర వాయు సోమ సూర్యాది నానారూపధారియగు పరమాత్మ నుపాసింతురు.

16. శ్రౌతకర్మభేదములు స్మార్తకర్మభేదములు, పితరుల కన్నమగు స్వధా, సర్వప్రాణులకు ఆహారమగు ఓషధులు, దేవపితౄదుల నెఱుగు సాధనమైన వేదమంత్రములు, యజ్ఞ మందలి హోమద్రవ్యము, అగ్ని, హోమక్రియ ఇవన్నియు నేనే.

17. నే నీ ప్రపంచమునకు తండ్రిని, తల్లిని, తాతను, కర్మఫలప్రదాతను, తెలియదగిన వాడను, పవిత్రమగు ఓంకారమును, ఋగ్యజుస్సామవేదరూపుడను.

18. కర్మఫలము నేనే పోషించువాడను, ప్రభువను సర్వకర్మలకు సాక్షిని, ప్రాణుల నివాసమును — ప్రపన్నుల బాధను పోగొట్టువాడను, ప్రత్యుపకారాపేక్ష లేకుండా ఉపకారమొనర్చువాడను, జగదుత్పత్తిస్థితిలయ కారణమును - వారందరు నాయందుందురు. వారు కాలాంతరమం దనుభవింపగోరు ఫలమును నాయందు నిక్షేపముగా నుంతురు. తిరిగి వారు జన్మించు బీజరూపము నేనే, నశింపనివాడను.

19. నేనే ఆదిత్యాది రూపముతో ప్రకాశింతును. ఆ సూర్యునియొక్క కొన్ని కిరణములతో వర్షింతును. మరికొన్ని కిరణములతో వర్షమును నిగ్రహింతును. దేవాహారమగు అమృతము, ఉనికి, లేకుండుట అన్నియు నేనే.

20. వేదమందలి కర్మకాండవిదులు, యజ్ఞమందు సోమపానమొనర్చి నిష్పాపులై స్వర్గసుఖమొందగోరి, ఈ యజ్ఞము నా కోరికతో మనుష్యలోక కాలమానముచే నెంతకాల మనుష్ఠించిరో, అంతకాలము దేవమానముతో, దేవలోకసుఖ భోగములనుభవింతురు.

21. విశాలమైన స్వర్గలోకమంతను అనుభవించి, ఆ పుణ్యకర్మఫలము క్షీణింపగానే తిరిగి భూలోకమందు జన్మింతురు. ఇట్లనేక కోరికలను కోరుచు, అవి నేరవేరుటకు వేదమును సాధనముగా గ్రహించి, పుట్టుచూ మరణించుచూ యుందురు.

22. ఇక నెట్టి కోరికలు లేకుండి, అనన్యచిత్తులై, ఒకే పరమాత్మను బుద్ధివ్యాపారమునకు లక్ష్యముగా పెట్టుకున్నవారు నిత్యాభియుక్తులు, అనగా ఎల్లప్పుడు నాతో కలసి యుందురు గాని వారికి ప్రాప్తముగాని జ్ఞానధ్యానమును నేనే ప్రాప్తింపజేతును. ఉన్నజ్ఞానమును నేనే రక్షింతును.

23. దేవతలందరు నేనే గాన ఏ దేవత నారాధించినను నన్నారాధించినట్లే గనుక మోక్షమేల రాదనగా వారు శ్రద్ధగలవారైనను నన్ను అవిధిపూర్వకముగా నారాధించిన వారగుదురు

24. నేనే సర్వయజ్ఞములందు భోక్తను (హోమమొనర్చిన హవిస్సు ననుభవించువాడను) ప్రభువును. వా రీ నిజరహస్యము నెఱుగనందున, వారుత్తమఫలమున కనర్హులు.

25. తానెరిగిన దేవతల నొంద నుద్దేశించి తదనుకూల వ్రత నియమబద్ధులై యజ్ఞము నాచరించువారు దేవతలనే పొందుదురు. అట్లే పితరుల నారాధించువారు పితరులను, భూతప్రేతాదుల నారాధించువారు భూతాదులను, పరమాత్మ నగు నన్నారాధించు వారు నన్ను పొందుదురు.

26)

11. ఎట్లనగా, వారలయందలి దయచే వారల బుద్ధిలోపల నుండి, వారల అవివేకమును, మిథ్యాజ్ఞానమును, మోహాంధకారమును నా స్వరూపజ్ఞానదీపముచే పోగొట్టుచుందును.

12 నీవు పరబ్రహ్మవు. స్వయంజ్యోతిస్స్వభావుడవు, సర్వపావనుడవు, సర్వవ్యాపకుడవు. శాశ్వతుడవు, దేవతలందరకు మొదటివాడవు, జన్మాది వికారములు లేనివాడవు.

13. ఇట్లని నారద, అసిత, దేవల, వ్యాసాది మహర్షులు చెప్పిరి. నీవున్ను చెప్పితివి.

14. ఇదంతయు నిజమేనని తలచుచున్నాను. ఓ భగవంతుడా! దేవదానవాదులలో ఎవరును నీ ఉత్పత్తిని గాని, ఆదిని గాని ఎఱుగరు.

15. నిన్ను నీవు మాత్రమే ఎఱుగుదువు. ఓ భూతస్రష్టా! భూతేశా! దేవదేవా! జగత్పతీ!

16. నీవెట్టి విభూతులచే (మాహాత్మ్యము నెఱుగుట కనువగు గుర్తులు) ఈ లోకముల నన్నిటిని వ్యాపించియుంటివో వాటినన్నిటిని చెప్పదగుదువు.

17. నిన్ను నేను ఎల్లప్పుడు ధ్యానించుచు గుర్తించు టెట్లు? ఏ యే వస్తువులందు నీవు ధ్యానింపదగియుంటివో చెప్పుము.

18. ఓ జనార్దనా! నీ యోగమును, విభూతులను విస్తారముగా చెప్పుము. నీ వాగమృతమును ఎంత గ్రోలినను తృప్తిలేకున్నది. గాన విపులముగా చెప్పుము.

19. ఓ కురుశ్రేష్ఠా! దేవసమయమునకైన నా విభూతులలో ప్రధానమైనవాటిని చెప్పెదను. విస్తరముగా చెప్పుటకు విభూతులిన్నియని లెక్క లేదు.

20. ఓ జితనిద్రుడా! నేను సర్వభూతముల యొక్క హృదయమందున్న ప్రత్యగాత్మను. ఇది ధ్యానింపదగినది. అది చేతగానిచో ఈ క్రింది భావములు ధ్యానింపదగినవి. దేహాధారులకు ఆది, మధ్యము, అంతము నేనే.

21. ద్వాదశాదిత్యుల సంపదని నన్నుగా ధ్యానింపలేనివారు "విష్ణు"వను ఆదిత్యునినన్నుగాను, కాంతివంతములన్నియు నేనని ధ్యానింపలేనివారు "సూర్యుని" నన్నుగాను, మరుద్భేదములన్నియు నేనని ధ్యానింపలేనివారు మరీచి యను మరుదేవతను నన్నుగాను, నక్షత్రములనన్నిటిని నన్నుగా భావింపలేనివా రందులో చంద్రుని నన్నుగాను,

22. అట్లే వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుని, ఇంద్రియములలో మనస్సును, భూతములలో చైతన్యమును,

23. ఏకాదశరుద్రులలో శంకరుని, యక్షరాక్షసులలో కుబేరుని, అష్టవసువులలో పావకుని, పర్వతము లన్నిటిలో మేరువును.

24. పురోహితులందరిలో బృహస్పతిని, సేనాధిపతులందరిలో స్కందుని, దేవనిర్మిత జలాశయము లన్నిటిలో సాగరమును,

25. మహర్షులందరిలో భృగువును, వాక్కులన్నిటిలో ఓంకారమును, యజ్ఞములన్నిటిలో జపయజ్ఞమును, స్థావరములన్నిటిలో హిమాలయమును,

26. వృక్షములన్నిటిలో అశ్వత్థమును, దేవఋషులందరిలో నారదుని, గంధర్వులందరిలో చిత్రరథుని, సిద్ధులందరిలో కపిలుని,

27. గుఱ్ఱములన్నిటిలో సముద్రమథనమున, అమృతముతోపాటుపుట్టిన ఉచ్చైశ్శ్రవమును, ఏనుగులన్నిటిలో ఐరావతమును, నరులందరిలో రాజును,

28. ఆయుధములన్నిటిలో వజ్రమును, పాలిచ్చువాట యన్నిటిలో కామధేనువును, పుట్టించువారందరిలో మన్మథుని, సర్పములన్నిటిలో వాసుకిని,

29. నాగములన్నిటిలో అనంతుని, జలదేవత లన్నిటిలో వరుణుని, పితృదేవతలందరిలో అర్యముని, జీవులను నియమించువారందరిలో యముని,

30. దైత్యులందరిలో ప్రహ్లాదుని, లెక్కించువాటి యన్నిటిలో కాలమును, మృగములన్నిటిలో సింహమును, పక్షులన్నిటిలో గరుత్మంతుని,

31. పవిత్రమొనర్చువాటిలో గాలిని, శస్త్రధారులందరిలో శ్రీరాముని, జలజంతువు లన్నిటిలో మొసలిని, ప్రవహించువాటి యన్నిటిలో గంగానదిని,

32. సృష్టులన్నిటిలో ఆది, అంత, మధ్యములను, విద్యలన్నిటిలో ఆత్మవిద్యను, ప్రవక్తలు మాట్లాడు మాట లన్నిటిలో యథార్థ నిర్ణయోపయుక్త వాదమును,

33. అక్షరములన్నిటిలో 'అ' కారమును, సమాసము లన్నిటిలో ద్వంద్వసమాసమును నేనే గాన పై వాటి నన్నిటిని నేనుగా భావించలేనివారు అందలి ముఖ్యునిగానైనను నన్నుపాసించవలెను. నశింపని కాలమును విశ్వతోముఖముగా అందరికి కర్మఫలమును విభాగించి ఇచ్చు విధాతను నేనే.

34. ప్రాణము నపహరించు మృత్యువు నేనే. జీవుల కభివృద్ధిప్రాప్తి హేతువు నేనే. స్త్రీలలో నుండు కీర్తి, ఐశ్వర్యము, వాక్కు, స్మృతి, మేధ, ధైర్యము, ఓర్పు, నేనే.

35. సామగాన విశేషములన్నిటిలో బృహత్సామము, ఛందస్సులన్నిటిలో గాయత్రీ ఛందస్సు, మాసములన్నిటిలో మార్గశిరము, ఋతువులన్నిటిలో వసంతఋతువు నేనుగా ఉపాసించవలెను.

13. అచట అర్జునుడు ఒకే దేహమందు, నానాభేదభిన్నమగు ఒకేజగత్తును పూర్తిగా చూచెను.

14. అది చూచిన అర్జునుడు విస్మయముచే పరవశుడై రోమాంచితుడై, ఆదేవునకు సాష్టాంగ నమస్కార మొనర్చి, దోసిలొగ్గి ఇట్లు పలికెను.

15. ఓ దేవా ! నీ దేహమందు, సర్వదేవతలను, సర్వజీవ విశేషసమూహములను, బ్రహ్మ విష్ణుమహేశ్వరులను, ఋషులను, సర్వదివ్యసర్పములను చూచుచున్నాను.

16. అనేక బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు గలిగి, అంతులేని రూపము గల నిన్ను చూచుచున్నాను. ఓ విశ్వరూపా ! విశ్వమున కంతటికి ప్రభువా! నీరూపము నకు మొదలుగాని, చివరగాని, మధ్యగాని నేనెందు కనిపెట్టలేకున్నాను.

17. సర్వతోముఖదీప్తి గలిగిన తేజోరాశివై, కిరీటగదాచక్రధారివై, ప్రజ్వలించు అగ్ని సూర్యుల కాంతివంటి కాంతిగలిగి, చూడశక్యముగాక, బుద్ధితో నూహింపనలవిగాని నిన్ను చూచుచున్నాను.

18. నీవు నాశరహితుడవు, సర్వోత్కృష్టుడవు, అందరిచే తెలియదగినవాడవు. ఈ విశ్వమున కంతకు మూలకారణమును ఎట్టి మార్పులులేనివాడవు. శాశ్వతధర్మమును రక్షించు వాడవు. సనాతనుడవు, సర్వము నీచే నిండియున్నది. ఈ సిద్ధాంత మిపు డనుభవ మాయెను.

19. ఆది, మధ్య, అంతములులేనివాడవు. అనంతసామర్థ్యము గలిగి, అంతులేని బాహువులు గలిగి, సూర్యచంద్రులు నేత్రములుగా గలిగి, ప్రజ్వలించు అగ్నియే ముఖముగాగలిగి, నీ తేజస్సుచే ఈ విశ్వమునంతను ప్రకాశింపజేయు నిన్ను ఇపు డనుభవించుచున్నాను.

20. ఓ మహాత్మా ! పృథివ్యంతరిక్షలోకముల మధ్యభాగమంతయు, దశదిక్కులున్ను, నీ ఒక నిచే వ్యాప్తమైయున్నవి. ఉగ్రము, ఆశ్చర్యకరము అగు నీ రూపమునుగాంచి, ముల్లో కములు చలించుచున్నవి.

21. ఈ యుద్ధరంగమందున్న భీష్మాదులు తమ నిజమైన వసుదేవతాదిరూపములతో నీలో ప్రవేశించుచున్నట్లగుపడుచున్నది. కొందరు భయపడి దోసిలొగ్గి స్తుతించుచున్నారు. మహర్షులయొక్క సిద్ధులయొక్క, సమూహములు, "లోకక్షేమమగుగాక" యని నిన్ను పుష్కలముగా స్తోత్రములచే కొనియాడుచున్నారు.

22. రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినులు, మరుద్దేవతలు, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు వీరందరు గుంపులుగా చేరి ఆశ్చర్యముగా నిన్ను చూచుచున్నారు. (దేవాత్మలాత్మవిదులు కారను విషయమిప్పు డనుభవమాయెను.)

23. ఓ మహాబాహూ! నీ రూపము అతిప్రమాణము. అనేక ముఖ, నేత్ర, బాహు, ఊరు, పాద, ఉదర, దంతాదుల గలిగి భయంకరముగా నున్నది. దీనిని చూచి లోకులు నేను కూడ పరిచలించుచున్నాము.

24. ఓ విష్ణూ! ద్యులోకమును స్పృశించునది, అనేక రంగులు గల్గి ప్రకాశించునది, నోరులు తెరుచుకొని యున్నది. ప్రజ్వలించు విశాలనేత్రములు గలదియగు నీరూపమునుచూచి, బాగా వ్యధపడి ధైర్యము చెడి శాంతి లేకుంటిని.

25. కాలాగ్నితో సమానమై భయంకర కోరలు గల నీ ముఖములను గాంచుటతోనే దిగ్భ్రాంతి గలిగి సుఖమును పొందలేకున్నాను. ఓ జగన్నివాసా! అనుగ్రహింపుము.

26, 27 దృతరాష్ట్ర పుత్రులు, వారి పక్షములోని భీష్మ, ద్రోణ, కర్ణాదులు, ఉభయపక్షము లందలి రాజసమూహమున్ను భయంకర కోరలుగల నీ ముఖములను, త్వరపడుచూ ప్రవేశించుచున్నారు. అందు కొందరు నీదంతములందుచితికినతలలతో అతికియున్నారు.

28. నదులన్నియు మహావేగములు గలిగి సముద్రాభిముఖమైనట్లు ఈ యోధులందరు మహావేగముతో వెళ్ళి పరిజ్వలించు నీ ముఖములందు ప్రవేశించుచున్నారు.

29. ప్రజ్వలించు అగ్నిని మహా వేగముగల పక్షులు తమ నాశనము కొరకు ప్రవేశించు నట్లు, ఈ రాజులందరు మహావేగులై ఆత్మనాశనముకొరకు నీ ముఖములను ప్రవేశించుచున్నారు.

30. ఓ విష్ణూ! ప్రజ్వలించు ముఖములచే లోకముల నన్నిటిని, సంపూర్ణముగా గ్రసించుచు నాలుకలచే జాపుచున్నావు. నీ ఉగ్రమైన కాంతులు జగత్తునంతను తైక్ష్ణ్యముతో నిండి ప్రతాప మొనర్చుచున్నవి.

31. ఓ దేవశ్రేష్ఠా! నీకు నమస్కారము. ఇట్టి భయంకర మూర్తివైన నీవు ఎవరో నాకు చెప్పుము - ప్రసన్నుడవగుము — మొట్టమొదటివాడవగు నిన్ను తెలుసుకొనగోరు చున్నాను నీ ప్రవృత్తి నెఱుగలేకున్నాను.

32. నేను లోకక్షయ కారుడవగు "కాలు" డను - లోకముల నాశనార్థం ప్రవృత్తుడనై

సంహారించుట కిట్లు వృద్ధి నొందితిని. ఈ యుద్ధరంగమందలి యోధులందరు నీవు యుద్ధము చేయకున్నను చనిపోదురు. ఇంక వారి దేహములుండవు.

౩౩. ఓ అర్జునా ! అందుచే లెమ్ము - కీర్తిని పొందుము - శత్రువుల జయించి సమృద్ధ రాజ్యము ననుభవింపుము. ఈ యుద్ధరంగమందలి యోధులందరు నాచే పూర్వమే చంపబడిరి. నీవిపుడు నిమిత్తమాత్రుడవగుము.

౩౪. నాచే ఇదివరకే చంపబడిన, ద్రోణ, భీష్మ జయద్రథ, కర్ణాదియోధ వీరులను చంపుము మనస్సులో ఎట్టి బాధను పొందకుము. యుద్ధము చేయుము. శత్రువుల నందరను జయింపగలవు.

౩౫. కేశవునిమాట విన్న అర్జునుడు, దోసిలొగ్గి వణుకుచూ, నమస్కరించి గద్గదస్వరముతో మాటాడబోయి, అత్యంతభీతుడై సాష్టాంగ నమస్కారము చేసి పలికెను.

౩౬. ఓ హృషీకేశా ! నీవు అందరి ఇంద్రియములకు ప్రభువను విషయమిపు డనుభవింప బడినది. నీ మాహాత్మ్యము వినుటచే జగత్తు సంతోషించుటయు నీయం దనురాగము గలిగియుండుటయు యుక్తమే. నీవు సర్వాత్ముడవు, సర్వసుహృద్దుడవుగాన నీ వందరి బుద్ధిలోను నవరసముల కారణుడవగుట యుక్తమే నిన్ను చూచి భయముతో రాక్షసులు దిక్కులకు పారిపోవుచున్నారు. సిద్ధులు భక్తితో నీకు నమస్కరించు చున్నారు.

౩౭. ఓ మహాత్మా ! ఓ అనంతా ! దేవాధిపతీ ! ఓ జగన్నివాసా ; నీవు నాశరహితుడవు, పదార్థము, ఉండుట, లేకపోవుట, యను రెండును నిన్నెఱుగుటకు విధానములు. నీవు సర్వాధిష్ఠానము. ఆదిలో సృష్టికర్తయై గొప్పవాడుగా జీవులచే తలపబడుచున్న బ్రహ్మ దేవునకును గూడ నీవు ఆదికారణుఁడవు. ఇట్టి నీకు ఏల నమస్కరింపరు ?

౩౮. ఓ అనంతరూప ! నీ వాదిదేవుడవు - సర్వత్ర ఉన్నావు. ఎంతపూర్వమందైనను నూతనుడవు. ఈ విశ్వమునకు మూలము నీవే సర్వజీవుల కర్తృత్వము వారొనర్చు సర్వ క్రియలు - వాటికి విషయమగు కర్మ ఈ మూడున్ను నీవే. ఈ తృతీయ రూపుడవగు నీచే సర్వము వ్యాప్తమై యున్నది.

౩౯. నీవే వాయు, యమ, అగ్ని, వరుణ, చంద్ర, ప్రజాపతి,బ్రహ్మారూపుడవు. లోకపితయగు బ్రహ్మకు నీవు తండ్రివి. ఇట్టి నీకు మాటిమాటికి లెక్కకు మించి నమస్కరింతును.

40. నీకు ముందు వెనుక భాగములందును సర్వదిక్కులందును నమస్కరింతును. నీవు అంతు లేని వీర్యము, విక్రమము గలవాడవు. అందుచే సర్వమును ఒక ఆత్మతో వ్యాపించి, సర్వుడవనబడుచున్నావు.

41. ఇదివరలో నీ మహిమ నెఱుగని నాచే ప్రమాదమువల్లను, చనువుచేతను నిన్ను నా స్నేహితునిగా మాత్రమే భావించి ఎగతాళిగా, ఓ నల్లనివాడా, ఓ రాజ్యార్హత లేని యాదవా! ఓ చెలికాడా ? యని పిలిచియుంటిని.

42. అట్లే షికారుఅనబడు విహారములందు, శయనమందు ఆస్థానసభాములందు, భోజనమందు పరిహాసప్రయోజనముకొరకు నాచేపరిభవింపబడితివి. ప్రత్యక్షముగాగూడపరాభవింపబడి తివి. ఇపుడు నీవు బుద్ధులకు గోచరముగానివాడవని గుర్తించితిని. నా తప్పులన్నిటిని క్షమించుము.

43. నీ వీ చరాచరప్రపంచము నంతకును తండ్రివి. పూజ్యుడవు - గురుడవు - గొప్ప వాడవు - నీతో సమానుడే లేడు - గొప్పవాడెట్లుండును ? నీవు ముల్లోకములందును సాటిలేనంత ప్రభావము కలవాడవు.

44. అందుచే నీకు సాష్టాంగ నమస్కారమొనర్చి స్తుతింపదగిన ఈశ్వరుడవగు నిన్ను నేను బ్రతిమాలుచున్నాను. పిల్లల యపరాధమును తండ్రివలె, సఖ్యుపరాధమును సఖుడువలె, ప్రియురాలి యపరాధమును ప్రియుడువలె క్షమింపదగుదువు.

45. ఇదివరకెన్నడు చూడనట్టి నీ పారమేశ్వర రూపము చూచి సంతోషించితిని. నామనస్సు భయముతో కలవరపడినది. గాన ఓదేవేశ! జగన్నివాస! మామూలు రూపమునే చూపుము !

46. ఓ సహస్రబాహూ ! ఓ విశ్వమూర్తీ ! నిన్ను నాలుగు భుజములుగలిగి కిరీటధారివిగా గదా చక్రహస్తువిగా చూడగోరుచున్నాను.

47. ఓ అర్జునా ! నీయందనుగ్రహించిన నాచే నా పారమేశ్వర సామర్థ్యముచే నీ కీ తేజో మయము, ఆద్యంతరహిత విశ్వరూపము చూపింపబడినది. నీకంటె ఇతరు లెవరిచేతను ఈ రూప మిదివరలో చూడబడలేదు.

48. నాలుగు వేదముల నధ్యయనమొనర్చుట యజ్ఞానుష్ఠాన విజ్ఞానములు. దానములు, అగ్ని హోత్రాది కర్మానుష్ఠానములు ఉగ్రతపస్సులు వీటిలో దేనిచేతను, మనుష్యులీ వి రూపమును చూడనశ్యులు కాజాలరు.

49. నీకు ఈ రూపమును చూపుటచే గల్గిన బాధ, విమూఢచిత్తత్వము, దిగ్భ్రమ ఇత్యాదులు పోవుగాక - భయరహితుడవై సంతోషముగల మనస్సుగలిగి నా మామూలు రూపమును చూడుము.

50. ఇట్లు కృష్ణుడు పలికి అర్జునునకు తన కృష్ణరూపమును చూపెను. సౌమ్యుడై అర్జునుని నోదార్చెను.

51. ఓ కృష్ణా! సౌమ్యమగు నీ మానుషరూపమును చూచి స్వస్థచిత్తుడనైతిని.

52. దేవతలుగూడ నా విశ్వరూపమును నిత్యము చూడనభిలషింతురు. నీవు చూచిన నా విశ్వరూపము సామాన్యాధికారులకు చూడశక్యముగాదు.

53. నీవుచూచినట్లు వేద, తపో, దాన, యజ్ఞములను సాధనముగ గ్రహించువారీ పరమేశ్వర రూపమును చూడలేరు.

54. ఓ అర్జునా! అనన్య భక్తిచే మాత్రమే ఈ రూపమును చూచుటకు, అందు నిజముగా ప్రవేశించుటకు శక్యమగును.

55. ఓ పాండవా! ఈశ్వరునుద్దేశించి తన వర్ణాశ్రమానుసారముగా కర్మల ననుష్ఠించువాడు సర్వదా నాయందే తాత్పర్యముగలవాడు, నా భక్తుడు, ధన పుత్ర దారాదులందు తాదాత్మ్యాభిమానము లేనివాడు, సర్వభూతములందు వైరముగాని, భేదబుద్ధిగాని లేనివాడు అగు భక్తుడవే జ్ఞాని మాత్రమే నన్ను చూడగలడు, పొందగలడు.

# XII

1. ఓ కృష్ణా! ఇట్లు విశ్వరూపుడవగు నిన్ను సత్కర్మాదులతో నుపాసించువారు, సర్వకర్మ సంన్యాసులై నీ. అతీంద్రియ, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావమును, మనన మొనర్చు వారున్ను అగు ఇద్దరిలో ఎవరుత్తములు ?

2. విశ్వరూపుడవగు నాయందు మనస్సును నిరంతరముగానుంచి. ఉత్తమ శ్రద్ధాభక్తులతో నన్ను ప్రార్థించువారుత్తములని నాయభిప్రాయము.

3. ఏ ప్రమాణము చేతను వ్యక్తముగానట్టిన్ని, ఏవిధముగాను నిర్దేశింపదగినది గానట్టిన్ని, సర్వత్ర వ్యాపించియున్నట్టిన్ని, ఊహించవలనుగానట్టిన్ని, అసత్య జడదుఃఖ పరిచ్ఛిన్న

దేహాదికమందు సాక్షిగాను అధిష్ఠానముగాను ఉన్నట్టిన్ని, ఎట్టి మార్పు లేనట్టి నిత్య మగు "ఆత్మ" నుపాసించుచూ-

4. ఇంద్రియ విషయాదుల నన్నిటిని నియమించి సర్వము ఆత్మయే నను స్థిరబుద్ధిగలవారు నన్నే పొందుదురు.

5. క్లేశము పై ఇద్దరకు ప్రయత్నకాలమందున్నను అవ్యక్తోపాసకుల కధిక క్లేశము, కారణమేమనగా దేహాభిమానము స్వాభావికమైనందున, సర్వకాల సర్వావస్థలందును. దేహాభిమానరహితులగుట కధిక క్లేశముండును.

6. ఎవరు తమ దేహవ్యాపారములను తత్ప్రయోజనములను అన్నిటిని నాయందు సన్న్యసించి. అనన్యయోగముతో నన్ను ధ్యానించుచూ నా సమీపమందే సర్వదా ఉందురో.

7. వారు సర్వదా నాయందే లీనమొనర్చిన మనస్సు గలిగియున్నందున, వారిని త్వరగా జననమరణ ప్రవాహరూపమగు సంసారమునుండి నేను ఉద్ధరింతును.

8. అందుచే నీవు సర్వదా, విశ్వరూపుడనగు నాయందే మనస్సునుంచుము. బుద్ధివ్యాపార ప్రయోజనములన్నియు విశ్వరూపమేనని నిశ్చయించియుండుము. అట్లయినచో నీవు శరీర మరణానంతరము నాయందే నివసించియుండగలవు.

9. అట్లు నీ చిత్తమును నాయందు స్థిరముగా నుంచలేని యెడల ఉంచుటకు ప్రయత్నించుము. ఉంచుట నభ్యసింపుము.

10. అట్లభ్యసించుటగూడ చేతకానిచో నన్నుద్దేశించి నీ స్వకర్మల ననుష్ఠింపుము. క్రమముగా సిద్ధిని పొందగలవు.

11. అది కూడ నీకు చేతగానిచో, నా యోగముల నాశ్రయించి, చిత్తమును నియమించి సర్వక్రియలను ఫలాపేక్షలేకుండా ఆచరింపుము.

12. వివేకపూర్వకమగు అభ్యాసముకంటె జ్ఞానము శ్రేయస్కరము, దానికంటె జ్ఞానపూర్వకమగు ధ్యానము శ్రేయస్కరము. దానికంటె సర్వకర్మఫలత్యాగము శ్రేయస్కరము. ఆ వెంటనో సంసార బంధము శాంతించును.

13. ఇక అక్షరోపాసకులగు సంన్యాసుల ధర్మసముదాయ మువదేశింపబడుచున్నది. సర్వభూతములందు ద్వేషభావము నుంచక మైత్రిని, కారుణ్యమును ఉంచి తన దేహాదికమందు "నేను" అను భ్రాంతిగాని. దారాపుత్ర ధనక్షేత్రాదులందు "నాది" యను భ్రాంతిని గాని లేకుండ ఓర్పు గల్గి, సుఖదుఃఖములను రెంటిని సమముగా భావించి

14. నిత్యసంతుష్టుడై నియమిత స్వభావుడై, సర్వముఆత్మయేనను ధృఢ నిశ్చయము నొంది నాయందే ఉంచబడిన బుద్ధీంద్రియ ప్రాణములు గలవాడు భక్తుడు నాకు ప్రియుడు.

15. ఎవనివల్ల లోకమందలి ఏ పదార్థమున్ను ఉద్వేగపడదో, లోకమందలి ఎట్టివస్తువు వల్ల ఎవ డుద్వేగపడడో, ఎవనికి సంతోష, కోప, భయ ఉద్వేగములుండవో, వాడుభక్తుడు. నాకు ప్రియుడు.

16. దేహేంద్రియ విషయ సంబంధాదులందపేక్ష లేకుండి నిత్యము లోపల బైటగూడ శుచియై. ప్రతి కార్యమందు యథార్థ జ్ఞానియై, సర్వవిషయములందు, ఉదాసీనుడై ఎట్టి భయము లేకుండి ఇహసుఖ, పరసుఖములకొరకెట్టిపని చేయకుండువాడు భక్తుడు నాకు ప్రియుడు.

17. ఎవని దృష్టిలో ఇది శుభము ఇది అశుభము అని ఉండదో, ఎవడాయాదేశ కాలాదినిమిత్తములందు సంతోష, ద్వేష, శోక. కాంక్షలు నొందకుండునో, వాడు భక్తిగలవాడు, నాకు ప్రియుడు.

18. శత్రు, మిత్రులందు సముడై, తన గౌరవ, అవమానములందు సమదృష్టి గల్గి శీతోష్ణ సుఖ దుఃఖాది విరుద్ధ ద్వంద్వములందు సమభావన గల్గి ఎట్టి సంగము లేనివాడై

19. తనని ఇతరులు స్తుతించినను.నిందించినను,సముడై. ఎల్లప్పుడు ఆత్మను మననమొనర్చుట తప్ప ఇతరమెఱుంగకుండి, దానంతటఅది, కోరకుండగా. ప్రయత్నించకుండగా, లబ్ధమైనదానితోసంతోషించి, ఎట్టి స్థిరఆశ్రయములు లేకుండా నిరాశ్రయుడై, స్థిర నిశ్చిత. ఆత్మరూపుడై యుండువాడు భక్తిగలవాడు. నాకు ప్రియుడు,

20. శ్రద్ధాభక్తులతో, ధర్మ బద్ధము, మోక్షహేతువునగు 13 నుంచి 19 వరకుగల పదు గీత ములలో బోధింపబడినట్లు ప్రవర్తించువారు భక్తులు. నాకు అత్యంతప్రియులు.

---

# XIII

కుంతీపుత్రా! ఈ శరీరము 1 అనిష్టమునుండి రక్షించుటచే 2 పశించుటచే 3 ఎల్లా

ప్పుడు మారుటచే 4 భూమిలో పంటలు పండునట్లు ఇందు పుణ్య పాపకర్మలన్నియు పండుటచేతను, క్షేత్రమనబడును. దీని నెవడు స్వాభావిక జ్ఞానముచేతను, శాస్త్ర సంస్కార జ్ఞానముచేతను గుర్తించునోవాడు "క్షేత్రజ్ఞు"డనబడును.

2. సర్వ శరీరములందును క్షేత్రజ్ఞుడొక్కడే. అతనినే నన్నుగా తెలిసికొనుము, ఈ క్షేత్ర క్షేత్రజ్ఞులనిద్దరను స్పష్టముగా, అసంకీర్ణముగా తెలుపునదియే ఆత్మవిద్య. అదియే వా స్వరూపమగు జ్ఞానము.

3. ఆ శరీరమనే క్షేత్రము ఎట్టిదో ఎట్టి ధర్మములుగలదో ఎట్టి మార్పుల నొందునో ఎందు వలన అది ఏర్పడునో, ఎట్టికార్యము నేర్పరచునో, క్లుప్తముగా చెప్పెదను. అట్లే క్షేత్రజ్ఞుడెవడో, శరీరోపాధి భేదముచే ఎట్టి శక్తులు గల్గియుండునో క్లుప్తముగా చెప్పె దను సావధానముగావినుము.

4. ఈ రెండు విషయములు 1 ఋగ్యజుస్సామాథర్వణవేదముల చేతను 2 వశిష్ఠాదిఋషు లచేతను 3 విషయ, సందేహ, పూర్వపక్ష, సిద్ధాంత, సంగతులనెడి ఐదు హేతునిశ్చయ ములతో నొప్పు బ్రహ్మసూత్ర పదములతోను ఇట్లనేక విధములుగా విమర్శించి శోధిం పబడినవి. పరబ్రహ్మను సూచించు వాక్యములద్వారా పరమాత్మను తెలియజేయును గాన నవి బ్రహ్మసూత్ర పదములనబడును.

5.6. క్షేత్రమనగా ఈక్రింది 13 పదార్థములసముదాయము. 1సూక్ష్మములు ఇతరేతరఅసం కీర్ణములు అగు ఆకాశాది భూతములు అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధత న్మాత్రలు 2వాటికి కారణమగు "నేను" అనుజ్ఞానము అహంకారము. 3 తత్కారణమగు నిశ్చయ జ్ఞానము 4 తత్కారణమగు ఎవరికి గోచరముకాని ఈశ్వరశక్తియను అవ్య క్తము 5 అంతరింద్రియము 6 శ్రోత, త్వక్, అక్షి, రసనా, ఘ్రాణములను జ్ఞానేంద్రి యములు 5 వాక్, పాణి, పాద. పాయు, ఉపస్థలనెడి కర్మేంద్రియములు 5 యను పదకొండు ఇంద్రియములున్ను, 6 స్థూలముగా ఇంద్రియములకు గోచరములును శబ్ద స్పర్శ రూప రస గంధములున్ను 7 కోరిక 8 ద్వేషము 9 సుఖము 10 దుఃఖము 11 దేహేంద్రియ సముదాయము 12 అందుప్రకటితమగు అంతఃకరణ వృత్తి రూప మగు చైతన్యమున్ను 13 దేహేంద్రియాదులను ధారణచేయుగల శక్తియు, అను నీ పదమూడున్ను వాటి మార్పులున్ను క్లుప్తముగా ఉదహరింపబడెను.

7. ఇందు ఐదు గీతములచే జ్ఞాన సాధన గణ ముపదేశింపబడుచున్నది-

1 ఆత్మశ్లాఘ లేకుండుట 2 స్వధర్మమును ప్రకటింపకుండుట 3 తనకొరకితర జీవులను హింసింపకుండుట 4 ఇతరులు తనకపకార మొనర్చినను తాను ఎట్టిమార్పును పొందక స్వస్థుడగుట 5 ఎట్టివంకరలేకుండా బుద్ధి వృత్తులన్నిటిని ఋజుభావములతోనుంచుట 6 మోక్షసాధనవిద్యల నుపదేశించు ఆచార్యులను భక్తిశ్రద్ధలతో సేవించుట 7 దేహ, ఇంద్రియ సుకః ప్రాణముల నన్నింటిని ఎట్టి మాలిన్యములేకుండ శుచిగా నుంచుట 8 మోక్షమార్గమందు మాత్రమే స్థిరనిశ్చయుడై యుండుట 9 దేహేంద్రియాదులను స్వాభావిక ప్రవృత్తిని సద్విద్యామార్గమునకు మరల్చి నడిపించుట

8. 10 ఐహిక, ఆముష్మిక, భోగములందు రాగములేకుండుట

11 దేహేంద్రియాదులే తానను అహంకారము లేకుండుట

12 జన్మయందు, మరణమందు, ముసలితనమందు, వ్యాధులందు, దుఃఖములందును గల దోషముల నాలోచించి నిశ్చయించుట. జనన మరణ, జరా. వ్యాధులు దుఃఖ రూపములేయని నిశ్చయించుట

9. 13 పుత్ర, భార్యా. గృహాదులందు, ఆసక్తిగాని, తాదాత్మ్యముగాని లేకుండుట అనగా దారా పుత్రాదులు సుఖించగా తానే సుఖించితినని వారిదుఃఖము తనదుఃఖమే. వని భావింపకుండుట

14 తన ప్రారబ్ధ కర్మవశముచే ప్రాప్తించిన ఇష్ట, అనిష్టములందు, సంతోష కోపాది మార్పుల నొందక ఎల్లప్పుడు స్వస్థుడైయుండుట

10. 15 పరమేశ్వరునందు సార్వకాలికమగు నిశ్చలభక్తి నొందియుండుట

16, అరణ్యా, నదీ పులిన, దేవాలయాది, వివిక్త దేశముల సేవించుట

17 ప్రాకృతులు, సంస్కార శూన్యులు, అవినీతులు అగు జనులతో ఎట్టిసంబంధము నొందకుండుట

11. 18 తనయందు నిఖిలభూతములందు, ఏకరీతిగా నున్నజ్ఞానమొక్కటియే నిత్యమని తలచుట

19. పై జ్ఞానసాధనములన్నిటియొక్క పరిపాక నిమిత్తమగు 'మోక్ష' మను నిత్య సిద్ధఫలము నే ఆలోచించుట

ఈ మొత్తము 19న్ని సాధకదశలో జ్ఞాన సాధనములున్ను సిద్ధ దశలో ఇవియే భావిక

లక్షణములున్ను అగును. వీటికి విరుద్ధమగు మానిత్వ, దంభిత్వ, హింసాదులు అజ్ఞాన సాధనములున్ను, అజ్ఞాని లక్షణములున్ను అగును. వాటిని పరిహరించుటయే జ్ఞాన సాధనము.

12. జీవులచే తెలియదగిన పరమతత్వమును చెప్పుచున్నాను. అది తెలుసుకొన్నవాడు మరణాదులు లేనివాడై నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావుడగును. అది అన్నిటికంటె దేశతః, వస్తుతః, కాలతః, గొప్పది గాన "బ్రహ్మ" యనబడును. దానికి ఆద్యంత ములు లేవు. అది భావరూపమేగాని అభావరూపమెన్నటికి గాదు. అట్లని బుద్ధీంద్రియ గోచరమున్ను గానేరదు.

13. అది సర్వతోముఖముగా లెక్కలేనన్ని పాణి, పాద, అక్షి, శిరో, ముఖ, శ్రోత్రాదులు గలదై సర్వమును ఆవరించి, సర్వవ్యాపకమైయున్నది. అనగా సర్వదేహధారులంద రును, వారి ప్రవృత్తులన్నియు, తత్సాధనములగు చక్షురాదీంద్రియములున్ను, ఆ బ్రహ్మయే మూలముగా గలిగియున్నవి.

14. కాని ఆ ఇంద్రియాదులా జ్ఞేయమునకు నిత్య సంబంధములు గావు. జ్ఞేయము బంగారమువంటిది. ఇంద్రియాదు లాభరణములవంటివి. ఆభరణ, గుణదోషములు బంగారమునకంటనట్లు ఇంద్రియాదుల గుణదోషములు బ్రహ్మకంటవు. బంగారము యొక్క అభాసమాత్రమే ఆభరణములైనట్లు, ఇంద్రియములు, వాటి వ్యాపార ములు, తత్ఫలములు అన్నియు బ్రహ్మాభాసములే. బంగారము ఆభరణములన్నిటి లోను ఎట్టి సక్తత లేకుండా, అన్ని ఆభరణములను భరించునట్లు ఆ బ్రహ్మ దేహేం ద్రియ మనఃప్రాణములన్నిటిలోను ఎట్టి సక్తత లేకుండి వాటినన్నిటిని భరించును. బంగారము స్వభావముచే గుణములు లేనిదైనను ఆభరణము అన్నిటియందలి గుణము లకు భోక్తయైనట్లు, బ్రహ్మగూడ స్వభావముచే నిర్గుణమైనను, దేహేంద్రియ మనః ప్రాణములందలి గుణములన్నిటికి భోక్త యగును.

15. ఆకాశమువలె ఆబ్రహ్మ భూతములన్నిటికి, లోపల బయట గూడ వ్యాపించియున్నది. స్వభావముచే ఆకాశము నిశ్చలము, ఘటాద్యుపాధి విశిష్టమగు ఆకాశమువలెను. ఘటాది చలనముచే చలనమున్నట్లుభాసించును. అట్లే బ్రహ్మ స్వభావముచేనిశ్చలము. దేహేం ద్రియాది ఉపాధి వశముచే చలనమున్నదానివలె భాసించును. అత్యంత సూక్ష్మమైనం దున బుద్ధ్యాదులతో తెలియదగి యుండదు. అది ఆకాశమువలె, అత్యంత సమీపముగు స్వహృదయమందును అత్యంత దూరమందును గలదు.

16. ఆకాశమువలె సర్వభూతములందు అవిభక్తముగానున్నను విభక్తమైనదానివలె కాన్పించును. అనగా ప్రతిమనుష్యుడును ఆకాశమేది? యని ప్రశ్నింపగా బయట నున్న ఆకాశమును చెప్పి చూపించును, వాడట్లు పలుకుటగాని చూపించుటగాని ఆకాశమే గదా! ఆకాశము వాని హృదయములో లేకున్న యెడల వాడు పలుకజాలడు. చూపింపజాలడు ప్రతి జీవుడు తన సుషుప్తిలో "తాను" మాత్రమున్నాడు. ఆకాశాది భూతములుగాని తద్ధర్మములుగాని తత్కార్యములు గాని అపుడులేవు. మేల్కొన్నక్షణమునుండీ తిరిగి నిద్రించువరకు తనవల్ల ఆకాశాధిభూత తద్ధర్మ తత్కార్యములు ఆవిర్భవించుచూ కొంతకాలము తనలోనే స్థితి నొందుచూ తిరిగి తనలోనే లీనములగుచున్నవిగదా ఈ "తానే" బ్రహ్మ

17. లోకమందలి వస్తువులను సూర్యుడు మొదలగు వారి వెలుగు ప్రకాశింపజేయుచుండగా "ఈ తాను" అను బ్రహ్మ ఆ సూర్యాది వెలుగులనుగూడ గ్రహించి ప్రకాశింపజేయుచున్నది. తాను సుషుప్తిలో నున్నపుడు దీప, సూర్యాది వెలుగు భాసింపదు గదా. తాను ప్రమాతయైనపుడేగదా సూర్యాది వెలుగు భాసించుట. గాన ప్రమాతయగుతానే సూర్యాది వెలుగులను భాసింపజేయుచున్నాడు. జీవుడు బయటివస్తువులను చూచుటకుమాత్రమే దీప సూర్యాదివెలుగుభాసకమగుచున్నదిగాని అంతరములగు తన మనస్సును అందలి స్మృతులను పదార్థములను సూర్యాదివెలుగు భాసింపజేయుట లేదనుట సర్వానుభవ సిద్ధము. సూర్యాదులు కర్మ (Object) తాను కర్త (Subject) ఈ ఇద్దరిలో కర్త స్వతంత్రుడు కర్మ పరతంత్రముగాన తానే సూర్యాదులకు భాసకుడనుట యుక్త్యనుభవసిద్ధము, సూర్యాదుల వెలుగు చీకటిని పోగొట్టి ఆయా పదార్థములను భాసింపజేయునట్లు "తాను" తన అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమును ప్రకాశింపచేయుచున్నది, ఈ "తానే" సర్వజీవుల హృదయమందుండి వ్యవహార దశలో 1 జ్ఞాన సాధనము 2 తనచే తెలియదగిన జ్ఞేయము (Object) 3 జ్ఞానముచే తెలియదగిన ఫలములను త్రైవిధ్యమునొందుచున్నది. అనగా తనజ్ఞానములో కొంతభాగము 1 కర్తగా 2 కొంతభాగము కర్మగా 3 ఇంకొకభాగము సాధనముగా 4 ఇంకొకభాగము సంప్రదానముగా (తనప్రయత్నముచేపొందగోరుఫలము) 5 వేరొక భాగము అపాదానముగా (తన బుద్ధివిజ్ఞానమందిమిడియున్న జ్ఞేయ (Object) మందు తననుంచివిడదీయుట) 6 ఇంకొకభాగము తనకు జ్ఞేయమువకు సంబంధముగాను 7 మరియొకభాగము తనకు కర్మకు ఆధారముగాను ఇట్లేడువిధముతై వ్యవహారమునొంది, చివర

పరిపక్వదశలో జ్ఞేయము (Object) జ్ఞాతలో (Subject) లీనమగుచున్నది. తెలియబడుచున్నదశలో అదియే జ్ఞేయమనబడ తెలిసిన దశలో అదియే జ్ఞానఫలమగుచున్నది.

18. ఇట్లే అధ్యాయమందలి 1—6 గీతములందు క్షేత్రమున్ను 7—11 గీతములందు జ్ఞాన సాధనగణమున్ను 12—17 గీతములందు జ్ఞేయమున్ను క్లుప్తముగా బోధింపబడినది. వీటి నెఱుగుటకు ప్రయత్నించుటమొదలు పూర్తిగా తెలుసుకొని అనుభవించుట వరకు గల సాధనము భక్తులనబడెదరు, పరిపక్వదశలో భక్తులు "జన" యగుదురు.

19. ఏడవ యధ్యాయమందుపదేశింపబడిన 1 పరాకృతియనబడు క్షేత్రజ్ఞుడు 2 అపరా ప్రకృతియనబడు క్షేత్రము. ఈ రెండు ఈశ్వరప్రకృతులే. సర్వభూతము లకు మూలము అను విషయము ఇచట వివరింపపడుచున్నది.

అపరాప్రకృతి పరిమితహద్దులలో నుండి, విస్తరించుట కొరకు నిరంతరము ప్రయత్నించు సాధ్యవస్తువుగాన "ప్రకృతి" యనబడును. పరాప్రకృతి సర్వవ్యాపకమగు సిద్ధ వస్తువుగాన ఇది "పురుషు" డనబడును. ఇవిరెండును అనాదులే ఈశ్వరుడీ రెంటిని తనస్వాధీనమందుంచుకొనిజగత్సృష్టి స్థితిలయకారణమగుచున్నాడు. మార్పులన్నియు బుద్ధీంద్రియ ప్రాణరూపములగుచూ, సుఖ, దుఃఖ. మోహాద్యాకార పరిణితములగును. ఇవి "ప్రకృతి" వల్ల ఏర్పడినవే. ఈశ్వరునియందు మార్పును భాసింపజేయు శక్తి ఈ ప్రకృతియే.

20. దేహేంద్రియ మనః ప్రాణములు వాటి వ్యాపారములు తత్ఫలములు. వీటియన్నిటికి "ప్రకృతియే కారణము. ఒకజన్మలోని దేహేంద్రియాది వ్యాపారమునకు ఫలమే మరు జన్మలోని దేహాదులు భోగ్యములందు సుఖ. దుఃఖాదులననుభవించుటకు "పురుషు డే" హేతువు. దేహధారి శబ్దస్పర్శాది విషయములను గ్రహించుట వాటిననుభవించుట భోగమనబడును. క్షేత్రరూపమగు ప్రకృతితో, క్షేత్రజ్ఞుడు అవిద్యచే సంయోగము పొందుటయె సంసారము.

21. దానికి నిమిత్తమేమనగా, పురుషుడు భోక్తయగు (క్షేత్రజ్ఞుడు) దేహేంద్రియాది రూపముగా పరిణమించిన "ప్రకృతి" లోనుండి దానినే తానుగా భావించి తజ్జనిత సుఖ దుఃఖ మోహాదులతో తాదాత్మ్యమునొంది ప్రవర్తించుటయే ముందురాబోవు మంచి చెడ్డదేహములకు కారణము, అవిద్యయు కామక్రోధాదులున్ను సంసారకారణములుగాన వాటిని పరిత్యజింపవలెను.

22. యజ్ఞమందు ఋత్విక్కులు తమతమ కర్తవ్యమును నెరవేర్చుచుండగా మరియొక గొప్పవాడు వారియందరి కర్తవ్యములను అందలిగుణ దోషములను గమనించువాడు "ఉపద్రష్ట" యనబడును. బాల్యమందు తనదేహమే చేష్టాకర్తయని, కొంచెము విద్య నభ్యసించినతరువాత తన ఇంద్రియములే చేష్టాకర్తలని ఇంకను విద్యనొంది మనస్సే చేష్టాకర్తయని విద్యపరిపాకదశయందు "ఆత్మయే" చేష్టాధిష్ఠానమని గుర్తింపబడును. బుద్ధీంద్రియాదులనుతనప్రయోజనమునకనుకూలముగా ప్రవర్తింపజేయవలెను. దేహేంద్రియవ్యాపారములందు తత్ఫలములగు సుఖ దుఃఖములందు తాను సాక్షిమాత్రుడుగానేయుండుట "అనుమంత" యనబడును. బుద్ధీంద్రియాదులు కలసిమెలసి పనిచేయుచూ యథార్థముగా తమకంటె వేరైన చైతన్యమును తమనుగానే భాసింపజేయుటయనగా బుద్ధ్యాదులే చైతన్యరూపము లనుకొనుటకు కారణమైన ఆత్మ "భర్త" యనబడును.

సుఖదుఃఖాది జ్ఞానములు శబ్దస్పర్శాది సర్వవిషయములు ఇవియన్నియు నిజముగా చైతన్యరూపములుగానే ఏర్పడుచున్నవని తలపబడునపుడీ ఆత్మ "భోక్త" యనబడును. సర్వవిషయములను తనలో లీనమొనర్చుకొని సర్వస్వతంత్రుడై గొప్పవాడనితలపబడునపుడు "మహేశ్వరు"డనబడును. దేహేంద్రియమనఃప్రాణములలో ఉత్తరోత్తరోత్కృష్ట కారణజ్ఞానముద్వారా సర్వకారణ రూపమును గుర్తించునపుడది "పరమాత్మ" యనబడును. ఇట్లు ప్రతి దేహమందు 1 ఉపద్రష్ట 2 అనుమంత 3 భర్తా 4 భోక్తా 5 మహేశ్వరుడు 6 పరమాత్మయని ఆరుదశలలో ఆరుగుర్తులద్వారా పురుషుడు విద్యనభ్యసించి పరమాత్మయేయగుచున్నాడు.

23. ఇట్లు ప్రకృతిని, పురుషుని, గుణములతోసహా స్పష్టముగా గుర్తించియుండు విద్వాంసుడెట్లు ప్రవర్తించినను వాడీ దేహమరణానంతరము తిరిగి పుట్టడు. అతనికీదేహమే తుదిది. ఇతడే జననమరణాది రహితపరమాత్మ.

24. ఇట్టి ఆత్మదర్శనమున కుపాయముగా 1 కొందరుతమ ఇంద్రియములన్నిటిని శబ్దాది విషయములనుండి ఉపసంహరించి మనస్సునందులీనమొనర్చి మనస్సును పరమాత్మలో నుపసంహరించి ఏకాగ్రముగా ధ్యానించుచూ పరమాత్మను తమబుద్ధితో చూతురు. వీరు ధ్యానయోగులనబడెదరు. 2 కొందరు బుద్ధ్యాదులు సత్వరజస్తమోగుణములు ప్రపంచము ఇత్యాదులన్నియు నాకు దృశ్యములగుచున్నవి, నేను ద్రష్టను. వీటి యన్నిటికంటె విలక్షణుడను. వీటి వ్యాపారములకు సాక్షిని, నిత్యుడను, ఆత్మను అని

నిరంతరము మనన మొనర్చుచూ ఆత్మనుగుర్తింతురు. వీరు సాంఖ్యులనబడెదరు కి మరి కొందరు ఈశ్వరార్పణబుద్ధిలో తమ వర్ణాశ్రమ విహితకర్మల ననుష్ఠించుచూ నిర్మలాంతఃకరణులై ఆత్మను గుర్తింతురు.

25. పై మూడు ఉపాయములను స్వతంత్రముగా నాచరింప నసమర్థులై పెద్దలవలన విని తెలిసికొన ప్రయత్నింతురు. వీరుగూడ వేదమే మోక్షసాధనమను స్థిరనిశ్చయము గలవారైనందున క్రమముగా మోక్షము నొందగలరు.

26. స్థావర, జంగమ, జీవులందరు, ఇట్టి క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగముచే ఏర్పడినవారేనని తెలుసుకొనుము. ఓ అర్జునా క్షేత్రజ్ఞుడు ఆకాశమువలె నిరవయవుడు గాన కుండకు, త్రాడుకువలె, అవయవ సంశ్లేష మసంభవము క్షేత్రమునకు, క్షేత్రజ్ఞునకు కార్యకారణభావము లేనందున దారమునకు వస్త్రమునకువలె "సమవాయ" సంబంధముండనేరదు. ఇక క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమెట్టిదనగా అధ్యాసరూపమైనది. ఎట్లనగా-

| క్షేత్రజ్ఞుడు (Subject) | క్షేత్రము (Object) |
|---|---|
| నిత్యుడు | అనిత్యము |
| స్వతంత్రుడు | పరాధీనము |
| జ్ఞానరూపుడు | జడరూపుడు |
| అనంతుడు | పరిచ్ఛిన్నుడు |
| సత్యమైనది | అసత్యమైనది |
| ఆనంద రూపము | దుఃఖరూపము |
| విషయి | విషయము |

ఇట్లు విరుద్ధ స్వభావములగు పై రెంటిని వీడదీసి గుర్తింపలేక రెండు ఒకటియని భ్రమించి ఒకదాని ధర్మములను రెండవదానియందారోపించుట, ఇదియే అధ్యాస సంయోగమనబడును. పై క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగమిట్టిది.

27. ఇదియే అవిద్యయనబడి జీవుని సంసారమున బంధించుచున్నది. దీనిని సమూలముగా నశింపజేయునదే సమ్యగ్దర్శనము. దేహము, ఇంద్రియములు, మనస్సులు, ఎన్నిమార్లు మార్పునొందుచు నశించుచున్నను స్థిరముగానుండి సర్వభూతములందు ఒకేరీతిగానున్న పరమాత్మను గుర్తించుటయే సమ్యగ్దర్శనము వాడే సార్థకజీవి.

28. అట్లుగాక దేహాదిభేదములు కనుపించుచున్నందున వాస్తవముగా జీవభేదమే పరమార్థ

సత్యమని. తలచువాడునిజమగు అద్వితీయాత్మను హింసించినవాడగును. అనగా రూపా యను పైపగాగుర్తించుట రూపాయనుహింసించుటయేయైనట్లు సర్వవ్యాపకమగుఅద్వై తాత్మను పరిచ్ఛిన్నమైనదానినిగా గుర్తించుటదానినిహింసించుటయెయగును. వాడు తననిజరూపమును తానేహింసించినవాడగును. అట్లుగాకసర్వద్రవ్యగుణక్రియాదులందు ఏకరీతిగానున్న పరమాత్మనుగుర్తించినవాడు హింసకుడుగాకపోగా సర్వాత్మభావము నొందును.

29. మనోవాక్కాయములచే చేయబడు సర్వక్రియలున్ను పూర్వమందు చేసన క్రియల యొక్క పరిణామములే (ఫలములే). ముందుచేయబోవు క్రియలకు సాధనములే. ఇట్లు 1 క్రియా 2 సాధన 3 ఫలములు మూడున్ను ప్రకృతియొక్క రూపమే. ఇదియె కర్త ఆత్మ ఎల్లప్పుడు ఆ కర్తయేనని గుర్తించువాడు పరమార్థదర్శి యనబడును. నిర్గుణము అకర్త, నిర్విశేషములగు ఆత్మకు సజాతీయ విజాతీయ స్వగత భేదములలో ఏ యొక టియు ఉండదు. ఎట్టి ప్రమాణమున్ను ఆ భేదమును సాధింపజాలదు

30. శాస్త్రాచార్యోపదేశము ననుసరించి నానా విధములుగా భాసించుచున్న దేహేంద్రియ మనః ప్రాణములలోని భేదము ఉపాధిసంబంధ జనితమని నిశ్చయించి ఆత్మైకత్వమును గుర్తించినవాడే బ్రహ్మ భావమును పొందును. అనగా ప్రపంచమందలి దేహములలో భేదము అధికము ఇంద్రియములలో అంతకంటె తక్కువ భేదము, మనస్సులలో ఇంకను తక్కువభేదము, విజ్ఞానములో ఇంకను తక్కువ భేదము ఈవిధమైన భేదము నకు ఆదేహాది ఉపాధులే కారణము. గాన ఉపాధిరహితమైన సర్వాధిష్ఠానమొక్కటే. అందెట్టి భేదము లేదను నిశ్చయము సుకరము.

31. ఇట్టి పరాత్మకు సర్వదేహ సంబంధమున్నను దేహదోషసంబంధములేదు. ఏలనవగా ఆది అద్యంతములు లేనిది. గుణములులేనిది, నాశనము లేనిది, నిరవయవము, నిత్యసిద్ధము ఇట్టిదిశరీరమందున్నను కర్తగాదు. తత్ఫలలేపము నొందదు. కర్తయగువాడా కర్మఫల ముతో సంబంధించును. వాడు 1 సావయవుడైనందున అవయవములమార్పు నొందును. 2 సగుణుడైనందున గుణవ్యయముచే మార్పునొందును. 3 ఆదిగలవాడైనందున అంత మునొందును. గాన అవిద్యామాత్రస్వభావుడగు జీవుడు ఆదశలో మాత్రమే కర్తయై ఈ యీ మార్పుల నొందుచుండును.

ఆకాశము సర్వగతము అత్యంత సూక్ష్మముగాన లోక మందలి ఎట్టి పదార్థ గుణ దోషసంబంధమున్ను దానికిలేదు ఆకాశ కారణమగు ఆత్మకుండదని వేరుగచెప్పనేల?

33. ఒకే సూర్యుడు నానా విధభేదభిన్నమగు సర్వ ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నట్లు ఒకే క్షేత్రజ్ఞుడు సమస్తక్షేత్రజాతమును ప్రకాశింపజేయును.

34. ఇట్లు శాస్త్రీయజ్ఞానముచే క్షేత్రమును క్షేత్రజ్ఞుని అసంకీర్ణముగా విభజించి అవిద్యను దాని కార్యమును, దాని నాశమును తెలుసుకొని ప్రవర్తించువారు బ్రహ్మభావమను మోక్షము నొందెదరు.

ఇతి త్రయోదశో ఽ ధ్యాయః

# XIV

ఇంతవరకువినగా సాధారణముగా ఈ సందేహములుదయించును.

1 క్షేత్ర క్షేత్రజ్ఞసంయోగముచే సర్వప్రపంచము ఎట్లు పుట్టును?

2 క్షేత్ర క్షేత్రజ్ఞులు రెండును ఈశ్వరాధీనములా? లేక స్వతంత్రములా?

3 ప్రకృతిలో పురుషుడెట్లుండును? గుణములందలి సంగము సంసారకారణ మెట్లగును?

4 ఏయే గుణమందు ఎట్టి సంగముండును? గుణములేవి? ఎన్ని, ఎట్లు జీవుని బంధించును?

5 ఈ గుణబంధములోనుంచి మోక్షమెట్లు గల్గును? ముక్తుని లక్షణమెద్ది? యని వీటికి సమాధానముగా ఈ అధ్యాయముపదేశింపబడుచున్నది.

1. యజ్ఞాదిజ్ఞేయవస్తు జ్ఞానములన్నిటిలో నుత్తమమగు పరమాత్మజ్ఞానమును తిరిగి విపులముగా చెప్పుచున్నాను. దీనిని పుష్కలముగా నెరిగి పూర్వులనేకులు సిద్ధినొందిరి.

2. ఈ జ్ఞానవిద్య నాశ్రయించి జ్ఞాన సాధనములననుష్ఠించి చాలామంది పెద్దలు తమ నిజరూపము పరమాత్మయేనను నిశ్చయముతోనుండి ముక్తులగుదురు. నా స్వరూపమే వారు, వారి స్వరూపమే నేను. వీరు ప్రళయకాలమందు నశింపరు. సృష్టికాలమందు పుట్టరు.

3. అపరా ప్రకృతి (క్షేత్రము) సత్వరజస్తమో గుణాత్మకనుగు మాయ ఇది నా స్వభూతమైనది. నాకంటె భిన్నమైనదిగాదు, ఇది కార్యప్రపంచమంతటికంటె గొప్పదిగాన మహత్తనబడును. ప్రపంచవికారము లన్నిటిని భరించునుగాన బ్రహ్మయనబడును. ద్వివిధ ప్రకృతి శక్తిమంతుడనై ఈశ్వరుడనగునేను పై మహత్తను ప్రకృతియందు బీజమునుంతును, క్షేత్రజ్ఞుడె క్షేత్రమందుండి ఎట్టి అవిద్యా కామ కర్మల నెంతవరకు బొందియుండునో అందులకనువగు ఉపాధిస్వరూపము నేర్పరచుకొని అందు తాదాత్మ్యము నొందునట్లొనర్చును, అదియే సర్వభూతముల పుట్టుక.

4. దేవ, మనుష్య పితృ, పశు, మృగాది యోనులందేర్పడు దేహములన్నిటికి పరమేశ్వరుడను, ప్రకృతిద్వయప్రభువునుఅగునేను తండ్రిని, మహత్తనబడుప్రకృతి తల్లి.

5. ఆప్రకృతివల్ల 1 సత్వము 2 రజస్సు 3 తమస్సులను గుణములేర్పడినవి. అవిద్యాగ్రస్తుడగు క్షేత్రజ్ఞునిగుణములు క్షేత్రమందు తాదాత్మ్యము నొందునట్లు కట్టివేయును. అందుచే నాతడు తన నిజరూపమును మఱచిపోయి క్షేత్రానుగుడగును.

6. అందు సత్వగుణము, నిర్మలమైనదగుటచే ప్రకాశకమైనది, నిరుపద్రవమైనదిగాన జీవుని సుఖ సంగముతోను జ్ఞానసంగముతోను బంధించును. అనగా తనకు విషయమైె తన కంటె వేరైనసుఖము తానుగానే భావించునట్లొనర్చును.

7. రజోగుణము అనురాగమే సర్వరూపముగాగలది. అప్రాప్తవస్తువును గోరుట, పొందిన వస్తువునందు ప్రీతి. దానివల్లనేర్పడును, అందుకొరకు లౌకికప్రయోజనములను పారలౌకిక తత్సాధనములను తదను ష్ఠానమును జీవులందు బంధించును.

8. తమోగుణము అజ్ఞానముచే పుట్టునది. దేహధారులందరకు మోహకరమైనది. ప్రమాదము, అలసత్వము సోమరితనము నిద్ర ఇత్యాదులద్వారా జీవుని బంధించును.

9. సత్వగుణము జీవులను సుఖమందును, రజోగుణము క్రియలందును తమోగుణము, వివేకవిజ్ఞానమునావరించి ప్రమాదమందును (తనవిధి నిర్వహణమందు గూడప్రవృత్తి లేవి వానివిగాను) కలిపివేయును.

ప్రతిదేహమందును ఈ మూడుగుణములలో ప్రతియొక్క గుణమును, మిగిలిన రెండు గుణములను అణగద్రొక్కి తానే దేహధారి మీద పూర్తిగా పెత్తనము చేయ గోరును.

11. తన నిజస్వరూపమగు ఆత్మనుగు_ర్తించుట కనువగు ద్వారములే శ్రోత్రాదీంద్రియములు. శబ్దస్పర్శాది బుద్ధివృత్తులన్నిటి యందును జ్ఞానము ప్రకాశము అభిలషితములైవచో (శబ్దస్పర్శాదులద్వారా ఆత్మనెరుగుటకొరకు ప్రయత్నము శబ్దాదులకు మూలకారణ మేది? యనివిచారించుట) ఆదేహధారియందు సత్వగుణము ప్రబలముగా నున్నట్లు తెలియదగును.

12. పరద్రవ్యాదుల నొందవలెనను లోభము, సామాన్యచేష్టలు. అనేకపనుల నారంభించుట ఏస్థితిలోను తృప్తిలేకుండుట, హర్షరాగాదిప్రవృత్తి, సర్వసామాన్యవస్తుతృష్ణ, ఇత్యాదులున్న దేహధారియందు రజోగుణము ప్రబలముగానున్నట్లు తెలియదగును.

13. అవివేకము, అత్యంతము ప్రవృత్తిలేకుండుట, ప్రమాదము, మోహము, మూఢత్వము, ఇత్యాదులున్న దేహధారియందు తమోగుణము ప్రబలముగానున్నట్లు తెలియదగును.

14. సత్వగుణము ప్రబలముగానున్న బుద్ధివృత్తితో మరణించిన దేహధారి, మహదహంకార పంచతన్మాత్రాదుల నెరిగినవారు పొందగల నిర్మలలోకమందు జన్మించును.

15. రజోగుణము ప్రబలముగా నున్నబుద్ధి వృత్తితో మరణించినవాడు కర్మాసక్తిగల మను ష్యజన్మ నొందును. తమోగుణము ప్రబలముగానున్న బుద్ధి వృత్తితోమరణించినవాడు పశుపక్ష్యాదిజన్మల నొందును.

16. సత్వప్రధానముగా ప్రవర్తించువాడు తదనుగుణమైన నిర్మల జ్ఞానఫలమునే బొందును రజః ప్రధానముగా ప్రవర్తించువాడు తదనుగుణమైన దుఃఖఫలమునే బొందును. తమః ప్రధానముగా ప్రవర్తించువాడు తదనుగుణమైన అజ్ఞాన ఫలమునే బొందును.

17. సత్వగుణము బాగా రూఢమైనవానికి జ్ఞానమున్ను రజో గుణము బాగుగా రూఢమైన వానికిలోభమున్ను, తమోగుణముబాగుగా రూఢమైనవానికి ప్రమాదము మోహము అజ్ఞానములున్ను కలుగును,

18. సత్వగుణమందు నిరంతరము నుండువారు దేవాద్యూర్ధ్వలోకములందును, రజోగుణ మందు నిరంతరముగానుండువారు మనుష్యలోకమునందున్ను తమోగుణమందు నిరం తరమునుండువారు, నిద్రాలస్య ప్రమాదాది పరవశులై పశుపక్ష్యాది దేహములందును జన్మింతురు.

19. ఇట్లు పురుషుడు ప్రకృతితో తాదాత్మ్య సంగమును పొంది మృచ్ఛి, చెడు, దేహములందు జన్మించుననియుసత్వరజస్తమోగుణములస్వరూపస్వభావములున్ను వాటిబంధకత్వమున్ను

తద్వశముగ పురుషునకు రాగల దేహాపరంపరయున్ను బోధించి సమ్యగ్దర్శనముచే మోక్ష మెట్లుగల్గునో వివరింపబడుచున్నది. సత్వాది మూడు గుణములే కార్య కరణ రూప ముతో దేహేంద్రియాద్యాకారము నొంది దేహయాత్రకు కర్తలగుచున్నవని వేదవిద్యా నిరంతర మనన మొనర్చిన విద్వాంసుడు గుర్తించి తనను అకర్తగాను ఆగుణత్రయ ముకంటె భిన్నమైన వానినిగాను తెలుసుకొని, అనుభవించును. అదియే నా భావము. (పరమాత్మభావము) ఇదియే మోక్షమనబడును.

20. పై మూడు గుణములు దేహముచే నేర్పడినవి, జనన, మరణ, జరాది దుఃఖములు దేహధర్మములు. సాధకుడైన విద్వాంసుడు తద్విలక్షణుడుగాన అతడు మోక్షము నొందును.

అర్జునుడిట్లు ప్రశ్నించుచున్నాడు-

21. ఓ ప్రభూ! ఈ త్రిగుణములనతిక్రమించిన వాని యాచార మెట్టిది? వానిని గుర్తించు టకు చిహ్నములెవ్వి? ఎట్లు గుణముల నాతడతిక్రమించును?

భగవద్వాక్యము-

22. ప్రపంచ పదార్థ ప్రకాశనముగాని వాటినొందు ప్రవృత్తిగాని మోహముగాని అతడు పొందడు. వాటియంతట అవి తనకు ప్రాప్తించినచో ద్వేషింపడు. సుఖింపడు. తనకు ప్రాప్తించని వాటిని కోరడు. "నేను మూఢుడనైతిని. కోరుచుంటిని, దుఃఖించు చుంటిని నేను వివేకిని సుఖించుచున్నాను." ఇత్యాదిగా గుణత్రియధర్మములను తన యందారోపించుకొనడు. ఇట్టి గుర్తులు అతనికి మాత్రమే గోచరమగును. ఎప్పుడైన ఈ అధ్యాస వచ్చినచో వెంటనే నివారించి నేను అకర్తను. పరమాత్మను అని వెంటనే నిశ్చయించును. ఈ గుర్తులు ఇతరులకు తెలియదగినవిగావు.

23. పై మూడు గుణములచే ననగా జ్ఞాన, ఇచ్ఛా, క్రియలచే అతడు చలింపడు. సర్వదా సర్వ వస్తువులందును ఉదాసీనుడుగానే యుండును. గుణముల నతిక్రమించు ఉపా యమార్గమందే ఎల్లప్పుడు ఉండును. ఎట్టి మార్పును పొందడు. దేహేంద్రియములు గుణములేనని బాహ్యములగు శబ్దస్పర్శాదులున్ను గుణములేనని, గాన గుణములు గుణములందు ప్రవర్తించుచున్నవి. నేను సాక్షిమాత్రుడను. అను నిశ్చయముతోనే యుండును.

24. అతడు సుఖ దుఃఖములను, మట్టిగడ్డ బంగారములను, ప్రియ అప్రియములను, స్తుతి నిందలను, సమానముగాచూచు ధీరుడై యుండును. ఇవియన్నియు త్రిగుణములనియు తాను తద్విలక్షణ ఆత్మరూపుడననియు అతడు ధైర్యముగా నుండును.

25. తన గౌరవ అవమానములందు తుల్యదృష్టిగలవాడు, అతనికి శత్రువులు మిత్రులులేరు సర్వసముడు సర్వము ఆత్మగా చూచును. ఎట్టి పనిని చేయడు. తనదేహధారణ మాత్రోపయుక్త కార్యములను మాత్రమే ఆసక్తి లేకుండా చేయును.

26. నిరంతర, నిశ్చల భక్తితో పరమాత్మనగు నన్ను సేవించుచుండువాడు, అతడే దేహముండగనే త్రిగుణముల నతిక్రమించినాడు. బ్రహ్మ భావము మోక్షము అతనికి అయత్న సిద్ధము.

27. జనన మరణాది వికార రహితమున్ను శాశ్వత ధర్మ సుఖరూపమున్ను అగుచూ వేద విద్యద్వారా తెలియవగిన పరమేశ్వరునకు నిత్య నిర్గుణ అద్వితీయ పరమాత్మనగు నేనే ప్రతిష్ఠను లేక అధిష్ఠానమును లేక పరమలక్ష్యమును.

ఇతి చతుర్దశో ఽధ్యాయః

# XV

కర్మఠులకు, జ్ఞానాభ్యాసకులకు ఫలప్రదాత పరమేశ్వరుడే గాన భక్తులు తమ యభ్యాసముచే క్రమముగా ఈశ్వరానుగ్రహముద్వారా గుణాతీతులగుదురనగా ఆత్మవేత్తలు ముక్తులేనని వేరుగా చెప్పనేల? యను వాశయముతో శ్రీకృష్ణుడు ఆత్మతత్త్వము నుపదేశింపతలచి వైరాగ్య మందుల కంతరంగసాధనమని బోధించుటకొరకు సంసార రూపమును వర్ణించుచున్నాడు.

1. 1 కాలముచే అత్యంత సూక్ష్మముగాన 2సర్వకారణ మైనందున 3 నిత్యముగాన 4అన్నిటికంటె గొప్పదిగాన మాయావిశిష్ట పరమాత్మ యనబడు ఈశ్వరుడు లేక సాధకునిచే తెలియబడుచున్నదశలోని పరమాత్మ, ఊర్ధ్వ మనబడును. ఈ వృక్షమువంటి సంసారమున కాతడు మూలము, బుద్ధీంద్రియాదులీ సంసారవృక్షమునకు శాఖలవంటివై క్రిందకు

వ్యాపించియున్నది. ఇది ప్రతిక్షణ పరిధ్వంస స్వభావముగలది. ఆద్యంతములు గోచరింపనిది. అవిచ్ఛిన్న దేహాది సంతానాశ్రయమైనది. చెట్టును ఆకులు రక్షించునట్లు ఈ సంసారమును ఋగ్యజుస్సామా థర్వణవేదములు ధర్మాధర్మ హేతు ప్రదర్శనాదిద్వారా రక్షించును. ఇట్టి సంసారవృక్షమును మూలముతో సహా పుష్కలముగా నెరిగినవాడే వేదార్థవిదుడు,

2. అతలాది సత్యలోకము వరకుగల దేహధారులందరు దాని కొమ్మలు సత్వరజ స్తమోగుణములచే పెరుగును. శబ్దస్పర్శాది విషయములనే చిగురుటాకులు దేహాదికర్మఫలముల నుండి అంకురించున్న, వారి కర్మఫలరూపములగు రాగద్వేషాదివాసనలు దాని ఊడలు ధర్మా ధర్మ ప్రవృత్తికారణములచే ఊర్ధ్వ అధోలోకములకు వ్యాపించినది, ఒకజన్మ లోనిక్రియలు పూర్వజన్మలోని ప్రవృత్తుల ఫలముగాను ముందురాబోవు జన్మలకు సాధనములుగాను కలది.

3. స్వప్నపదార్థము, ఎండమావులు, గారడీవాని వస్తువులవలె, ప్రతిభాసకాలమందు మాత్రమే భాసించి, పూర్వాపరకాలమందు భాసించని రూపముగలదీ సంసారవృక్షము. ఈ కాలమునుంచి సంసారము ప్రారంభమైనదిగాని ఇంతవరకు దీని సరిహద్దుయనిగాని ఈరీతిలో ప్రతిష్ఠింపబడునదనిగాని తెలియబడనిది. బాగా వేళ్ళు పాతుకొనియున్న ఈ సంసారవృక్షమును, పుత్రైషణా, ధనీషణా, దారైషణాలను పరిత్యజించుటయను "అసంగ" మను దృఢ శస్త్రముచే మాత్రమే ఛేదించి

4. సర్వవ్యాపకమగు నిత్యసత్య ఆనంద పరమాత్మను విచారించవలెను. దానినెరిగిన వారు మాత్రమే ఈ సంసారమందు తిరుగరు. గారడీవానివల్ల మాయయేర్పడినట్లు ఆ పరమాత్మవల్లనే ఈ సంసారమేర్పడినదిగాన ఆయననే నేనాశ్రయింతుననినిశ్చయింపవలెను

5. 1 దేహాదికమందు నేనను అభిమానము లేకుండుట 2 మోహములేకుండుట 3 దేహాది ప్రపంచముతో సంగములేకుండుట 4 నిరంతరముగా పరమాత్మనే విచారించుట 5 ఎట్టి కోరికలను కోరకుండుట 6 సుఖదుఃఖాది ద్వంద్వములందు భేదబుద్ధి లేకుండ సమబుద్ధిగల్గియుండుట 7ఎట్టి స్థితియందును మౌఢ్యము లేకుండుట యను ఏడులక్షణములు గలవారుమాత్రమే ఆ శాశ్వతపదవిపొందెదరు,

ఆపదవిని సూర్య, చంద్ర, అగ్న్యాదులు ప్రకాశింపచేయజాలవు. దాని పొందినవారు

తిరిగి దేహాది సంబంధమునొందరు. ఆ సాధనమే "నేను" అదియే సర్వులకు నిజరూప మగు "ఆత్మ".

7. జీవుడు పరమాత్మపదవినొంది ఎట్లు తిరిగిరాడనగా జీవుడు పరమాత్మలోభాగమే. ఉదక మందలి సూర్య ప్రతిబింబము ఉపాధియగు జలము నశింపగా సూర్యునిలో లీనమై తిరిగిరాదుగదా అట్లేఘటమందు పరిమితమైయున్న ఆకాశము మహాకాశములోని భాగ మైయుండి ఘటనాశమందు మహాకాశములో లీనమై తిరిగిరాదు, అట్లే జీవుడు ప్రకృ తిభాగములగు ఐదు ఇంద్రియములు మనస్సు అగు ఉపాధిలోనున్నంతవరకు ఘటాకా శమువలె జలసూర్య ప్రతిబింబమువలె జీవుడనబడి జననమరణాదులనొందుచు జ్ఞానాభ్యాస ముచే తన నిజరూపమెరిగి బ్రహ్మాభావమునొంది తిరిగి జీవుడుగా మారనేరడు.

8. వాయువు పుష్పాదులందలి పరిమళమును తనలో నిముడ్చుకొని దేశాంతరమునకు పొందించునట్లు జీవుడు పై ఆరు ఇంద్రియములను అందలి స్వరూపభావములను, వాటి హేతువులను ప్రయోజనములను గ్రహించి జన్మాంతరముల నొందును.

9. జీవుడు 1 చెవి 2 నేత్రము 3 త్వక్కు 4 నాలుక 5 ముక్కు 6 మనస్సు అను ఆరు ఇంద్రియములను అధిష్ఠించియుండి వాటితో తాదాత్మ్యము నొంది శబ్దాదివిషయముల ననుభవించును.

10. ఈ జీవుని నిజరూపము 1 ప్రాణోత్క్రమణమందు 2 దేహస్థితి కాలమందు 3 శబ్దాది విషయములననుభవించు కాలమందు 4 సుఖదుఃఖాదులతో అనుగతుడైన కాలమం దున్ను విద్వాంసులకు స్పష్టముగా గోచరమగుచున్నదిగాని సామాన్య పామరులు గుర్తించుటలేదు. అనగా పై నాలుగు పనులు ఆత్మచైతన్య మూలకములేగాని జడ మగు దేహధర్మములుగావని సామాన్యులుగూడ గుర్తింప శక్యమే. ఐనను లోకము మూఢమై గుర్తించుటలేదు,

11. శాస్త్రీయమగు సాధనసంపద్విశిష్టులగువారు, తమ బుద్ధీంద్రియ ప్రాణవృత్తులకన్ని టికి సాక్షియై అధిష్ఠానముగానున్న "ఆత్మ" ను ప్రయత్నించి గుర్తించుచున్నారు. అవివేకులు, శాస్త్రప్రామాణ్యములేనివారు, ఇంద్రియజయములేనివారు రాగద్వేషాదిక కలుషితచిత్తులు ప్రయత్నించినను ఆత్మను గుర్తింపలేరు.

12. సూర్య, చంద్ర, అగ్నులందు లోకమును ప్రకాశింపజేయు సామర్థ్యము వారిగావే

తెలుసుకొనుము. ఇట్లు సర్వజీవులందును చైతన్యాత్మక, స్వ, పర, ప్రకాశసామర్థ్యమే నేను పరమాత్మను. మూలమొకటియే మట్టిలో ప్రతిబింబింపకపోవుట మలినమగు అద్ధములో కొంచెము ప్రతిబింబించుట స్వచ్ఛమగు అద్దములో బాగా ప్రతిబింబించుటవలె పరమాత్మ ఆదిత్యాదులందు బాగుగాను మానవులలో కొంచెముగాను ప్రకాశించుచూ కాష్ఠ పాషాణాదులలో ప్రకాశింపక పోవును.

13. భూమియందున్న నా పరమేశ్వరశక్తి, భూమిని అందలి భూతములను ధరించుచున్నది. కావుననే అవి క్రిందపడకుండా నిలచి యున్నవి. సమస్త ఓషధులను పోషించు పారమేశ్వరశక్తి భూమియందు సర్వ రసములకు గనియైన సోమునిలోను ఉన్నది. అదినేనే.

14. నేనే సర్వజీవులయొక్క జఠరాగ్నినధిష్ఠించియుండి ప్రాణాదివాయుభేదప్రసారద్వారా వారు భుజించు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యాద్యాహారములను యథాతథముగా పచనమొనర్చి దేహేంద్రియ ప్రాణ వ్యాపారములకు తత్సారమును పంచుచున్నాను. పరమేశ్వరశక్తి ఒక్కటియుమాత్రమే ఆపని చేయగలదు.

15. నేనే సర్వజీవులకు స్వరూపమై వారి బుద్ధికిలోపల సాధకదశలో ప్రేరకునిగాను, సిద్ధదశలో సాక్షిగాను ఉందును. నావల్లనే వారలకు వారిపుణ్యాపాపముల ననుసరించి స్మృతి జ్ఞాన విస్మృతిఅజ్ఞానాదులేర్పడును. ఋగాదిసర్వవేదములునాయథార్థమును పూర్తిగా అన్నిరకముల అధికారులకు బోధించునవియే. వేదము అధ్యయన తదర్థబోధ తదుదిత ధర్మాచరణ దశలలో మాత్రము జీవులకది జ్ఞానసాధనము. ఆ దశలలో జీవులువేరు వేదము వేరు నేను (పరమాత్మ) వేరు వారే నిరంతర వేదాభ్యాసమననాదులచే క్రమముగా వేదరూపులైన దశలో, వారే వేదవిదులు. అపుడు వారు జీవులుగారు. పరమాత్మనగు నేనే వారు. అపుడు వేదము నేనే ఆదశలో 1 కర్తయగు జీవుడు (Subject) 2 కర్మ లేక జ్ఞేయమగు (Object) పరమాత్మ 3 వీరిద్దరకు సంబంధమునుకలుపు క్రియయగు వేదవిద్య ఈ మూడును ఒకటియేయగును. ఇట్లు పరమాత్మ ప్రతిపాదకమగు వేదవిద్య జీవులకు భేదదశలోనుండి అభేదదశ నొందుటకు సాధనమై పరిపక్వ దశలో జీవుని పరమాత్మగా నొనర్చి తానుగూడ అందే లీనమగును, ఇట్టిరూపముతో నేనే సృష్ట్యాది ప్రళయపర్యంతము వేదార్థమును అవిచ్ఛిన్నసంప్రదాయముతో ప్రవర్తింపజేయుచుందును,

16. ఇకమీద కేవలనిర్గుణ పరమాత్మను నిర్ధారణ చేయదలచి గత అనాగత గీతార్థసారము మూడు రాశులుగా విభజించి బోధించబడుచున్నది. 1క్షరపురుషుడు 2 అక్షరపురుషుడు 3 ఉత్తమ పురుషుడగు పరమాత్మయని దృశ్యమానమగు లోకమంతయు 1 క్షరమ్ము!

2 అక్షరము అని ద్వివిధము అందు సర్వజీవుల బుద్ధియు దానికి గోచరమగు భూత జాలమంతయు క్షరపురుషుడనబడును. ఇది ప్రతిక్షణ విలక్షణమై ఆరువిధములగు భావ వికారములు. (1 పుట్టుక 2 ఉండుట 3 వృద్ధినొందుట 4 పరిణమించుట 5 క్షీణించుట 6 నశించుట) గల్గినట్లు స్పష్టముగా పామరులకుగూడ తెలియబడుచున్నది. ఇక రెండవది బుద్ధికిగోచరముగాక బుద్ధీంద్రియాదులను ప్రేరణచేయుచూ సామాన్యులకుగాక శాస్త్ర సంస్కారముగలవారికి మాత్రము ఆరు భావ వికారములు గలదిగ తెలియదగియుండి పైన చెప్పిన "క్షరలోకము" నకు బీజ భూతమగు అవిద్య లేక అజ్ఞానము లేక పూర్వమను పుణ్యాపుణ్యకర్మఫలము ఇదియొకని జన్మారంభ కాలమందలి పుణ్యపాపముల నిలవ మూలధనము ననుసరించి తదనుకూల దేహేంద్రియాదుల నేర్పరచి తదనుకూలముగా పుణ్యపాప ప్రవృత్తులందు దేహేంద్రియాదులను నడిపించి తత్ఫలములను పుణ్యపాపములను ఎప్పటికప్పుడు మూలధనములో కలుపుచూ రాగా మారుచు మరణ కాలమందు నిలవ తేలిన పుణ్యపాపములే. మూలధనముగానిల్చి తదనుగుణ జన్మాంతర కారణమగును. ఇట్లనేకజన్మలు దేహములకు మారినను ఈ అవిద్య మారినట్లు కనుబడకుండ జన్మపరంపరాహేతువగుచున్నందున ఇది "అక్షర" పురుషుడనబడును అనేక లక్షలమందిలో నొకనికి మాత్రమే ఈ అవిద్య నశించును. అప్పుడాతడు ముక్తుడనబడును. అప్పుడుగూడ మిగిలినవారికందరకు ఈ అవిద్య నశింపకయే యుండును గాన "అక్షర" మనబడును.

17. పై రెంటికంటె విలక్షణమై సర్వవ్యాపకుడై సర్వులకు స్వస్వరూపమై ఆరు రకముల భావవికారములలో నేయొకటియు లేకుండి నిత్యసిద్ధుడగు పరమాత్మయే ఉత్తమ పురుషు డనబడును.

18. వెనుకటి రెండురకముల పురుషలక్షణములను నేను (పరమాత్మను) అతిక్రమించి యున్నాను, వాటికంటె సర్వోత్తముడను గాన లోకమందు వేదమందుగూడ పురుషోత్తముడనని ప్రసిద్ధి నొందియున్నాను.

19. ఎట్టి సాంకర్యములేకుండా స్పష్టముగా పై క్షరాక్షరపురుషులనుండి విడదీసి పురుషోత్తముని గుర్తించి రూఢముగా అనుభవింతురో వారే సర్వవిదులు, వారు నన్నే పొందెదరు, వారి దృష్టిలో సర్వము సర్వ విధముగాక ఏకరీతియగునేనే, వారే ముక్తులు.

20, పాపరహితుడవగు ఓ అర్జునా! ఈ విద్య ఉత్తమాధికారులకు మాత్రమే చెప్పదగినది. సామాన్యులకు గోపనీయమైనది. నీయందలి వాత్సల్యముచే బోధించితిని దీనిని యథాతథముగా తెలుసుకొని మనన మొనర్పుము. కృతార్థుడ వయ్యెదవు. ఇట్టి సర్వాత్మ భావమును అద్వైతస్థితియే కేవల భావముగాన కైవల్యమని సంసారమునుండి జీవుని వదలిపెట్టించును. గాన మోక్షమని చెప్పబడును. ఈస్థితి నొందువరకు జీవునికర్తృత్వము శేషించియే యుండును. జీవుడు వేరు, జగత్తువేరు. పరమాత్మ వేరు అని భావించినంత వరకు జీవుడు పరిచ్ఛిన్నుడై యుండునుగాన, ఆ హద్దులనుదాటి గొప్పవాడగుటకు కోరి ప్రయత్నించుచునే యుండును. సర్వము ఒక్కటియై తానేయైనపుడిక కోరదగినది కాని ప్రయత్నింపదగినదిగాని లేనందున అపుడాతడు కృతార్థుడనబడును.

ఇతి పంచదశో ऽ ధ్యాయః

# XVI

వవమాధ్యాయమందు 1 దైవ 2 అసురీయని రెండు ప్రకృతులు సూచింపబడినవి. వాటి నిచట విస్తరింపుచున్నారు. రెండింటి స్వరూప స్వభావాదులు విస్తరముగా తెలుసుకొన్న సాధకుడు ఆసురీ ప్రకృతిని వర్జించుటకున్ను దైవీప్రకృతిని గ్రహించుటకున్ను ప్రయత్నించును. ముందు దైవీప్రకృతి 26 లక్షణములుగలది. ఈ 26 న్ను ప్రారంభ కాలమందు సాధకునకు "లక్ష్యములు" వాటిని బుద్ధిలో లక్ష్యముగా పెట్టుకొని ప్రవర్తించునపుడివియే సాధనములగును. చివర పరిపక్వదశలో ఈ 26న్ను అతని లక్షణములగును.

1. 1 ఎట్టి దేశ కాల వస్తు నిమిత్తముల చేతను భయపడకుండుట 2 ప్రతిక్షణమందును బుద్ధిలో పరవంచనా మాయావృతాదులు లేకుండా శుద్ధముగానుండుట 3 ప్రపంచ వస్తులన్నిటి తత్త్వమును శాస్త్రాచార్యోపదేశానుసారముగా గ్రహించి ఏకాగ్రబుద్ధితో వాటిననుభవములోనికి తెచ్చుకొనుట 4 తానవనుభవించు ఆహార వస్త్రాదులను ఇతరులకు గూడ ఇచ్చి అనుభవింపజేయుట యను దానము 5 శ్రోత్రాదీంద్రియముల నన్నిటిని చాపల్యరహితముగా నుంచుట 6 దేవతలు, భూతములు, మనుష్యులు

పితదులు, వేదములు, అనునీయైదింటితో తాను నిత్యసంబద్ధుడైనట్లు గుర్తించి వారివారి వలన తాను జీవించుచున్నట్లు తెలుసుకొని అందుకు కృతజ్ఞతా సూచకముగా వారలకు తానొనర్చు ప్రత్యుపకార మవశ్యకర్తవ్యమని నమ్మి అట్లాచరించుట యను యజ్ఞానుష్ఠానము, 7 వేదాధ్యయన, తదర్థబోధ, తదుదిత కర్మాచరణ, తత్ప్రచారము లను స్వాధ్యాయము 8 శరీరం 1 వాక్కు 2 మనస్సు లనుమూడంటితో చేయుతపస్సు (17-14 నుంచి 16 వరకు చెప్పబోవుచున్నారు) 9 సర్వ దేశ కాల వస్తు నిమిత్తము లందు తిన్నని న్యాయబుద్ధితో ప్రవర్తించుట,

2. 10 తనసుఖముకొరకు ఇతరభూతములను హింసింపకుండుట 11 ఇతరుల కప్రియము గాను అబద్ధమును మాట్లాడక యథా భూతార్థమునే పలుకుట 12 ఆయా దేశకాల వస్తునిమిత్తములందు తనకు వచ్చిన కోపమును నివారించుట 13 తానొనర్చు ప్రతిపని తనవిధియనియే భావించుట అంతియేగాని ఈపనివల్ల ఈ ప్రయోజనము నాకు వచ్చు నను తలంపుతో ఏపని చేయకుండుట యను ఫలత్యాగము 14 ఎల్లపుడు చిత్తమును ప్రశాంతముగానుంచుట 15 ఇతరుల దోషముల నెంచకుండుట 16 సర్వభూతములందు దయగల్గి యుండుట 17 ఇంద్రియములను తద్గోచర విషయసన్నిధియందుగూడ ఎట్టి మార్పు లేకుండునట్లుంచుట 18 ఎట్టి వస్తువునందును క్రౌర్యములేకుండా మృదుభావ ముతో నుండుట 19 నాకంటె మహనీయులనేకులు గలరు, నేనిట్టి తక్కువవాడినైతి నేలయని సిగ్గుపడుట 20 తనదేహధారణ మాత్ర ప్రయోజనములగు చేష్టలు తప్ప ఇతర దేహచేష్టలు లేకుండుట

3. 21 దేహకాంతిగాక బుద్ధియందలి ప్రగల్భత్వము అనగా బుద్ధి యందలి బోధనాశక్తిని పుష్కలముగా వినియోగించుకొనుట 22 ఎట్టి కష్టసుఖములను బుద్ధిలోనే సహింపగల ఓర్పు 23 దేహేంద్రియములందు శక్తి క్షీణించినపుడు తిరిగి వాటిని ఉత్తంభనమొనర్పు గల ధైర్యము 24 మనోవాక్కాయములందుశుచిగానుండుట 25 ఎవరియందు ద్రోహ చింతన లేకుండుట 26 "నేను గొప్పవాడను నన్నందరు గౌరవింపవలెను" అను అతి మానిత్వము లేకుండుట యను నీ 26 ను బుద్ధియందు లక్ష్యముగా పెట్టుకొని అందుల కనువుగా ప్రయత్నించు స్వభావము "దైవసంపత్తి" యనబడును.

4. ఇక అసురిసంపత్తు ఆరు లక్షణములు గలది 1 లోకులు తనను గూర్చి గొప్పగా భావిం చుటనుమాత్రమే ఉద్దేశించి తదనుకూలముగా ప్రవర్తించుట 2 విద్యా ధన వ్రజనాది

నిమిత్తమగు దర్పము 3 తాను లోకమందు గొప్పవాడని అందరు తనను గౌరవింపవలెనని తలచుట 4 ఆయా దేశకాల వస్తునిమిత్తాములందు తనకువచ్చే కోపమును అభివృద్ధి నొందించి దానితో తాను తాదాత్మ్యము నొందుట 5 ఇతరులతో పరుషముగా మాట్లాడుట, ఇతరులందు పరుషమగు అభిప్రాయము గలిగియుండుట 6 అవివేకముగా తన మంచి చెడ్డలుగాని, కర్తవ్య అకర్తవ్యము లనుగాని సరిగా గ్రహింపనేరక విపరీతముగా గ్రహించి తదనుకూలముగా ప్రవర్తించుట యను నీ ఆరింటిని తనకు లక్ష్యముగా పెట్టుకొని అందులకనువుగా ప్రయత్నించు స్వభావము ఆసురీసంపత్తనబడును.

5. దైవీసంపత్తులోనుండి దాని నభివృద్ధి నొందింపగా మోక్షము సిద్ధించును. అనగా పై 26 తనకు ప్రారంభమందు లక్ష్యములై తర్వాత సాధనములై పరిపక్వదశలోఅవియే తనకు అయత్న సిద్ధలక్షణములగు స్థితియే మోక్షమనబడును, ఆసురీసంపత్తులో నుండి దానినభివృద్ధి నొందించిన కొలది పశుపక్ష్యాది నికృష్ట దేహపరంపర సిద్ధించును. ఓ అర్జునా! నీవుశోకింపకుము. నీయందు దైవీసంపత్తున్నది.

6. ఈలోకము నందలి మనుష్యులందరు పై రెండుసంపత్తులలో నెద్దియోయొకటి పుట్టుక లోనే గల్గియుండి వారి జీవితాంతమువరకుగల ప్రవృత్తులను బట్టి మార్పునొందిన ఆ సంపత్తున కనుపగు దేహాంతరము నొందెదరు, అందు దైవీసంపత్తు విస్తారముగా బోధింపబడినది. ఇక అసుర సంపత్తును వివరించెదము సావధానముగా వినుము.

7. అసుర సంపత్తుగల మనుష్యులు తమ శ్రేయస్సునుగాని అందుకనుష్ఠింపవలసిన పనుల నుగాని అందుకు విసర్జింపవలసిన పనులనుగాని గుర్తింపరు, దయా, సత్య, శుచి, భావ ములతో నొప్పు మంచి యాచరణ, వారికుండదు.

8. తమ వలెనే అందరు అనృత ప్రాయులని తలతురు. ధర్మాధర్మములు ప్రపంచమునకు ప్రతిష్ఠకావందురు. సర్వాను శాసకుడగు పరమేశ్వరుడు లేడందురు. కామవశులైన స్త్రీ పురుషుల సంయోగమే జగత్కారణమని అంతకంటె వేరుగా కారణాంతరము లేదని తలతురు.

9. ఇట్టి దృక్పథమునాశ్రయించి పరలోకముగాని తత్సాధనముగాని ఉన్నట్లు విశ్వసింపక అల్పబుద్ధిగలవారై క్రూరకర్ములై హింసానిరతులై జగత్క్షయముకొరకు పుట్టుదురు. వారిప్రపంచమునకు శత్రువులు.

10. ఎంత నెరవేరినను తనవితీరని కోరికల నాశ్రయించి దంభముతోను అత్యంతదురభిమానముతోను ధనాది మదముతోను ఎల్లపుడు కూడియున్నవారై అవివేకముచే తమకు, లోకమునకు వినాశకరమగు నిశ్చయముగల్గి అపరిశుద్ధమగు ఆచరణములతో ప్రవర్తింతురు.

11. మరణ పర్యంతము పరిమాణములేని ఆలోచన గలవారై విపరీతముగా ఐశ్వర్యాద్యాది విషయములను కోరుచు ప్రయత్నించుచూ అనుభవించుచూ యుండుటయే జీవన సార్థకతయని నమ్ముదురు,

12, తమ కోరికలే తమనుబంధించు జన్మహేతువులగునని తెలియక నిరంతరా విశిష్టులై ఇష్ట వస్తువులందు ప్రేమ అయిష్ట వస్తువులందు క్రోధములు మాత్రమే జీవన హద్దులుగా గ్రహించి కామ భోగ ప్రయోజనములకొరకు పరద్రవ్యాపహారణాద అన్యాయోపాయములచే ధనమును కూడబెట్టుచుందురు.

13. వారిట్లు తలతురు ఈ ద్రవ్యము నాచే పొందబడినది. ఈ కోరికను సంతోషకరముగా పొందగలను. ఇది నాకున్నది. ఈ వస్తువులు నాకే రాబోవుసంవత్సరములో ప్రాప్తించగలవు. దానంచేసిన ధనికుడను కాగలను.

14. ఈ శత్రువు నాచే పరాభవింపబడెను. ఇంకను ఇతరశత్రువులను సంహారింప గలను. ఈ అల్పులు నన్నేమిచేయగలరు? నాతో సమానుడెవరు? నేను గొప్పవాడను. భోగిని. సిద్ధుడను, బలవంతుడను, సర్వసంపత్సమృద్ధుడను, పుత్రపౌత్రాది యుక్తుడను, సుఖము గలవాడను, మిగిలిన వారందరు భూమికి భారభూతులు,

15 కొన్ని తరములనుండి నావంశము మంచిది, ధనధాన్యాదిసమృద్ధిగలది, నాకువెవరున్ను సాటిలేరు, నాప్రవర్తనచే ఇతరులనందరను అణగద్రొక్కగలను, నట విట గాయకులకు ధనాదులనిచ్చి లోబరచుకొందును. సర్వవిధముల సంతోషింతును.

16. ఈ రీతిగా అజ్ఞానముచే మోహింపబడి అనేకవిధ చిత్తవిక్షేపములచే భ్రాంతులై. అవివేకులై కామభోగ లాలసులై అపవిత్రము దుఃఖ భూయిష్టము అగు నరకమందు బాధపడెదరు.

17. తామే సర్వ సద్గుణ శోభితులమని తమను తామే స్తుతించుకొనుచూ పెద్దలున్నారని గూడతలంపక వారిని గౌరవింపక ధన, అభిమాన మదములతో నొప్పుచూ లోకులం

దరూ తమను కొని యాడుటకొరకు నామమాత్రము ఈశ్వరారాధన మొనర్చుచున్న ట్లభినయింతురు.

18, వారిబుద్ధిమాత్రము 1 తమయందున్నట్టి లేనట్టి గుణములనన్నిటిని ఆరోపించుకొనుటచే కరుడుగట్టిన అహంకారము 2 కామముతోను రాగముతోను కూడియున్న పరాభిభవ నిమిత్తబలము 3 ధర్మము దానియంతటఅదే తొలగగల దర్పము 4 స్త్రీవిషయకమగు కామము 5 తన కిష్టముగాని వస్తువునందు క్రోధము ఇత్యాదిగొప్ప దోషములతో నిండియుండును, తమబుద్ధికి సర్వజీవబుద్ధులకు లోపల సాక్షిగానుండు పరమాత్మనగునన్ను ద్వేషింతురు. సాధువులందు అసూయగల్గి యుందురు.

19, పరమేశ్వరుడనగునేను సన్మార్గ శత్రువులును సాధుద్వేషులును క్రూరులున్ను అగు ఈ నరాధములను మాటి మాటికి అసురసంపత్తుగల నరకమార్గ, వ్యాఘ్ర సింహాదిదేహములందే జన్మింపచేతును.

20. వారల్లు క్రమక్రమముగా అసురసంపత్తు అధికమగు దేహములందుండుటచే పరమాత్మజ్ఞాన మూఢులగుచూ పరమాత్మను పొందకయే అధోగమనము నొందెదరు.

21. పై అసురసంపత్తంతయు 1 ఇష్టవస్తువులందు కామము 2 అనిష్టవస్తులందుగాని ఇష్టవస్తువులభింపనపుడుగాని గల్గు క్రోధము 3 పరద్రవ్యాదులందు లోభము అను మూడు ప్రధాన దోషములం దిమిడియున్నది. ఈ మూడు దోషములను పరిత్యజించువాడు-అసుర సంపదనంతను పరిత్యజింపగలడు. ఈ మూడే ఆత్మనాశకమగు నరకమునకు ద్వారము.

22. తమమ అజ్ఞానాంధకారములో ముంచు ద్వారములగు 1 కామ, 2 క్రోధ, 3 లోభములను తొలగించుకొన్నవాడు, తన శ్రేయస్సును తిరిగి తదనుకూల ప్రవృత్తి గలిగి, క్రమముగా ముక్తుడగును.

23. ఋగ్యజుస్సామాథర్వణ వేదములు, శిక్షావ్యాకరణ, చందో, నిరుక్త, జ్యోతిష, కల్పములను వేదాంగములున్ను, సర్వజీవులను ఇహ పర సుఖసాధనాదులందు శాసించును గాన అదియే శాస్త్రమనబడును. అందు చెప్పినట్లు చేయుట, నిషేధింపబడిన పనులు చేయకుండుటయే ఇహ పర సుఖములకు మోక్షమునకు ఉపాయము. దాని నతిక్రమించి తమకు తోచిన రీతిగా ప్రవర్తించువారి కెట్టి ప్రయోజనము లేదు. మోక్షము మరొకముండ నేరదు.

24. అందుచే ఓ అర్జునా ! నీ వొక పని చేయుటకుగాని శాస్త్రమే ప్రమాణము. ఆ పని యొక్క సాధక బాధకములను, చివరపరిణామమును. నిత్యము-అపౌరుషేయము అగు శాస్త్రమే నిర్ణయింపగలదు గాని, అనిత్యము, పౌరుషేయము అగు పురుష బుద్ధి నిర్ణయింపజాలదు. పురుష బుద్ధి, దేశకాల వస్తువులు మూడింటితో పరిచ్ఛిన్నము-శాస్త్రమున కీ త్రివిధ పరిచ్ఛేదము లేదుగాన నీవు శాస్త్ర తాత్పర్యము నెరిగి, తదనుగుణ మగు పని చేయదగియున్నావు.

---

# XVII

అ ర్జు న ప్ర శ్న :

1. ఓ కృష్ణా ! నీవు చెప్పినట్లు శాస్త్రవిధానము నెరుగక ఆస్తిక్యబుద్ధి గలిగి శ్రద్ధాభక్తులతో కేవల వృద్ధవ్యవహార దర్శనము ననుసరించి దేవతలం నారాధించు మనుష్యులు, సాత్వికులనబడెదరా ? రాజసులా ? తామసులా ? వారల కెట్టి ఫలము లభించును ?

శ్రీకృష్ణుని సమాధానముతో పై ప్రశ్న విభజింపబడి, విడి విడిగా జవాబు చెప్పబడుచున్నది.

2. జీవుడు తన జీవితమంతలోను ప్రవర్తించిన ధర్మాధర్మముల నిలువ, మరణకాలమందు నిలవ తేల్చబడి 'స్వభావ' మనబడును. దాని ననుసరించి అతనికి పునర్జన్మయు, అందలి ప్రవర్తనలున్ను ఏర్పడును. అదియే శ్రద్ధ యనబడును. గాన స్వభావజనితమగు శ్రద్ధ 1 సాత్వికి, 2 రాజసి, 3 తామసి యని మూడు విధములుగ నుండును.

3. దేహధారియొక్క క్రియలన్నియు వాని అంతఃకరణలో బయలుదేరును. ప్రతి క్రియయు, అనేక క్రియల సమూహము. పూర్వక్రియ, ఉత్తరక్రియకు సాధన మగును, ఉత్తరక్రియ, పూర్వక్రియకు ఫలమగును. గాన పూర్వ జన్మాంతరమందలి క్రియలయొక్క ఫలమే ఈ వర్తమాన జన్మలోని క్రియలును-తదాశ్రయమగు అంతఃకరణమున్ను అగును. దాని ననుసరించియే జీవున కీ జన్మలో ఆ యా క్రియలందు శ్రద్ధ యేర్పడును. అట్టి క్రియలందు మాత్రమే అత డా జన్మలో శ్రద్ధతో ప్రవర్తిం-

చును గాన జీవుడు శ్రద్ధామయుడనబడును. వాని ప్రకృత శ్రద్ధావిషయమును బట్టి అతని పూర్వజన్మయూ, ముందు రాబోవు జన్మయు ఊహింపబడును—గాన శ్రద్ధయే, జీవుడనబడును.

4. సాత్వికమగు శ్రద్ధగలవారు వేదోక్త దేవతలను, రాజస శ్రద్ధగలవారు, యక్షరాక్షసాదులను, తామస శ్రద్ధ గలవారు, భూత, ప్రేత, పిశాచ, సప్తమాతృకాదులనున్ను పూజింతురు,

5, 6 ఎవరు శాస్త్రముచే ఉపదేశింపబడనివిధముగా తనకు, ఇతరులకు పీడాకరమగు నట్టి తపః పూజాదులను, లోక డాంబిక, అహంకార, కామ, రాగ, బలములతో కూడి అవివేకులై తమ శరీరేంద్రియములను కృశింపజేయుచూ తమ (సర్వ) బుద్ధిసాక్షినగు నా యొక్క శాసన ముల్లంఘించుటద్వారా నన్ను కృశింపజేయుచూ ఆచరింతురో వారిని అసుర సంపత్తుగలవారినిగా, రాజస తామస శ్రద్ధగలవారినిగా తెలుసుకొనుము. నీ విట్టివాడవు గాకుము,

7. ఇక 1 ఆహార 2 యజ్ఞ 3 శారీర, వాచిక, మానస, తపో 4 దానములను నాలుగు విషయములందు సాత్విక రాజస తామస భేదము లుపదేశింపబడుచున్నవి. అందు రాజస, తామస ఆహారాదులందు సాధకులకు గల శ్రద్ధను క్రమముగా పరిత్యజించి, సాత్వికమగు ఆహారాదులందు శ్రద్ధ నభివృద్ధి నొందింపవలెను. గాన సావధానుడవై ఆ భేదములను వినుము.

8. సాత్వికాహార పదార్థములు, ఆయుస్సును, బుద్ధిని, బలమును, ఆరోగ్యమును, సుఖమును, భోజనకాలమందు ఎట్టి ద్వేషాదులు లేకుండా ప్రీతిని భోజనానంతరమందు ఎక్కువకాలము తృప్తిని, వృద్ధినొందించునవి. రసవత్తరములయినవి. చమురుగలవి, దేహేంద్రియ మనస్సులందు చిరకాలముండునవి. హృదయమునకు పుష్టినిచ్చునవి. ఇవి సాత్వికులకు ప్రియములు. అనగా శ్రేయఃకాముడగు సాధకు డిట్టి ఆహారములనే కోరి భుజింపవలెను.

9. రాజసాహారపదార్థములు, మిక్కిలి కారము, పులుసు, ఉప్పు, ఉష్ణత, తీక్ష్ణత్వము-చేదు, చమురులేని రూక్షత సంతాపకారిత్వముగలవి - అనుభవకాలమందున్ను తర్వాత పరిణామకాలమందున్ను పీడను గలుగజేయునవి, రోగహేతువులు, ఇవి రాజసులకు ప్రియములు. శ్రేయఃకాముడగు సాధకు డిట్టివానిని పరిత్యజింపవలెను.

10. తామసాహారములు— వండిన జాముకాలమైన తర్వాత తినబడునవి. బాగా ఉడకనివి. మాడినవి లేక ఎక్కువగా ఉడికినవి, సారములేనివి, దుర్గంధముగలవి. మఱివాటికి చద్దిబడినవి, ఒకరు తిని పారవేసినవి, అపవిత్రమయినవి. ఇవి తామసులకు ప్రియములు. శ్రేయఃకాముడు వీనిని వదలవలెను,

11. సాత్వికయజ్ఞమనగా తనకొక ప్రత్యేక ఫలము నుద్దేశింపక శాస్త్రముచేత తన వర్ణాశ్రమానురూపముగా విధించబడినదిగాన అవశ్య మాచరించి తీరవలెనను దృఢనిశ్చయముతో తానను భవింపబోవు సర్వభోగ్యములును, దేవతల నుద్దేశించి, త్యాగమొనర్చుట - ఇది శ్రేయః కాము డలవరచుకొనదగినది.

12. రాజస యజ్ఞమనగా, తన కొక ప్రత్యేకఫలము లభింపవలెనను కోరికతోను, లోకులు తనను గూర్చి గొప్పగా చెప్పుకొనవలెనను దృష్టితోను, దేవతారాధన మొనర్చుట ఇది శ్రేయఃకాముడు వర్జింపదగినది.

13. తామసయజ్ఞమనగా, శాస్త్రవిపరీతముగాను, అన్నదానము లేకుండగను, మంత్ర, వర్ణ, స్వరలోపములతోను, శాస్త్రమందు చెప్పబడినంత దక్షిణల నివ్వకుండగను శ్రద్ధాభక్తులు లేకుండగను. దేవతారాధన మొనర్చుట. ఇది శ్రేయః కాముడు విసర్జింపదగినది.

14. తపస్సు 1 శారీరము, 2 వాఙ్మయము, 3 మానసము అని మూడు విధములు. అందు శారీర తపస్సనగా దేవతలను, వేదవిదులను, తనకు దేవతలను, వేదమును బోధించు గురువులను వేదార్థమును జీర్ణించుకొన్న మహనీయులను పూజించుట తన బుద్ధితోను దేహేంద్రియములందును శుచిగా నుండుట తిన్ననయిన సత్ప్రవర్తన, బ్రహ్మభావము నొందుటకు నిరంతర ప్రయత్నము యితరులయందు యెట్టి హింసాభావము లేకుండుట——

15. వాఙ్మయ తపస్సనగా, ఇతరుల కెట్టి బాధయు కలుగకుండునట్లున్ను. సత్యమును ప్రియమును, పారలౌకిక హితకరమును అగునట్లు మాట్లాడుటయు. వేదాభ్యాసమున్ను.

16. మానసతపస్సనగా. మనస్సు నెల్లపుడు ప్రశాంతముగా నుంచుట, ఇతరులందరియందు మంచి బుద్ధికలిగియుండుట, వేద తాత్పర్యమునే నిరంతరముగా మననమొనర్చుట,

శబ్దాది విషయ బుద్ధి గలిగియుండుట. వేదతాత్పర్యమునే నిరంతరముగా మనన మొనర్చుట శబ్దాది విషయములపైకి బుద్ధిని ప్రసరింపజేయకుండుట ఇతరులతో వ్యవహరించునపుడు ఎట్టి మాయావిశ్లేష లక్షణములు లేకుండా అందలి మంచినే గ్రహించుటయు -

17. పై మూడు విధములగు తపస్సున్ను సాత్విక రాజస తామసములను భేదత్రయము గల్గియున్నది, అందు సాత్త్వికతపస్సనగా అత్యంత ఆస్తిక్యబుద్ధితోను, శ్రద్ధాభక్తులతోను ఎట్టి ఫలాపేక్ష లేకుండగను ఏకాగ్రచిత్తముతోను చేయు శారీర, వాఙ్మయ, మానస తపస్సు — ఇది గ్రాహ్యము.

18. రాజస తపస్సనగా లోకులు తనను కొనియాడుట, గౌరవించుట ఇత్యాదులకొరకు దంభముతో ప్రతిక్షణవిలక్షణముగా, ఇతరులు చూచునపుడొక విధముగను, చూడనప్పుడు వేరొకవిధముగను, అనిత్యముగా, శారీర. వాఙ్మయ, తపస్సుల నాచరించుటయే-ఇది పరిత్యాజ్యము.

19. తామసతపస్సనగా, అవివేక నిశ్చయముతో తను పీడ నొందుచూ, ఇతరుల వినాశము నుద్దేశించుచూ, శారీరవాచిక మానసతపస్సు నాచరించుటయే - ఇది అత్యంత నిందితమయినది. సాత్త్విక, రాజస, తామస దానభేదములు వివరించబడుచున్నవి.

20. సాత్త్వికదానమనగా :- శాస్త్రీయమగు దేశకాల, పాత్రాది నిమిత్తములందు శాస్త్ర విధి నెరిగి తనకెట్టి ప్రత్యుపకారాపేక్ష లేకుండగా, తన కర్తవ్యమాత్రముగా భావించి తన ధనాది భోగ్యవస్తువుల నితరుల కర్పించుట - ఇది శ్రేయఃప్రాప్తిసాధనము.

21. రాజసదానమనగా, తాను దానమిచ్చువ్యక్తినుండి తిరిగి ప్రత్యుపకారము నపేక్షించి ఈ దానముల కిహపరములందు ఫలమును కోరి, తన ద్రవ్యము పోవుచున్నదను ఖేదముతో తన ధనాది భోగ్యముల నితరుల కిచ్చుటయే - ఇది శ్రేయః ప్రతిబంధకముగాన పరిత్యాజ్యము.

22. తామసదానమనగా మ్లేచ్ఛాది అపవిత్రదేశమందు పుణ్యహేతువులుగా శాస్త్రముచే బోధింపబడనికాలమునందు, మూర్ఖతస్కరాదిపాత్రములకు, పూజాగౌరవభావములు లేకుండగా ప్రతి గ్రహీతను, తిట్టి అవమానపరచి తన ధనాది భోగ్యము నితరుల కిచ్చుటయే - ఇది శ్రేయః కాముడు సర్వవిధముల పరిత్యజింపదగినది.

23. ప్రీతిదానమున్ను, "1 ఓం 2 తత్ 3 సత్" అను మూడు, భావ గాంభీర్యబోధక పద ములతో, చేయదగినదని కోవిదులు చెప్పుచున్నారు. తన పరమ లక్ష్యమగు బ్రహ్మ భావము, ఈ మూడింటిచేతను 1 బ్రాహ్మణులద్వారా 2 వేదముద్వారా 3 యజ్ఞ ములద్వారా, నెరవేరగలదు. అనగా బ్రహ్మభావమను, మోక్షము 1 ముందు బ్రహ్మవేత్త శుశ్రూష 2 ఆ పైని ఆయనవల్ల వేద తాత్పర్య శ్రవణము 3 ఆపైన, మనన, నిదిధ్యాసలు, చే, క్రమముగా సిద్ధించును.

24. అందు "ఓం" వారి తాత్పర్యమేమనగా, వేదతాత్పర్యము నెరుగుట, తదనుకూలముగా ప్రవర్తించుట, అందులకెట్టి విఘ్నములు కలుగకుండగా, తాను బ్రహ్మపైమడగుట,

25. "తత్" పద తాత్పర్య మేమనగా, తానొనర్చు, యజ్ఞ, దాన, తపోదానాదులను, ఎట్టి ఫలమును కోరక అవి తన కర్తవ్యములుగా భావించి, నిశ్చలమై ఈశ్వర భావా పన్నమగు బుద్ధితో ఆచరించుటయే.

26. "సత్" పద తాత్పర్య మేమనగా, పుత్రులులేని వానికి పుత్రుడు కల్గినట్లు, దుర్మా ర్గుడు, సన్మార్గుడుగా మారినట్లు, వివాహాది శుభ సంతోషములట్లు పరమాశ్చర్యకర మైనదియని.

27. యజ్ఞము, దానము, తపస్సు. మొదలగు వేదోపదిష్ట శ్రేయస్సాధనము లనుగ్రహించుట, ఆచరింపవలెనని కోరుట. ఆచరించుట ఇత్యాదులన్నియు "సత్" అను శబ్దమునకు అర్థములే.

28 అశ్రద్ధతోచేయు, హోమ, దాన, తపః క్రియాదులన్నియు "అసత్తు" అనబడును. ఆ హోమాదులే శ్రద్ధతో చేయబడగా "సత్తు" లనబడును, ఆ సత్తులు, ఇహమందు గాని పరమందుగాని ఎట్టి ఫలమునీయవు,

ఇతి సప్తదశో ఽ ధ్యాయః



# XVIII

అర్జునప్రశ్న :

1. ఓమహానుభావా! సర్వేంద్రియాధిపతీ! సర్వపాపహరా! సన్యాసము—త్యాగము, అను రెండు పదములు నీ ఉపదేశములందనేకసార్లు వినబడినవి. వాటిని. విస్పష్టముగా, విపులముగా, నాకువివరింపుడు—వాటి యథార్థ స్వరూపముల నెఱుగగోరుచున్నాను.

భగవత్సమాధానము :

2. పురుషుని నిశ్వాసములవలె, పరమేశ్వరునుండి అయత్నోద్భూతమగు ఋగ్వేదాది శాస్త్రము, అధికారులలో ప్రారంభకులకు, వర్ష, పశు, పుత్రాదికోరికలు గలుగగా, అవి నెరవేరుట కుపాయసాధనములుగా, కొన్ని పనులు చేయదగినట్లుపదేశింపబడినవి. ఇవి కామ్యకర్మలనబడును. వాటి ననుష్ఠించి ఆ ఫలము ననుభవించగా విశ్వాస మేర్పడిన మంచి సాధకులకు, చిత్తశుద్ధి సాధనోపాయములుగా కొన్నిపనులు చేయదగి నట్లుపదేశింపబడినవి. ఇవి నిత్యకర్మలనబడును, ఇపుడు నీవు ప్రశ్నించిన 1 సంన్యాస 2 త్యాగశబ్దముల తాత్పర్యము అనేక వేద విదులచే అనేక విధములుగా చెప్పబడు చున్నది. అందు కొందరు, కామ్యకర్మల నాచరింపకుండగా, నిత్య కర్మల నాచ రించుట సంన్యాసమనియు, అన్ని కర్మలను, ఫలాపేక్ష లేకుండగా, అనగా ఆకర్మ నాచరించినందువల్ల రాగల ఫలము తన (ఆత్మ) కెంతమాత్రము సంబంధించనిది అను నిశ్చయముతో, ఆచరించుట త్యాగమనియు, చెప్పుదురు.

3. పుణ్య పాపకర్మల నాచరించుటచే, తదనుకూల దేహాంతర సుఖదుఃఖాదుల ననుభవించ వలెను. గాన, సర్వకర్మలును సాధకునకు బంధహేతువులే యైనందున, అవి త్యజింప బడవలెనని కొందరు—మరికొందరు, ఎట్టిదశలోను, యజ్ఞ, దాన, తపో, నిత్య కర్మాదు లను పరిత్యజింపరాదు. ఆచరించి తీరవలసినదే యందురు.

4. ఇట్టి స్థితిలో నా నిశ్చయము నుపదేశింతును, వినుము. ఓ అర్జునా! పురుషశ్రేష్ఠా! సంన్యాస త్యాగశబ్దములు రెండింటికి తాత్పర్య మొక్కటియే-సాధకుడు, ఆత్మయాథా త్మ్యము నెఱుగనంతవరకు, గల దశలలో, త్యాగము లేక సంన్యాసము 1 సాత్వికము 2 రాజసము 3 తామసము అని మూడువిధములుగా నుండును.

5. ఎట్టిదశలోనైనను సాధకుడు 1 యజ్ఞము 2 దానము 3 తపస్సులను మూడు భేదములతో నొప్పు కర్మలను ఆచరించి తీరవలసినదే - పరిత్యజింపరాదు - ఎట్టి ఫలమును కోరకయే వాటి ననుష్ఠించువారు, విశుద్ధచిత్తులగుదురు, చిత్తశుద్ధి కంతకంటె వేరు సాధనములులేవు.

6. ఆ యజ్ఞదాన తపస్సులనుగూడ మోక్షము నపేక్షించు సాధకుడు, వాటితో తాదాత్మ్యము నొందక, ఫలాపేక్షారహితుడై, అవశ్య కర్తవ్యములను భావముతో చేసి తీరవలసినదేనని నాయభిప్రాయము - అట్లుగాక, ఆకర్మతో తాదాత్మ్యమునొంది, ఫలాపేక్షతో ఆచరింపగా నవి వానికి బంధహేతువులేయగును.

7. సాధకుని దశయందు, వర్ణాశ్రమముల, కనువుగా, శాస్త్రముచే, నియమింపబడిన, నిత్యకర్మల నెట్టి పరిస్థితిలోను పరిత్యజింపరాదు - అట్లువాటిని సంన్యసించుట మోహము వల్లనే గాన నియ్యది తామసత్యాగ మనబడును.

8. ఎవడు తన దేహమునకు క్లేశముగల్గునను భయముచే, ఈ నియతకర్మను దుఃఖమని భావించి పరిత్యజించునో, వానిత్యాగము. రజోగుణ కార్యమైనదిగాన వానికి త్యాగ ఫలమగు మోక్షము లభింపదు - గాన నిది రాజసత్యాగమనబడును.

9. సాత్త్వికత్యాగమనగా, తాను సాధకుడైనచో ఈశ్వరప్రీతి యనబడు తనచిత్తశుద్ధికొరకు సిద్ధుడైనచో లోకసంగ్రహముకొరకు, తనవర్ణాశ్రమానురూపముగా నియతకర్తవ్యముగా శాస్త్రముచే విధింపబడినకర్మను, ఫలాభిలాషలేకుండా, దానితో తాదాత్మ్యము నొందకుండగా చేయుటయే.

10. ఇట్టివాడు నిర్మలచిత్తుడై ఆత్మజ్ఞానాధికారియై క్రమముగా ఆత్మనిష్ఠుడే యగును. కామ్యకర్మ నాతడు ద్వేషముచె త్యజింపడు, నిత్యకర్మను,ఆసక్తితోగాని తాదాత్మ్యము నొందిగాని ఆచరింపడు, నిరంతర సాత్త్వికత్యాగియై, ఆత్మ, అనాత్మవివేకియై. తన స్వస్వరూపము నెన్నటికిని మఱవకుండగా, ఆత్మస్వరూపావస్థానమే మోక్షము, ఎట్టి క్రియయొనర్చినను దానికి ప్రతిబంధకమే" అను నిశ్చయముతో నుండును.

11. దేహ మందభిమానముగల అజ్ఞానులందరు,ఆదశలో నిశ్శేష సర్వకర్మ సంత్యాగమొనర్ప జాలరు, అదియసంభవము - గాన ఉత్తమ సాధకుడు, తన నిత్యకర్మల నాచరించు చునేయుండి తత్ఫలమును మాత్రమే త్యజించును. వీడు లోకుల దృష్టిలో [illegible]

తన దృష్టిలోగాని శాస్త్రదృష్టిలోగాని 'త్యాగి'- ఇకసిద్ధుడు దేహాత్మభావనారహితుడై నందున వాస్తవముగా అశేషకర్మ సంన్యాసియగును, అట్టివానికి మాత్రమే వాస్తవ సర్వకర్మ సంన్యాసము సాధ్యమగును.

12. అంతకంటె తక్కువదశలోనున్నవారి క్రియలే, ఫలమున్ను, సాధనమున్ను అగును- అనగా పూర్వక్రియ, ఉత్తరక్రియకు సాధనమున్ను, ఉత్తరక్రియ పూర్వక్రియకు ఫలమున్ను - అది పూర్వోత్తర సంబంధ రహితముగా, కేవలముగా ఆలోచించినపుడు క్రియయున్ను అగును, క్రియ త్రికోణమువలె 1 దేశ 2 కాల 3 వస్తువులను మూడు హద్దులుగలది. మార్పు నొందుటయే దాని స్వభావము - ఆ మార్పు దేశాంతరమును, కాలాంతరమును. వస్త్వంతరమును పొందుటయే - గాన అది ప్రతి క్షణమందును పూర్వ రూపమును వదలి: ఉత్తరరూపమును స్వీకరించును, సామాన్యముగా ఫలాభిసంధితోనే, కర్మల నాచరించువారికి 1 అనిష్టమగు, నరక పశుపక్ష్యాది రూపము 2 ఇష్టమగు దేవాదిరూపము 3 మిశ్రమమగు మనుష్యాదిరూపము అను మూడు విధముల ఫలమేర్పడును.

13. ఆ ఫలమేర్పడుటకు, సమస్త ప్రపంచ వ్యాపారములకు మూలమగు వెదాంతమందు, ఐదు కారణములు పేర్కొనబడియున్నవి - చెప్పెదను వినుము.

14. (1) ఇచ్ఛాద్వేషాది దేహచేష్టలకన్నిటికి ఆశ్రయమగు శరీరము 2 దేహమందు తాదాత్మ్యాభిమానియై: తాను కర్తనని భోక్తననితలచు జీవుడు శబ్దాదులను గ్రహించు సాధనములగు శ్రోత్రాదీంద్రియములు 4 ప్రాణాది వాయుభేదములయొక్క చేష్టలు 5 ఆయా ఇంద్రియాది స్థానదేవత, యను నీఐదు.

15. దేహధారి, శరీరముతో, వాగాదీంద్రియములతో, మనస్సుతో, చేయు, మంచి, చెడు, పనులన్నిటికి, ఈ ఐదున్ను హేతువులు.

16. ఇట్టి స్థితిలో శాస్త్ర సంస్కారములేని పామరుడున్ను, వేద తాత్పర్యము నెఱుగని వాడున్ను, తానే కర్తనని తలచును-వాడు తనబుద్ధిని తాను పూర్తిగాఉపయోగించు కొనలేనివాడు.

17. పూర్తిగా బుద్ధి నుపయోగించుకొన్నవాడు, "తాను" కర్తనుగాననని అజ్ఞానముచే [illegible] పై ఐదున్ను కర్తలని, తాను వాటి వ్యాపారము లన్నిటికి సాక్షి

మాత్రుడనే నని నిశ్చయించి, బుద్ధిని, ఎట్టి విషయముతోను సంబంధింపకేయుండును- అట్టివాని దేహాదిక మీలోకముల నన్నిటిని హత్యచేసినను, అతని శాక్రియతోగాని, దానివల్ల రాగల పుణ్యపాప ఫలముతోగాని, ఎట్టి సంబంధమున్ను ఉండదు. లోక దృష్టిలో నతడు హననక్రియా కర్మగాని, తన దృష్టిలో అతడు నిష్క్రియాత్మయే.

18. దేహధారి 1 దేనిని గ్రహింపవలెనో 2 దేనిని పరిత్యజింపవలెనో 3 దేని నుపేక్షించ వలెనో నిర్ణయించి అతనిని, దెహాదిసర్వచేష్టలిందు ప్రవర్తింపజేయు ప్రేరకశక్తివిధము- 1 క్రియా ప్రారంభమందు కర్తయు, సమాప్తియందు భోక్తయు అగు తాను (Subject) 2 తనచే తెలియదగినది అనుభవింపదగినదియగు జ్ఞేయము (Object) 3 ఈ రెంటికి సంబంధమును కలుపు బుద్ధిశక్తియని—(జ్ఞానము) ఇట్టి ప్రేరణచే తయారైన క్రియ దేహాది ఐదింటిద్వారా (14 శ్లోకములోనివి) 1 ఆ క్రియాసాధనములగు అంత రింద్రియ బహిరింద్రియములు 2 తన క్రియద్వారా పొందదగిన తనయభీష్టము (కర్మ) 3 దేహేంద్రియ వ్యాపారకారియగు తాను (కర్త) అని మూడు రూపముల నొందును.

19. 1 జ్ఞానమున్ను 2 క్రియయు 3 కర్తయు. ఈ మూడున్ను సాత్త్విక రాజస తామస భేదములచే త్రివిధములని శాస్త్రమందుపదేశింపబడిన దానిని బోధింతును - సావధానుడవై వినుము.

20. సాత్త్వికాది జ్ఞానభేదములు— పిపీలికాది బ్రహ్మపర్యంతమగు సర్వభూతములున్ను, విభక్తమగువాని. రూపములతో నొప్పుచున్నను, అవిభక్తముగా, ఒకేనిత్య, సచ్చిదానంద పరమాత్మ ఉన్నదని గ్రహించు జ్ఞానము సాత్త్వికమైనది.

21. ప్రపంచభేదమును: మనుష్యాదిజాతిలోగూడ వ్యక్తిభేదమును, వ్యక్తిలోగూడ కరచరణాద్యవయవభేదమును, ఒకేఅవయవమందుగూడ క్రియాభేదములను, ఇట్లు ప్రతివ్యాప్త విషయమందును: భేదమునుగొప్పగా గ్రహించు జ్ఞానము రాజసమైనది.

22. "ఈశ్వరుడనగాదేహమే ఈవిగ్రహమే: ఈదేవాలయమే, ఈభావమే, ఈతపస్సే" ఇత్యాదులలో తానామ్మిన ఒకేవిషయమందు: నిర్హేతుకముగా అవగా ఈదేహ విగ్రహ దేవాలయాదులెట్లు ఈశ్వరుడగును? అను విచారణలేకుండనవే అయథార్థమును, అల్పమును, అగు విషయమందు ఆసక్తి గల్గియుండుట తామస జ్ఞానమనుము.

23. సాత్వికాది కర్మభేదములు— సాత్విక కర్మయనగా, దిగ్దేశకాలాది శాస్త్రీయనియమము లతో ఆ పనియందుగాని తత్ఫలమందుగాని, ఎట్టిసక్తతలేకుండగా, అందుఇష్టభాగ మందు రాగముగాని, అనిష్టభాగమందు ద్వేషముగాని లేకుండగా, ఎట్టిఇష్టానిష్టదృష్టి లేనివాడై చేయుపనియే శ్రేయఃకామునకిది గ్రాహ్యము.

24. రాజసకర్మయనగా, ఒక కోరికతో, నేను ఇంతటి కార్యము నొనర్చుచుంటినను గర్వ ముతో అధికాడంబర, ఆయాసములతో నొనర్చుపనియే శ్రేయఃకామునకిది పరి త్యాజ్యము.

25. తామసకర్మయనగా, ముందుతనకురాబోవు పరిణామము తనయొక్క ఇతరులయొక్క క్షయమును, హింసనుగాని, తనబలమును సాధనసంపదనుగాని, సరిగాగుర్తింపక, మోహవశుడై యొనర్చుపనియే శ్రేయఃకామునకిది పరిత్యాజ్యము.

26. సాత్వికాది కర్తృభేదములు— సాత్వికకర్త, తనదేహాదికమే తాననిభావింపడు, దేహాదు లతోగాని బాహ్యప్రపంచ విషయములతోగాని ( సంబంధమును ) తాదాత్మ్యము నొందడు – శాస్త్రీయమగు పని తన కవశ్య కర్తవ్యమను ధైర్యోత్సాహములతో నొప్పియుండును. ఆ పని సఫలమైనను, విఫలమైనను, ఎట్టి మానసిక మార్పును బొందడు, శ్రేయఃకాముడిట్లగుటకు ప్రయత్నింపవలెను.

27. రాజసకర్త, తన కిష్టమైన వస్తువులందు తీవ్రానురాగముగల్గి, తానొనర్చు పనియొక్క ఫలమందు తీవ్రమగు ఆతుర్దాతో, పరద్రవ్యాదులందు తృష్ణగల్గి, పరపీడాకరస్వ భావుడై, తన ద్రవ్యాదుల నెంతమాత్రము త్యజింపక, మనస్సును దేహేంద్రియము లను, మలినమొనర్చుచూ, ఇష్టప్రాప్తియందు సంతోషము, ఇష్ట వియోగమందును అనిష్టప్రాప్తియందును, శోకమున్ను గల్గియుండి ప్రతి పనిలోను ప్రవర్తించును. శ్రేయఃకాముడిద్దానిని తొలగింపవలెను.

28. తామసకర్త, ఏకాగ్రచిత్తుడుగాడు – ఒక నిశ్చయముండదు – ప్రకృతి పరవశుడు – ఎప్పుడేవిషయము మనస్సునకువస్తే దాని నాచరింపగోరును. లోకమందు జడములని వ్యవహరింపబడు కాష్ఠ పాషాణాదులవలె స్తబ్ధుడైయుండును. బుద్ధికెట్టి విచక్షణా శక్తియు ఉండదు. ఎట్టి గొప్పవారికి నమస్కరింపడు. మనస్సులో నొకటి, చెప్పు నదింకొకటి, చేయునది వేరొకటి – లోకులందు పరస్పర భేదమునుపయోగించును.

సోమరి - తన కర్తవ్యమందుగూడ విషాదముతో నుండును. నేడు చేయదగిన పనిని, నెలరోజులకుగూడ చేయడు. శ్రేయఃకాము డిట్టి కర్తృత్వమును పరిత్యజింపవలెను.

29. అర్జునా ! ఇకమీద, సాత్విక, రాజస, తామస, బుద్ధిభేదములను, సాత్వికాది, ధృతి(లేక) ధైర్యభేదములను వివరింతును-వినుము. నీవు అనేక దిగ్విజయ మొనర్చియుంటివిగదా ! అందెట్టి బుద్ధిబలమును, ధైర్య విశేషములను ప్రదర్శించి యుంటివో గమనింతువుగాక.

30. సాత్వికబుద్ధి, ఎట్టి ప్రవృత్తివలన తనకు క్రమముగా శ్రేయోభి వృద్ధిగల్గునో, ఎట్టి సాధనములచే తాను మోక్షము నొందగలడో, స్వభావ సిద్ధమైన దుర్బల క్రియలనెట్లు ఎపుడు నివర్తించి, మంచివిగా మారునట్లొనర్పవలెనో, కర్మశాస్త్ర మోక్షశాస్త్రముల సమన్వయములను, తానొనర్పవలసిన పనులు, మానవలసిన పనులు, తన భయంకర మైనట్టి, అభయజనకమైనట్టి పనులెట్టివో నెరుగుట, ఎట్టి ప్రవర్తనచే తాను బద్ధుడగునో, ఎట్టి నడవడిచే ముక్తుడగునో ఇవన్నియు తెలిసి ప్రవర్తించును.

31. రాజసబుద్ధి, ధర్మాధర్మములను, కర్తవ్యములను, సాధ్యాసాధ్యములను, దేశకాల పాత్రానుసారి సాధన భేదములను, శాస్త్రీయముగా పూర్తిగా నెఱుగనేరదు. అసంపూర్తిగా నెఱగును.

32. తామసబుద్ధి, అజ్ఞానావృతమైయుండి, ధర్మమును అధర్మముగాను, అధర్మము ధర్మముగాను, ఇత్యాదిగా, సర్వ విషయములను, శాస్త్రవిరుద్ధముగా గ్రహించి, తదనుగుణముగా ప్రవర్తించును.

33. సాత్వికధైర్యముగలవాడు, శాస్త్ర తాత్పర్యమును పుష్కలముగా నెఱిగి - సర్వకాల సర్వావస్థలందున్ను, సర్వము పరమాత్మగా నెఱుగుటకు ప్రయత్నించుచూ, అందులకనువుగా, తన దేహేంద్రియ, మనః ప్రాణములను, ధైర్యముతో, ధరించియుండి, వాటిని ఉన్మార్గగాములు గానీయక, సర్వాత్మైకత్వభావమునకెట్టి విఘ్నములురానట్లు నడిపించును.

34. రాజసధైర్యముగలవాడు— శాస్త్రమందలి మోక్షభాగమును గ్రహింపలేక, పుణ్యాలోకములు తత్ప్రాప్తి సాధనములుగల భాగమును మాత్రమే గ్రహించి, తన తాత్కాలిక సుఖమగు కామమును, సంవత్సరములవరకు ఎడతెగని సుఖమగు "అర్థ" మును, జన్మాంతరమందు గూడగల్గు సుఖమగు "ధర్మ" మును, ఆ యా సమయభేద ప్రసంగ

భేదములచే, గ్రహించి, అందుల కనువుగా. తన దేహేంద్రియమనః ప్రాణములను స్థైర్యముతో ధారణచేసియుండి నడపించును.

35. తామసస్థైర్యముగలవాడు— శాస్త్రజ్ఞానములేనివాడై, శాస్త్రమందు విశ్వాసముగూడ లేకుండ. నిరంతరము, స్వప్న, భయ, శోక, విషాద, మద, విషయసేవాదులను మాత్రమే తనకు అత్యంతప్రియములని, అవశ్యకర్తవ్యములని భావించి, తదనుకూల ధైర్యముతో దేహేంద్రియ మనఃప్రాణములను ధరించియుండును.

36. ఓ భరతవంశశ్రేష్ఠా! జీవులందరు, సుఖమునుద్దేశించి, కోరి ప్రయత్నించి, తత్ఫలము నొందెదరు. ఆ సుఖమున్ను, ఫలమున్ను, సాత్త్విక, రాజస, తామస భేదములచే త్రివిధము. చెప్పెదవినుము.

37. అనుభవప్రారంభమందు, జ్ఞానము, వైరాగ్యము, ధ్యానము మొదలగుశ్రమతో, విషమువలె కష్టముగతోచి, అనుభవ పరిణామదశలో, అమృతమువలె, మరణరహితము నిత్యము, సత్యము, నిరతిశయానందము, దేశ కాల వస్తు పరిచ్ఛేదరహితమున్ను అయి బుద్ధినైశ్చల్య, నైర్మల్యభావములచే, ఇంతవరకున్న బుద్ధియే ఆనందరూపమగు ఆత్మ యగుట సాత్త్వికసుఖమనబడును.

38. సాధకుని, బుద్ధికి, ఇంద్రియములకు, బాహ్యములగు శబ్దాది విషయములతో సంబంధ మేర్పడిన ప్రారంభ కాలమందు, అజ్ఞానముచే, అమృతమువలె గొప్పసుఖముగా భాసించి, పరిణామదశలో, విషమువలె, సాధకుని, తేజోవిహీనునిగా నొనర్చు విషయ సుఖము రాజసమనబడును.

39. సాధకునకు, విషయానుభవేచ్ఛా కాలమునుంచి, అనుభవావసాన దశవరకు, ప్రతిక్షణ మోహ జనక మగుచూ, సుఖమువలె వాతనికి గోచరించు, నిద్ర, ఆలస్య, ప్రమాదాదులచే, ఏర్పడు సుఖము, తామస సుఖమనబడును. శ్రేయః కాముడు, సాత్త్విక సుఖము నొందగోరి రాజస తామస సుఖముల పరిత్యజింపవలెను.

40. పృథివీ, అంతరిక్ష, ద్యులోకాదులలోని సర్వ విధజీవులున్ను, ఈసత్వ, రజస్తమోగుణ భేదములను, తత్కార్యములగు 1 ఆహార 2 యజ్ఞ 3 శ్రద్ధా 4 శారీరతపస్సు 5 వాచికతపస్సు 6 మానసతపస్సు 7 దాన 8 క్రియా ఫలత్యాగ 9 జ్ఞాన 10 కర్మ 11 కర్త 12 బుద్ధి 13 ధృతి 14 సుఖములను పదునాల్గింటిలోను, సాత్త్విక, రాజస,

తామస భేదములను, అవశ్యముగల్గియె యున్నారు. ఈ గుణభేదములేని వ్యక్తి ఏలోకమందున్ను ఒక్కడుగూడలేడు. ఇవియే సంసారకారణము గాన తన్నివృత్తి కుపాయమును బోధించుచున్నారు.

41. పూర్వజన్మలో మరణ పర్యంతము, యాజీవులవద్ద నిల్వ తేలిన పుణ్యాపావభేదములను, పై పదునాలుగు ఆహారాది సుఖాంతమందలి సాత్వికరాజసతామసాది భేదములను మొత్తము స్వాభావిక గుణ మనబడును. దాని ననుసరించి, వారిజన్మలో, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుగా దేహముల నొందెదరు.

42. పుట్టుకతోనే 1 అంతరంగమందే, శబ్దాది విషయములను నిగ్రహించుట 2 శ్రోత్రాదీంద్రియములు. శబ్దాదులందు ప్రవర్తించుచుండగా, నివారించుట 3 శారీర, వాచిక, మానసిక తపస్సు ( 17 లో 14 నుంచి 19 వరకు ) 4 బాహ్యాభ్యంతర శుచిభావము 5 ఎట్టి మానావమాన సుఖదుఃఖాదులు సంభవించినపుడుగూడ ఓర్చుకొనుట 6 మనోవాక్కాయములందొకేరీతిగల శాస్త్రీయ సత్ప్రవర్తన 7 పరమాత్మజిజ్ఞాస 8 అందుల కనువుగా సాధననములగుఅమానిత్వ, అదంభిత్వ అహింసాదుల నభ్యసించుట (13 లో 7 నుంచి 11 వరకు ) 9 శాస్త్రమందు శ్రద్ధాభక్తులు అను తొమ్మిది గుణములుగల్గి యుండుట బ్రాహ్మణ స్వభావమనబడును.

43. పుట్టుకతోనే 1 శౌర్యము 2 ప్రగల్భత 3 ధైర్యము (ఎట్టి పరిస్థితిలోను అవసాదము నొందకుండుట) 4 చేయతగిన పనులందు త్వరగా నిశ్చయించి పనిలోనికిదిగుట 5 ధర్మ రక్షణకొరకు అధర్మ శిక్షణకొరకు యుద్ధ మొనర్చుచూ, అందు ప్రాణభయ మేర్పడినను పారిపోకుండుట 6 తన సర్వస్వమును ధర్మముకొరకు దానమిచ్చుట కెట్టి సంకోచము లేకుండుట 7 ప్రభుశక్తిని ఎల్లపుడు ప్రకటించియే యుండుట అను నీ యేడు గుణములు కల్గియుండుట క్షత్రియస్వభావమనబడును.

44. పుట్టుకతోనే 1 భూములలో వ్యవసాయమొనర్చు పంటలు పండించుట 2 గవాది పశుపోషణ 3 వస్తువులక్రయ విక్రయాది వ్యాపారము అను వీ మూడుగుణములు వైశ్య స్వభావ మనబడును. పై ముగ్గురమతేక 9 + 7 + 3 = 19 గుణములను కోరి, అభ్యసించుచు, వారికి వాటికి పరిచర్య చేయుటయను గుణము శూద్రస్వభావ మనబడును.

(34)

45. వీరంపసు, తమతమ స్వభావము, పూర్వజన్మనుండి, ఉద్దేశింపబడుచూ, అందులకనువుగా ప్రవర్తింపంచు దేహేంద్రియాదులు గల్గియుండుటచే, ఆ పనులే వీరలకు త్వరగా సిద్ధించును. అందుచే. వీరు క్రమముగా అంతకంటె గొప్పదగు పై తరగతికి చెందిన సాధకులగుదురు. ఇందలి ప్రతి తరగతిలోను, ప్రతి పనియు, ఈశ్వరారాధనమే,

46. పిపీలికాది బ్రహ్మపర్యంతమగు దేహాధారులందరు ఇట్టి తరగతులలో నొకదానిలో ఉండె అంతకంటె పై తరగతి నుద్దేశించి, ప్రయత్నించుచూ, తత్ఫల రూపమగు జన్మాంతరముల నొందుచుందురుగాన. సర్వదేహాధారుల . సర్వప్రవృత్తులున్ను, పరమేశ్వర మూలకములే - సాధకులు. తమ స్వాభావిక ధర్మములచే, ఆ భగవంతు నారాధించుచూ అంతకంటె గొప్పదగు పై తరగతిలోనికి వెళ్లుచుందురు,

47. తన పుట్టుకనుండి స్వభావముగా ఏర్పడిన ధర్మము, కొంతభాగము మాత్రమే అదరించినను. శ్రేయస్సునే కలుగజేయును. తనఅంతస్థుకు మించిన వేరొకధర్మము, ఎంతబాగా పూర్తిగా ఆచరించినను శ్రేయస్కరముగాదు, తనస్వాభావిక ధర్మము నాచరించుటచే ఎట్టి పాపమును పొందడు - తన వర్తమానస్థితి, భవిష్యత్తులోగూడ తగ్గకుండగా మండును.

48. స్వాభావిక ధర్మములలో కొన్ని దోషములున్నను, దానివాచరించి తీరవలెనుగాని దోషదృష్టితో మానరాదు, అసలు దేహాధారియై. దోషములు గలవాడు - అగ్నితో గూడ పొగ ప్రారంభకాలమందుండి, పరిపక్వకాలమందుండవట్లు, దేహాధారిగూడ సాధకావస్థలో, దోషములు, దుష్టమగు ఉద్దేశములు, సాధనములు. ప్రయత్నములు గల్గియుండి క్రమముగా దోషము తగ్గుచున్న ఉద్దేశసాధన ప్రయత్నములు గలవాడై చివరకు సిద్ధావస్థలో, విశుద్ధుడగును.

49. ఇట్లు పలుజన్మలోను: తన స్వభావధర్మము నాచరించగా చివరజన్మలో ఆ సాధకుడు సర్వప్రాపంచిక విషయములందు ఎట్టి ఆసక్తియు లేనివాడు ఆత్మరూపము నొందిన బుద్ధిగలవాడు. దేహ. జీవిత, భోగములందు ఎట్టి తృష్ణలేనివాడు. ఒకే ఆత్మయున్నదిగాని ఎట్టి రెండవవస్తువులేదుగాన ఎట్టి క్రియకు అవకాశములేదను నిశ్చయానుభవముగలవాడై . సమ్యగ్దర్శియై. సన్యాసియై జీవన్ముక్తుడగును.

౫0. ఓకుంతీపుత్రా! ఇట్లు తమస్వధర్మముచే పరమేశ్వరు నారాధించుచూ, తదనుగ్రహముచే, తనదేహేంద్రియ మనఃప్రాణములు నిర్మలములై, జ్ఞాననిష్ఠకు యోగ్యములగుటయే సిద్ధియనబడును, ఇదినరలో క్లుప్తముగా బోధింపబడినది. ఇంకను వివరింతును. సావధానముగా వినుము.

౫1. ఇట్టి నిశ్చలబుద్ధితోనుండి సర్వము పరమాత్మమాత్రమే నను ధైర్యముతో. దేహేంద్రియాదులను నియమించి, స్వాధీనమందుంచుకొని, తన దేహధారణ మాత్రోపయోగము కంటె ఇతరములగు భాగ్య శబ్ద స్పర్శాదులను పరిత్యజించి, శరీర స్థితికొరకు అప్రయత్నముగా లభించిన పదార్థములందెట్టి రాగముగాని ద్వేషముగాని లేకుండి.

౫2. అరణ్య, నదీపులిన, గిరిగుహాది ఏకాంత దేశమందుండి, అత్యల్ప సాత్వికాహారము దానియంతట అదియే లభించు దానితో మాత్రమే తృప్తి పడుచూ, దేహేంద్రియ మనఃప్రాణములను తన వశమందుంచుకొని, నిరంతర భగవద్ధ్యాన తత్పరుడై, ఇహ, పరలౌకిక భోగముల నెంతమాత్రము అపేక్షింపక.

౫3. దేహేంద్రియాదులే నేను అను భ్రాంతిని, కామముతో. అనురాగముతో కూడిన సామర్థ్యమును, హర్షానంతరమం దేర్పడు ధర్మోల్లంఘన హేతువగు దర్పమును, ఇచ్ఛా, ద్వేష, పరిగ్రహాదులను, వీటి నన్నిటిని పరిత్యజించి. ప్రశాంత చిత్తుడై, బ్రహ్మభావము నొంద సమర్థుడగును.

౫4. అట్లు పరమాత్మభావమునొంది తనబుద్ధియే ఆత్మకాగా ఎట్టిశోక. కాంక్షాదులు లేనివాడై సర్వభూతములను, ఆత్మరూపులనుగా జూచుచూ నాయందు గొప్ప భక్తి గల్గియుండును.

౫5. దానిచే, పరమాత్మనగు నేనెట్టి వాడనో, ఎంతవాడనో. నా స్వరూప మెట్టిదియో. పూర్తిగా గ్రహించి, క్రమముగా నాలో లీనమగును.

౫6. అట్టిస్థితిలో, వాని దేహేంద్రియాదులకు, చేయదగిన విధులుగాని. చేయరాని. నిషేధములుగాని లేవు వాడు నన్నాశ్రయించి నేనుగానే యుండును. నేనేవాడు- వాడే నేను ఇదియే మోక్షమనబడును.

౫7. నీవు, నీబుద్ధీంద్రియ ప్రాణములను. వాటి వ్యాపారములను. నాయందే యుంచి, నాయందు మాత్రమే ఆసక్తుడవై, నిరంతరము తదేకనిష్ఠతో నుండుము.

58. అట్లున్నచో, నా యనుగ్రహముచే. జనన మరణాది సంసార బంధముల నన్నిటిని అతిక్రమించి శాశ్వతసుఖము నొందగలవు. అట్లుగాక. నీకున్న స్వల్ప విద్యాద్యహంకారముచే నాబోధ వినక, మనన మొనర్పక. ఆచరింపక పోయేయెడల, నశింపగలవు.

59. నీవు ప్రారంభమందు " యుద్ధమొనర్ప "నని గట్టిగా పల్కితివిగదా ! ఇది అహంకారముగాదా? నీవు యుద్ధమొనర్చుటకుగాని, మానుటకుగాని, స్వతంత్రుడవుగావు-నీకు ఆజన్మసిద్ధమగు స్వభావము నిన్ను దానికనుకూలముగా నడిపించి తీరగలదు,

60. ఓ కౌంతేయా! నీవు అనేక జన్మలమండి, దేని నుద్దేశించి. దేనికొరకు ప్రయత్నించి యుంటివో, దాని పరిణామమే నీ స్వభావ మనబడును. అదియే నిన్ను బంధించి, దాని కనువుగా నీ దేహేంద్రియాదులను వినియోగించు కొనును. నీకిష్టములేని పని నైనను. అది చేయించి తీరును.

61. ఓ అర్జునా ! దేహధారులందరియొక్క దేహవ్యాపారముల కన్నిటికి, మూలము, వారి హృదయ మందుండు పరమేశ్వరుడే రంగులరాటనముపై నధిష్ఠించువారి నందఱను ఆ యంత్రమును నడపువాడు త్రిప్పునట్లు. ఈశ్వరుడు దేహధారుల నందఱను, వారి వారి పుణ్యాపాపకర్మల ననుసరించి ప్రవర్తింప జేయుచుండును. అనగా, దేహమందు. ఆత్మాభిమానముగల్గి యున్న దశలో జీవులందరును. ఈశ్వరాధీనులై యుందురు.

62. ఓ భారత! నీ మనో, వాక్కాయాది సర్వభావముతోను. సర్వేశ్వరుని శరణుజొచ్చుము. అట్లైన ఆయన అనుగ్రహముచే. ఆత్యంతిక శాంతిని. శాశ్వతస్థానమును. పొందగలవు.

63. సమస్త వేదసారము, పరమ పురుషార్థ సాధనము అగు బ్రహ్మవిద్య నీ కీ విధముగా, పూర్తిగా ఉపదేశింప బడినది. దీని నా మూలాగ్రముగా మనన మొనర్చుకొన్న తర్వాత నీ ఇష్టానుసారముగా ప్రవర్తించుము,

64. నీవు నాకు అత్యంత ప్రేమపాత్రుడవు నాయందు నీకు దృఢమగు భక్తిగలదు. గాన నీకు హితమును నేను తిరిగి ఆదరముతో చెప్పుచున్నాను అది సర్వవిద్యలలో అత్యంత రహస్యమైనది వినుము,

65. నాయందే ఎల్లప్పుడు నీమనస్సునుంచుము, నాభక్తుడవగుము - నన్నుద్దేశించి నీసర్వస్వమును త్యాగమొనర్పుము - నన్నే నమస్కరింపుము - నీమనస్సును. ఇంద్రియము

లకు, గోచరమగువదంతయు నేనుగా భావింపుము - సర్వము నేనని విశ్వసించుము, అట్టుంటినేని. నన్నేపొందగలవు - నీవునాకు ప్రియుడవైనందున ఇట్లు ప్రతిజ్ఞ చేయు చున్నాను

66. నీస్వబుద్ధితో ఇదిధర్మము, ఇదిఅధర్మము అను విచారణమును మానివేసి సర్వము నేనుగా నిశ్చయించి నన్నొక్కనినే శరణు జొచ్చుము. అట్లయిన, నేను నిన్ను సర్వపాప పుణ్యా ములనుండి జనన మరణ ప్రవాహ రూపమగు సంసార బంధమునుండి విడిపింతుము. నీవెంతమాత్రము శోకింపకుము.

67. ఈ ఆత్మవిద్యను, నీవు 1 శాస్త్రీయమగు, శారీర, వాచిక. మానసిక తపస్సు నొనర్పని వానికి 2 శాస్త్రమందు, తదూపులగు, గురువులందు, శాస్త్ర ప్రతిపాద్యమగు దేవుని యందు భక్తిలేనివానికి తీవ్రముగా బ్రహ్మవిద్య నభ్యసించు కోరికలేని వానికి 4 వసు దేవపుత్రుడు. కృష్ణుడు మానవమాత్రుడని తలచి, అట్టి మానవోపదేశమును నేనేల గ్రహించవలెనను అసూయ గలవానికి. ఎట్టిదశలోను బోధింపవద్దు.

68. ఈ విద్యను నీవుగాని నీవల్ల ఉపదేశము నొందిన ఇతరులుగాని 1 శాస్త్రీయముగా తప స్సుచేసి 2 శాస్త్రగురు దేవతలందు భక్తిగలిగి 3 బ్రహ్మవిద్యయందు తీవ్రాభిలాషగల్గి 4 శ్రీకృష్ణుడే పరమేశ్వరుడను స్థిరవిశ్వాసముగలవారికి మాత్రమే చెప్పవలెను. ఈవాల్గు లక్షణములుగలవారే నాభక్తులనబడెదరు అట్టివారికి ఉపదేశించినవారు ఆ యుపదేశము లను గ్రహించి మననమొనర్చి తిరిగి ఉపదేశించువారు నన్నే పొందెదరు.

69. ఇట్లు శాస్త్రసంప్రదాయమును అవిచ్ఛిన్నముగా ప్రవర్తింపజేయువాడే నాకత్యంత ప్రియుడు వానికంటె ప్రియుడు నాకిపుడులేడు ముందుండబోడు - త్రికాలములందు శాస్త్రసంప్రదాయ ప్రవర్తకుడే నాకత్యంతప్రియుడు.

70. ఎవరీ మన ఉభయుల సంవాద రూపమగు, ధర్మయుక్త జ్ఞానప్రదమగు [illegible] మొనర్చి, తదర్థముతెలిసి అట్లాచరింతురో వారు నన్ను జ్ఞానయజ్ఞముచే నారాధించిన వారగుదురు. 1 విధియజ్ఞ 2 జపయజ్ఞ 3 ఉపాంశుయజ్ఞ 4 మానసయజ్ఞములు ఉత్త రోత్తర ప్రబలములు - మానసయజ్ఞమే జ్ఞానయజ్ఞ మనబడును - ఇది నా [illegible]ము.

71. అట్లే ఈ విద్యను, శ్రద్ధగల్గి అసూయారహితుడై వినువాడుగూడ పాపక్షయద్వారా పుణ్యలోకముల నొందగలడు.

72. ఓ అర్జునా ! నీవీవిద్యను ఏకాగ్రచిత్తముతో జాగ్రత్తగను పూర్తిగాను వింటివా? దీని పూర్తి తాత్పర్య మవగతమైనదా? ఓ ధనంజయా ! ప్రారంభమందలి నీయజ్ఞానసం మోహము నశించినదా ?

73. అర్జునవాక్యము— ఓఅచ్యుతా ! నీవు వాస్తవముచే నాశరహితుడవు నీయనుగ్రహముచే జాగ్రత్తగావింటిని. తాత్పర్యమునెరిగితిని. మోహమునశించినది. ఆత్మస్మరణ లభించినది. నాసందేహములన్నియు తొలగినవి. కృతార్థుడనైతిని. నాకెట్టి కర్తవ్యమున్న లేదు. ఈశ్వరాజ్ఞను ఎట్టిసక్తతలేకుండగా అనుసరింతును.

74. సంజయవాక్యము— ఈ ప్రకారముగ మహానుభావులగు శ్రీకృష్ణ అర్జునుల సంవాదమును వింటిని. ఇది అత్యంత విస్మయకరమైనది. రోమాంచజనకము. ఇదివరలో ఎన్నడుకనివిని ఎరుగనిది,

75. ఈ రహస్యమును శ్రీవేదవ్యాసులు నాయందు సంక్రమింపజేసిన అనుగ్రహముచే సాక్షాత్ పరమేశ్వర ముఖమునుండి బయల్వెడలిన బ్రహ్మవిద్యను వినగల్గితిని.

76. ఓ ధృతరాష్ట్రమహారాజా ! ఆ కృష్ణార్జునుల సంవాదము ఆశ్చర్యము, అద్భుతము, అత్యంతపుణ్యము అయియున్నది. దానిని మాటిమాటికి స్మరించి ఆనందించుచున్నాను,

77. సమస్త ప్రపంచభేదమును ఒకే ఆకారముగల వ్యక్తియని నిరూపించుటకు మూర్తిభవించిన అద్వైతభావమును ప్రదర్శించిన భగవద్విశ్వరూపము. అత్యద్భుతమైనది వ్యాసానుగ్రహముచే ఆ పరమేశ్వర అద్వైతరూపమును చూడగల్గితిని దానిని స్మరించి నపుడెల్ల పరమాశ్చర్యానందములు గల్గుచున్నవి,

78. పరమేశ్వరుడగు శ్రీకృష్ణుడు, ఈ బ్రహ్మవిద్య కధికారియై భగవద్భక్తాగ్రేసరుడై ధనుర్బాణాదుల ధరించిన అర్జునుడు, ఏపక్షమందుండిరో ఆపక్షమందే ఐశ్వర్యము విజయము ధర్మము న్యాయము నీతి ఇత్యాదులన్నియు ఉండునని నానమ్మకము.

ఇతి శ్రీ